

గౌతముని జీవకారుణ్యము

చిత్రకారుడు: శ్రీ ఇ. జగన్నాథరావుగారు, రాజమండ్రి.





చెన్నపట్టణము, జూలై ౧౯౨౯



సంపుటము ౬ శుక్ల సంవత్సరము ఆషాఢమాసము సంఖ్య



## నిరీక్షణము

కొడాలి ఆంజనేయు

ప్రేమకిశోరమూర్తి చివురించిన కోమలకల్పకద్రుమా
రామములన్ నిసర్గ మధురం బగు వేణురవ ప్రసక్తికిన్
మైమఱ పొందెనేమొ మధుమాసపువెన్నెల, వాని నేలతా
కోమలి వాలుఁజూపు నునుకుంకుమపూవుల కందువార్చెనో!

కానఁగ రాఁడు వానికయి కన్నులు కాయలుకాచె నందనో
ద్యాన లతాంత సూత్న మలయానిలముల్ ఘనసారవాసనల్
పూని యొసంగు స్వాగతము పొందుట మమ్ముల విస్మరించెనో
గానకుమార శేఖరుఁడు కానఁడుగా వలవంత వంతలన్.

నడచెద నీ మనోజ్ఞయమునాసికతాతలశయ్యలందు నీ
యడుగులజాడ వెన్నెలల యగ్గికి తెల్లనిమబ్బునీడలం
బడి, మురళీరవంబు వినవచ్చెడు త్రోవల కీ యేకాంతపుఁ
గడియలలో ననుం గరుణఁ గావఁగదే భువనైకమోహనా!

---

# (దం)డి-కావ్యాదర్శము

మానవల్లి రామకృష్ణకవి గారు, యం. ఏ.

(శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగా రాంధ్రీకరించిన కావ్యాదర్శమునందలి పీఠిక దీనికి మాతృక)

కావ్యాదర్శ మను నలంకారశాస్త్రము ప్రాచీన(గ్రంథ)ములలోఁ బ్రసిద్ధి వడసినది. దీని రచించిన కవి(ఖ్యా)తుఁడగు దండి "కవిర్దండీ కవిర్దండీ కవిర్దండీ (న సంశ)యః" అని భోజుని సభలోఁ బ్రశంస గన్నవాఁడని (ఐతి)హ్యము కలదు.

"(త్ర)యోఽగ్నయ స్త్రయో వేదా
స్త్రయో దేవా స్త్రయో గుణాః,
(త్ర)యో దండి ప్రబంధాశ్చ
త్రిషు లోకేషు విశ్రుతాః."

(అని) ప్రఖ్యాతి కలదు. 'కావ్యాదర్శము, దశకుమారచరి(త్రము)' దండికృతములుగా నెగడుచున్నవి. మూఁడవకృతి (యే)మని శంకించి కొందఱు ఛందోవిచితియనియు, (పిష)ల్" అను పాశ్చాత్యమహాశయుఁడు మృచ్ఛకటిక మే (దండికృ)తమనియు వ్రాసిరి. ఇతని దేశకాలము లేవి? (భామ)హాలంకారమునకంటెఁ గావ్యాదర్శము ప్రాచీన(మా)? అను సందియములు కలుగును. ఇటీవలఁ గొన్ని (గ్రంథ)ములు కేరళదేశమునఁ దాళపత్రముల లభింపఁగా, (వాని) పరిశోధనమునఁ బైయంశములు కొంతవఱకుఁ బరి(ష్కృ)తి చెందెను. కావ్యాదర్శ మను పేర మఱియొక (అలం)కారగ్రంథము కలదు. దానిలో క్షేమేంద్రుని మత(ము) ...గుటచే నది యర్వాచీన మనుటకు సందేహము (లేదు). మన గ్రంథము దండికృతమే యనుటకు నభినవ(గుప్తాదు)లగు ప్రామాణికులు "యథాహ దండీ", "యథా(హ దణ్డి)నా!" యని యుదాహరించిన శ్లోకము లిందుఁ (గాన)చ్చు చుండుటయే నిదర్శనము. భట్టగోపాలుఁడు (కావ్య)ప్రకాశవ్యాఖ్యారంభమున:

"...కృయ వ్యద్యుతాం రేఖాం కావ్యాదర్శలిపిక్రమే,
...మధ్యే మధ్యే మహాచార్యో దణ్డీ ఖేదయతే కవీన్."

(అని) చెప్పెను. కావున నిది దండిప్రోక్త మనుట నిస్సం(దేహ)ము.

దీనిపైఁ బెక్కులు వ్యాఖ్యలు కలవు. అతిప్రాచీనమయినది వాదిఘంఘాలదేవుని శ్రుతానుపాలిని. అతఁడు క్రీ. శ. ౯౫౧ లో నుండెడి గంగరాజు నాస్థానకవి. తరుణవాచస్పతి, యామునేయుఁడు, మఱికొందఱును వ్యాఖ్యాతలైరి. తరుణవాచస్పతి "పంచవర్ణాహ్వయపురేఽష్టవర్ణాహ్వయో నృపః" అన్న శ్లోక వ్యాఖ్యలో కాంచీపురమనియుఁ, బల్లవరాజు లనియుఁ బ్రహేళిక కర్థము చెప్పెను. వాదిఘంఘాలుఁడు నట్లె వివరించెను. దండి కాంచీపురవాసి యనియుఁ బల్లవరాజాశ్రితుఁ డనియు నూహింపవచ్చును.

శ్రవణబెళగుళ మను జైనమఠములోని శిలాశాసనముల శ్రీవర్ధదేవుండను జైనాచార్యుని ప్రశస్తిలో [శాసనము సంఖ్య ౫౪-క్రీ. శ. ౧౧౨౯]: య ఏవ ముపశ్లోకితో దండినా—

"జహ్నోః కన్యాం జటాగ్రేణ బభార పరమేశ్వరః,
శ్రీవర్ధదేవ సంధత్సే జిహ్వాగ్రేణ సరస్వతీమ్."

అని లిఖింపఁబడి యున్నది. శ్రీవర్ధదేవుఁడే వైద్యవ్యాకరణకారుఁడుఁ బ్రసిద్ధిగాంచిన పూజ్యపాదుఁడు. అతఁడు క్రీ. శ. ౬౫౦ కాలమున నుండెను. దండియు నప్పటివాఁడని తేలును. భోజదేవుఁడు శృంగారప్రకాశమునఁ దొమ్మిదవప్రకాశమున "దండినో ధనంజయస్య వా ద్విసంధానం" అని కథాద్వయసంవిధానమున కుదాహరణముగాఁ జెప్పి "ద్విసంధానే".

"ఉదారమహిమా రామః ప్రజానాం హర్షవర్ధనః,
ధర్మప్రభవ ఇత్యాసీత్ ఖ్యాతో భరత పూర్వజః."

అని యుదాహరించెను. అది ధనంజయ ద్విసంధానమునఁ గానరాకుండుటచే దండికృతమగు ద్విసంధానమున నుండునేమో యని సందేహము కలుగుచున్నది. ఈశ్లోకమున ముద్రాలంకారలక్షితముగా హర్షవర్ధనుని పేరు గలదు. దండి యతనియాస్థానమునకుఁ బోయియు—

వచ్చును. దండియొక్క గ్రంథము ద్విసంధాన మనురాఘవపాండవీయమని యూహింపఁబడెను. అతని దశకుమార చరిత్రము పూర్వపీఠిక యనియు, నుత్తరపీఠిక యనియు రెండుభాగములై, యొక్కొక్కటియు నాశ్వాసవిభాగము కలదై వచనరూపముగా నున్నది. ప్రాచీనవ్యాఖ్యలన్నియు నుత్తరపీఠికపై మాత్రమే కలవు. పూర్వపీఠికలు పెక్కు తెఱఁగుల నాశ్వాససంఖ్య మాత్రమే కాక కథాసరణియు భేదించుచు బహు కవికృతములగు భిన్నగ్రంథములవలెఁ గానవచ్చుచున్నవి. కేతన యను నాంధ్రకవి తెనిఁగించిన దశకుమారచరిత్రమును సంస్కృతముతోఁ బోల్పఁ బూర్వపీఠికలలో నొక్క పాఠము మూఁడాశ్వాసముల వఱకు మక్కికి మక్కి యనువాద మగుచున్నది. ఉత్తరపీఠికలోఁ గథామాత్రస్వారస్య ప్రధానముగాఁ దెనిఁగింపఁబడియె. కర్ణాటకానువాదమునఁ బూర్వపీఠికాకథ లబ్ధగ్రంథభాగములకు భిన్నముగా నున్నది. ఉత్తరపీఠిక మూలమునకు సరియైనదే. మఱియుఁ బూర్వోత్తరపీఠికలలో శైలి భేదిల్లుచున్నది. ఉత్తరపీఠిక ప్రౌఢతరము. కావునఁ బూర్వభాగము దండికృతము కాదు. ఒకపాఠము కేతన దశకుమార చరిత్రమును జూచి పూర్వపీఠిక యెవ్వరో సంస్కృతమున లిఖియించిరని తోఁచును. లాక్షణికు లెవ్వరు దీనిలోనుండి యుదాహరింపరైరి.

ఇటీవల నవంతిసుందరీకథ యనియు, నవంతిసుందరీకథాసార మనియు రెండుగ్రంథములు కేరళదేశమున లభించినవి. వానిఁ బరిశోధింపఁగా నవంతీసుందరీకథయే దండిప్రోక్తమగు నాఖ్యాయిక యనియు, దానికి సంక్షేపరూపముగాఁ దత్సారము నెవ్వరో రచించిరనియు, దండి కాంచీపురాధీశ్వరులగు పల్లవరాజులయొద్ద నుండెననియుఁ దేలినది.

"అస్త్యవనద్ధపురం నామ ప్రదేశే పశ్చిమోత్తరే,
ఆర్యదేశశిఖారత్నం తత్రాసన్ బహవో ద్విజాః.
తతో వినిస్సృతా కాచి త్కౌశిక-బ్రహ్మసంతతిః,
బ్రహ్మలోకా దివాయాంతీ పుణ్యతీర్థా సరస్వతీ.
నాసిక్యభూమా వౌత్సుక్యా న్మూలదేవ నివేశితామ్,
ప్రాప్యానలపురం నామ పురీ మధివసత్యసౌ.

తస్యాం నారాయణస్వామినామ్నో నారా
దామోదర ఇతి శ్రీమా నాదిదేవ ఇవాభవత్.
స మేధావీ కవి ర్విద్వా న్భారవిః ప్రభవో గి
అనురుద్ధ్యాకరో మైత్రీం నరేన్ద్రే విష్ణువర్ధనే
ఇతి శ్రుత్వా మహీపాల స్తదాలోకనలోల
అనేక శ్రీముఖాకృష్ట మకరో దము మాత్మసా
నృపనిర్బంధనిర్దిష్టే ప్రకల్పవిభవే గృహే,
వహతః పైతృకీం వృత్తిం తస్యాసీ త్తనయత్రితం
మనోరథాహ్వయ స్తేషాం మధ్యమో వంశవర్ధ
తత స్తనూజా శ్చత్వారః ప్రష్టు ర్వేదా ఇవ
శ్రీ వీరదత్త ఇత్యేషా ముత్తమ స్తత్త్వవేదిన
యవీయా నస్య న క్లాఘ్యా గౌరీ నామాభవత్ప్రి
తతః కథంచి త్సా గౌరీ ద్విజాధిపశిఖామణేః
కుమారం దణ్డి నామానం వ్యక్త శక్తి మజీజన
పశ్చాల ఏవ మాత్రాచ పిత్రా చాపి వ్యయుజ
అయుజ్యత గరీయస్యా సరస్వత్యా శ్రుతేన
స విక్రియే పురే తస్మిన్ పరచక్రోపరోధతః,
స చచార శుభాచారః సర్వా ముర్వీ ముదార
అథ శ్రీమే ష్వతీయాన శాస్త్రేషు చ కృత
పశ్యన్ పుణ్యాన్యరణ్యాని వ్యతిపద్దినసాన్ బహ
మిత్రాణిమాతృదత్తాద్యాః కేరళేభ్యో ద్విజో త్త

భారవిని పిలిపించినవాఁడు కాంచీపురా
సింహవిష్ణువు. పై శ్లోకములవలన దండి భారవికి మ
మఁడనియు, నతఁడు సింహవిష్ణువు నాస్థానమున ను
యు, నందుచే దండి నరసింహవర్మ కాలమున నుం
డుట యసంభవము కాదనియు స్ఫురించుచున్నది.
సుందరీకథలోని కథాంశము దశకుమార చరిత్ర
కథాభాగమే. శైలి యతి రమణీయమై, ప్రౌఢ
ణాదికవుల రచనాగాంభీర్యము ననుకరించియు
కావున దశకుమారచరిత్రకుఁ గవికృతనామధేయ
సుందరీకథ యనియుఁ, బ్రసిద్ధదశకుమారచరిత్ర
పీఠికయే యిప్పుడు లబ్ధ మగు నవంతీసుందరీ
భాగము కానోపుననియుఁ దద్గ్రంథపఠనమువల

ంకి తండ్రి వీరదత్తుఁడు, తల్లి గౌరి, మిత్రులు త్రి, మాతృదత్తుఁడు, భవనాథుఁడు మొదలగు కాంచీపురము చాళుక్యరాజగు విక్రమాదిత్యునిచేఁ డు సంరక్షకులు ముట్టడింపఁబడఁగా, దండి లమునఁ గేరళాది నానా దేశములు సంచరించి, కాంచీ ధముగడచినపిదప మగిడివచ్చెననియు దానిలో నే కావున నితఁడు క్రీ. శ. ౬౩౦—౪౦ ప్రాంత కాంచీపురమున నుండెననుట నిక్కము. ఇతని లుత్తర దేశమున నానందపురవాసులయ్యు, గ్రమ దక్షిణదేశవాసము వీరి కలవడెను. దండి రచించిన గ్రంథములు దశకుమారచరిత మను నవంతిసుందరీ ఁ, కావ్యాదర్శము, ద్విసంధానము ననుగాఁ బర్యాప లేలను. ఆనామయస్తోత్ర మను శివస్తుతి యితఁడు ను. వైయాకరణు లితని స్మరించుటచే నితఁడు ాష్యమునకు వ్యాఖ్య వ్రాసియుండు నేమో యని ంపవలసి యున్నది.

చిరంతనాలంకారికులలో దండియు నొక్కఁడను వాదము లేదు. భామహుఁ డను గ్రంథకారుఁ డితఁ ప్రాచీనుఁడో, లేక సమకాలికుఁడో, సుప్రసిద్ధుఁ డున్నవాఁడు. అతఁడు కావ్యాలంకార మనునొక ము రచించెను. దానిలోని కొన్ని యంశముల కిందు ము కలదు. అతిప్రాచీనవ్యాఖ్యాత యగు వాది ల దేవుఁడును దండియాఖ్యాయికా శబ్ద నిర్వచన కథాకారిక వ్రాయుచు, 'భమ్మహామతిమాత్మపతి' భామహునిఁ బూర్వునిగా నూహించెను. భామ ు రామశర్మకృతమగు నచ్యుతోత్తరములోనుండి ము లుద్ధాటించెను. రామశర్మ దండిమిత్రుఁడగు మహేశుఁ డగు నేమో యని శంకింపవలసి యున్నది. సూత్ర భాష్యకారుఁడగు మస్కరి తాను భామ శిష్యుఁడని చెప్పుకొనెను. భామహుని కావ్యా రమునఁ జతుర్థపరిచ్ఛేదమునఁ దిఙ్నాగ ధర్మకీర్తుల లు నిరసింపఁబడుటచే భామహుఁడు ధర్మకీర్తితో కాలికుఁడైనఁ గావలెను. ధర్మకీర్తి క్రీ. శ. ౬౫౦ యుండినందున ధర్మకీర్తి భామహ దండి బాణభట్ట యుఖాదులు సమకాలికులని యూహింపఁదగు.

దండి పూర్వాచార్యుల గ్రంథముల సంగ్రహించెనని చెప్పుచున్నాఁడు. వ్యాఖ్యాతలు వారు కాశ్యప బ్రహ్మనంది బ్రహ్మదత్త ప్రభృతు లని వివరించిరి. కాశ్యపుఁ డెవ్వఁడో శిల్ప సంగీత నాట్య వైద్య జ్యోతిష ఛందః కావ్యాలంకారాదుల గ్రంథములు రచించెను. వానిలో శిల్పము మాత్రమే కానవచ్చుచున్నది. దానికే యంశుమద్భేదమని నామాంతరము. బ్రహ్మనంది వ్యాసుల బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యాత. ఆవ్యాఖ్యాన మిప్పుడు లభింపదయ్యె. బ్రహ్మదత్తుఁడును మీమాంసావేదాంత గ్రంథకారుఁడు. వీరల కృతు లుప్తన్నము లగుటచేఁ కావ్యాలంకారమున వీరిమత మేదో కనుఁగొన సాధ్యముకాదు.

మనకు లభించు కావ్యాలంకారగ్రంథములలో వహ్నిపురాణభాగము కావ్యాదర్శముకంటెఁ 'ప్రాచీనతరము'. భరతుని నాట్యశాస్త్రమున నలంకారశాస్త్రములోని యంశములు పెక్కులు గలవు.

అలంకారశాస్త్రమున సామాన్యముగా 1. కావ్యస్వరూపము, 2. వృత్తిలక్షణము, 3. గుణదోషప్రకరణము, ౪. శబ్దార్థాలంకార వివేచనము, ౫. రసభావనిరూపణము, ౬. నాయకనాయికా గుణావస్థానిర్ణయము, ౭. దృశ్యశ్రవ్య కావ్యభేదము, ౮. రూపకపరిభాషాంగప్రశంస, ౯. కథాశరీర సంవిధానము, ౧౦. కవిప్రేక్షకపటుత్వసముదాయాది ప్రకీర్ణకవిమర్శము, అనునంశములు విశదీకరింపఁబడు. అలంకార శాస్త్రములు సాధారణముగా రెండు తెగల నొప్పారు. మొదటి నాలుగువిషయములు నొక్కతెగగాను, తక్కినవి రెండవ తెగగాను శాస్త్రకారులు గ్రహించిరి. భామహాలంకారము (౬౫౧ క్రీ.శ.), దండికావ్యాదర్శము (౬౪౦ క్రీ.శ.), రుద్రటుని కావ్యాలంకారము (౭౦౦), వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి (౮౦౦), ఆనందవర్ధనుని ధ్వన్యాలోకము (౮౫౦), ఉద్భటుని కావ్యాలంకారసంగ్రహము (౮౪౦), వాగ్భటుని కావ్యాలంకారము (౯౦౧), రాజశేఖరుని కావ్యమీమాంస (౮౩౦), మహిమభట్టు వ్యక్తివివేకము (౧౦౦౦), భట్టనాయకుని హృదయదర్పణము (౯౫౦), కుంతలకుని వక్రోక్తిజీవితము (౯౬౧), భోజదేవుని

సరస్వతీకంఠాభరణము (౧౦౫౦), మమ్మటుని కావ్య ప్రకాశము (౧౧౫౧), రుయ్యకుని సహృదయలీలయు, అలంకారసూత్రములు (౧౧౭౦) ను, మంఖుకుని యలం కారసర్వస్వమును, సాహిత్యమీమాంసయు (౧౧౭౧), హేమచంద్రుని కావ్యానుశాసనము (౧౧౫౦), విద్యా నాథుని ప్రతాపరుద్రీయము (౧౩౨౦), విద్యాధరుని యేకావళియు (౧౩౫౦), విశ్వనాథుని సాహిత్యదర్పణ మును (౧౩౫౦), అలంకారసుధానిధి (౧౩౭౦), చమ త్కారచంద్రిక (౧౩౫౦) మొదలుగాఁగలవి మొదటి తెగకుఁ జేరినవి. రెండవతెగయగు రసభావనిరూపణ ప్రముఖగ్రంథజాలములో భరతుని నాట్యశాస్త్రము అధ్యాయములు [౬, ౭, ౧౭, ౧౮, ౨౦, ౨౧, ౨౨, ౨౩, ౨౪], రుద్రుని శృంగారతిలకము (౭౦౧), తోతా చార్యుని కావ్యకౌతుకము (౯౭౯), అభినవగుప్తుని యభి నవభారతియు, నాట్యలోచనము (౧౧౦౦), భోజదేవుని శృంగారప్రకాశము (౧౦౬౦), శారదాతనయుని భావ ప్రకాశము (౧౧౫౦), ధనంజయుని దశరూపకము (౧౦౧౮), జగద్ధరుని నాట్యసర్వస్వము, రామచంద్రుని నాట్యదర్పణము (౧౧౭౦), త్రిలోచనుని నాట్యలోచ నము, రసార్ణవసుధాకరము (౧౩౫౦), కుంభకర్ణునిసంగీత మీమాంస, రసపరిచ్ఛేదము (౧౧౫౦), రసవివేకము, రాజరాజీయము, రసమీమాంస, రసకల్పద్రుమము, శృంగార మంజరి మొదలగునవి చేరుచున్నవి.

వీనిలో భామహదండ్యానందవర్ధనభట్టనాయక కుంతలకమహిమభట్టభోజులు మొదటితెగలోను, భరత నందిరుద్రాభినవగుప్తభోజాదులు రెండవతెగలోను మూలస ప్రస్థానములు స్థాపించి తక్కినవారికి మార్గదర్శులైరి. పై విభాగమునఁ గొందఱిగ్రంథముల రెండుతెగల యంశములను గలపిరో, యానుషంగికముగ సూచింపఁ బడియో యుండును. కావ్యాదర్శమునఁ గావ్యస్వరూప మునను, నలంకారవివేచనమునను దండి చాల శ్రమించి సూక్ష్మభేదముల నెలకొల్పె. అయినను దీనలంకారభేద జాతి యంతయుఁ దర్కశాస్త్రపరిష్కృతము గాక చాల కాలముండఁగా, విద్యానాథాదులకాలమున కనఁగా శిరో మణి భట్టాదుల మణిదీధితి విజృంభణమునకుఁ బిదప, సకల

శాస్త్రములవలెనే దీనికిని న్యాయశాస్త్రనిక బున నొరయిక తగిలి ప్రాచీనుల నిర్వచనములన బునఃపరిశోధితములై, రసగంగాధర సాహిత్యర కావ్యదర్పణ సాహిత్యసారాదినవీనగ్రంథముఖము జితములై వెలుఁగుచున్నవి. అయినను మాయభి మున నర్వాచీనగ్రంథములు నిరుక్తిపరిష్కారసమ సూక్ష్మాంశపరిబోధకములగుట సత్యమైనను, స ప్రౌఢిమమునఁ బ్రాచీనకృతులను సరిగావేరవు. దర్యాదులు కావ్యప్రకాశ రసగంగాధరాదులక పోవచ్చును; కాని ప్రౌఢిమ గాంభీర్యముల మి డును. ఈయంశము కావ్యప్రకాశకారాదులకుఁ డగు వాదిఘంఘాలుని కావ్యాదర్శవ్యాఖ్యచే విశ

ఈగ్రంథము ప్రౌఢగంభీరార్థకమగుటచేత గున నలంకారశాస్త్రమున నిర్దుష్టగ్రంథములు చేతను బనిఁగొనుట మిక్కిలి కష్టము. కావ్య చూడామణిలో దండి లక్షణశ్లోకములు పెక్కు కరింపఁబడియె. వానిఁ బరిశీలించినచో విన్నకో న్నకు సంస్కృతభాషాపరిచయము లేదని కా యలంకారశాస్త్రగ్రంథ మతఁ డెఱుఁగఁడని కా వలసివచ్చును. భట్టుమూర్తి నరసభూపాలీయము తర్కశాస్త్రవాసన లేనివీరు మహాగ్రంథములఁ నొరఁగొనుట హాస్యభాజన మగుటయే కాక, నగౌరవము ప్రతిపాదించిరి. ధ్వనితత్త్వమును గవి నకు మొదట ప్రసాదించిన యానందవర్ధను నట్టివాని జయంతుఁడు న్యాయవార్తికమున,

> యం మన్యః పండితమ్మన్యః ప్రపేదే కంచన
> విధే ర్నిషేధావగతి ర్విధి బుద్ధి ర్నిషేధతః.
> మానాంతరపరిచ్ఛేద్య వస్తురూపోపదేశినామ్,
> శబ్దానా మేవ సామర్థ్యం తత్రతత్ర తథాతథా
> అథవా నేదృశీ చర్చా కవిభిః సహ శోభతే,
> విద్వాంసోఽపి విముహ్యంతి వాక్యార్థగహనే

అని పండితమ్మన్యుఁడనియు, నశాస్త్రజ్ఞుఁ దూషించెను. ఈవాక్పరిహారము కేవల మానందవ కాక ధ్వనివాదమునకుఁ బరమాచార్యుఁడగు భర్త

దగులుచున్నది. ఇట్లుండ భట్టుమూర్తి ప్రభృతు లకు? ఈగ్రంథమును యథామూలముగాఁ దెనిఁ పరిభాషలకును, వాక్యార్థవిశేషములకును విపుల వ్యాఖ్య వ్రాయుటచే నాంధ్రులకు మూలగ్రంథ ము తెలియనగుఁ గాని స్వమనఃప్రవృత్తికిఁ దగి తెనిఁగించుట యంత లోకోపకారము కానేరదు. శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రులవారు దీని నతి సి యథామూలముగాఁ దెనిఁగించిరనుట నిస్సంశ తెనిఁగింప నసాధ్యములగు సభంగశ్లేషముల వీరు శ్రమించి తత్తుల్యముగా నాంధ్రమున వాక్యజాలము కల్పించి లక్షణముల కుదాహరణము లిచ్చిరి. అట్టి చోటులు వీరి పాండిత్యప్రకర్షమును జాటుచున్నవి. భాషలో నలంకారగ్రంథములు లేనిన్యూనత వీరు కొంతవఱకుఁ దొలఁగించినందులకు నెల్లరు కృతజ్ఞులు గాఁదగు. ఇది శాస్త్రగ్రంథము కావున వ్యాఖ్యానసాపేక్ష మనుట యచ్చెరువు కాదు. ఇది పాఠ్యగ్రంథకోటిలో నిర్ణీత మగు నేని, కాలక్రమమున సువ్యాఖ్యలు దీనిపై వెడలు ననుట దురభిలాషము కాఁజాలదు.

---

# నా పదము

కొంపెల్ల జనార్దనరావు గారు

దీని కనుపేక్ష్యయాత్ర కాదియని లేదు,
అంతమని లేదుఁ గాఁ బోలు! అరిగి యరిగి
చూడఁ, దొలిఁగన్ను విచ్చిన చోటు చుట్టి
తిరుగుచుండుటె నాపద మెఱుఁగుచుండు!

దీన నిఁకముందు నడక లేదేని, ఒకట
నిలుకడకుఁ బూని సాధింప నేరదేల
నాపదము? రిత్తలైన, యత్నములు నలుప
కోరికలు లోఁ దరంగించు కొనునొ యేమొ!

తన పరాధీనతకు నాపదము సహించి
వలవదంచును నెదురాడ వలవదింతె
ఎటు లభించెనో అరయదు; ఇంతమధుర
మో యిది! తలంప దానికే యొదవు వింత.

ఉన్న వెలుతురు కాంచదు; కన్నుమూసి
అడుగులిడు నాపదము. కత మడుగఁ బడిన
'అపరాధీనతా సూత్రమందె కలవు
వెలుఁగు పెన్నిధు, లో, నవి విరియు' ననును.

---

# ఉత్తరరామచరిత నాటక రసవిచారము

కొంపెల్ల సుబ్బారాయశాస్త్రి

ఇదం కవిభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే,
వన్దేమహిచ తాం వాణీ మమృతా మాత్మనః కలామ్.

సంస్కృతనాటక కవులలో సుప్రసిద్ధుం డగు మహాకవి భవభూతిచే రచియింపఁబడి "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే" యను ప్రఖ్యాతిం గలిగించిన యుత్తర రామ చరిత మనునాటకము భారతీయ సంస్కృత సారస్వతసారగ్రాహు లగు సహృదయాగ్ర గణ్యు లెల్లరు నెఱింగినదియే. దానియందుం బ్రధానరస మెద్ది యను విచారమున ననేకు లనేకమార్గముల ననుగమించుచున్నారు. పలువు రిందుం బ్రధానమైనది కేవల కరుణరస మని చెప్పుచున్నారు. మఱికొంద ఱీ నాటకమునం బ్రధానరసము విప్రలంభశృంగారమని వాదించుచున్నారు. ఇట్లీకరుణ విప్రలంభ వాదుల వాదములే పరస్పరవిజిగీషతో బయలుదేఱి యెల్లెడం బ్రవర్తిల్లుచున్నయవి. ఇవి యిట్లుండ నిఁకఁ గొంద ఱీనాటకము వీరరసప్రధానమైన దని తలంచుచున్నారు. కాని వీరివాద మంతగా రచ్చకువచ్చుట లేదు. ఇట్లు బహువిధ వాదభూయిష్ఠ మగుటవలన నిందు నిశ్చిత మెల్లరకుం గోచరమగుట లేదు. సామాన్యముగా రసస్వరూపముం దెలియుట బ్రహ్మ స్వరూపముం దెలియుట యనవచ్చును. కావుననే "రసో వై సః" అని శ్రుతి చెప్పుచున్నది. మన ప్రాచీనసాహిత్య మీమాంసా శాస్త్రకా[...] "బ్రహ్మాస్వాద సబ్రహ్మచారీ విగళిత వేద్యా[...] భగ్నావరణచిదా చర్వ్యమాణో[...] అని రసలక్షణముం జెప్పియున్నారు.

"ఫలానాఞ్చ దళానాఞ్చ
సన్తు తే తే వివేచకాః,
మకరన్ద విశేషజ్ఞో
మిళింద మపహాయ కః."

అనినట్లు లోకమున శబ్దార్థాది విమర్శకు[...] కు లుందురుగాక, రసభావాది విమర్శకు[...] డుగా నుందురు. ఇట్లుండ నతిసూక్ష్మము[...] తిదవాంతర విశేషంబులం దెలియుట [...] దాది కించిజ్జ్ఞకోటికి దుశ్శకమని నే నెఱు[...] దును. అయినను నే నేఁబదివత్సరములకా[...] దాదాపునుండియు నీనాటకమును నా కొ[...] బుద్ధితో నప్పుడప్పుడు విచారించు చున్న[...] "మహాజనో యేన గత స్సపన్థాః" అను ప్ర[...] నోక్తికి లోఁబడి నడుచు స్వభావము గల[...] నైనను, బహుజన సమ్మతమగు కరుణర[...] ధాన్యము నంగీకరించుట కెంత మాత్రమ[...] నాయంతరాత్మ సమ్మతించుటలేదు. వీర[...] ప్రాధాన్య వాద మత్యల్ప సంఖ్యాక సం[...]

హితమైనను ధర్మోత్కర్షా పాదక
బవలన సత్యంతాదరణీయమని తెలంచి,
వేశము నొంది సహాయదౌర్బల్యమునకు
పక నాశక్తికొలఁదిం బ్రయత్నించి చూ
ం సాహిత్యమీమాంసా పద్ధతిని సహృ
హృదయరంజనముగా సాధించు సదుపా
ములు సంతృప్తికరముగా నిప్పటికిం జిక్క
న నావిషయమున మందోత్సాహుఁడ
యుంటిని. కావున నీకుఁ బరిశిష్టమగు కరు
పలంభశృంగారరసమే యిప్పటికిఁ బ్రబల
గా నాకుఁ గనఁబడుచున్నది. దుర్దైవవశ
నింతవఱకు నిదమిత్థమని నా కుపదే
ం సద్గురువు లెవ్వరును లభింపలేదు.
డు రసభావాది విమర్శకు లనేకులు
లు దేఁతి కావ్యాదిరహస్యముల వెల్లడింపఁ
నుచున్నారు కావున నీనాటకరసప్రాధా
షయమున నాకుఁ దోఁచిన వికల్పములం
టించినచో దయాళుహృదయులగు సహృ
లెవ్వరైనఁ గటాక్షించి నన్నుఁ గృతా
జేయఁ గలరని తలంచి యిందుఁ బొందుప
చుచున్నాఁడను. చిత్తగించి ప్రమాణముగా
త్తరముల నీయఁ బ్రార్థించుచున్నాఁడను.

కరుణరసప్రాధాన్యవాదులు తమవాద
కుపష్టంభకముగాఁ జూపు ప్రమాణము
ు, యుక్తులును నెవ్వి యనిన:—

౧. ఈనాటకమున మొదటఁ బ్రస్తావన
నటుఁడు

"అతిదుర్జన ఇతి వక్తవ్యమ్.
దేవ్యా అపిహి వైదేహ్యా
సాపవాదో యతో జనః,
రక్షోగృహస్థితి ర్మూల
మగ్నిశుద్ధౌ త్వనిశ్చయః." ౧.అం. ౬.

అని పలుకఁగా, సూత్రధారుఁడు "యది పునరియం కింవదన్తీ మహారాజం ప్రతి స్యన్దేత తతః కష్టం స్యాత్." అనెను. ఇందువలన భావివిపత్ప్రయోజనము సూచింపఁబడుచున్నది.

౨. మఱియుఁ జిత్రదర్శనమున లక్ష్మణుఁడు

"సోయం శైలః కకుభసురభి
ర్మాల్యవా న్నామ యస్మి
న్నీలస్నిగ్ధ శ్శ్రయతి శిఖరం
నూతన స్తోయవాహః,
ఆర్యే ఽస్మిన్......"

అని రాముని దుఃఖావస్థం జూపఁబోఁగా, రాముఁడు

"...విరమ విరమా
తఃపరం నక్షమోఽస్మి
ప్రత్యావృత్త స్స పునరివ మే
జానకీ విప్రయోగః." —౧.అం.33.

అనెను. ఇది భావి జానకీవియోగమున కుపశ్రుతిగా నున్నది.

3. దుర్ముఖదుర్వచశ్శ్రవణానంతరమున రాముఁడు లోకాపవాదమునకు జడిసి యొద్ద యో చేయఁదలంచి,

"హా దేవి, దేవయజనసమ్భవే, హా స్వజన్మానుగ్రహపవిత్రితవసున్ధరే, హా నిమిజనకనన్దిని, హా పావకవసిష్ఠారున్ధతీప్రశస్త శీలశాలి

ని, హా రామమయజీవితే, హా మహారణ్యవాసప్రియసఖి, హా తాతప్రియే, హా స్తోకవాదిని, కథ మేవం విధాయా స్త వాయ మీదృశః పరిణామః!

త్వయా జగన్తి పుణ్యాని
త్వ య్యపుణ్యా జనోక్తయః,
నాథవన్త స్త్వయా లోకా
స్త్వ మనాథా విపత్స్యసే."
—౧. అం. ౪౩.

అనెను. ఇందువలన సీతకు మహోపద్రవము సిద్ధముగ నున్నదని రాముని యభిప్రాయము తెలియుచున్నది.

౪. రాముఁడు "హా కష్టమ్. అతి బీభత్సకర్మా నృశంసోఽస్మి సంవృత్తః.
శైశవా త్ప్రభృతి పోషితాం ప్రియాం
సౌహృదా దపృథగాశయా మిమామ్,
ఛద్మనా పరిదదామి మృత్యవే
సౌనికో గృహశకున్తికా మివ.
—౧. అం. ౪౫.
త స్కిమస్పృశ్యః పాతకీ దేవీం దూషయామి."

అని సీత తలక్రిందిచేయి తీసికొని,
"అపూర్వకర్మచణ్డాల
మయి ముగ్ధే విముఞ్చ మామ్,
శ్రితాసి చన్దనభ్రాన్త్యా
దుర్విపాకం విషద్రుమమ్."
—౧. అం. ౪౬.
అని లేచి,

"హన్త హన్త సర్వథా నృశంసోఽస్మి ... విపర్యస్తో లోకః; అద్యావసితం జీవిత ప్రయో... రామస్య శూన్య మధునా జీర్ణారణ్యం జ... అసార స్సంసారః; కాష్ఠప్రాయం శరీ... అశరణోఽస్మి; కింకరోమి? కాగతిః? అథ

దుఃఖసంవేదనాయైవ
రామే చైతన్య మాహితమ్,
మర్మోపఘాతిభిః ప్రాణై
ర్వజ్రకీలాయితం హృది.
—౧. అం.

హా అంబ అరున్ధతి, భగవన్తౌ వసిష్ఠ వి... మిత్రౌ, హా భగవ న్పావక, హా దేవి భ... ధాత్రి, హా తాత జనక, హా తాత, హా ... తరః, హా ప్రియసఖ మహారాజ సుగ్రీవ, ... సౌమ్య హనూమన్, హా మహోపకారిన్ ల... ధిపతే విభీషణ, హా సఖి త్రిజటే! పరిముషి... స్థ, పరిభూతాః స్థ రామహతకేన. అ... కోనామ తేషా మహ మిదానీ మాహ్వా...

తేహి మన్యే మహాత్మానః
కృతఘ్నేన దురాత్మనా,
మయా గృహీతనామానః
స్పృశ్యన్త ఇవ పాప్మనా.
—౧. అం.

యోఽహమ్
విస్రమ్భా దురసి నిపత్య జాతనిద్రా మున్ము...
చ్య ప్రియగృహిణీం గృహస్య లక్ష్మీమ్,
ఆతఙ్క స్ఫురితకఠోరగర్భగుర్వీం
క్రవ్యాద్భ్యో బలి మివ దారుణః క్షిపామి.
—౧. అం.

సీత పాదములను శిరంబున నునిచికొని, ...ము పశ్చిమ స్తే రామశిరసి పాదపఙ్కజ ...ః." అని యేడ్చుచున్నాఁడు. దీనివలన ...ుఁడు సీతావిషయమునఁ గేవల నిరాశుఁ ...ై యిదియే కడసారిగా భావించుచున్నట్లు ...మగుచుండఁ, బిమ్మట రామునిహృదయ ...న శోకమే కాక శృంగారరసస్థాయిభావ ...ు రతి యంకురించుటకైన నవకాశము ...దా?

౫. "హా వత్సే జానకి!
స ఏష తే వల్లభ శాఖివర్గః
ప్రాసంగికీనాం విషయః కథానామ్,
త్వాం నామ శేషామపి దృశ్యమానః
ప్రత్యక్షదృష్టామివ నః కరోతి."

—౨. అం. ౬.

...ు నాత్రేయి వచనమున సీత కిడిన నామ ...పురాలనువిశేషణమును విని వాసంతి భయ ...త్రాఁ దవలో "కథం నామ శేషే త్యాహ" ...కొని, "కి మత్యాహితం సీతా దేవ్యాః" అని ...డుగును. ఆత్రేయి "న కేవల మత్యాహితం, ...పవాదమపి" అని చెవిలో నేమో చెప్పును. ...ది విని వాసంతి "హా దారుణో దైవ నిర్ఘాతః" ...ని మూర్ఛిల్లును. అప్పుడు తమసిచే నూఱడిం ...బడి వాసంతి "హా ప్రియసఖి, ఈ దృశ స్తే ...ర్మాణభాగః! హా రామభద్ర, అథవా అలం ...యా" అనెను. ఇందువలన సీతాజీవితాశ ...ుగుట కవకాశ మున్నదా?

౬. రాముఁడు శంబూకుని సంహరించు ...కు సదయోద్యతఖడ్గుఁడై,

"రే హస్త, దక్షిణ, మృతస్య శిశో ర్ద్విజస్య
జీవాతవే విసృజ శూద్రమునౌ కృపాణమ్,
రామస్య బాహు రసి నిర్భరగర్భఖిన్న
సీతావివాసనపటోః కరుణా కుత స్తే."

—౩. అం. ౧౦.

అని యెట్టకేలకు నఱికి, "కృతం రామసదృశం కర్మ" అనును. దీనివలన సీతవిషయమునను, శంబూకుని విషయమునను దాను చేసినది తుల్యమగు నిర్దయఘోరకృత్యమనియుం, దన బ్రతుకే యట్టిదయ్యె ననియు రాముని యభిప్రాయము తెలియుచున్నది. కావున సీతాజీవితాశ రామునకుఁ గలదనుట కవకాశము లేదు.

౭. మఱియు రాముఁడు "అత్రైవ సా పంచవటీ యత్ర నివాసేన వివిధవిస్రంభాతిప్రసంగసాక్షిణః ప్రదేశాః ప్రియాయాః ప్రియసఖిచ వాసన్తీ నామ వనదేవతా కిమిద మాపతిత మద్య రామస్య సమ్ప్రతిహి.
చిరా ద్వేగారంభీ ప్రసృతఇవ తీవ్రో విషరసః
కుతశ్చి త్సంవేగా త్ప్రచలఇవ శల్యస్య శకలః,
వ్రణో రూఢగ్రంథిః స్ఫుటితఇవహృన్మర్మణిపునః
పురాభూతశ్శోకో వికలయతి మాంనూతనఇవ.

—౨. అం. ౨౬.

హా న్తహా న్త పరిహర న్త మపి మాం పఞ్చవటీ స్నేహా దాకర్షతీవ"
అని సకరుణముగా—
"యస్యాం తే దివసా స్తయా సహా మయా
సీతా యథా స్వే గృహే

యత్సంబన్ధకథాభి రేవ సతతం
దీర్ఘాభి రాస్థీయత,
ఏక స్సంప్రతి నాశితప్రియతమ
స్తా మేవ రామః కథం
ప్రాపః పఞ్చవటీం విలోకయతువా
గచ్ఛ త్వసంభావ్య వా."
—౨. అం. ౨౮.

అనును. ఇందు రాముని నిరాశా ప్రయుక్త కేవలశోకము స్పష్టమగుచున్నది.

౮. "సఖి తమసే, ప్రేషితాస్మి భగవతో౽గస్త్యస్య పత్న్యా లోపాముద్రయా సరిద్వరాం గోదావరీ మభిధాతుమ్: 'జానాస్యేవ యథా వధూపరిత్యాగా త్ప్రభృతి,

అనిర్భిన్నో గభీరత్వా
దన్తర్గూఢఘనవ్యథః,
పుటపాకప్రతీకాశో
రామస్య కరుణో రసః. —3.అం.౧.

తేనచ తథా విధేష్ట జనకష్టవినిపాతజన్మనా ప్రకృష్టగద్గదేన దీర్ఘశోకసంతానేన సంప్రతి పరిక్షీణో రామభద్రః. త మవలోక్య కంపిత మివ కుసుమసమబన్ధనం మే హృదయమ్. అధునాచ రామభద్రేణ ప్రతినివర్తమానేన నియతమేవ పంచవటీవనే వధూసహనివాస విస్రమ్భసాక్షిణః ప్రదేశా ద్రష్టవ్యాః. తత్రచ నిసర్గధీర స్యాప్యేవం విధాయా మతిగంభీరాభోగశోకక్షోభసంవేగా త్పదేపదే మహాప్రమాదాని శోకస్థానాని శంకనీయాని. తద్భగవతి గోదావరి, త్వయా తత్రభవత్యా సావధానయా భవితవ్యమ్—

వీచీవాతైః శీకరక్షోదశీతై
రాకర్షద్భిః పద్మకిఞ్జల్కగంధాన్,
మోహేమోహే రామభద్రస్య జీవం
స్వైరం స్వైరం ప్రేరితై స్తర్ప'యేతి.
—3. అం.

అను మురలావాక్యమువలన రాముడు సీ… వియోగజనితశోకాతిరేకమునం బ్రాణావశి… డుగా నున్నాఁడనియును, లోపాముద్ర… లకుఁ గూడ సీతా జీవితాశ లేదనియు… దెలియనగును.

౯. వాసంతి

"అయి కఠోర, యశః కిల తే ప్రియం
కి మయశో నను ఘోర మతః పరమ్
కి మభవ ద్విపినే హరిణీదృశః
కథయ నాథ, కథం బత మన్యసే."
—3. అం.

అరణ్యమున సీతగతి యేమయ్యె నని తల… వని రాము నడుగఁగా రాముఁడు

"సఖి కిమత్ర మన్తవ్యమ్.
త్రస్యైకహాయనకురఙ్గవిలోలదృష్టే
స్తస్యాః పరిస్ఫురితగర్భభరాలసాయాః,
జ్యోత్స్నామయీవ మృదుబాలమృణాలకల్పా
క్రవ్యాద్భి రఙ్గలతికా నియతం విలుప్తా."
—3. అం.

అని చెప్పెను. ఇందు మాంసభక్షకజంతువు… సీత కడతేర్పఁబడినదనియే రాముని నిశ్చ… మని తెలియుచున్నది.

రాముఁడు

"...త్యా శూన్యస్య జగతో
...ద్వాదశః పరివత్సరః,
...ష్టమివ నామాపి
...చ రామో న జీవతి."

—3. అం. 33.

...ను. 'ఈలోకము సీతాశూన్యమయి యిప్ప
... బం[డెండవ సంవత్సరము. ఆమె పేరు
...క నశించిన ట్లున్నది. నేను [బతికియే
...న్నాను.' అనుటవలన సీత మృతి నొందె
...మే రాముని తాత్పర్య మని [గహింపనగును.

౧౧. "అన్య ఏ వాయ మధునా విపర్య
... వర్తతే.

...యానాం భావా
...దవిరలవినోదవ్యతికరై
...పద్రై ర్వీరాణాం
...జనితజగదత్యద్భుతరసః,
...హాగో ముగ్ధాక్ష్యా
...స్సఖలురిపుఘాతావధి రభూ
...టు స్తూష్ణీం సహ్యో
...నిరవధి రయ ప్రవ[ప్రతివిధిః."

—3. అం. ౪౪.

...విలపింపఁగాఁ [బచ్ఛన్నముగా నున్నసీత
...హుమాణిదమ్హి పువ్వవిరహే ణిరవధి త్తి హో
...దాహ్మి (బహుమానితాస్మి పూర్వ విరహే
...వధిరితి హా హాతాస్మి.) అనును. మఱియు
...ముఁడు

"కష్టంభోః.

వ్యర్థం యత్ర కపీన్ద్రసఖ్యమపి మే
వీర్యం హరీణాం వృథా
[ప్రజ్ఞా జామ్బవతో న యత్ర న గతిః
పుత్రస్య వాయో రపి,
మార్గం యత్ర న విశ్వకర్మ తనయః
కర్తుం నలోఽపి క్షమ
స్సౌమిత్రే రపి పత్రిణా మవిషయే
తత్ర [ప్రియే క్వాసి మే."

—3. అం. ౪౫.

అనెను. ఇందు సీత లోకాంతరము నొందె ననియు, నిఁక నేయుపాయమునుఁ బనికి రా దనియు, సీవియోగము హద్దులేని దనియు రామునిసిశ్చయ మని తెలియనగును.

౧౨. తమస "అహో సంవిధానకమ్.

ఏకో రసః కరుణఏవ నిమిత్తభేదా
ద్భిన్నః పృథక్పృథగివ [శయతే వివర్తాన్,
ఆవర్తబుద్బుదతరఙ్గమయా న్వికారా
నంభో యథా సలిలమేవహి తత్సమస్తమ్."

—3. అం. ౪౭.

అనెను. భవభూతి యీనాటకము కరుణ రస [ప్రధానమని స్వాభి[పాయమును దమసాముఖ మున వెల్లడించెను. నాటక కర్తయే [ప్రధా నము కరుణరసమనియుం, దక్కినవి దాని వివ ర్తములనియుం జెప్పినాఁడు కదా!

౧౩. ఘనశ్యామ వీరరాఘవ [ప్రముఖు లగు వ్యాఖ్యాత లీనాటకము కరుణరస[ప్రధాన మనియే వ్యాఖ్యానములు రచించిరి.

౧౪. ఈనాటకము నాంధ్రీకరించినకవులు కరుణరసప్రధానమని తలంచియే భాషాంతరీకరణముం గావించిరి.

౧౫. భవభూతికిం దరువాతివా రగు గోవర్ధనాచార్యాది మహాకవులు

"భవభూతే స్సమ్బన్ధా
ద్భూధరభూ రేవ భారతీ భాతి,
ఏతత్కృతకారుణ్యే
కిమన్యథా రోదితి గ్రావా."

—ఆర్యాసప్తశతి.

ఇత్యాదికములవలనం గరుణరసప్రధానమనియే ప్రశంసించియున్నారు.

౧౬. మఱియు నీనాటకముం దెచ్చటఁ జూచినను బ్రధానముగాఁ గరుణరసమే గోచర మగుచుండుటవలనను, దక్కిన రసము లన్నియును దాని కంగములుగాఁ దోఁచుచుండుటవలనను సార్వజనీనముగా నుత్తర రామచరితము కరుణరసప్రధానమని సామాన్యముగాఁ జెప్పుచున్నారు.

౧౭. ప్రతాపరుద్రీయమున రసప్రకరణమున "ఇష్టజనవియోగాదినా ఆత్మని దుఃఖాతిభూమి శ్శోకః" అని కరుణరసస్థాయిభావ మగు శోకమునకు లక్షణము చెప్పఁబడినది.

౧౮. దశరూపకమునం జతుర్థప్రకాశమున

"ఇష్టనాశా దనిష్టాప్తే
శ్శోకాత్మా కరుణో ను తమ్,
నిశ్వాసోచ్ఛ్వాసరుదిత
స్తంభప్రలపితాదయః. ౮౧
స్వాపాపస్మారదైన్యాధి
మరణాలస్యసంభ్రమాః,
విషాదజడతోన్మాద
చింతాద్యా వ్యభిచారిణః."

అని కరుణరసలక్షణము చెప్పఁబడినది.

ఇత్యాదిహేతువులం జూపుచు నీ నా
కము కరుణరసప్రధానమైనదని నిశ్చయి
చున్నారు.

ఇట్లు కరుణరసవాదులు చూపు హే
వులు పదునెనిమిదింటికిం గ్రమముగాఁ బ్ర
త్తరము లీక్రింద వ్రాయఁబడుచున్నవి.—

౧. ఇందలి "కష్టం స్యాత్" అన
కదా భావివిపత్ప్రియోజనసూచకము?
మనఁగా ననిష్టముమాత్రమే కాని మరణ
యర్థము కాదు. ఈనాటకమున వీరశృం
కరుణరసవాదులలో నెవ్వరికైనను ద్వా
వర్షపరిమితవిప్రయోగము నంగీకరింపక త
కదా? అది కష్టము కాదా? కావున నిది క
సాధకమునుఁ గాదు, వీరశృంగారబాధ
నుంగాదు. ఇదియుం గాక వెంటనే "సర్వ
ఖలు ఋషయో దేవాశ్చ శ్రేయో
స్యన్తి" అని నటుఁ డనెను. ఇందువలనఁ
స్సమాగమము సూచింపఁబడుట లేదా? ఇ
యిందలి బీజము.

౨. ఇందు జానకీవియోగసూచన
స్నను బయిదానివలెనే యిదియునుఁ గ
సాధకము కాదు. ఇందువలన సీతయందలి
ముని పరమానురాగము స్పష్ట మగుచున

3. ఇందు రాముఁడు లోకాపవాదము విని లోకారాధనరూపస్వధర్మనిర్వహణ నకై సకలసద్గుణసంపన్నురాలగు సీతం త్యజింపవలసివచ్చినదని విచారించుచున్నాఁ కావున నిదియునుఁ గరుణసాధకము కాదు. నువలన రామునకు సీతయందుఁగల లోకో ప్రేమవిశ్వాసములు స్పష్టమగుచున్నవి.

౪. ఇందు రాముఁడు 'బాల్యమునుండి ం నకృత్రిమపరమానురాగముతో నమ్మి ంచుచున్న మహాసాధ్వి నిప్పటివఱకు నుప లించుచుండి, యిప్పుడు మిష పెట్టి ఘోరా ణ్యములో నేకాకినిగా విడిచి హింసింపఁదలఁ మహాపాతకిని ఇట్టిదారుణకార్య మొనరించి మైహికమంతయును నిరర్థకము చేసికొను న్నాఁడను.' అని నిర్విణ్ణుఁడై యేమేమియో ంచి విలపించుచు, సీతాపాదములను శిరం వం గీలించి యిదియే కడసారి యని యేడ్చు న్నాఁడు. ఇది యంతయు సీతాపరిత్యాగ ర్యవృత్తాంతమే కావున నిదియునుఁ గరుణ ధకము కాదు. భావిసీతామరణ సంభావన కరుణసాధిక మైనయెడ, "జాతస్య మరణం వ"మ్మని యున్నది కావున సర్వత్ర కరుణ ము ను సాధింపవచ్చును. అప్పుడు "ఏకో ః కరుణఏవ" యనుపద్యము కరుణ వాదు ఁ జరితార్థమగును.

౫. ఇత్యాత్రేయీవాసంతీసంవాదము కి పిమ్మట వాసంతి "ఆర్యే ఆత్రేయి, అథ మ్మాదరణ్యా త్పరిత్యజ్య నివృత్తే లక్ష్మణే, సీతాదేవ్యాః కిం వృత్తమితి కాచిదస్తి ప్రవృత్తిః?" అని యడుగఁగా, నాత్రేయి "నహినహి" యని యుత్తర మిచ్చెను. కావున లక్ష్మణుఁడు సీత నరణ్యమున విడిచిపోయినపిమ్మట నేమి జరిగినదియు వీరికిం దెలియదనుట స్పష్టము. అనిష్ట సంభావనామాత్రమే కాని నిశ్చయము లేనందునఁ గేవల కరుణము కానేరదు.

౬. ఇందువలన నిరపరాధియగు శంబూకుని సంహరించుట కిష్టము లేకున్నను సీతాపరిత్యాగమువలెనే స్వధర్మవిధివశమున రామునకుఁ జేయక తప్పనిదయ్యెనని తెలియును. "సీతావివాసనపటోః" అనుటవలన వనపరిత్యక్తయగు సీత యేమియైనదియు నితనికిఁ దెలియదనవచ్చును. ఇందు సీతామరణనిశ్చయము లేనందున నిదియునుఁ గరుణసాధకము కాదు.

౭. ఇందు వియోగదుఃఖోద్దీపకములగు పరిచితప్రదేశభావాదులం జూచుటవలన రామునకుం గలిగిన వైక్లబ్యవికారము వర్ణింపఁబడినది. ఇందు "నాశితప్రియతమః" అనియుండుటవలన నిది యొకసాధకమని కరుణవాదులు భ్రాంతి నొందుచున్నారు. నాశ మనఁగా జాడ తెలియకుండుట కాని మృతి కాదు. "నష్టే మృతే ప్రవ్రజితే" ఇత్యాదిప్రయోగములం జూడుఁడు. సీత యేమియైనదియుఁ దెలియకుండునట్లు చేసినవాఁడని యర్థము కాని చంపినవాఁడని యర్థము కాదు. ఇది సీతామృతి నిశ్చయవాచకము కాదు కావున నిదియునుఁ గరుణసాధకము కాదు.

౮. వియోగదుఃఖపరిక్షీణుఁడగు రామునియందలి దాక్షిణ్యమునఁ బంచవటియందనిష్టము నాశంకించి లోపాముద్ర మురలచే గోదావరికి రామునిం గాపాడుచుండు మని సందేశము నంపెను. ఈవార్త మురలవలనవిని వెంటనే తమస "ఉచితమేవ దాక్షిణ్యంస్నేహస్య. సంజీవనోపాయస్తు మౌలికఏవాద్య సన్నిహితః" అనెను. మురల "కథమివ" అని యడుగఁగా తమస వినుమని మున్ను వాల్మీకితపోవనప్రాంతారణ్యమున లక్ష్మణుఁడు విడిచిపెట్టి పోఁగా సీతాదేవి యతిదుఃఖావేగముకలనఁ బ్రసవవేదనతో గంగలోఁ బడుటయు, నప్పుడం బిడ్డలఁబాలకులం గనుటయుఁ, బృథ్వీభాగీరథులు వారి ననుగ్రహించి రసాతలమున నుంచి కాపాడుటయు, స్తన్యత్యాగానంతరమున నా బాలకద్వయమును గంగాదేవి వాల్మీకి కర్పించుటయుం జెప్పెను. అప్పుడు

"ఈదృశానాం విపాకోఽపి
జాయతే పరమాద్భుతః,
యత్రోపకరణీభావ
మాయాత్యేవంవిధో జనః.
—3. అం. 3.

"ఇట్టి మహనీయుల దుర్దశమైననుఁ బరమాద్భుతమైన దగుచున్నది; ఏమనిన, నేవిపాకమందిట్టి పృథ్వీభాగీరథీ ప్రభృతిజనము కార్యసాధనమగుటను- అనగా సాహాయ్యకమును బొందుచున్నదో" అని మురల విస్మయ మందెను. పిమ్మటఁ దమస-"శంబూకునికొఱకు రాముఁడు జనస్థానమునకు వచ్చునని సరయువువలన విని గంగాదేవి లోపాముద్రవలెనే యాశం
యెద్దియో కులాచారమని మిషపెట్టి సీ
గోదావరింజూడవచ్చెను. వచ్చి సీతతోఁ '
నీపుత్త్రులగు కుశలవులకుఁ బన్నెండు వ
ములు పూర్తియగును. కావున మీవం
నకుఁ గూటస్థుఁడగు సూర్యుని నీస్వహ
లతోఁ గోసిన పుష్పములచేఁ బూజింపు
నీవు భూమియందు సంచరించునప్పుడు
ష్యులే కాక వనదేవతలుసైతము నాప్రభా
వలన నిన్నుఁ గనుఁగొనలేరు.' అని
నన్నుఁజూచి, 'సీతకు నీయం దెక్కువ ప్ర
కావున నామెవెంట నీ వుండు' మని నా
పించెను. కావున నే నట్లుచేయుదు" నని
మురలయు "నే నీవృత్తాంతమును లోపా
కుఁ జెప్పెదను. రామభద్రుఁడును వచ్చి
తలంతును" అనెను. ఈప్రకరణమునం గ
రససాధక మెద్దియును లేదు సరియేకదా,
దేవతానుగ్రహమువలన భావికాలమున
యస్సు కలుగఁగలదని కూడఁ దెలియనగు

౯. ఇందు వాసంతిక యడుగునప్పు

"కిమభవ ద్విపినే హరిణీదృశః
కథయ నాథ, కథం బత మన్యసే."

"అరణ్యములో విడిచిపెట్టినపిమ్మట సీతగతి
యైనదని తలఁచుచున్నావు?" అని యడి
అప్పుడు రాముఁడు

"సఖి కిమత్ర మన్తవ్యమ్."

"చెలీ! ఇం దూహింపవలసిన దేమి యున్న
అని చెప్పుచు,—

...త్యద్భి రంగలతికా నియతం విలుప్తా."

...యొక్క—దేహాతలను మాంసభక్షక జంతు ...కడ జేర్చి యుండవచ్చును." అని రాముని ...హ కాని నిశ్చయము కాదు. ఇట్లు "నియ..." అను నుత్ప్రేక్షావ్యంజకముచే దృఢ ...మువిషయము కాదని తెలియ నగును. ...నఁ బ్రాప్త్యాశావిఘాతము లేదు. కనుకఁ ...ణసాధకము కాదు.

౧౧. పరిత్యాగము మొదలు నేటికిఁ ...ండు వత్సరము లైనది. సీత యెచ్చట ...దియు, నేమి యైనదియుం దెలియరాదు. ...కొనుటకు వీలులేదు. నిరాశ కలుగదు. ...ఖముగా దుఃఖించుటకైన నవకాశము ... మఱపురాదు. అత్యుత్కట మగు నీ వి...గదుఃఖమును లోలోనం గుందుచుఁ జిర...మనుభవించుటవలనను, ఆదుఃఖ మిపుడు ...క్తద్వార మగుటవలననుఁ బట్టరాని వికార...ంభణమువలన నిట్లు విలపించెను. ఇందు ...న సీతామరణ నిశ్చయము రామునకుఁ ...దనికొనుటకు వీలులేదు. చిరదుఃఖానుభవ...వలన నిట్లు తోఁచుట స్వభావము. సప్త...ంకమున నిర్వహణానంతరమునఁ గూడ ...ముఁడు "సర్వ మిద మనుభవన్నపి నప్రత్యే..."—"ఇది యంతయు ననుభవించుచుండియు ...నమ్మలేకున్నాను" అనియెను. కావున నిది ...ను గరుణసాధకము కాదు.

౧౨. పూర్వవిరహము శత్రుకృతమగుట ...న శత్రుసంహార మవధిగాఁ గలది. కావున నుపాయములచే దరి గాంచితిమి. ఇప్పటి విరహము స్వయంకృత మగుటవలన నిరవధి. అనఁగా నవసానకాలసంభావన కవకాశము లేనిది. కావునఁ బ్రబలపింపక యెట్లూరక సహింపనగును? "ఎంతకష్టము? హా ప్రియురాలా! పూర్వమున నుపయోగించిన సుగ్రీవ సఖ్యాద్యుపాయములకుఁ గోచరము గాని య్యోప్రదేశమం దుంటివి?" అని రాముఁడు విలపించెను. ఇట రామునకుఁ బ్రాప్త్యాశ లేక పోలేదు. కావున నిది యునుఁ గరుణసాధకము కాదు.

౧౩. రాముఁడు తిరిగి వెడలుటకు సిద్ధముగుచుండఁగా సీత తదేకదృష్టిగా రామునిఁ జూచుచు మూర్ఛిల్లి తెలివి నొంది,

"కిఅ చ్చిరంవా మేహంద రేణ
పుణ్ణిమాచందదంసణం"
(కియచ్చిరం వా మేఘాంత రేణ
పూర్ణిమాచంద్రదర్శనమ్)—

"మేఘముల మధ్యమున రాకాచంద్రదర్శన మెంతసే పుండును?" అనును. అనఁగా క్షణములోఁ దిరోధానమగుట దానికి స్వభావమే. ప్రత్యక్షముగా ననుభవించుట కవకాశము లేనందున రామునకుఁ దెలియకుండ వ్యాజవిశేషముచేత నయిన యీసమాగమము శాశ్వతము కాదను నీయంశము సిద్ధమే యని ప్రకృతార్థము. సాక్షాత్సమాగమ మెప్పు డగునో యను నౌత్సుక్యమందుఁ దాత్పర్య మనియును గ్రహించనగును. పిమ్మటఁ దమస "అహో

సంవిధానకమ్. ఏకో రసః......తత్సమస్తమ్." అనెను. ఇది చూచి కరుణవాదులు భ్రాంతి నొందుచున్నారు. భవభూతి తాత్పర్య మట్లు కాదు. ఈతమసావాక్యార్థము నిట్లు గ్రహింపుఁడు: సంవిధానకమ్=సందర్భవిశేషము, అనఁగా ప్రకృతసంఘటనమున, అహో=ఆశ్చర్యజనకము: దానినే "ఏక" ఇత్యాది పద్యముచేఁ జెప్పుచున్నది: కరుణః= కరుణవిప్రలంభ మనుపేరుగల, రసః=రసవిశేష మగుశృంగారము, ఏక ఏవ = ఒక్కటియే, నిమిత్తభేదాత్ = విభావముల విజాతీయత్వమువలన, భిన్నః = విలక్షణానుభవ గోచరమై, పృథక్పృథగివ = పరస్పరవిలక్షణముగా నున్న, వివర్తాన్=పరిణామములను, శ్రయతే= పొందుచున్నది. అనఁగా పరస్పరానురాగబహుగుణితమగు మీదంపతుల వియోగవ్యథ యనువర్తించుచున్న దైనను, నిప్పటిసంవిధానముచేఁ బ్రతిక్షణమందును సమస్తాశ్వాసహర్షలజ్జాదులగు వివిధభావము లుప్పతిల్లుచున్న వనియును, నివియన్నియును స్థాయియగు విప్రలంభమున కంగములగుచున్నవి కాని స్వతంత్రములు కావనియునుఁ దాత్పర్యము. దీనికి దృష్టాంతము నుపన్యసించుచున్నది: అంభః=ఉదక మొక్కటియే యగుచున్నను, ఆవర్తబుద్బుదతరంగమయాన్ = భ్రమ బుద్బుద భంగాకారములగు, వికారాన్యథా = పరిణామములనువలెను, తత్సమస్తం =ఆయావర్తాదికమంతయును, సలిలమేవహి= ఉదకాభిన్నమే కదా. ఉపాదానమగు మృత్పదార్థ మొక్కటి యైనను దానివలనఁ బుట్టిన

ఘటశరావాదులకుఁ గారకవ్యాపార భే… వలన నామరూప భేదంబును, వ్యవహార … బును నెట్లు సిద్ధించుచున్నవో, అంతమ… ముచే మృద్వికారములగు ఘటాదులకు మ… న్నత్వ మెట్లు కలుగుటలేదో అట్లే ప్ర… నాయకులగు సీతారాముల యితరేతరా… నమై వియోగసమయావచ్ఛిన్నమగు శృం… మిది యొక్కటియే యగుచున్నను, హ… వాంతరభావములచే విలక్షణముగాఁ గన… చున్నది. అంతమాత్రముచేఁ గరుణవిప్ర… త్వమును విడుచుటలేదు. కారణము క… గార్యము భిన్నము కాదుకదా? "వాచా… ణం వికారో నామధేయం మృత్తి కే… సత్యమ్", "త దనన్యత్వ మారంభణ శ… భ్యః" ఇత్యాదులవలన నయ్యది స్పష్ట… ఈతమసావాక్యమందలి "కరుణః" అనుప… నకు శోకస్థాయిక మగు కరుణమని యర్థ… జేయువారు "సర్వథా సఏవ భగవా… వారపరికల్పనా నిర్మితో విప్రలంభః పున… రనుబధ్నాతి మామ్" అను రామ… మందలి "విప్రలంభః" అను పదమునకు… స్థాయికమగు విప్రలంభమని యర్థ మేల … రాదో చెప్పవలయుఁగాక. భవభూతి యుచ… గరుణపదమును స్వార్థమందుఁ బ్రయో… యుండఁడు. కరుణరసమందే భవభూతి … ర్యమై యిట్లు కరుణపదమును బ్రయోగి… యుడ స్వశబ్దవాచ్యత్వరూపరసదోష … వార్యమగుటవలన "కవయః కాళిదా… భవభూతి ర్మహాకవిః" అని పేరుగాంచిన

...శవిషై సనభిజ్ఞతాశనిపాత మవ్యాహత
...ను చిత్తగింపుడు:
(౧) రసగంగాధరమున,
...మవిరోధసంపాదనేనాపి నిబధ్యమానో
...రసశబ్దేన శృంగారాది శబ్దైర్వా నాభి
...ం ముచితః; అనాస్వాద్యతాపత్తేః తదా
...దస్య వ్యంజనమాత్రనిష్పాద్య ఇత్యుక్త
...త్; యత్ర విభావాదిభి రభివ్యక్తస్య
...స్య స్వశబ్దే నాభిధానం తత్ర కోదోష ఇతి
..., వ్యంగ్యస్య వాచ్యీకరణే సామాన్యతో
...నాఖ్యదోషస్య వక్ష్యమాణత్వాత్; ఆస్వా
...తావచ్ఛేదకరూపేణ ప్రత్యయాజనకతయా
...స్థలే వాచ్యస్పృత్తేః కావేయ కల్పత్వేన
...షదోషత్వాచ్చ ఏవం స్థాయివ్యభిచారిణా
...శబ్దవాచ్యత్వం దోషః" అని జగన్నాథ
...త రాజును; (౨) కావ్యప్రకాశమున, "వ్యభి
...రి రసస్థాయిభావానాం శబ్దవాచ్యతా" అని
...లంకారిక మూర్ధన్యుఁడగు మమ్మటోపా
...యుఁడును; (౩) కావ్యానుశాసనమున,
...సదోషాః రసస్థాయివ్యభిచారిణాం స్వశబ్దేన
...చ్యత్వం స్వశబ్దోక్తిః" అని వాగ్భటుఁడును;
... సాహిత్యకౌముదియందు, "అథ రసదోషా
...హ - వ్యభిచారి రసస్థాయిభావానాం శబ్ద
...చ్యతా" అని విద్యాభూషణుఁడును; (౫)
...ంకారశేఖరమున, "స్వస్వశబ్దై రుపాదానం
...వస్య చసినస్య చ" అని కేశవమిశ్రుఁడును; (౬)
...హిత్యదర్పణమున, "అథ రసదోషా నాహ-
...స్యోక్తిః స్వశబ్దేన స్థాయిసంచారిణోరపి"

అని విశ్వనాథకవిరాజును, ఇట్లింకను ననేక గ్రంథములయం దనేకాలంకార శాస్త్రకర్తలును రసదోషముల నుగ్గడించి యున్నారు. కావున సీనాటకమందలి రసభావవాచకపదము లన్యార్థపరములని వ్యాఖ్యానముఁ జేయుటయే సహృదయహృదయంగమమని తెలియవలెను.

"యత్ప్రౌఢిత్వ ముదారతాచ వచసాం
యచ్చార్థతో గౌరవం
తచ్చే దస్తి తత స్తదేవ గమకం
పాండిత్య వైదగ్ధ్యయోః"

అని చెప్పికొనిన భవభూతి యిట్లు వమనాది దోషజనకములం బ్రయోగించునా? అతని ప్రయోగముల యర్థగౌరవాదిక మస్మదాదులకు దుర్విజ్ఞేయము. కావున నే,

"ఉత్పత్స్యతేఽస్తి మమ కోఽపి సమానధర్మా కాలో హ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ" అని వ్రాసికొనియున్నాడు. కనుక భవభూతి హృదయ మతిగంభీరము. కొంద 'ఱీనాటకమునం బ్రతీయమాన మగు రతి శోకమును బోషించునది మాత్రమే యగుటవలన నారతికి స్థాయిత్వము లేదు కావున నారతిపోషిత మగు శోకమునకే స్థాయిత్వము కలుగుచున్నది. కాఁబట్టి యిందుఁ గరుణరసమునకే ప్రాధాన్యము గాని శృంగారరసమునకుఁ బ్రాధాన్యము లేదు. ఏకాంతవిస్రబ్ధయు, సాధ్వియుఁ, గఠోరగర్భయు, జీవితనిర్విశేషయు నగు సీతాదేవిని "ఉత్పత్తిపరిపూతాయాః కిమస్యాః పావనాన్తరైః" ఇత్యాదికముచే నింతి

చెన్నపట్టణమునకు సమీపమున ఆరోగ్యపద్ధతుల ననుసరించి చికిత్సచేయుటకు చక్కని ఆ



# ఆవడి ఆరోగ్యాశ్రమము

మారడుగులయెత్తును, చక్కనినీడలును, పచ్చనిబయళ్లును, నిర్మలమైననీరును, ఇసుక నేలయును గల్గి
మైనను నివాసయోగ్యమై యుపాశ్రమములోలు నీప్రదేశము మిక్కిలి ఆరోగ్యవంతమైయున్నదని డాక్టరు
మొదలగు ప్రకృతిశాస్త్రవేత్తలు హెచ్చుగా కొనియాడియున్నారు.

డాక్టరు ఆ. లక్ష్మీపతి, బి.ఏ., ఎం.బి., సి.ఎం. భిషగ్రత్న, మేనేజింగ డైరెక్టరు
19, హారిసురోడు, మదరాసు అని వ్రాయవలెను.





# ప్రశ్న

మందభాగ్యమగు నీ మనుజలోకమున కుపకరించుటకై
ప్రభావసంపన్ను లగు మహర్షులచే నేర్పరుపబడిన సాధన
ప్రశ్నశాస్త్ర మొకటి. దైవస్వరూపమును, దుర్జేయమును
వ్యక్తికాలగర్భమున తన కేమి భాగయధేమ దాగియున్నదో
ఆ యంధకారమునం దాశాలేశ మేమైన మినుకుమినుకు
దేమో యనియు తెలిసికొనగోరు వర్తకులు, విద్యార్థులు, పెం
సించువారు, ఉన్నతపదవుల కభిలషించువారు, రోగగ్రస్తులు
హారకర్తలు, మీరువారనసేల పసుస్తజనులును ఈ ప్రశ్న
సహాయమున అర్థకామముల సాధింపవచ్చును. 5 ప్రశ్నలకు
చెప్పుటకు రు. 1-4-0. వి. పి. గా పంపబడును. ప్రశ్న
కాలము, లేక జాతకచక్రము నకలు ప్రశ్నలతో పంపవలయు

అడ్రెసు:— ప్రొఫెసర్ శేఖరు మెస్మరిస్టు, ఏలూరు (పశ్చిమగోదా

# మైసూరు పురాతన శిల్పకళ చిత్రములు-బేలూరు



౧. చెన్న కేశవ దేవాలయ ముఖద్వారము-బేలూరు



౧. ప్రక్క-వైపున నున్న-చెన్నకేశవదేవాలయ-ద్వారము బేలూరు

మీఁది యుపలాలించి, తుద కెట్టియపరాధ
మును లేకయే ఘోరారణ్యములో నేకాకినిఁ
గా విడిచిపెట్టించిన రామునిహృదయమందు
శోకము కాక మఱియొకభావము నిలిచియుం
డుట కవకాశము లేదు కదా? మరణనిశ్చ
యము కలిగియుండిననే కరుణరస మగు నను
నియమ మిచ్చట నవసరము లేదు. మరణ
నిశ్చయము లేకున్ననుఁ గరుణరసము కావ
చ్చును. ప్రవాసవిప్రలంభాదులయందు భావి
సంప్రయోగనిశ్చయము కలదు. కావున నాని
యమము ప్రవాసవిప్రలంభాది విషయము.
భావిసంప్రయోగనిశ్చయము కలిగినది కావు
ననే మరణనిశ్చయ మున్ననుఁ జంద్రాపీడు
నితో మహాశ్వేత సంభాషించిన వాక్యముల
యందు విప్రలంభమని యంగీకరించుచున్నారు.
ప్రకృతమున రామునకు భావిసంప్రయోగ
నిశ్చయము గాని, తత్ప్రయత్నము గాని లేనం
దున మరణనిశ్చయము లేకున్ననుఁ గరుణరస
మనియే చెప్పవలెను.' అని వాదించుచున్నారు.
ఇది యాపాతమాత్రరమణీయము గాని నిలు
చునది కాదు. సీతారాముల పరస్పరాను
రాగ మనన్యసామాన్యము; అనితరవేద్యము;
కావుననే తృతీయాంకమునఁ దమసతో
"అహం ఎవ్వ ఏదస్స హిఅఅం జాణామి, మ
మావి ఏసో"—(అహమేవైతస్య హృదయం
జానామి, మమాప్యేషః) అని సీత పలుకును.
షష్ఠాంకమున రామునితోఁ గుశుఁడు రామా
యణములోని శ్లోకద్వయమని చదువుచు,

"హృదయం త్వేవ జానాతి
ప్రీతియోగం పరస్పరమ్"

అనును. ఇట్టిలోకోత్తరపరమానురాగమున
లోకాపవాదము తొలఁగించుకొనునుపాయ
స్వాధీనముగా లేనందునను, శాస్త్రశిష్టస
కులాచారపితాచారముల ననుసరించి
రంజనము స్వధర్మ మగుటవలనను వి
సీతను నిష్కారణముగా విడువవలసి వచ్చె
అయినను రామునిహృదయమున
యున్న రతి నశించుటకు హేతువు
కావుననే తృతీయాంకమున నాత్రేయితో

"వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమా
లోకోత్తరాణాం చేతాంసి కోహి వి
మర్హ

అని వాసంతి పలుకును. ఇట్లుండ రా
హృదయమున శోకేతర భావము నిలిచి
డుట కవకాశము లేదనుట యతిసాహస
రామునకు సీతావిషయమునఁ గలిగిన శో
నకు రతియే కారణ మగుటవలన నాశో
రత్యంగ మగుచున్నది. కావున నిచ్చట ర
ప్రాధాన్యముగాని శోకమునకుఁ బ్రాధాన్య
లేదు. ఈనాటకమునఁ దుదకు సమాగమ
తోడనే నిర్వాహణము చెప్పఁబడినందున వి
దశావర్ణనమందే భవభూతి తాత్పర్య
తెలియుచున్నది. ప్రవాసాది విప్రలంభ
యందువలె నిందును శోకము అంగ మగుట
యుచితము. తజ్జన్యములగు నిర్వేదగ్లానిశ
ది సంచారిభావములు ప్రధానభావమున

లగుట యావశ్యకము. ఎట్లయినను నిర్వే
నము స్మరణమాత్రముచేత నే శోకము
స్థాయిత్వము నంగీకరించునెడఁ బ్రవా
విప్రలంభము లన్నిటియందును శృంగార
హార మస్తమించును. కావున సకలాలంకా
చనవిరోధము దుర్వారమగును. శోకము
ంగ మగుట ప్రవాసాది విప్రలంభములందు
తార్థ మగునుగాని యిచ్చటఁ గాదనుటయు
క్తము కాదు. ప్రవాసాది విప్రలంభముల
, దీనికిని భేదము నిరూపింప శక్యము
ు. ఇంతియకాక అట్లే యయినచో దీనితోఁ
్య యోగక్షేమములు గలవియు, శృంగార
ానములని సహృదయులచే నంగీకరింపఁ
నవియు నగు నభిజ్ఞాన శాకుంతలాదులకును
లఁగింపరాని కరుణరసప్రధానతాపత్తి వాటి
ు. నాయికయొక్క జీవననిశ్చయమును,
ని యభావమును నను నీ రెండింటినిఁ బట్టి
లక్షణ్యము గలదని చెప్పుటయు నుచితము
దు. ఆవిషయమునను, వానికిని, దీనికిని భేద
, లేదు. అదియునుఁ గాక హిరణ్మయ ప్రతి
తిని సహధర్మచారిణిగాఁ జేయుటచేత సీతా
తనిశ్చయమే యిందుఁ జెప్పి తీరవలయును.
్లు కానియెడ విధురునకుఁ బ్రతికృతిస్థాపనము
్మసంహితాశిష్టాచార విరుద్ధ మగుచుండఁ
ుణరసప్రాధాన్యము నంగీకరించు చున్న వీర

రాఘనాది వ్యాఖ్యాతలుగూడ నుదాహరించి యున్న,

"యస్య భార్యా విదూరస్థా
 పతితా దూషితాపి వా,
అనిచ్ఛుః ప్రతికూలా వా
 తస్య ప్రతికృతౌ క్రియా."

ఇత్యాదిస్మృతివచన పరిగణితము లగు పత్నీ ప్రతికృతిస్థాపనోపాధుల నతిలంఘించుటచేత నాయకుఁ డగు రామునకు దోషాపత్తి వచ్చుచున్నది. ధర్మసంస్థాపనైకతానుఁడును, భగవంతుఁడు నగు రామునియం దట్టిదోషాపత్తికి సమ్మతించుట యుక్తము కాదు. ఇదియునుఁ గాక జీవితత్వనిశ్చయము లేనియెడఁ బ్రాప్త్యాశకుఁ గారణాంతరము లేనందున నది లేకపోఁగాఁ బ్రాప్త్యాశచేత నే నిర్వహింపఁ దగిన గర్భసంధికే యుచ్ఛేదాపత్తి కలుగుటచేత నీ నాటకము నకే యలక్షణత్వ మాపదిల్లుచున్నది. అట్లు కల్పించుట ప్రత్యక్షవిరుద్ధము. కావునఁ గాదంబర్యాదులకంటె నిందు వైలక్షణ్యము నారోపించుట హృద్యముకాదు. అట్లయినచో నిందలి రసము కరుణముగా ననుభవగోచర మగునా, శృంగారముగాననుభవగోచరమగునా? యనినఁ గరుణవిప్రలంభ శృంగారముగా నని సదుత్తరము. అట్లే యాలంకారిక సమయము.

(సశేషము)

---

# ప్రణయలీల
## (లైలీ మజ్ను)

అల్లంరాజు రంగనాయకులు

ఆ పురములోన విలసితాంతఃపురాన
లేత వెన్నెలఁ గాయు లైలీకుమారి
తేనె లురలు లేఁబలుకుల సోన లొలికి
అవిరతానంద మొసఁగూర్చు నాత్మ పితకు.

తరళ విద్యుల్లతాంగి, నిక్కమ్ము మృత్తి
కాకలశకారు తనయు మజ్నూకుమారు
స్వచ్ఛభావాల మేలి వజ్రాల రాశి
జత గలిసి పాఠశాల శిక్షార్థ మరుగు.

ప్రతిదివస మిత్తెరంగున ప్రముదితాత్ము
లగుచు లైలీమణియు, మజ్నుఁ డలరు జంట
సరణి నన్యోన్యమైత్రితోఁ జదువు చుండఁ
జిన్ని యెడఁదలఁ బ్రేమమ్ము శిరసు లెత్తె.

ఆటవిడుపుల మజ్నునిశాంతములనె
నికర మేల్కాంచి ప్రేయసి నెదఁ దలంచి
గృహము బీభత్సమైతోఁచ సహచరికడ
కరుగు తలఁపున నుపవనమందు జేర.

ధవళ కౌశేయ వసనముల్ దాల్చి, మఘవ
నీలమణి మయోజ్జ్వల భూషణాళి, మాల్య
ముల ధరించి, లైలీబాల మురిసి మురిసి
ప్రేమచూడ్కులఁ బఱపుచు ప్రియుని డాసి.

ఆటపాటల జదువుల నతి ముదాన
సఖునితోఁ బ్రొద్దువుచ్చి ముచ్చటలఁ దేల్చి
సెలవుఁ గైకొనునంత నిస్తేజుఁ డగుచు
సుదతి పదపద్మముల చెంత సొమ్మసిల్లు

రమణు, హృదయమ్మునం జేర్చి రాజతన
అమల మృదువాక్య సమితి నూరార్చి
ముద్దులంగొని— "సఖ! నేడు ప్రొద్దు వ
నెల్లి వత్తును లెమ్మ" టం చేఁగు చుండు.

* * * *

అంతకంతకుఁ జివురెత్తు నంతరంగ
మల్లి కాసుమ తారాప్రఫుల్ల సురభి
కౌముదీదీప్తి మూఁడులోకాల కోటి
కోటి నయనాలఁ దెఱవ నక్కముదవల్లి
యౌవన విభాత మంగళాహ్లాద భంగ
మాలికాసమూహాన నుయ్యాల లూఁగఁ
పాదుసా యానతిచ్చె— "నా మోద
రాశి! తల్లీ! బడికిఁ బోవ రాదటంచు!"

* * * *

నిబిడ కాదంబినీకృత నీలపంజ
రాన బంధితుఁడౌ నిశారమణు పగిది
బాలికామణి నిజగృహ పంజరమున
మరుఁగువడినంత మజ్నుఁ డున్మదితుఁ డగు
ప్రేయసీ దర్శనార్థమై రేయుఁ బవలు
రాజవీథుల బయళుల రచ్చలందు
విసువు గనకుండ తిరుగాడి వెదకి వెదకి
కడలెఱుఁగ లేక తుదకు నుత్కంఠుఁ డగు
"సంతతానంతలీలా ప్రశాంత మధుర
చంద్రికామృత వాహినీచయము నింపు

నోరాజ్ఞి! లైలీసఖీమణీ! వి
గతాపభారమ్ము నెట్లోర్వఁ గలను?
మెడఁబాటు కరవులో నిటుల పగిలి
నిరుపేద బ్రతుకులోఁ దావకీన
రరాగ స్రవంతు లెవ్విధిని పొంగి
లి స్రవహించునో యేమొ?...

తరుగరాని
బలేని పెంజీకటి కడుపులోనఁ
కులాడు నల్పాణువు వంతలెల్లఁ
ోవంగ నెపుడు త్వదీయ హృదయ
ారుణ కిరణాళి నెఱపఁదలఁతొ?

యు భువనాల తృష్ణాంతరాళముల, వి
మొనరించు నపుడు గ్రీష్మాతపాన
సి పడిపోవు పులుఁగు నెవ్వగ హరింపఁ
వసోనల నెన్నండు చిలుకఁ గలవొ?

గభీరాంధజీమూత హృదయ శిథిల
కజాలముల నిటులె లోనణంగు
తరాశాలతా పల్లవమ్ము లింక
టికి తిర్గి శీర్షమ్ము లెత్తగలవు?

యా! లైలీ మహారాజ్ఞి! సకల భువన
హినీ! విషాదాంభోధి మునిఁగి పోవు
ద నెవ్వాఁడు దరిఁజేర్తు రయ్యయో! భ
దాబ్జ పరాగ సంపదమె కాని?

విమల కల్పభూజమా! యుష్మదీయ
ంత మధుర ప్రణయ దృగంచల విశాల
చ్ఛాయల సుఖించు సిద్ధజీవ
మ్ము కలల నేనియు దుష్కరమ్ము నాకు!

భయద దుర్దాంత వేదనా బాడబాగ్ని
శిఖలలోఁ బడిఁ యుష్మద్విశీర్ణ హృదయ
రాజ్యమంతయు నొకమాఱె రగిలి, మండి
పోయి మండిపోయి నుసినై పోవు నేమొ!"

మజ్నుఁ డివ్విధి విభ్రమమానసుఁ డయి
తన మనోనాయికను మదిఁ దలఁచి తలఁచి
పిలిచి పిలిచి రోదింపఁ నవ్వీటి ప్రజలు
మూఢులై యాతనిని జాల మొత్తుచుండ్రి!

చెనటి పౌరుల దుష్కార్యమునకు భూర
మ:ఖ తనూజాత వడఁగంది మ్రందిపోవు
సుమలతాతన్వి వడువున సొగసిపోయి
పద్యమొక్కటి లిఖియించి పంపె నిటుల-

"నాకొఱకు వెఱ్ఱినై నను గూర్చి మలయునె
వ్వారి నేని విషాదపఱుప వలదొక యింత!"
అంత పురనివాసులు మఱి యింత కఠిను
లగుచు మజ్ను బాధించి, యన్నగరు వెలికిఁ
దరుముకొనిపోవ, విపినాలదారిఁ బట్టి
అరిగి యొక భూరుహచ్ఛాయయందు నిలిచి.

నిత్య లైలీజపావిష్ట నియత చిత్తుఁ
డగుచు, శుష్కించి శుష్కించి, అవిరతాంత
రంగజాతానలార్చులఁ గ్రాఁగిపోయి
క్రాఁగిపోయి నిరాశలో వేఁగి పోయె!

* * * *

అప్పు డిచట లైలీవిషాదార్ద్రమూర్తి
ప్రియుని మెడబాటుచిచ్చు భరింప లేక
ధ్వాంతసంచయావృత నిశీథమ్ము నందు
సదన రాజ మెడలె ముక్తశరము లీల!

అట్లరిగి ప్రాణవల్లభు నంకసీమ
వ్రాలి, మధురమోహాను దివ్యపదసరోరు
హములఁ గన్నీటఁ గడిగి సౌహార్ద మొలయఁ
గరలతాయుగ్మమున మృదుకంఠ మల్లి
మోవిఁ గమ్మోవి హత్తించి ముద్దు వెట్టు
సతిని బతి కౌఁగిలింపఁ బ్రసన్నభావ
ములు విశాలలోచనములు వెలువరించి
మృదుగళమ్మున నమృతమ్ము మేళవించి-
"కాంత! యీ దీనురాలిపైఁ గరుణ బూని
కొంత కాల మిచ్చో వసియింతునేని
తిరిగి వేగమె వచ్చి సుస్థిర సుఖమ్ముఁ
బడయఁ గల్గుదు భవదీయ పాదసేవ!"
అని విన్నవించి, నిజనా
థుని యానతి నొంది, మోదదుగ్ధార్ణవ సం
జనితోర్మినివహ మీఁదుచు
జనకాంతఃపురికిఁ బోవు సమయములోనన్.

సంయమి యొకండు భూజాని సరసఁ జేరి
అతని కిట్లనె—"రాజ! నీసుత హృదీశ
చింతనామగ్న నన్ను దుశ్శీల యగుచు
సంప్రఘితాడన మొనరించి యరిగె నెటకొ!"
అనుచు నుడివిన పారశీకావనీంద్రుఁ
డనె మునీంద్రునితో—"దేవ! అస్మదీయ
పుత్త్రికారత్న మెన్నండు మూఢమతుల
పగిది సాధుల నవమానపఱుపఁబోదు!—"
ఇటులఁ బలుకుచునుండ మహీశుతనయ
తరళ సౌదామనిం బోలె మరలి వచ్చి,
నర్వమెఱిఁగి—"తండ్రీ! లోకజనకుఁ గొలుచు
సీతనికి స్పర్శ శబ్దమ్ము లెట్లు తోఁచు?

నాకు మజ్నూజహాన దుర్నయ విరాగి
మశక సదృశుండు గాకుండె; మనసు విడి
పరమపూరుషు ధ్యానించు భక్తవరుల
కఖిల భువనమ్ము లణుమాత్రమైనఁ గావు
అనఁగ హాని లజ్జానుండై శిరమ్ము
వాంచి యెటకో చనియె; భూమిపతియు,
రూకుఁడై ప్రియసుత యవరోధ మెపల
కుండఁ బరిచారికాళిఁ గాపుంచినాఁడు!!
ఆనాఁటి నుండి లైలీ
మానిక మాత్మేశు కొఱకు మలయుచు, జ
దూనిన పాషాణత్వం
బేనాఁటికినేని కరఁగునేమో యనుచున్.

వేచి వేచి యెంత వేసారిపోయిన
ముక్తిఁగాంచలేక ముగుద, కొన్ని
వత్సరమ్ము లిట్లు వడఁగ్రాఁగి వడఁగ్రాఁగి
మరిగి మరిగి వంత తరఁగ లేఁది.

ఇంక నచ్చోట నిలుపోవ కెద దహించు
కారుచిచ్చుల నిశ్శబ్ద భైరవార్భ
టుల నోకింత ధైర్యాన లోపల సణంచి
వెడలె శుద్ధాంత మొకనాఁటి వేగుఁబోక
ప్రణయమయమూర్తి హృదయేశుఁ బడ

తలఁపుతొందర లోకమాత తెరిమి వైవ
విహగపతిఁ జేరు విరహిణీ విహఁగి వోలె
బరువు పరువున నఖుఁడుండు వనము జాసి
మందహాస రేఖాంకిత మధురవదన
జనిత లోల విలోకనోచ్ఛలిత ఫుల్ల

దికా సంహతుల జొన్పి సాంద్రవనము
మూల మూలలు వెలిఁగించి వైచి
మిత స్థానమున మనోనేత మజ్ను
ని పాడగాన కంఠంబు తిరిగి తిరిగి
ంత పిలిచినఁ బ్రతి యింతయేని గనక
పరాని నిరాశాగ్ని నీఱుఁ జేయ
ంకు బీటలు వాఱ, నా ప్రాంతమందె
న నమ్యోడు భూజమ్ముకడకుఁ బోయి
లు కన్నీటి నరుల శొంకరల చేల
త్తుకొని కాంచె వల్మీక మొక్కటచట!
ంతు చెలి, నూత్న భావమ్ము లంతరాళ
న మెఱయ, తనలోన—"నేమున్న గనఁగ
ని వల్మీక మిపుడిటుఁ గానుపించు
దెదో మహాగూఢార్థమిమిడియుండు!"
సమీపించి నలుగడ లరసిచూచి
క మొలుఁ గొక్కటందుండి వినఁగఁబడఁగ
ప్పు పులకింపఁ మనము సందడి గొనంగ,
లు మోదవిషాదంపు కణము లొలుక—
న్నాళ్లనుండి నీవి కఠిన హృదయులై
యమ్ము విడనాడి తలిదండ్రులను వీడి
హార నిద్రా విహారమ్ము లెడలించి
రవహా తపమూని క్రుంగిపోతివె నాథ!
ఆనాఁడు క్రూరాత్ము లదయులై నిను శిలా
ప్రహారమ్ము లొనరించి వన్యభూములఁ ద్రోయు
సమయాన నీ యనదసాయమ్ముకై వేచి
యెంత నొచ్చితో దేవ! యెంత విసిగితో నాథ!"

అనుచు విలపించి ప్రాణేశు నంటియున్న
చెదలఁ దొలఁగించుచుండ, విశీర్ణ దేహుఁ
డైన మజ్నూకిశోరుఁ డఘాంధ వితతి
నడఁచు నయనకోరకముల నపుడు తెఱచి.

ఎదుట సాక్షాత్కరించు ప్రాణేశ్వరిఁ గని
మనము సంతోషలహరుల మునుఁగుచుండ
చిత్తమూ కాంతసీరధి జొత్తిలంగ
హృదయమత్తించె ప్రియురాలి హృదయమం[దు!!

* * * *

స్వాదుమలయ వాతోర్మికాపాళికాళి
జాలిగా జాలిగా జాతి సోలి సోలి
ప్రకృతి యెల్ల సుఖ స్వప్న భరిత మయ్యె;
సురలు ప్రసవాల గురిసి, సుందరవిమాన
మపుడు పంపఁగ, సఖైక్యమందు ప్రేయ
సీ ప్రియులు, దివ్యగాత్రాలఁ జెంది శాశ్వ
తామలామోద సంభృతారామసీమ
లందు విహరింప స్వర్లోక మరిగినారు!!!

# ఆంధ్ర రాజకవులు

తేకుమళ్ల రామచంద్రరావుగారు, యమ్. ఏ., బి. ఎ

ఆంధ్రవాఙ్మయము వలె మనకుఁ దెలిసిన యితర వాఙ్మయ రచయితలలో భూపాలకులైనకవు లరుదు. తెలుగుభూపతులు కావ్యరచనను ప్రోత్సహించిరనియు, ఆంధ్రకవిపుంగవుల నాదరించిరనియు, వారి గ్రంథములకు కృతిపతిత్వము నంగీకరించిరనియు, శ్రీనాథాదులగు కొందఱు మహాకవులను కనకాభిషేకాదులతో గౌరవించిరనియు మనమెల్లర మెఱుంగుదుము. ప్రస్తుత కాలమునకు బూర్వము తెలుగున వ్రాయబడిన గ్రంథములనేకము లేభూపాలునియండ యుండుటవలననో బయలుపడినవి. ఈవిషయము మన తెలుగునాటి రాజులకు కవులపట్లను, భాషపట్లను, సాధారణముగ విద్యపట్లను మిక్కుటముగు నభిమానము గలదని సూచించుచున్నద నుట నిర్వివాదాంశము.

కాని—, ఆంధ్రరాజులు వట్టియభిమానమును చూపుటతోడను, కృతిపతిత్వము నంగీకరించుటతోడను, ధనసాహాయ్య మొసఁగుటతోడను తృప్తులై యుండలేదు. వారుగూడ విద్యాభ్యాస మొనర్చి, పాండిత్యమును గడించి యాంధ్రభాషలో పద్యాదిరూపముల గ్రంథములను రచించియుండిరి. కాని, ఏకారణముచేతనో యీ గ్రంథకారులకును, వారిగ్రంథములకును, ఆంధ్రవాఙ్మయమున నీయవలసిన స్థాన మొసంగఁబడి యుండలేదు. రాజకవులగు మహాకవులుసైతము ఆధునికకాలమున మఱుగున బడవేయబడి యెవ్వరిచేత నాదరింపబడకున్నారు. అనేకులగు రాజకవు లేయాంధ్రవాఙ్మయరచయితలలో నెన్నికెక్కిరో, ఆ యాంధ్రవాఙ్మయము తక్కుంగల భాషావాఙ్మయములకంటె నేవిషయమున నున్నతస్థాన మాక్రమించినదయ్యు, తనఘనతను తానే తెలిసికొనలేని యధమస్థితిలో నున్నది.

ఈఘనత నించుకగుర్తించిన యాధునికగ్రంథకర్తలు సైతము పైరాజకవుల కీయవలసిన యున్నతస్థానమును వారి కీయకపోవుట కడుశోచనీయము. సం గ్రహీయులై యుండిన శ్రీకందుకూరి వీరేశలింగం పంతులుగారు వేమన రాజకవికి తమకవులచరిత్రమునం దంతస్థాన మొసంగుటకు సంశయాళులై తొంకిరనుటకు పైన నేను వ్రాసినదాని కొకయుదాహరణము. మఱికొన్ని యుదాహరణము లీవ్యాసమునందు పోను పొందుపరచెదను.

ఆంధ్రరాజకవుల విషయమున చూప యశ్రద్ధను సాధ్యమైనంతవఱకు తొలగించుటకును, రైన పాఠకుల కిప్పటికన్న నెక్కుడు సానుభూ గించుటకును, మనవాఙ్మయమున నీగ్రంథకారుల లమును గూర్చి విచారించుటకును యీవ్యాసమున పూనుకొనుచున్నాను. ఇందుమూలమున నా సైర ములు సిద్ధించుటయే నాకు పారితోషికము.

## నన్నెచోడుడు

తెలుగు రాజకవులలో ప్రథముడు నన్నె టెంకణాదిత్యుడు. ఈతడు కావేరితీరమునందలి యొరయూరు రాజధానిగ గోదావరిసింహళమధ్యభూమి చోళరాజుల వంశమువాడు. ఈతనితండ్రియగు బల్లి పాకనాటి కధిపతి. ఈతనికాలమునుగూర్చి గిన వివాదములలన గాబోలు శ్రీవీరేశలింగంపం గారు వీరిపై 'శిశుర్నన్న' వేసియున్నారు. నన్న పూర్వుడే, అనఁగా ౯౫౦ ప్రాంతములం దీతడుం శ్రీమానవల్లి రామకృష్ణకవిగారి వాదము. ౧ ప్రాంతములం దీతడుండెనని శ్రీవీరేశలింగముగా దము. శ్రీవీరేశలింగంగారి కవులచరిత్రలో నన్నె నెడ న్యాయముగ చూపవలసిన సానుభూతి చూ లేదని ప్రతిచదువరియు గ్రహింపగలుగును. ఈ కవిత్రయకవులలో నగ్రగణ్యుడని చెప్పవచ్చు, ఇ దోషములు గలవనియు, పరభాషాపదముల నుప

...ంచినాఁ డీతనికవిత్వము చాలబాగున్నదనియు పం...గారేదో యొకవిధముగ పొదపెట్టి వ్రాసియు...ు కాని, యింతటితో మనము తృప్తిపడజాలము. ...ంగం పంక్తులుగా రిచ్చినస్థానమునకం టె పైస్థాన...కితఁ డర్హుఁడని నా యభిప్రాయము. నన్నెచోఁ...ప్రథమాంధ్రరాజకవి యగుటయే కాక, ఆంధ్ర...కవివరేణ్యులలో ప్రథముఁడు. ఆంధ్రరాజకవులలో...ణ్యుఁ డగుటయే కాక, సకలాంధ్రకవులయం దగ్ర...్యులలో నెన్నదగినవాఁడు.

ఈనన్నెచోడమహాకవి వ్రాసిన కుమారసంభవము, ...మ యందలి యుత్కృష్టగ్రంథములతో నైనను సరే, ...మానముగ నుంచదగిన గ్రంథము.

నాతండ్రిగారగు శేషమల్ల రాజగోపాలరావుగారు ...పురి క్రైస్తవకళాశాల పత్రికలో ఈప్రకారముగ ...సినారు. "Kumarasambhavamu is the ...radise Lost' of the Telugu language; only ... theme is set in an oriental atmosphere ...ler oriental conditions."

ఆంగ్లమహాకవి యగు వర్డ్స్వర్తు మున్నగువారిని ...వాధునికాంధ్రవాఙ్మయమున ప్రకృతినారాధించి, ...ృతిని వర్ణించి, ప్రకృతిసౌందర్యమును తనివిదీర మార...కవులను మెచ్చుచున్న యీకాలములో, ప్రకృతి...రాధించిన కవివరేణ్యుఁడగు నన్నెచోడుఁ డీవిషయమై ...ర్శించినమహోద్యుక్తినై పూజ్యముసర్వజనశ్లాఘాపాత్రము...మానఁడు. కుమారసంభవమునందలి నాలుగవయాశ్వాస...లో శివునితపోభంగమొనర్చుటకు మన్మథుఁడు బయలు...వ కథాసందర్భమున జేయబడిన వసంతాభివర్ణనము ...ంగు వాఙ్మయమునందలి మనోహరవర్ణనములలో ...టి. పాఠకుని మనోనేత్రముముందు ప్రకృతిరామణీ...కమును కవితాసృష్టిని, — ప్రదర్శిత మొనర్చుటలో ...ంధ్రవాఙ్మయమున నీతనితో సరిసమానులుండజాలరు. ...కవియగు వాల్మీకియొక్కఁడే యీవిషయమున నీతని ...బోల్పబడదగినవాఁడు. ఇతర కవులుగూడ ప్రకృతి...నమును కవితాసృష్టిని కల్పించిరి. కాని, అట్టి విషయ...కటి తీసికొని వందలకొలదిబొమ్మలను పాఠకునిమాన సదృష్టియందు రెండుతెగని నిజకవితాప్రభావముచే సృష్టించి బయటొక్కల చిత్రములవలె ప్రదర్శింపజేయుటలో నీతనిమించినవా రొక్కరును లేరు. కుమారసంభవమునందలి కొన్నిభాగములను చదువునప్పుడు కవిమనమునో భావములను సున్నితములను శృంఖలములచే కట్టివేయును; “ప్రకృతియెంత సజీవమైన”దని మనమనుస ట్లాశ్చర్యాన్వితులము జేయును. ఈవిషయమున నాతనికి పిమ్మటి తెలుగుకవులు కొంత ఉత్సాహమును జూపిరి; కాని ప్రకృతికి దూరముననుండి, వారికవితాసృష్టి కృత్రిమసృష్టియై పోయినది.

కవితాసృష్టియందే కాక భావగరిమయందు నీతనిని మించినవా రంధ్రకవులలో నెవ్వరును లేరు. ప్రకృతితో మిళితములయి భావగరిమాన్వితములగు కథాభాగములలో శివుని పతిగ బడయుటకై యరణ్యప్రదేశములకు తపస్సు చేయుటకు పార్వతి యరుగు నాఱవఆశ్వాసమునందలి కథాసందర్భము చాల మనోహరముగ నున్నది. ఈఘట్టమును చదువు పాఠకునిహృదయము భావోద్రేకముతో నుప్పొంగిపోవును. పాఠకు నీవిధముగ ననివార్యముగు తన్మయత్వము నొందించు భాగము లనేకములు కుమారసంభవమున గలవు. ఈతన్మయత్వము గలిగించు పదములను కూర్చుటకు కవి యేమాత్రమును శ్రమపడలేదు. సెలయేటియందలి శుద్ధోదకధారవలె సహజముగ నీతనిమనోనిర్గతమై యాంధ్రమహాజనులకు హృదయరంజకమై యీతని మనోహరపదజాలము కుమారసంభవమున లిఖితమైయున్నది. ఆభావోద్రేకముతోనే దీని కనువగు పదము దాని కదియే సమకూర్చబడుచుండుట మహాకవుల కరచేతిద్దె యుండునుగదా. కావున నీతనికి ‘కవిరాజశిఖామణి’ యన్నబిరుదనామ మెంతయు దగియున్నది.

## ప్రతాపరుద్రుఁడు

ప్రస్తుతము నైజామురాజ్యములో నున్న ఓరుగల్లు (వరంగల్) రాజధానిగ నేలిన కాకతీయులు ఆంధ్రుల రాజకీయచరిత్రమున పేరెన్నిక గన్నవారు. ఈకాకతీయుల వంశములోని మఱియొక ప్రతాపరుద్రుఁడు నాయకుఁడుగ శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారు

# తల్లులారా?

మీ బిడ్డకు "లాక్టోజను" నీయుడు.

మీ చంటిబిడ్డల ఆరోగ్యము, బలము విషయములో వృథాపరీక్షల నొనర్ప ప్రయత్నింపకుడు.

ఏవిధహేతువుచేతనో మీరు మీ బిడ్డకు, సహజముగా తల్లిపాలనిచ్చి పెంచ జాలని యెడల, యితరులచే యిట్టి పరిస్థితులలో యివ్వబడు చున్న ఆహారమునే మీ బిడ్డకు నీయుడు. అది ఏదన "లాక్టోజనే"

ప్రపంచమందు విఖ్యాతిగాంచిన వైద్యశిఖామణులచేతను ఉపయోగింపబడి కొనియాడబడు చున్నది. వారి సలహాల వల్ల లాభమును పొందుడు.

తల్లులారా! ఈ నమూనాడబ్బీ అలు మ్యూమినియం చెంచాతోసహా పోస్టేజిఖర్చు క్రింద 2 అణాలు స్టాంపులు పంపినవారికి ఉచితముగా పంపబడును.

LACTOGEN




Nestlé & Anglo-Swiss
Condensed Milk Co.,
P.O. Box 396, Calcutta.

☞ ఈ పేపరు పేరును ఉదాహరింపుడు.

ప్రతాపరుద్రీయమును రచించియున్నారు. ఈరెండవ ప్రతాపరుద్రుని నాటకమునందే యుగంధరుడు మంత్రిగ నుండెను. మొదటి ప్రతాపరుద్రుడు క్రీ. శ. ౧౨వ శతాబ్దాది నున్నట్లు తెలియుచున్నది. ఈతడు విద్యార్థులను పోషించుటయేకాక సంస్కృతాంధ్రకర్ణాటకములందు పాండిత్యము గడించి 'విద్యాభూషణు' డను బిరుదమును గలిగియుండెను. నన్నెచోడునివలె ప్రతాపరుద్రుడును శైవుడే. ఈతడు పాలకురికి సోమనాథుడు మున్నగు శైవకవుల కగ్రహారాదుల నొసంగి సత్కరించెను. ఈతడు సంస్కృతమున నీతిసార మను గ్రంథమును రచించి, తెలుగులోనికి దానిని భాషాంతరీకరించెను. ఆంధ్రవాఙ్మయమున నీతివిషయక పుస్తకము వలననే గలుగుచున్నది. వైదికగ్రంథకారులలో నీయాంధ్రరాజకవియే ప్రథముడు. ఈతడు మొట్టమొదటివాడగుటయే యీతని ప్రశస్తికి ముఖ్యకారణము. ఈతడు నీతిసారము వ్రాయుటవలన తరువాతి కవులు గూడ కొందఱు యీవిషయమై మార్గదర్శకులైన యనేకగ్రంథములు వ్రాయుటకు ప్రేరితులైరి.

కోనబుద్ధారెడ్డి

ఈతడు క్రీ. శ. ౧౩వ శతాబ్దాదియందుండెను. రంగనాథరామాయణ మని వాడుకలోనున్న ద్విపదరామాయణము నీయాంధ్రరాజు వ్రాసెనా? లేక రంగనాథుడను బ్రాహ్మణుడు వ్రాసెనా? యని కొందఱు సందేహించుచున్నారు. ఈద్విపదరామాయణము నందలి గద్యములందు కోనబుద్ధారెడ్డి పేరే కనబడుచున్నది. రంగనాథుని పేరు కానరాదు. దీనిని రంగనాథుడే వ్రాసెననుటకు మూడుకారణములు గలవు: ౧. ఈపుస్తకము రంగనాథరామాయణమని వాడుకలోనున్నది; ౨. పండితు లాత్మస్తుతిపరాయణులు గారనియు, ఈద్విపదరామాయణమున కోనబుద్ధునిస్తుతి కలదనియు, కావున రంగనాథుడే వ్రాసెననియు వీరేశలింగము పంతులుగారి వాదము; ౩. వైదికకవులపరపతి తగ్గి వైష్ణవభావములు పైకి వచ్చుచున్న సమయమున నట్టిభావములకు రాజాగారిసాహాయ్యము గావలెనని కోనబుద్ధుని పేరు పెట్టిరనుట మూడవకారణము.

౧. కాని, ఒకరు వ్రాసినను ప్రజాసామాన్య[...] లౌకికకర్తృత్వమున నది రచింపబడెననుట యస[...]ణము గాదేమోయని నా యనుమానము. తె[...] కొన్నిచాటువులు ఏ శ్రీనాథునివో, ఏ తెనాలిరా[...]ష్ణునివో వ్రాసిన ట్లూహింపబడుచున్నవి. భాస్క[...]మాయణ మను గ్రంథనామమున భాస్కరుని పేరే [...]చ్చుచున్నను అందలిగద్యములందు, బాల కిష్కింధ[...]దరకాండములందు మల్లికార్జునభట్టుచేతను, అర[...] కాండము కుమారరుద్రదేవునిచేతను, అరణ్యకా[...] భాస్కరునిచేతను, యుద్ధకాండము హుళక్కి భ[...]రుడు, నయ్యలార్యుడు ననునిరువురిచేతను రచిం[...]నట్లు కానబడుచున్నది. ద్విపదరామాయణమును [...]నాథుడు వ్రాసెననుటకు పైకారణమును జూపు[...] వీరేశలింగము పంతులుగారే తెనాలి రామకృ[...] కర్త యని ప్రజలనుకొనుచున్న "—విజయము" [...] గ్రంథము నతడు వ్రాసియుండెడని యభిప్రాయ[...]చ్చిరి. అటుగాక రంగనాథుడు ధనమునకు కక్కు[...] పడి ఇంకొకరి పేరితో పెట్టెననుట రంగనాథుడు [...]డుపరగణా కర్తకారి యగుటచే నాధారములు లేవు

౨. పండితు లాత్మస్తుతిపరాయణులు గా[...] రెండవకారణమున కధికారము లేదు. వీరేశలి[...] పంతులుగారే నన్నెచోడు డాత్మస్తుతి చేసికొ[...] వ్రాసియున్నారు. కొందఱు కొన్ని ఆత్మస్తుతి మనయా[...] కవులవిషయమున గ్రంథస్థమైయే యున్నది.

౩. వైష్ణవగ్రంథములకు ఖ్యాతియు, నిర్వచనో[...] రామాయణము, వేములవాడ భీమకవి వ్రాసిన రాఘ[...] పాండవీయము మున్నగువాని కక్కుర లేని రాజకర్తృ[...] దీనికిమాత్ర మెందుకు గావలసివచ్చెనో తెలిసి[...] కొనుట కష్టము.

ఏది యెట్లున్నను ద్విపద రామాయణమును [...]నాథుడే వ్రాసెనని చాలమంది కంఠశాంధ్రవిద్వా[...] తలంచుచున్నారు. కాని కోనబుద్ధారెడ్డి పేరు రాం[...]లలో చేర్పవలయుననుట కెవ్వరును సాహసింపుట[...] కొంతభాగము శిథిలముకాగా రెండవవారు పూ[...]

పర్వ శేషమువలె చేసిరేమో యనుకొనుట కట్టికథ పు స్తకవిషయమున నింతేవఱకు మనచెవిని పడలేదు. దములమీఁదను, వాడుకనుబట్టియు గాక బలవ ు లగుకారణములమీద కోనబుద్ధారెడ్డి కర్తృత్వ త్రో సిపుచ్చువఱకును నీయాంధ్రరాజకవి నొకరీతి వృందములో జేర్చుటకు సాహసించువారిలో నే ను గాను.

ఈకవి తనపుస్తకమున భాషావిషయమున నాంధ్ర జాతీయత నాదరించుచు, సమాసాదులను, తెలుగు ములను విరివిగ వాడుట యొకముఖ్యాంశము.

ఈవిషయమునసే కాక కథావిషయమునగూడ సంస్కృతమునందలి వాల్మీకి నధికముగ ననుసరింప టను బట్టి చూడ, ఆంధ్రభాషాజాతీయతను నిలుప కు గంకణముకట్టుకొనెనో యన్నట్లు పొడగట్టును. యణకథ భారతదేశమునందలి యనేకభాగములం విధములుగ జెప్పఁకొన బడుచున్నదనుమాట అంద తెలిసినదే. అట్టిభేదములలో ఆంధ్రావనియందు కలోనున్న కథను తీసికొని వాల్మీకి రామాయణ పోల్చి తెలుగువాఁటిలో వాడుకలోనున్నట్లు మర్పుచు కథాసందర్భమును బట్టి వాల్మీకి ననుస చు నీతఁడు రంగనాథరామాయణమును వ్రాసెను.

బద్దెన

'కవిబ్రహ్మ'యను బిరుదముగల యీకవి 'కృష్ణా ష్టపహ్రవిషయాధీశ్వరుడు'. ఈతడు క్రీ. శ. ౧ ప్రాంతముల నున్నట్లు జయంతి రామయ్య లుగారు నిర్ధారణచేసిరి. ఈతడు కోనబుద్ధునివలె వుడు. సూర్యవంశోద్భవుడైన సుక్షత్రియుడు. డు 'నీతిశాస్త్రముక్తావళి'ని, 'సుమతీశతకము'ను చెను. నీతిశాస్త్రమును రెండువిభాగములు చేసి మొదటిది రాజులకును, రెండవది ప్రజాసామాన్య సీతడు నిర్దేశించెను. వేమన పద్యములవలె సుమతీ మునందలి పద్యములు ప్రతియాంధ్రునింట నుచ్చరిం ంచు ప్రఖ్యాతములయినవి. సుమతీశతకమునందలి ముల నమందానందముతో జదువు చిరుత బడిపిల్ల

వాడు నేటి కేడునందలయేండ్లక్రిందటనొక నృపవరునిచే నిది వ్రాయబడెననియు, ఇన్నినందలయేండ్లీపద్యము లాంధ్రదేశమున ఛత్రాధిపత్యము వహించియుండెననియు నెఱుంగదుగదా. సులభమును, మృదువును, మనోహర మును నగు శైలితో ఆంధ్రలోకవిఖ్యాతమగు పాత్త మును రచించుటచే కృష్ణాదక్షిణషట్సహస్రవిషయాధీశ్వ రుడైన యీబద్దెనొకదేవునిజన్మ సార్థకమైనది. ఆంధ్ర నాము మున్నంతవఱకును నీనృపాలుని నామము నెవ్వ డును చెఱచిపోజాలడు.

### కాచవిభుడు, విఠలరాజు

వీరు కోనబుద్ధారెడ్డి కుమారులు. ప్రస్తుతకాలమున నిరువురు కలసి చివర 'కవులు' అనుపదమును చేర్చి పుస్త కములు వ్రాయుచుండుట శ్రీతిరుపతి వేంకటకవులకాల మునుండి మన మెఱుగుదుము. ఈపద్ధతి చాల పురాతన మైన పద్ధతి. కాచవిభుడు, విఠలరాజు ఈకారణముచే కొంతచరిత్రఖ్యాతి గలవా రగుదురు. వీరు ద్విపదలో ఉత్తర రామాయణమును రచించి, తమ తండ్రిగారి యాజ్ఞను పాలించిరి. ఈ రెండు ద్విపదరామాయణ ములును కలిసి సంపూర్ణరామాయణమైనవి. వీరిశైలి సులభముగ చక్కఁగ నుండును. వీరు క్రీ. శ పదమూడవ శతాబ్దాంతమున నుండిన ట్లంగీకరించబడినది.

శ్రీవీరేశలింగముపంతులుగారి యనుమానము వీరి విషయమునగూడ కొంతపనిచేసినది. రంగనాథుడే ఈ ద్విపదోత్తరరామాయణమును గూడ వ్రాసి వీరిపేరు పెట్టె నని వారియూహ. కాని కోనబుద్ధుని విషయమున చెప్పి నంత ఘంటాపథముగ రంగనాథుని కర్తృత్వము నిచ్చట సాధించుపలుకులు వారు పలుకలేదు. కావున కాచవిభు డును, విఠలరాజును ఆంధ్రరాజకవులని ఆంధ్రవిద్వాంసు లంగీకరించుచున్నారు.

ఈసందర్భమున నీరెండు ద్విపదరామాయణము లనుగూర్చి యొక్కముక్క వ్రాయవలసియున్నది. ప్రాస యతులు, మిశ్రసమాసములవలెనే ద్విపదకూడ శైవ కవులచే చేకొనబడినది. దానిని వైష్ణవకవులు గ్రహించి గ్రంథస్థ మొనర్చుట కీరామాయణమే మొదటి యత్నము.

## వేమనకవి

ఈతడు క్రీ. శ. పదునైదవ శతాబ్దాదియన్నట్లు మాతంగ్రిడిగారు ౧౯౨౮ సం॥ ఏప్రెల్ నెలలో వెలువడిన చెన్నపుర్రి క్రైస్తవకళాశాలపత్రికలో నిర్ణయించిరి. ఈతని పూర్వులు చాల సంవత్సరములు అద్దంకి, కొండవీడు నగరములు ముఖ్యపట్టణములుగా పుడమిధరించియుండిరి. ఈరెడ్డిరాజులలో ననేకులు విద్వాంసులును, గ్రంథకారులునై యుండిరి. కాళిదాసుని నాటకములకు వేమన్నకు పూర్వుడగు కాటయవేమన్న వ్యాఖ్యారచన యొనర్చెను. ఈకాటయవేముని బావయగు కుమారగిరి సంస్కృతమున వసంతరాజ్యమను గ్రంథమును రచించెను. వేమనకవికి పూర్వుఁడగు పెదకోమటి వేమారెడ్డి అమరుకకావ్యమునకు 'శృంగారదీపిక' యను పేర నొక సంస్కృతవ్యాఖ్యను రచించెను.

వేమనకాలమునకు కొంచెము పూర్వము తిక్కనచే నాంధ్రకవిత్వమున ప్రాధాన్యమొసంగబడిన అద్వైతతత్వము ప్రబలియుండెను. వేమన పద్యములం దీశంకరుని అద్వైతవేదాంతము విరివిగ గానబడుచున్నది.

వేమన ద్రవిడాదిదేశములకు బోయి యచ్చటి విద్యాగంధమును కొంత యలవరుచుకొన్నట్లు కొన్ని పద్యములందు నిదర్శనములు గలవు.

ఈవేమారెడ్లరాజ్యము పదునైదవ శతాబ్దాదిని పోవుటచేత నీతడు వేదాంతి యయ్యెనేమో యని కొందఱు విద్వద్వరేణ్యుల మతము.

ఇట్లు విద్వాంసులగు సుప్రసిద్ధ వంశోద్భవుఁడై, అద్వైతసిద్ధాంతములను మది నిలిపికొని, విదేశవాసమున విశాలమైన అనుభవముతో వేదాంతియై కవియైన వేమన్న పద్యములు నిన్నమొన్నటివఱకు నాంధ్రవాఙ్మయమున స్థానము లేక వెలిబడియుండెను. కాని కొంతవఱకు గాకపోయిన గొంతవఱకైనను నీతనికవితాసామర్థ్యమును నేటికైన నాంధ్రపండితబృందము గుర్తించుటభినందనీయము.

శ్రీనాథునకును కృష్ణరాయనికిని నడిమికాలమునకు జెందిన యీతడు కవిత్వమున నొకసంస్కర్త యని చెప్పబడవచ్చును. ఆతనికి ముందు తెల లలోని వాఙ్మయమంతయు సంస్కృతముపై నాధ యుండెను. భాషాంతరీకరణములే ఆంధ్రకవులకు యయ్యెనుగాని తమయాత్మభావములో స్వకపోలకల్పి లగు గ్రంథములను రచించుటకు వారు పూనుకొన వేమన్న తరువాత కృష్ణరాయనికాలమున పెద్దనము కవివర్యులు ఆంధ్రభాషకు గలిగినకొలంతను దీసి వెంపొందిరి. ఆంధ్రవాఙ్మయమున పెద్దనాదు లీశ పక్షము ద్రొక్కుటకు పూర్వము ఉషఃప్రబోధవ వేమకవి చల్లని తీయనిగీతారవములు రాబోవు సూర్యోదయమును ప్రకటించుచుండెను.

కాని, ఈనూత్నమార్గావలంబకులైన కృష్ణ రాయని కాలమువారు ఆంధ్రకవిత్వముచుట్టు నల్లి కొన్ని సంస్కరణీయములగు నియమములను గదల్చ నియమానుగుణ్యముగనే కవిత్వరచనకు గడంగిరి. వేమన్న వీరికంటె నొకయడుగు ముందు వైచి ని ములకన్న భావమే పదిలేలని పద్యరచన కారంభిం

వేమనయందలి మఱొకగొప్పవిశేష. మేమ అంతవఱకు నాంధ్రరచయితలు కొంచెముగనో, గనో సంస్కృతజ్ఞానము గలవారి కందుబాటులో డునట్లు గ్రంథములను రచించియుండిరి. ఈగ్రంథ దలి సంగతులు, నందు ముఖ్యముగ వేదాంతతత్త్వ ప్రజాబాహుళ్యమునకు దెలియునట్లు విస్తరించ యావశ్యకత మిక్కుటముగ నుండెను. ప్రజాసావ ములోగూడ నీదృష్టి వ్యాపించియుండక తప కావున నీయాంధ్రరాజకవి ప్రజలకొఱకు తనక మును నిర్దేశించి సులభమును, మృదులమును నగు షలో విద్యాగంధ మించుకయు లేని ప్రతియాంధ్ర మనస్సునకును ప్రబోధమును గలిగింపగలశైలిలో ద్యములను వ్రాసెను.

ఈపై కారణములవలనను, కవు లనుసరించు డిన పద్యాదులుగాక గీతాదిపద్యములలో నీతడు మనఃకుహరమునన్న భావములను వెల్లడించుటచే ఆంధ్రకవులును, వాఙ్మయధురంధరులును నీతనికి గౌరవ మొసంగలేదు.

## తిమ్మరాజు

ఈతడు పదునాఱవ శతాబ్దాంతమున నున్నట్లు తెలియుచున్నది. ఈతడు కొండవీడు రాజధానిగ నేలిన వైష్ణవరాజు. ఈతడు పరమయోగివిలాస మనుకావ్యము రచించెను. కవిత్వమునం దసమానప్రజ్ఞను, ప్రౌఢిమను జూపుటయేకాక అద్భుత చరిత్రరచనాచాతుర్యాకృతి నీతడు తనకావ్యమున సువ్యక్తమొనర్చెను.

## సవరము చిన నారాయణ నాయకుడు

విజయనగర సామ్రాజ్యకాలమున తెలుగుక్షత్రియులును, నాయకులును భూమిపాలింపను, సేనానాయకత్వము వహింపను దక్షిణ పశ్చిమాది దేశములకు బంపబడిరి. విజయనగరసామ్రాజ్య మంతరించినపిమ్మట నీనాయకులు స్వతంత్రరాజ్యములను స్థాపించుకొనిరి. వారిమాతృభాషయగు నాంధ్రభాషయెడ వారికిగల యభిమానాదరములు మిక్కుటములు. ముఖ్యముగ నీకారణమునలననే ఆంధ్రవాఙ్మయక్షీణకాలమున అరవదేశమున నేకొంతవఱకు మనభాషాగ్రంథములు రూపు దాల్చినవి. ఇప్పటికిని మాతృభాషాభిమానులగు దాక్షిణాత్యాంధ్రులును, దక్షిణాంధ్రభాషాభివర్ధనీసమాజమువారును అరవదేశమున నాంధ్రభాషోద్ధరణ మొనర్చుచు ప్రశంసాపాత్రు లగుచున్నారు.

ఈవిధముగ పేరెన్నిక గన్నకవులలో రామభూపాలుని కుమారుడగు సవరము చిననారాయణనాయకుడు ప్రథముడు. ఈతడు క్రీ. శ. పదునాఱవ శతాబ్దాంతమున జీవించియుండెను. ఈతనికవిత్వము సలక్షణమయి సొంపుగ నుండును. ఈతడు కువలయాశ్వచరిత్ర మను గ్రంథమును రచించెను.

రాజులేగాక రాజకులమున నుద్భవించి కొలదిగనో గొప్పగనో సేనానాయకాదిపదవులం దుండిన కవులు కొందఱు గలరు. ఇట్టివారిలో అహల్యాసంక్రందన కారకుడగు వేంకటకృష్ణనాయకు డను కవి అరవదేశమున పాండ్యరాజగు విజయరంగ చొక్కనాథుని సేనానియై యుండెను. డామెర వేంకటపతియను నాయకుడు



బహులాశ్వ చరిత్రమును వ్రాసెను. సేనానియగు
పూడి కృష్ణయ్యయనునతడు భానుమద్విజయమును
చెను. మైసూరురాజగు దొడ్డని మనుమడగు నంజర
౧౬౭౦ ప్రాంతములందు హాలాస్యమాహాత్మ్య మను
గ్రంథమును రచించెను. ౧౭౦౧ ప్రాంతములందు
ఖం వేంకట కృష్ణప్పనాయకుడు వచన జైమినీభా
మును రచించెను. రాజకవియగు తంజావూరి రఘు
రాయడు 'శృంగారసావిత్రి' యనుగ్రంథమును రచి
నట్లు తెలియుచున్నది.

ఇట్లాంధ్రవాఙ్మయ శైశవదశనుండియు కవి
భులై మించిన యాంధ్రరాజకవు లనేకులు గలరు.
మాంధ్ర రాజకవియై, ప్రథమాంధ్ర శైవకవి వరేణ్యు
ప్రకృతివర్ణనలయం దసమానప్రజ్ఞావిశేషుడై, భ
నేక క్రియానిపుణుడైన నన్నెచోడ టెంకణాది
నకును; ప్రథమాంధ్ర నైతికకవిశేఖరుడగు శైవప్ర
పరుద్ర మహారాజునకును; సంస్కృతముగాక ప్రా
గునకును, నాంధ్రజాతీయతకు గవిత్వమున ప్రాధా
మొసగిన ద్విపదరామాయణ కర్తలకును; నైతికక
మున నెన్నొ గాంచి, హృద్యములును, మనోహరములును, సు
ములగు శైలిలో సకలాంధ్రజనుల హృదయకుహర
లందు నేటికిని పదిలపరచుకొనుచున్న పద్యములు
సుమతీశతకకారుడగు బద్దెనరేంద్రునకును; రా
వియై, ప్రజలకవియై, ప్రకృతికవియై, వేదాంతకవి
భావకవియై, ప్రజాబాహుళ్యముచే నెల్లచోట్ల నన్ని
కల జోహారులం గొనుచు, తనయాదరణగోలున లెక్క
లేని మహోన్నత స్థానాధిష్ఠితుడగు వేమనమహాకవి
భువనవిజయ సింహాసనాసీనుడై రాజ్యలక్ష్మికిని, సర
తికిని తనసభయందే కాక తనభుజాస్థానములందు
వ మేర్పరిచి, ఆంధ్రవాఙ్మయ స్వర్ణయుగపోషకు
కృష్ణదేవరాయనికిని; ఆంధ్రవాఙ్మయ క్షీణకాలమున
నావినియం దుండియు నిజవచోమాధుర్యముచే ఆ
భాషామతల్లి నెంతయును సంతోషపెట్టిన తక్కు
కవులకును మనము చూపవలసిన కృతజ్ఞత యటుం
వారి నిజమగుస్థానమును, వారివాఙ్మయధౌరంధర్యవ
తెలిసికొనక వారిలో చాలమంది నాంధ్రప్రజలు మ

...చియుంచిరి. ఇందరు రాజాధిరాజులు భాషాసేవ ...ండమునఁ గొనర్చియుండుటచే మహాసంతోషాంబుధి ...లాడవలసిన మనము వారిలో గొందఱ యగ్రస్థా...ను తెలిపికొనక వారిని నామమాత్రావశిష్టులను ...చితిమి. వాఙ్మయధురంధరు లగు తెలుగురాజు... ముఖ్యుల గొందఱ నాంధ్రభాషాకోవిదుల కన్నుల ...ఎట నిలిపి, వారి ప్రాశస్త్యము నొకింత విశదీకరించిన చోనైన నాంధ్రుల సహేతుకగర్వమాంధ్రావని నెల్ల వ్యాపించి యాంధ్రవాఙ్మయ ప్రాశస్త్యావలోకన కారణ మగు నమువిశ్వాసముతో నే నీవ్యాసరచన కుపక్రమించితి. ఆంధ్రులకు, నాంధ్రవిద్వద్బృందమునకు, నాంధ్రవాఙ్మయమునకు నారోపించునటు చేసిన యీచిన్న సేవ యాంధ్ర విద్వాంసుల యాదరాశీర్వాదపాత్ర మగుగావుత మని నే వినయవిధేయతలతో ప్రార్థించుచున్నాను.

---

## ...ర్ణఖండము

ఆంధ్రవిశారద తాపీ ధర్మారావుగారు, బి. ఏ.

కరిఁగితిఁ బల్చనైతిని; ఇఁకేల నను నిప్పులఁ గాల్చికాల్చి ని
ష్కరుణ దహింపనేటికి? యకారణ మిట్టులఁ గ్రౌర్యమూన దు
ర్భరమగు నంచు నెంచరు; ప్రపంచము వంచన సుమ్మటంచుఁ గా
తరమతిఁ జింతనొంది పరితాపము నందకు స్వర్ణఖండమా.

నీవు విభూషణార్హమవు నిక్కమె; నీకిపు డున్నవన్నె నే
డోవలితిం గనుంగొనియె యూఁదెను నిన్నిటు విశ్వకర్మ; యిం
కేవగ లేదు, నీ గుణ మహీనముగా నుతిఁగాంచుఁ, గాంచు మా
భూవలయాధినాథ పరిపూజిత సుస్థిర గౌరవోన్నతుల్.

---

౧. స్థలము

[అంపచాఁప చాఱపప్పు గోరోచనము కస్తూరి పండ్లు లోనగు కానుకలు అరుఁగు మీఁద పెట్టఁబడి యుండును. గృహవేదికపై ద్రోణుఁడు కూర్చుండియు, అతని కెదురుగా కల్యాణధన్వుఁడు నిలుచుండియు ప్రవేశింతురు.]

ద్రోణుఁడు

(తనలో) శిష్యుఁ డనిన నితఁడే శిష్యుడు. ఇతనికి విద్య నేఁగలిగితినేని నాయాచార్యకము సార్థకమే కాని అర్జునునకు బాసయిచ్చి నా గౌరవమును దుర్వినియోగ మొనరించితిని. అకటా! ఇఁకఁ జేయునది లేదు. పొమ్మనలేక యితని నింతవట్టు నిలువఁ బెట్టితిని. మనస్సును చంపికొని యితని నిఁకఁ బంపివైచెదను (సూర్యునిఁజూచి) మాధ్యందిన సవనవేళ యయినది. (పర్ణశాలకు మొగము త్రిప్పి) ధనుశ్శర్మా, ఈ కానుకల నాయాయి తావుల నుంపుము.

కల్యాణధన్వుఁడు

(తనలో) దయ కలిగెనా ధన్యుఁడను.

ధనుశ్శర్మ

(ప్రవేశించి తనలో) ఈ తడవ మాగురువుగారి పిలుపింత మధురంగా ఉన్నదేమి చెపుమా? (చూచి) ఇట్టి పరిచర్యలకు నాదే ముందడుగు. ఇటువంటి పాఠాలే ప్రొద్దూకులూ ఉంటేనా? (గోరోచనమును కస్తూరియుఁ దీసి) ఇవి కృపీదేవిగారికి. (అంపచాఁప యెత్తి) ఇది ఆ- ర్యులవారు కూర్చోడానికి. (చాఱపప్పు పం- ఎత్తి ఉదరము చూపుచు) ఇవి ధనుశ్శ- ఉదరాంతములోకి. (అని అన్నియుఁ గైకొ- నిష్క్రమించును.)

ద్రోణుఁడు

(తెచ్చిపెట్టుకొన్న స్వరముతో) వత్సా, చె- నే చెప్పితిని—'శూద్రునకు ధనుర్వేదము చె- న'ని. (రూక్షస్వరముతో) ఇఁక నీవేఁగుము. (అ- పర్ణశాలాంతరములోనికి నిష్క్రమించును.)

కల్యాణధన్వుఁడు

(బాష్పనయనుఁడై పరిక్రమించి)

ఉ. బాలుఁడు సుంత తెల్వి కను
పైఁ దనజన్మవిధం బటో యిటో
తేలుచుకోఁ దలంచి గురు
దేవుని సన్నిధి కేఁగి కాళ్లపై
వ్రాలుడు వానిమోముఁ గని
'వచ్చును ముక్కలు వీని కం'చునుం
బాలన జేయునొజ్జదయ
బ్రబ్బుట యెంత యదృష్టమో కదా!

అశ్వత్థామాదులయు, పాండవులయు సహాధ్యా- యత్వము లభించుననుకొంటిని. ఔరా, అ- యెంతవానికి! నాది వట్టియడియాస.

మ. అవలోకింపఁగఁ లేదు సుంతయును నా
హస్తోద్యమ మ్మొక్కఁడా

దివసంబేనియు నాచరిత్రమును శో
ధింపంగలే దార, నా
ల్గవజాతిం బ్రభవించినాఁడవని పౌ
ష్మ్యం బాన యిచ్చెన్; గళా
వ్యవసాయంబున కేది దిక్కు? విధి యి
ట్లానే, కటా నాయెడన్!
(విల్లు జాఱిక్రిందఁబడి, ధ్వనించును.)
శిజీవచ్ఛవమా!' యని నన్నిది సంబోధించు
న్నది. (విల్లు గ్రహించి) ఇఁక నాజన్మము
ువిద్యకు శ్మశానమా? కాదు; ముమ్మా
ఁ గాదు. (పరికించి) నేను గురుదయ సంపా
చి తీరెదను.

ఈశ్వరాను గ్రహంబును నెలమిఁ గొనఁగ
విగ్రహారాధనము చేయు విధముగాఁగ
ద్రోణదేశికు దయ నేను దోఁచికొనఁగ
నాచరించెదఁ దత్ప్రతిమార్చనంబు
ందుల కస్మ త్పురపరిసరమునందలి, యర
్యమే శరణ్యము. (వెను దిరిగి ద్రోణుని దెస
ుస్కరించి నిష్క్రమించును.)

---

౨. స్థలము

అరణ్యమున కల్యాణధన్యుఁడు ధనుస్తూణీర
ణిమై ప్రవేశించును.]

కల్యాణధన్యుఁడు

పృథివీ మహాభూతమా, నమోవాకము.
. ఏమి మహాద్భుతంబో పర
మేశ్వరుఁ డారసి యెన్నియెన్ని యు
ద్దామములైన యాకృతులఁ
దా ధరియించునో వానివానికిం
గోమలమైన యన్నమయ
కోశసహస్రము లిచ్చుచుందువో
భూమి! మదీయదేశికుని
బొమ్మకు నీ యొక కొన్ని రేణువుల్.
(దాపునఁ గలపుట్టను జూచి)
గీ. పెక్కు కలుఁగులు గలుగు నీ పెద్దపుట్ట
గురుని దేహము కోసము కొంతమట్టి
తీసికొమ్మోయి యంచు నాకేసి చూచి
శతముఖమ్ములఁ బల్కెడి జాడ నొప్పు.
(అని ధనురగ్రముచే మట్టిని ద్రవ్వి కైకొనుట
అభినయించి చూచి)ధనురభ్యాసమున కీప్రదేశ
మెంతయుఁ దగినది. (వేలు వేలుగా నిర్దేశించి)
ఆ కొండ! ఈ చెట్టు!
క. గురుదేవుని కడకును మెల
సరిగియు నుత్తానహస్తుఁడై వెలయు నయో
త్తరుఁడగు శిష్యుండన నా
ధరణీధరనికటమందు తరువు దలిర్చున్.
ఈ చెట్టునీడనే పవిత్రమగు నీ పుట్టమట్టితో
ద్రోణాచార్యులఁ బ్రతిష్ఠితును. (అని మనస్సున
ద్రోణుని భావించి)
ఉ. నాదగు శక్తి నంతయు మ
నంబునఁ బెంచి కరంచి సత్వపుం
బాదున నించి మీ విమల
పాదములం దిడి 'వీఁడునర్క ధను
ర్వేదతలంబునందు నొక
వీరకథోపనిష' త్తటంచు బి
ట్టాదర మందిగాని పద
మావలికిం గదపన్ గురూత్తమా!.
[నిష్క్రమణము]



3. చెన్న కేశవ దేవాలయము వెలుపలిగోడలపైనున్న సుందరశిల్పము- బేలూరు



౮. చెన్న కేశవ దేవాలయము వెలుపలిగోడపై నున్న శిల్పచిత్రములు-బేలూరు

3. స్థలము

[ధనుశ్శాలలో కొందఱు విద్యార్థులు వచ్చుచుఁబోవుచు నుందురు.]

ధనుశ్శర్మ

(ఎగిరి చూచి) మాగురువుగారు ముందుకు వెళుతున్నప్పటికీ కళ్లు వీఁపుమీఁదనే ఉంటవి. ఆయనకు ముచ్చిలిగుంటకూడా ఒకకన్ను అనుకుంటా. (చేయి త్రిప్పి) కాని ఇవ్వేళమటుక్కు ఈయనకు కన్నులు లేవు. (సంజ్ఞ చేయుచు) అలా వెళ్లాలి; అలా వెళ్లాలి. అనధ్యాయం కోసం కొంత ప్రయత్నం చేశానుగాని ఏలాగో భీష్ములే వర్తమానం చేశారు. దానితో శిష్టానధ్యాయం వచ్చేసింది. (నిక్కి చూచి) అనఁగూడదుకాని కనఁబడకుండా వెళ్లిపోయారు.

(అని ఎగిరియెగిరి చూచును.)

శరశర్మ

(ఎగిరి చూచి) గురువుగారు తిరిగివస్తున్నారు. (భయముతో ధనుశ్శర్మ ఎత్తుగా ఎగిరిచూచును. శరశర్మ కా లడ్డము పెట్టును. ధనుశ్శర్మ క్రిందఁ బడును.)

ధనుశ్శర్మ

(లేచి) నీవు అసత్యం చెప్పడమే కాకుండా అవినయంకూడా చేస్తున్నావు,

శరశర్మ

ప్రొద్దున్నే నీవు దొంగ ఉఱుములు ఉఱమడం కంటె అసత్యఅవినయాలా? దానిమాట అట్లా ఉండనీ! మనం శస్త్రవిద్యే కాకుండా కుస్తీ కూడా నేర్చుకోవాలి.

లక్ష్యశర్మ

(ద్రోణుని ఆసనమునఁ గూర్చుండి ద్రో
స్వరముతో) ఆఁఆఁ, ఏ మా యల్లరి!

(అందఱును ఉలికిపడి చూ త

ధనుశ్శర్మ

వాఁమోసం కనుక్కొని వెనక్కితిరిగి రా
కద. (చూచి) బలేబలే లక్ష్యశర్మా! అల్లరి చేశావు.

అర్జునుఁడు

(మెల్లగా ప్రవేశించి చూచి) గురుచర
కంఠధ్వని వినిపించెను గాని వారేరీ?

ధనుశ్శర్మ

(లేచి) ఈనాఁడు శిష్టానధ్యాయం. నేనే భీ
డ—మహారాజభీష్ముఁడ. —మహారా
రాజ భీష్ముఁడనయితే దైనందినం శిష్టా
యం చేయిస్తాను.

లక్ష్యశర్మ

కాదు కాదు, (ధనుశర్మ చెప్పవలదని
చేయును. లక్ష్యశర్మ నిర్లక్ష్యముగా) ఎక
నేర్చుకున్నాఁడోగాని, వీఁడు ప్రొద్దున్నే
పుష్కలావర్తక మేఘంలాగా ఉఱిమా
మేఘం ఉఱిమితే అనధ్యాయ మనే వ
ఎక్కడ విన్నాఁడో! గురువుగారు ఉఱు
నమ్మి తత్‌క్షణం అనధ్యాయం పొమ్మ
భీష్ముఁవద్దనుండి వర్తమానం రా
అమంగళానధ్యాయం శిష్టానధ్యాయ
మాఱితే, తరువాతి ముచ్చట.

అర్జునుడు

(వక్షస్థలమున అంబులపొది విల్లుఉంచి ఆలో
చించుచు నిలువబడి తనలో) మా శరకౌశల
ప్రదర్శన యేర్పాటు చేయుటకుఁ గాఁబోలు.

ధనుశ్శర్మ

(తనలో) గురువుగారితో చెప్పఁడుకద ?
చెప్పినంతమాత్రం యేంలే? ఆయన యెవరికైనా
మాట యిచ్చాఁడో ఇంకోణ్ణి పరిహ్యాకం
కైనా మాట దక్కించుకుంటాఁడు. ఎవరి
మాటా నమ్మారో ఇహ దేవుఁడు చెప్పినా
నమ్మరు. పెద్దలకు సామాన్యంగా ఉండే ఈ
సుగుణాలూ వీరి దగ్గిఱ బాఘా పాఁతు
కొని ఉన్నవి. (ప్రకాశము) ఒరేయ్, లక్ష్మ
శర్మా! నీకు మహాపొగరు ఎక్కిందే? గురు
వుగారి ఆసనమువీఁద - ఆసనమువీఁద -
కూర్చుంటా రఁటరా? (అని లక్ష్మశర్మ బుజ
ములపై చేతులు వైచి అంపచాఁపకు ఒత్తును.
ముళ్ళు లక్ష్మశర్మకు గ్రుచ్చుకొనఁగా లబ
లబలాడును.)

లక్ష్మశర్మ

బాబోయ్, గుచ్చుకుంటున్నయి. వదులువదులు.
అయ్యా అయ్యా చూచారా! వీఁడు గురు
వుగారి చాఁపకింద ముళ్లో గసికలో, ముల
కలో పెట్టాఁడు.

(అర్జునుఁడు వారిని జూచుచుండును.)

శరశర్మ

అది అసలే అంపశయ్య. వదిలెయ్యరా పాపం
వదిలెయ్య.

లక్ష్మశర్మ

అంపశయ్యేమిటిరా? మఱేమయిందా? ముళ్లు
గుచ్చుకుంటుంటే?

శరశర్మ

కాదురా అది బాణాల చాఁప

లక్ష్మశర్మ

(చూచి) నిజమే లాగా వుంది.

(అర్జునుఁడు చూచి ఆశ్చర్యపోవును)

ధనుశ్శర్మ

నమ్మకం కలిగి తేనే కాని వదిలెట్టడానికి వీలా?

లక్ష్మశర్మ

ముమ్మాటికి నమ్మకం నీ పుణ్యా మాయిరి.
వదలు!

ధనుశ్శర్మ

జాగర్త! తెలిసిందా? (అని వదులును.)

లక్ష్మశర్మ

ఇది నా ప్రాణాలు తియ్యడానికే కాఁబోలు
ఇక్కడి కొచ్చింది. (అని పృష్ఠము తడవి
కొనును.)

అర్జునుడు

(చాఁప నామూలాగ్రము పరికించి) చదరీ
యనుకొంటిని. (ముట్టుకొని చూచి) ఎవరు
దీని నల్లిన వారు?

ధనుశ్శర్మ

ఆ గ్రంథకర్త కల్యాణధన్వుఁడు.

అర్జునుడు

అతఁ డెవఁ డయ్యా?

ధనుశ్శర్మ

(తనలో) ఈవ్యర్థకాలక్షేపం ఎవఁడుచేస్తాఁడు? అనధ్యాయం అనుకుంటూ మళ్లీ బాణాలు, బాణాలచాఁపలు! ఈ ఒక్కొక్క నిమిషం ఒకొక్కస్వర్గం. నేనెగిరిపోతా. (అనిఎగురుచు నిష్క్రమాభిముఖుఁ డగును.)

అర్జునుఁడు

మాటాడవేమయ్యా?

ధనుశ్శర్మ

ఓరీ లక్ష్యశర్మా! ఆసంగతి నీవు చెప్పరా! (అని ఎగురుచు నిష్క్రమించును.)

లక్ష్యశర్మ

నాకేం తెలుసు? వీఁడు నన్ను నానా తిప్పలూ పెట్టి తప్పించుకో పోతున్నాఁడు. వీని పని పట్టిస్తా. (నిష్క్రమణము.)

అర్జునుఁడు

ఎవరయ్యా కల్యాణధన్వుఁడు?

శరశర్మ

నిషాదనృపతి హిరణ్యధన్వునికొడుకు కల్యాణ ధన్వుఁడు. అతఁడు గురువుగారిని శుశ్రూషించడానికి వచ్చాఁడు. ఎలికిలాడికి ధనుర్వేదం నిషిద్ధమనో మరేమిటో తోలేశారు. అదుగో ఆల్లాతఁడు బహుమతి చేశాఁడు.

అర్జునుఁడు

ఇది అతని శిల్పమేనా?

శరశర్మ

ఔను. దానిమీఁద పేరుంది. (అర్జునుఁడు పరీక్షించుచుండును.) ధనుశ్శర్మా లక్ష్యశర్మా కొట్టుకునేట్టున్నారు. గురుకులంలో ఈ
నయం తెలియఁబడకముందే తుంచెయ్యా

(నిష్క్రమణ

అర్జునుఁడు

సీ. గళ్లుగా మాతె నంచులుగాఁగఁ గు
గమ్మిగాఁ దీతెఁ బట్టెలుగాఁగఁ గూ
ఔర, యమ్ములు చెప్పినయట్లు వినిరా
నితనికరమున నున్నదాయేమి మనస

ఇతని ధనుస్సు పే రెంత మంచి యక్క
లతోఁ గూర్పఁ బడినదో?

శా. ఇంకేల వీనికిఁ బిచ్చి కాక గురుతో
నేలా పనుల్? వీని బా
ణాంకంబుల్ గనుఁగొన్నచో నితని
హ స్తంబునందుండి వి
ల్లంకూరించిన యట్లు తోఁచెడిని గా
దా? యీమహావీరుఁడే
కింకేల వింటిని నెత్తెనేని జగముల్
క్లిబంబులై పోవొకో?

ఇతండు దుర్యోధనునకే దక్కుచో? వే
షమున నేనే యితనిఁ గాంతుఁ గాక.

[నిష్క్రమణ

---

౮. స్థ ల ము

[అరణ్యమున ఒక పెద్దచెట్టు కొమ్మ
విండ్లు అంబులపొదులు తలిగింపఁబడి
డును. మట్టి ద్రోణుఁడు పుష్పాంకృత
చెట్టుక్రింది తిన్నెపై ఉండును.]

మాతరుఁడు

(మట్టిముద్దతో ప్రవేశించి అటు ఇటు ఒత్తి
అవమానించిన ఆయన్నేనా శుశ్రూషించ

ష్టమాలిన బానిసతనం బ్రాహ్మఁడిది. క్షత్రి
ష్టంలో ఆఘాతానికి ప్రతిఘాత మేజబాబు.
మృతుఁ డంటాఁడు - అధర్మాన్ని ధర్మం
అసత్యాన్ని సత్యంచేత, అవిద్యను విద్య
చావును చచ్చి జయించ మంటాఁడు.
౨ పూర్వకాలపు బాఁపన మాటలు.

ణ ప్రతిమను చూచి) ఇతఁడు పూజచేసు మైదానంలోకి వెళ్లాఁడే! భక్తిచే ఇత గురువుకాని ఈమట్టిపెళ్లా? (పరికించి) ం! ఇతఁ డన్నీ తిన్నఁగా ఎఱుఁగఁడు. దేవతార్చనలో అంబిక లేదు. నేను కృపీ ని చేస్తాను. (చేసి) అమ్మకు అయ్యకు క లేదు. ఎవరి శిల్పం వారిదే. ద్రోణాచా ం నేనూ చేస్తా. (చేసి) అయ్యా! గురు వారూ! నేను సిసలైన బ్రాహ్మణ్ణి కదా! ర్వాదం చెప్పి నన్ను వీరుణ్ణి చెయ్యండి! టు ఇటు తిట్టి వికారముగా మార్చి) తమ డ. (కృపీదేవి ప్రక్కగా ఉంచి) ఇహ జ చెయ్యాలి. పూవు లన్నీ మామిత్రుని జలో పరిసమాప్తము లవుతున్నవి. పోనీ లకుబదులు అక్షింతలు! అవిమాత్ర మేవీ? దుకుబదులు ఉళక్కి. ఓంకృపీదేవ్యైనమః, ద్రోణాచార్యాయనమః, ఓం బ్రాహ్మణ త్రియాయనమః, ఓం క్షత్రియాచార్యాయ మః, ఓం నిషాదనిషేద్ధ్రేనమః. ఓహో, బిగ్గ గా అనఁ గూడదు. వినిపిస్తే వ న్నిక్కడ ంచి బదరాయిస్తాఁడు.

నుష్పాణియై ఆలోచించుచు కల్యాణధన్వీ ప్రవేశించును. మాతంగుఁడు తాను చేసిన తిమలను వస్త్రముతో మూయును)

కల్యాణధన్వుఁడు

గీ. ఉదధి గర్భంబునను దాఁగియున్న మొసలి
చుక్కగుంపుల నడుమను నక్క గ్రద్ద
మట్టి ద్రోణుని సర్వదా మదిని దలఁచు
నీ నిషాదుని శరముల దే బెఱుంగు.

మఱియు

ఉ. మానవు లేఁగరాని వన
మధ్యమునందు నివాసమున్న యే
యేనుఁగు సింగమును బలియు
నేదు సివంగి మఱేది యేదియుం
గాని మనీయ బాహుపరి
కల్పిత దీర్ఘ ధనుర్గుణధ్వనుల్
వీనులఁ బడ్డ వంగి పెప
వీథులఁ బోవును గోవులో యనఁగ.

పతంగ నేధశబ్దవేధ నెఱపెదను. మబ్బులఁ జీల్చెద. ఐననేమి? గురుకృప లేనివిద్య యేటి విద్య? ఆచార్యుని కనుగ్రహము రాకపోయె. విద్యకు సార్థక్యము లేదాయె.

(తెరలో పటహధ్వనులు కేకలు కుక్క యఱపులు గర్జనములు బృంహితములు మొదలగు ధ్వనులు.)

మాతంగుఁడు

(వికటముగా లేచి) బాబో, బాబో! ఏమీ గందరగోళము? మా మీఁదకి యుద్ధానికి వస్తారా? రాండి రాండి. ద్రోణాచార్లు వచ్చి నానరే మ్ముంచి మా మట్టిద్రోణాచార్లను ప్రయోగిస్తాను.

కల్యాణధన్వుఁడు

చెవి యొగ్గినకొలఁది కర్ణజాహము మోఁగి పోవుచున్నది. (చెవిపై చేయిడికొని ఆకసము దెసఁ జూచి)

సీ. ఆకాశమునయందు నాదిపన్నగరాజు
పడగలో యన రజఃపటల మెసఁగె
అల త్రివిక్రముఁడు బ్రహ్మాండభాండం బెక్క-
త్రొక్కినగతిఁ జప్ప డెక్కడాయె
ప్రకృతి యూఁపిరితిత్తిపట్టు లుబ్బినయట్లు
వాయులోకమునందు వార్తపుట్టె
ప్రలయశంఖధ్వని ప్రతికృతిగా ధరా
ధరకందరము ప్రతిధ్వనుల నీనె
కొండగుహాలందు దాఁగిన గూబతుటుము
ఘూ ఘు ఘూయని యేడిచెగూబ లదర
చెల్ల రే నావ విల్లు విద్యుల్లత యన
మెఱసెడిని బ్రాఁకెడిని జేతిమీఁది కెలమి.

(తెరలో మిక్కటముగా కుక్క మొఱుఁగు విన బడును. కల్యాణధన్వుఁ డాలకించి ద్రోణ ప్రతిమకు నమస్కరించి)

గీ. భక్తి కుసుమంబుతోడ సపర్య జేసి
ఆర్త రక్షణాసై వేద్య మాచరింతు
విజయదానం బొనర్చి తృప్తిని గమింపు
మయ్య యాచార్యదేవ! మహానుభావ!

మాఠరుఁడు

ఈయన మనదగ్గనుండి ఏమైనా పుచ్చుకుంటాడుగాని మన కేమీ ఈయఁడు.

కల్యాణధన్వుఁడు

మన కిచ్చుట అపచారము. మనమే యిత్తము. (తెరలో మరల కలకలము.)

గీ. శబ్ద ముపసంహరించుచు శాంతిఁగొను
ధనువు నెత్తెను గల్యాణ ధన్వుఁ డిదిగ
మానఁబోకున్న వినుఁ డిదే మాదు వి
మీఁదు శబ్దంబు మిమ్మను బ్రింగివై చు

మాఠరుఁడు

నేనుమాత్రం ఊరుకుంటానా యేమిటి?

కల్యాణధన్వుఁడు

(వృక్షస్కంధ మెక్కి చూచి) ఎవఁడో యె యోధుఁడు పలువేఁపులతోనీ దెసకే వచ్చుచున్నాఁడు.

మాఠరుఁడు

అమ్మ బాబో, నన్ను వదలిపెట్టి చెట్టెక్కా (అని చెట్టు ప్రాఁకి కిందఁ బడి లేచి భ మభినయించును.)

కల్యాణ ధన్వుఁడు

ఔరా! అది యెంత కుక్క!

గీ. సవ్యశౌర్యాగ్ని కీల నా నాల్క వ్రే
కనులు నిప్పుల కొల్మలకరణిఁ దనర
ముక్కుఁ జెమరలు తిత్తులఁబోలె నుబ్బ
గుక్కయిదిగాలిపిఱుఁదునుగొనఁగఁబా

మాఠరుఁడు

పర్ణశాలతలుపు తీసి ఉంది. అన్నంకాస్తా కుక్క తినిపోతే ముందు నివేదనకు లోఁ వస్తుంది. ఇంతేకాక నా కీ అడవిలో గుప్పె మెతుకులైనా ముష్టిపుట్టవు మిత్రమా! ఇంట్లోకి పోతున్నా, కుక్క నీ మీఁదికి వ నన్ను పిలు. కఱ్ఱతీసుకోవస్తా. (ప్రతిమలతో

...డి మీకు నైవేద్యం ఆఁగి వుంది. (అని తీసి
...ని నిష్క్రమించును.)

కల్యాణధన్వుఁడు

...చెట్టెక్కి ఈకుక్క చావకుండను, మొఱుఁగ
...ంకెను ఉండునటులు తూపులు వైచెదను.
...అని దిగి విల్లు మొఱయించుచు నిష్క్రమి
...ంచును.]

---

## ౫. స్థలము

...ముట్టియుపై తూపులుగల వేఁపియు, దానిబరి
...లించుచు ధనుష్పాణి యగు అర్జునుఁడును
...ప్రవేశింతురు.]

అర్జునుఁడు

...పంపిన సైనికులింకను రాలేదేల? ఈతూపు
...ం సరిగా ఆచెట్టుపైనుండి వచ్చినవి. ఆయంప
...వేఁప తూపులును ఇవియు నొకటి. ఇవితప్పక
...ల్యాణధన్వునివి.(శునకముఖమున బాణములు
...యు యత్నించును గాని అవి రాకుండును)
...రా! ఊడఁ బెఱుకుటయు నాకుఁ జేతఁగా
...దే? పూలచెండువలె ముట్టె కలంకారము
...ను, ముఖబంధముగను బెఱికినను రాకుండఁ
...ను బాణప్రయోగము చేసిన యితనికా
...రువు? ఆహా, వీనిచే ద్రోణులాచార్యులు.
...రము లితనిచే ధన్యములు. ఆ చాఁపయే
...చాఁప. ఈతూపులేతూపులు. ఇసీ, నా బాహు
...వులేఁ? (అని దులిపి) ద్రోణుఁడు నా కథయ
...మిడెను. దానికన్న శరిణ్యము లేదు. (అని తల
...పంకించు చుండఁగా ఇరువురు సైనికులు ప్రవే
...శింతురు.)

౧ సైనికుఁడు

ఆమెలికిలాఁడే. (నిర్దేశించుచు) అదుగో, అదుగో! ఆచెట్టుమీఁద కోఁతిలాగా కూచున్నాఁడు ఒక బాణంతో సరి.

౨ సైనికుఁడు

ఆ ఒక్క బాణం వెయ్యలేక పోయావేమ్. (అర్జునునితో) ఆమనిషి ఆవిల్లూ చూస్తే ప్రాణాలావలించేట్టుంటే. వీఁడికిక్కడికిపరిగెత్తి కొచ్చిందాఁకా నోట మాట రాలేదు. మూగాఁడై పోయాఁ డనుకున్నా. తమ కొఱకు (అర్జునుఁ డాశ్చర్యము నటించును.) అర్ఘ్య పాద్యాలు తయారు చేస్తున్నాఁడు.

అర్జునుఁడు

మనము వడిగా అట కేఁగుదము.

[నిష్క్రమణము]

---

## ౬. స్థలము

[ పాద్యము చేఁబూని మూకరుఁడును ౧. సైనికుఁడును అభిముఖులై ప్రవేశింతురు ]

మూకరుఁడు

పాద్యం, పాద్యం. (చూచి) ఓరీ దుష్ట సైనికుఁడా! కోడిజుట్టువలె, కన్యాకుమారి - అగ్రం వలె పొడుచుకొని మరీ వస్తున్నావు. పాద్యం నీకే కాఁబోలు!

౧. సైనికుఁడు

మహాదొడ్డ బాంబఁడవు! నీ తప్పు నా మీఁద పారేస్తావేం?

మాతరుఁడు

అదే గొప్పవారి లక్షణం.

(అర్ఘ్యముతో కల్యాణధన్వుఁడును అర్జునుఁడును అభిముఖులై ప్రవేశింతురు. మాతరుఁడు పాద్య మిడును కల్యాణధన్వుఁ డర్ఘ్య మిడును; కుక్క. పరువిడివచ్చును.)

మాతరుఁడు

ముందు దీని కర్ఘ్యపాద్యా లివ్వాలి.

(కల్యాణధన్వుఁడు నేర్పుతో కుక్కముట్టి పైని బాణములు తీయును. అర్జునుఁడు అసూయతో చూచుచుండును. కుక్కను బుజ్జగించి పైనికిఁ డావలికిఁ గొంపోవును.)

కల్యాణధన్వుఁడు

(దోయలి యొగ్గి)

చ. భరతుని యన్వవాయమున
వాఁడవుగావున మాకు రాజ వా
శరవరవిద్య మాదుగురు
చంద్రుఁడడన్ గ్రహియించుపొంటె సో
దరుఁడవు నాదు పుణ్యవశ
తం జనుదెంచితి వయ్య! యీవనే
చరుఁ డిడు నాతిథేయమును
జాల దయం గయికొమ్మ, అర్జునా!

అర్జునుఁడు

నేఁడు నిన్నుఁ జూచుటయే వేయివిందుల పెట్టు. కౌరవులకును మాకును రేపు ప్రపరీక్ష, (ద్రోణప్రతిమఁ గాంచి వినయవినమితుఁడై) కల్యాణధన్వా! ఆచార్యులకు నీ విషయము విన్నవించి నీయాతిథేయమును స్వీకరిం జేయుదును.

కల్యాణధన్వుఁడు

(తేఁటి పాఱుఁ జూచి ఆనందబాష్పములతో) ఏమిా అకాలవర్షము!

ఉ. ఏమి మదీయదేశికుని
నీడకుఁ దెత్తువె? యర్జునుండ, నీ
ప్రేమకు నెల్లలేదె? విలు
విద్దెకునుం గొలబద్దె నాగురు
స్వామికి వేనవేలు పద
వందనముల్ గురు దేవుఁ దెచ్చుచో
నామెయి నీ విశుద్ధచర
ణంబులకుం గుసుమం బొనర్చెదన్
(అని మోఁకారిలును)

అర్జునుఁడు

నేటికి మూఁడవనాఁటఁ దప్పక వత్తుము.

కల్యాణధన్వుఁడు

దాసుఁడు ధన్యుఁడు.

అర్జునుఁడు

మంచిది మే మేఁగి వత్తుము.

(అర్జునుఁడు నిష్క్రమించి వెనుదిరుగఁ మాతరకల్యాణధన్వు లింకొకదెస వెను దిరిగి నిష్క్రమింతురు.)

అర్జునుఁడు

(వెనుదిరిగి చూచుచు) ఇతని శక్తి యంతయో ఆబోటన వేలు! ఆబోటన వేలు.

[నిష్క్రమణము

---

౭. స్థలము

లవాల్చి అర్జునుఁడును, అతని జూచును
ోణుఁడును ప్రవేశింతురు.]

అర్జునుఁడు

ారు నాకొకవర మిచ్చిన మాట మఱచితిరి.

ద్రోణుఁడు

వ్వి) నిన్నటి పరీక్షలో నీ విజయమే నామ
వమికి ప్రమాణము.

అర్జునుఁడు

న్నటి పరీక్షకు కల్యాణధన్యుఁడు వచ్చుచో
ంతటి ప్రబలమైన అప్రమాణము వేఱొకటి
ఉండదు.

ద్రోణుఁడు

తనలో) నిక్కమే. వాఁ డొకవీరావతార
ము. పూర్వజన్మముననే వానిది సిద్ధహస్తము.
ప్రకాశము) వరదాన మెఱఁగియే వానిని
ేషేధించితిని. అతఁడు నీ కెటులు కాన
చ్చెను ?

అర్జునుఁడు

అయ్యా! మీ కాతఁడు కానుక యిడిన చాఁప
ు జూచితిని. నేనును ఒనరింపఁ బ్రయత్నించి
తినిగాని అది జల్లెడయుఁ గాలేదు. పిదప నతని
ాంచ నడవి కేఁగితిని. అతఁడు నావేఁపపైఁ
ొన్ని తూపులు బఱపెను. అవి దాని మూతి
లంకారము. జీవితమునకు గవాటము. దాని
ేగము వానికడనే కలదు. అతని యంగుష్ఠమే
యంగుష్ఠము.

సీ. అల్లపరాక్రమం బను లతాగ్రంబున
వేయి రేకులతోడ విచ్చుపూవు
బలదర్పములకు శిల్పమునకు సౌందర్య
మాహాత్మ్యముల కేకమకుటకంబు
మీరు లందఱకును విధిగాఁగ వీక్షింప
నైన సజీవ దేవాలయంబు
కొలఁది రూపంబు చేకొని చెంగలించెడు
నాదిశేషుని ఘోరమైన పడగ
ఇతని యంగుష్ఠమే మని యెన్నువాఁడ
దానిపై నున్నయది కన్నుగాని గోరె?
ఇయ్య దయ్యారె నాకును హృదయశల్య
మిది నివేద్యము గురువున కెంతయేని.

ద్రోణుఁడు

చాలుఁజాలు వత్సా!

క. నాకొమరునికంటెను మఱి
నాకంటెను ఛాత్రజనగణమ్ముల కంటెన్
నీకే గొప్పఁదనంబుం
జేకుఱఁజేయుదు నను దొల్లి చెప్పిన భంగిన్.

అది యటుండె. అతని యునికి యేడ? అతనితో
మనము సంబంధము కలిగించుకొను టెటులు?

అర్జునుఁడు

(తలయెత్తి సంతసముతో) అతఁ డరణ్యమునఁ
దమ ప్రతిమ నొండు ప్రతిష్ఠించి యాప్రతిమకు
శిష్యుఁడై ధనురభ్యాస మొనరించుచున్నాఁడు.
నేఁడే యాతనికి తమ దర్శనభాగ్యము లభింపఁ
జేయుదునని మాట యిచ్చితిని.

ద్రోణుఁడు

ఏమీ యదృష్ట పిశాచన్యాయము! దారి తీయుము, దారితీయుము.

[ఇరువురు నిష్క్రమింతురు.]

---

౮. స్థలము

[వ్రతవేదిక యంతయు పరిష్కృతమై యుండును.]

కల్యాణధన్యుఁడు

లోని కెవరును రాకుండ మారరుని వనద్వార పాలకునిగా నియమించితిని. ఇంక నా యాచార్య పరిచర్య కాతంకము లేదు.

ఉ. ఈ సెలయేరు దేశికున
కిచ్చును బాద్యము చెట్టు లర్ఘ్యవి
న్యాస మొనర్చుతన్ లతిక
లన్నియు విచ్చిన పూలతో మురే
వేసలు చల్లుతం ద్రుణవి
శేషము లన్నియుఁ బీతకంబులో
గ్లానము నొందుఁగాక! సఫ
లం బగుఁగాక! నిషాదు కోరికల్.

క. కరకౌశలపున్ నికషము
శరమునకుం బరమగురువు సాక్షాన్మూర్తి
స్ఫురణము కల నాదైవం
బరుదెంచెను నేడు నామహాభాగ్యమహా.

(అని నృత్యము చేయుచు)

ఆ. నాదు గురున కాయె నామీఁద నామోద
మెంత పుణ్య మహాహ యెంత భాగ్య
మెట్టు లెదురుకొందు నేమెయిఁ దోడ్తెత్తు
నేమి యిత్తు మనమ, యిపుడు చెపుమ!

(ప్రతిమను జూచి)

ఆ. నీవు కరఁగి యొజ్జ దేవర వౌదవా?
వారి నిటకుఁ గొంచు వత్తువా?
నిన్ను నమ్మి యున్న నీదు సద్భక్తుని
నేఁడుపొందనిమ్ము నిండు సిద్ధి.

(అని భక్త్యుద్రేకముతో ద్రోణప్రతిమ
విల్లించి సాగిలఁబడియుండును. ద్రోణ
నులు ప్రవేశింతురు.)

ద్రోణుఁడు

(నడిగా కల్యాణధన్యుని సమీపించి తన
ఇట్టి భక్తి యెందును అబ్బురము. బలే! ని
శిష్యునిగాఁ గొననందుకు నన్ను లజ్జి
జేసితివి. (ప్రకాశము) వత్సా, లెమ్ము!

కల్యాణధన్యుఁడు

(చూచి) ఈప్రతిమనుండి మీ రావిర్భవించి
ధన్యుఁడఁ బరమ ధన్యుఁడ' (మోక్ష
ఆనందపరవశుఁడై స్తంభించి పోవును.)

ద్రోణుఁడు

వత్సా, లెమ్ము! 'అతివినయంధూర్తలక్షణ

కల్యాణధన్యుఁడు

(లేచి, ఆనంద బాష్పములతో)

శా. నే జన్మించుట సార్థకం బిపుడ యం
తేవాసిసామీప్య మ
వ్యాజంబౌ కృపఁ దామె రాఁగలిమి న
వ్యాసంగ మీడేతె దే
వా, జన్మించితి వేఱుజాతి నొగి మీ
పాదంబు లంటం జనక్

గాజుల్ వాలు మనంబు తాఁకికొనఁగా
నా కీయరే యానతిన్?

ద్రోణుఁడు

...డందుల కంత తొందర యేమి?

కల్యాణ ధన్యుఁడు

...నిండు!

...చాపాచార్యుఁడు పాండునందనునితో
స్వచ్ఛాత్మునిం జూడఁగా
వ్యాపారించెన లే? నిషాదుఁడు గురు
ప్రాసాద మర్థించి తా
నే పోవంగఁ దలంప వచ్చితిర మీరా
రే, యీశరీరంబు మీరా
దే, పుణ్యాహము నేఁడు నాకుఁ గొనుఁడీ
యీశిష్యపూజాంజలిన్.

ద్రోణుఁడు

...దియేమి? నీవు నాకు శిష్యుఁడవా?

అర్జునుఁడు

...నలో) బయటివాఁడు పాడిగేదె యనఁగా,
...ంటివాఁడు గొడ్డుగేదె యనినటు లున్నది.

కల్యాణ ధన్యుఁడు

...ాము కాక నా కితరులు ఆచార్యులు కాఁజా
...రు. తాము నాకుఁ బ్రత్యక్షమున నిషేధించి
...ను ఈప్రతిమయం దధివసించి శిక్షించితిరి.

అర్జునుఁడు

...రెన్న మాట

...కల్యాణధన్యుఁ డర్జునునకు నమస్కరించును.)

ద్రోణుఁడు

...వు మాప్రతిమ నర్చించినంతమాత్రమున
...నాకు శిష్యుఁడ వెటు లయ్యెదవు?

చ. ఉదరమునందుఁ జోటిడుట
యొక్కటి తక్కఁగఁ దల్లి యొమ్మనం
దొదలఁగ నెత్తికొంట యను
నొక్కటి తక్కఁగఁ దండ్రి జ్ఞానముం
గుదురఁగఁజేసి సౌఖ్య మొదఁ
గూడఁగఁజేయుట జేసిఁ దైవమై
యొదవు గురుండు నీ కహహా
యూరక చుల్కనయాయె నీదెసన్.

కల్యాణధన్యుఁడు

(తనలో) నా కిది పరీక్షయా?

ద్రోణుఁడు

సీ. పాద సంవాహనాభ్యంగనాదికము కా
వించి యెల్లపుడు సేవింపవలయు
ఆజ్ఞ చేయకమున్నె యరసి యాయాయి కా
ర్యకలాపములను జేయంగవలయు
సమయంబు కనిపట్టి చదువులలో మేల్ త
రంబులౌ వాని నేర్వంగవలయు
ఎంత వచ్చిననేని సుంత సగ్గుచు చెంత
నిలుబద్ద యొక్కింత నిలువవలయు
దాసురీతిని జనులలోఁ దనరవలయుఁ
గొమరునిం బోలె భక్తినిఁ గొనఁగవలయు
బుధుని చందాన విద్యను బొందవలయుఁ
గాని యెడ శిష్యుఁడను నాఁగఁ గచ్చ దేల?

కల్యాణధన్యుఁడు

అయ్యా, ఇందు నా దోసఁ గేమి? పోనిండు! వీఁడు శిష్యుఁడు కాఁడని మీరనుకొనుఁడు; తా మాచార్యులు కారని నే ననుకొనెను. ఇందేమి బాధ?

అర్జునుఁడు

బలే! శిష్యుఁ డనవలసిన మాట.

ద్రోణుఁడు

ఏమీ మచ్ఛిష్యముద్రతో దుష్కార్యములు చేయఁదలఁచుచుంటివా?

(అని మృత్ప్రతిమను కాలితో తన్ని వైచును. కల్యాణధన్వుఁడును, అర్జునుఁడును ఎత్తి పెట్టుదురు. ద్రోణుఁడు మరలఁ దన్నును. కల్యాణధన్వుఁడు మరల ఎత్తిపెట్టును.)

ఓరీ నిషాదా! నీవు దానిని ముట్టరాదు నీవు నా శిష్యుఁడవు కావు.

కల్యాణ ధన్వుఁడు

(చెవులు మూసికొని) ఇది కఠినపరీక్ష. (ప్రకాశము) అయ్యా,

సీ. ఉండునదా నేను చండీమం బగు వనం
బున మధ్యమున గండుఁబులులదండ
పుట్టినదా నేను పుణ్యాత్ముఁ డను పేరు
దాల్చియున్న హిరణ్యధన్వునకును
పట్టినదా నేను ప్రతిమలో నెలకొన్న
భవదీయ రమణీయ పాదయుగళి
నేర్చినదా నేను నియమపూర్వకముగా
నతిభక్తి ననవద్య శస్త్రవిద్య
మేదినియు నాకసంబును మీఁదఁబడిన
నాఁడె తప్పను దూపూర కవలఁ బఱప
కాదు ముమ్మాటికిని గాదుగాద ట నిన
నేను మీ శిష్యుఁడను గాకపోను నిజము.

అర్జునుఁడు

(తనలో) ఇది సమయము.

ద్రోణుఁడు

ఒరీ, నీవు మాకు శిష్యుఁడ వేని గురు ద
నిమ్ము, ఇమ్ము, ఇమ్ము.

కల్యాణ ధన్వుఁడు

(సంతసముతో ద్రోణుని ప్రదక్షిణించి నె
కారించి) దేవా!

సీ. అవిగోఁ జేకొనుఁడు మేల్ కవిలగోవులు క
పాదుగులు గలవి యర్బుదము దా

(అర్జునుఁడు ద్రోణు దెసఁగాంచి చప్పరించును)

ద్రోణుఁడు

నేను గొల్లఁడఁగాను.

కల్యాణ ధన్వుఁడు

అదె నాపరిజనంబు మది కింపితంబైన
పనిపాట లొనరించు పటిమకలదు

(అర్జునుఁడు ద్రోణు దెసఁగాంచి చప్పరించును)

ద్రోణుఁడు

నేను రాజనా?

కల్యాణ ధన్వుఁడు

అవియ భండారంబు లందుకొనుం డంది
సమితముల్ హేమకోశ్యములు కల

(అర్జునుఁడు ద్రోణు దెసఁగాంచి చప్పరించును)

ద్రోణుఁడు

నన్ను యక్షునిఁ జేయవలదు.

కల్యాణ ధన్వుఁడు

ఇదె నాదు మెయిచాల నెదిగియున్న దికొన
డిష్టార్థసిద్ధుల నిది యొనర్చు.

(అర్జునుఁడు కల్యాణధన్వుని బోట ప్రే
జూచును.)

ద్రోణుఁడు

ఈధనంబును నీగోవు లీజనంబు
లీ శరీరం బిదియు నెల్ల నేల నాకు?
ఇత్తువో లేదో నీయిచ్ఛ

కల్యాణ ధన్వుఁడు

కను సందియమా?

ద్రోణుఁడు

యిత్తువేని
కోసియిమ్మాయి, దక్షిణాంగుష్ఠ మిపుడు.

కల్యాణ ధన్వుఁడు

డ్డున నున్న ఖడ్గమును చరాలునఁ జేతికి క్షిణాంగుష్ఠమును రివ్వనఁ జతికి నెత్తుటదోఁగు నిని జేతనిడకొని)

వంకరకోరనం బొదలి
స్వల్పాకరంబగు శల్యసంఘచే
బింకము లేని [illegible]
క్రేల్ గురుదక్షిణగాఁగ నీవుఁగాఁ
గొంకెద విశికేంద్ర! యిది
గోఁ గొనుమయ్య! యఖండకుండలా
లంకృత ముక్త మహారుధిర
లాంఛిత మిగాతలఁ గోసి యిచ్చెదన్.

ని కత్తిమెత్తఁగాఁ బట్టుకొని)

ద్రోణుఁడు

త్సా! కలదు వలదు. నాయభీష్ట మింతయే.

(ఆనంద బాష్పములతో) నీ వేకలవ్యుఁడవే కాని అనేకలవ్యుఁడవు కావు.

(ఏకలవ్యుఁడు అంగుష్ఠమును ద్రోణున కిడును. ద్రోణుఁ డర్జునున కిడును. అర్జునుఁడు లజ్జా భయసంభ్రమములతోఁ గైకొనును.)

ద్రోణుఁడు

(తనలో) నేనితనికి దేశికుఁడనా; ఇతఁడే నాకు దేశికుఁడా? (ఏకలవ్యు నాలింగనము చేసికొని) వత్సా, కల్యాణధన్వా!

గీ. నిశ్చితం బగు గురుభక్తి నిన్నుఁ గొల్చెఁ
గొంటి నా పేరు నెల్ల సంగుష్ఠ మిచ్చి
ఏకలవ్యాభిధానంబు నీకుఁ జెల్ల
నప్రతిష్ఠయె నాకుఁ బ్రియమ్ము సుమ్ము.

భరతవాక్యము

ఉ. గాలియు నీరి చందముగ
జ్ఞాన మ దండ ఆసామ్యటంచు ధీ
శాలురు యోగ్యమైన జన
సంతతి కిత్తురుగాక! బ్రాహ్మణుల్
పాలకులైన క్షత్రియులు
వైశ్యులు శూద్రులు నన్నదమ్ములం
బోలెను నైకమత్యమును
బొందుచు నుందురుగాత మెప్పుడున్.

# నదీరేయి

కె. అన్నమరాజశర్మ గా

ఈ మృదుశాద్వలభూమి పవిత్ర - ముగ్ధానురాగంబు పుష్పించియుంట,
కాంక్షాచయంబు రెక్కలు గట్ట నేకతంబున చంద్రాతపంబున నిందు
విహరింతువో యంచు వేడ్క వచ్చితిని - కాని నీచిహ్నముల్ కానరావోయి
ఏయెడ నుంటివో యెఱిఁగించి వేగ - విరహవాగురలను విడిపింపు నాథ!

మనమనోగతములౌ మర్మాలకెల్ల - సాంద్రతమాలముల్ శరణం బొసంగె,
ద్వైతభావము లేని ప్రణయయామినులు - గడచె నీకాళిందిగట్టులం దెన్నొ,
కుసుమశృంఖలములఁ గూర్చి నిన్నిచట - బంధించియుంటి నాప్రాంతంబునందె,
కాటుకకన్నులం గాల్వలై పాఱు - విరహాశ్రుకణముల విడువంగవలసె.

నామనోరథములు నట్టటఁ గలియ - వెదకెదుకొలఁది నిర్వేదతాపమున
ప్రణయతైలంబున రగిలించుచున్న - ఆత్మదివ్యజ్యోతి యారిపోఁజొచ్చె—
పాటలాధర కాంతి పసనూలిపోయె, - దిఙ్ముఖమ్ములనెల్ల తిమిరసంతతులె
గాఢమ్ములై కప్పెఁ గౌముదీపటలి; - బ్రతుకు దూరంబయ్యె రమణ! నా కింక—

నిద్రాసమాధిలో నిఖిలవిశ్వంబు - దైనికవ్యథలెల్ల దలఁపున మాని
శాంతసంస్పృశ్య విశ్రాంతిఁ గైకొనఁగ, - ఈరహఃకల్పంబు లెవరింపలేక
తాపానలమ్మున దగ్ధమౌచుంటి - కరుణాసుధావృష్టి గురిపించి నాదు
హృదయ దయితుఁ జూపు బృందావనంబ! - వేఁడినిట్టూర్పుల వేఁచుచున్నాను.

తారాపథమ్మునఁ దళతళ లీను - తారకలార! నాతాపంబు వాయ
నెమ్మిపింఛమ్ము శిరమ్మునఁ దనర - జలతాకుశాలువు జానువు లంట,
చిఱునవ్వువెన్నెలల్ చిందించువాని - నవనవోన్మేషణానందలావణ్య
స్రోతసులు చిగిరించు మోహనవేణు - గోపాలబాలునిఁ జూపరే కరుణ!

ఆనందకేళీవిహారసైకతమె - నాచిన్నికృష్ణుండు ననుఁ బాయుకతన
బహుళదుఃఖమలినపంకిలం బయ్యె, - కాళిందితల్లి! నా కాంతుఁ డేచాయ
తలిరుపూఁబొదలందు దాఁగియున్నాఁడొ - శ్యామసుందరుఁడె నా సర్వస్వ మనుచు
వాపోవు రాధికా పరిదేవనంబుఁ - గడసారి పిలుపుగా గ్రహియింపు మనుము.

---

# కావేరి

## రాయసం వేంకటశివుఁడు గారు వ్రాసినది

త.రా

౧

సంవత్సరాదిసందర్భమున, మా ముఖ్యాధికారి సందర్శనమునకై పట్టణ మేగి, 'పార్టీ' వేడుకలు [illegible]చి, మరలి వచ్చునపుడు, బడలిక తీర్చుకొనుట కొక [illegible]ట్టునీడ నిలుచుంటిని. అనతిదూరమున నొక స్త్రీ [illegible]ర్చుండి, దీర్ఘవిచారమున మునిఁగినదానివలె నగ[illegible]డెను. కొంతసేపటి కామె కనుఁగవనుండి చిన్న బొమ్మ[illegible]ంసువులు నేల రాలెను. దుఃఖ మాగక యా యంగన [illegible]వులనుండి యశ్రుజలమంత నపరిమితముగ ప్రవింప[illegible]గెను. వేలకొలఁది ప్రేక్షకుల నానందసముద్రమునఁ దేల్చెడి [illegible]డుక లీసుదతి హృదయము నేల దుఃఖతోయముల [illegible]ంచెడినా యని నే నచ్చెరువంది చూచుచుండఁగా, [illegible]ర్భరశోకమున నామె మతి తప్పిపోవుదానివలె [illegible]య్యెను. ఆపద బంధుత్వమును వెదకికొనదు. చివాలున [illegible] నా స్త్రీయొద్దకుఁ బోయి, "శోకింపకమ్మా! ఏమి నీ [illegible]మాచారము?" అని ప్రశ్నించితిని. మొదట నామాటలు [illegible]నకుండెనే యావనిత, ఒకనిముసమునకుఁ గన్నులెత్తి, "మీ దారిని మీరు పొండయ్యా!" అని యలసమున [illegible]మెల్లఁగ ననెను. "చెప్పమ్మా నీసంగతి. నీ వతి విచారమున మునిఁగిపోవుచున్నావు. నిన్నోదార్చువా రెవ్వరును లేకపోవుటచేత నేను వచ్చినాను" అని పలికితిని. నామాటలు దుఃఖోపశమనము చేయుటకు మాఱుగ నా మానిని వంత మఱింత ప్రజ్వలింపఁజేసినను, కొంతసేపటి కామె కొకింత శాంతి సమకూర్చెను. ఇవు డాస్త్రీ దుఃఖమువాని, చీరచెఱఁగుతోఁ గన్నీరు తుడుచుకొని "పూర్వం



డంసి, నా దుఃఖకారణము దేవునికే యెఱుక! నా వెతలెవరు తీర్పఁగలరు!" అని మరల విలపింపఁబోఁగా నే నూఱడించి, తనసంగతి చెప్పుమని వేడితిని. ఆమె యవ్విట్లు చెప్పఁదొడంగెను:—

"దక్షిణాదిని మాయవరముదగ్గఱ మారంబాకము పుట్టినిల్లు. మాతండ్రి కావేరీతీరమున నొక గ్రామమున నుద్యోగమున నుండునపుడు నేను పుట్టినందున, నాకు

'కావేరి' యను పేరు పెట్టిరి. తల్లిదండ్రుల కల్లారు ముద్దుగఁ బెరుఁగుచున్న నాకు మంచి సంబంధము లభించుటచేత చిన్ననాఁడే పెండ్లియయ్యెను. కాని, వివాహమైన కొద్దికాలములోనే నా దురదృష్టవశమున భర్త చనిపోయెను. నాకు సంభవించిన విపత్తునకు బెంగపెట్టుకొని మాతల్లి యంత మృతినొందెను. నన్నును మా తమ్ములను ఒంటరిగఁ దాను పెంచఁజాలక, పెండ్లుగడచినను మా తండ్రి రెండవమారు పాలఘాటు పిల్ల నొకతెను పెండ్లియాడెను. పాలఘాటు పడుచులు పరమధూర్తలు. కాఁపురమునకు వచ్చినప్పటినుండియు మా సవతితల్లికి నామీఁద సవతితల్లి ప్రేమయే! నా తమ్ములన్నను మొదటిరోజులలో నా పుణ్యవతి కల్పియుండెనను, ఉపశమించి కొట్టు నామెనే 'అమ్మా! అమ్మా!' యని పిలచి వారంటిపెట్టుకొనియుండుటచేత కాఁబోలు, ఆపిల్లలయందే ప్రేమ పాకెను! నాయం దాయిల్లాలికి నఖాలేశమును లేదు. నా కామెయందు నట్లె యుండెను. తల్లి మృతినొందిన కారణమున వచ్చిన మాఱుఁదల్లి మాతల్లి మృతికిఁ గారణమని నేఁ దలపోసి, ఆమెయం దపరిమిత ద్వేషబుద్ధిఁబూని యుంటిని. వయస్సుతోపాటు మా యిరువుర యన్యోన్యవైరముఁ బెరిఁగెను. ప్రొద్దున నే వితంతువును జూచుట యశుభమని నన్నామె యేవగించుచుండును; సవతితల్లి మా కాగర్భశత్రువని నేను బరిగణించుచుందును. మా జగడములు పాపము మా నాయన మనశ్శాంతిని తొలఁగించెను. ఇరువురలో నెవరిని నిందించుటకును నోరు రాక, మాతండ్రి లోలోననే కుములుచుండెను. నేను బుద్ధిపాటవము గాంచినపిదప, ఈ గృహచ్ఛిద్రములకు నేనె నిమిత్తమని గ్రహించి, వైరబుద్ధి మరల్చుకొనవలెనని యెన్నో ప్రయత్నములు చేసితిని. కాని, మా సవతి యమ్మ ముఖారవింద మెంత చిత్రమైనదో కాని, ఆమె కనులఁబడఁగనే, నన్ను వెఱ్ఱికోప మావహించుచుండును! నన్నుఁ జూచిన నామెకు నదేవిధముగ నాగ్రహము పొంగుచుండును. ఇంక నాయింట మా యిద్దఱకుఁ బొత్తుగలియదని రూఢిపఱచికొని, ఆమె యచట నుండవలసినదే కావున, నేనే గృహము విడిచిపోవుట యుక్తమని యోజనచేసితిని. కాని, నే నెచటికిఁబోవుదును? మగఁడు లేని యాఁడుబడుచు కెంత దురవస్థలు! ఇట్టి గతులలో నా కేది దిక్కు?

"నాతోఁ గయ్యము సలుపుచుండినపుడు, ఒక్కొ తఱి మా సవతియమ్మ నన్నుఁ జూచి, 'పుట్టుకుంకవై చముపలె మము వేధింపక, ఏ వీరేశలింగము పాయ తో మాఱుమనువు చేసికొని పోయిన మనుచుండరా' యని నన్ను దెప్పుచుండును. ఈ మాటలనుబట్టి, తెలు దేశమున వీరేశలింగముపంతులు విధవావివాహములు పించుచుండుట నాకుఁ దెలియవచ్చెను. అదృష్టవశ నాకు మంచి తరుణము ప్రాప్తించినచో నా కష్టము గట్టెక్కునని నేఁదలపోసి, ఒకనాఁడు మాతండ్రి 'కమా పోయినపుడు, రాత్రివేళ నిలు వెడలితిని. అ పెట్టిన కొద్దినగలును నామూటలో వేసికొని, బయలుదేఱితిని.

"నాకు, 'వీరేశలింగము', 'గోదావరి', య రెండుమాటలు తప్ప, ఉత్తరాది సంస్కర్తను యెపు డేమియుఁ దెలియదు. ఆప్రాంతములందలి భా కూడ నాకు రాదు. ఎటులో రాజమండ్రి పురము వీరేశలింగముగారి తోటలో పాదమిడితిని. ఆ మ నీయుని పాదముల కెరఁగి, నన్నొక యింటిదా జేయుమని వేడితిని. ఆయన జాలి గుండెగలవాఁ కాని, బొత్తిగ తమిళ మెఱుఁగడు. కావేరమ్మయని నా పేరె యాయనకుఁ నోటఁదిరుగదు! కొంచెము చది కొనినచో మంచి సంబంధము దిక్కునని యాయన చెప్ప చేత, నా శక్తికొలఁదిని విద్యనేర్చితిని, కాని గుండ్ర వంటి తెలుఁగు లిపిపట్టుపడునప్పటికే నాకు తలప్రా తోఁకకు వచ్చెను. ఇంక పిడుగురాళ్ల వంటి పదములు యా యన్యభాష నే నెట్లు నేర్వఁగలను? ఆఱునెలలైన నా చదువున మార్పేమియుఁ గలుగ లేదు!

"ఒక నాఁటిమధ్యాహ్నము పంతులు నన్నుఁ బి నంపి, 'కావేరీ! నీకిఁక విద్య రాదు. చదువురానిదా దక్కని సంబంధ మెట్లు సమకూరును? వీరో యొక దాని నీవు సరి పెట్టుకొనవలెను. - ఇదిగో యీయనను జూ తివా?' యని నలువది వత్సరముల ప్రాయము గల దా

...ఁ జూచెను. ఆతని కేయుద్యోగము లేకున్నను, ...భూపతి గలదట. మశూచికపు మచ్చలు మెండుగను



...ముకొని యుండెను. మెల్లకన్నుకూడను! కొంచె...లో విందుకొని మతిచెప్పెదనని యప్పటికిఁ దప్పించు...నిపోయి, ఆసాయంకాలమె పంతులను సందర్శించితిని. ...దలై ప్రవహించు కన్నీటి ధారలచే నేనాపూజ్యుని ...దపద్మములు కడిగితిని. నాకీసంబంధము పనికి...దనియు, వేఱొకసంబంధము కుదుర్చుఁడనియు దైన్య...తో వేడితిని. దిక్కులేని నన్ను తనసొంతకూఁతునిగఁ ...చుకొమ్మంటిని. ఇంక కొంత గడువిచ్చినచో, ...క్కనగఁ జదివి తనను మెప్పించెదనని పలికితిని. పంతు...లు జాలికలిగి, 'సరేకావేరీ! చదువుచుండుము. నీ పెండ్లి ...టమాట యుంచు చూతములే!' అని నన్నుఁబంపివేసెను.

"నేను ప్రేళ్లుఅరిగిపోవునట్లు దిద్ది, కనులుబొత్తలు ...నట్లు చదివినను, నావిద్యలో మార్పేమియుఁ గానఁ ...దైతిని! ఒకనాఁడు పంతులు నాకుఁ గబురుపంపి, ...కావేరమ్మా! మంచి సంబంధమువచ్చినది. నీ అదృష్ట...మువ, వరుఁడు విద్యాధికుఁడు, ఉద్యోగస్థుఁడును. ...సుమండు, వర్ణభేదములు పాటింపని వివాహ...ములు జరుగుచుండునుకదా! చదువనిది పేరొందిన వెలను ...లము. నీకీసంబంధము సమ్మతమని తలంతును!' అని చెప్పెను. వెంటనే నేను పంతులతో, 'బాబయ్యగారూ! చదువు రాదని నన్ను కులము తక్కువవానికి కట్టఁబోకండి! శ్రమపడి నేనింతమాత్రము వచ్చినది శూద్రుని పెండ్లాడుటకుఁ గాదు సుమండీ! ఏమున్నను, లేకున్నను, బ్రాహ్మణునికే నన్నీయండి!' అని చెప్పివేసితిని. పంతులు ముంగోపి. ఈమాటల కాయన రౌద్రాకారుఁ డయ్యెను. 'కావేరీ! వచ్చి సంవత్సరమైనను, నీకు చదువేమి యంటలేదు—ట్టి సంబంధమును నీకు నచ్చుటయు లేదు! ఎంత కాలము నిన్నీశిక్షణాలయము భరించుననుకొన్నావు?' అనుపంతుల విసుగును దెప్పుమాటలకు నాకన్నుల నీరు గిఱ్ఱునఁ దిరిగెను. ఐనా, పంతులుకు, నాశక్తిని మెగాని మనస్సు మెత్తనిది. నాకన్నీరు కనుఁగొందుఁ జాలక, 'కావేరీ! నీకువచ్చిన ప్రమాదమేమియు లేదులే. నీయిష్టమువచ్చినవానికే నిన్నిచ్చెదనులే!' అని యూరడించి నన్నోదార్చి పంపివైచెను. ఇంకొకసారివచ్చిన సంబంధము నొప్పక యుండరాదని నేను మనస్సున నిశ్చయించుకొంటిని.

"పిమ్మట నొకనెలకు మఱియొక సంబంధము వచ్చెను—ఇప్పటి వరుఁడు బ్రాహ్మణుఁడు. వెనుకటి వానికంటె కులరూపములు గలవాఁడు. విద్య యంతగ లేకుండిన స్వల్పయుద్యోగము లోనున్నను, త్వరలో పైకి రాఁగలవాఁడు. నేను 'సరే' యంటిని.

౪

"ఆనందసనమున సంతోషజరిగిన మా వివాహమునకు పెద్దలనేకులు వచ్చియుండిరి. పెండ్లియైన కొంతకాలము వఱకును మేమాపట్టణమున నొకచిన్నయింటఁ గాపురముంటిమి. నాపతికి సంబళము తక్కువయైనను, గొప్పవారి ప్రాపుగల మమ్ము పురములోని పెద్దలు సన్మానించుచు వచ్చిరి. నలుగురిలో తలయెత్తి తిరిగెడి భాగ్యమిన్నాళ్లకు నాకు పట్టినదిగదా యని యానందభరితనైతిని.

"కాని, మందభాగ్యుల కిచ్చటను, కావేరి వెల్లువలె స్వల్పకాలములోనె సౌఖ్యసౌభాగ్యములు సమసిపోవుచుండును! నా పెనిమిటి తాఁచుగ దినకెతిగతులు తలపోసి దైన్యమందుచుండును. జీతము జీవనమునకు

...మహాపట్టణమున ప్రవేశము చేసెట్లు చేసికొనఁ ...ను? మొదల్యారు నిజముగ పరోపకారబుద్ధిగల ...డైనచో, స్వల్పకాలమైన నాకుఁ దనయింటనే పను ...యము చేయఁడా? ఎప్పటికప్పుడు నాజమాఖర్చులు ...వ్రాయుచుండుటను బట్టియే, సొమ్మువిషయమై యాతనిది ...ట్టిపట్టని నేగ్రహించితిని. ఒకవేళ నన్నే గోతిలోనైనఁ ...ద్రోసి, తానందుమూలమున లాభమునొందఁ గోరుచు ...న్నాఁడా? ఏమనుకొనుటకును, ఏమి చేయుటకును, ...నాకుఁ దోఁచకుండెను. ప్రాయమువచ్చిననాకీతఁడే ...ద్రోహము చేయ సాహసించునా? ఎపుడు వీనిదురుద్దేశము ...సూచితమగునో, ఆక్షణమందే వీనిని విడనాడవచ్చును ...గదాయని తలంచి, ప్రమత్తనై నేను పట్టణమందుంటిని.

౬

పట్టణము చేరిన యొక నెల 'ఆకును', నాకొక ...యింట చిన్నగదియొకటి మొదలియారు కుదిర్చి పెట్టెను. ...నెలకుఁ గావలసినసొమ్ము కూడ తానే పెట్టుబడి పె ...ట్టెను. రెయిలుకర్చులకును, మొదటినెల వ్యయముల ...కును, నూఱు రూపాయలాతఁడు లెక్కచెప్పెను. ఈసొ ...మ్మునకు నాచే నొకపత్రము వ్రాయించుకొనెను. ఈవిధ ...ముగా మూఁడునాలుగు నెలలు గడచెను. నామీఁద ...మున్నూఱు రూపాయలిపుడు బాకీ తేల్చి, సొమ్మిమ్మని ...యాతఁడు నన్నొత్తుడుచేసెను. నేనెట్లు వాని యప్పు ...తీర్పఁగలను? నాకైదైన వృత్తిచూపించి, తనబాకీ రాఁబ ...ట్టుకొమ్మన్ని నేనఁగా, ఏదో, దీర్ఘాలోచనలో మునిఁగిన ...వానివలె మొదల్యారు మౌనముతోఁ గొన్నిదినములు గడ ...పెను. నేనెన్నిసారులు కోరినను నాకుఁ దనవారిని ...చూపింపకుండుటయేకాక, ఎక్కువ వడ్డికట్టి నాబాకీ పెంచు ...చుండుటచేతఁ జూచి, యాతనితీరు బాగుగలేదని నే ...ల్లితిని. ఐన నేనీతని వలనుండి తప్పించుకొనుట యెట్లు? ...నాచిన్నచిన్న నగలిదివఱకే యమ్మివైచితిని. తలిదండ్రు ...లకే నాబాధ్యత లేనపుడు, లోకములో నెవ్వరీసమయ ...మున నాకుఁదోడుపడి, నాయప్పు లచ్చుకొందురు?

“ఎట్టకేలకు, మొదలియారి యోజనలు విశద ...మయ్యెను. తన యప్పుచెల్లింపుమని యాతఁడు మరల నన్ను నిర్బంధించెను. నా వృత్తిమాట జ్ఞాపకము చేయఁగా, 'మీరే యాలోచించుకొనండి!' యని యాతఁడు చెప్పివేసెను. కొన్నిదినములనుండి నన్నుఁజూచుట కతని ప్రేరణముచే నొకరిద్దఱు స్త్రీలు నాకడకువచ్చి, నాతో మాటాడి పోవుచుండిరి. నా వలెనే మొదట దారిద్ర్య



మనుభవించి పిదప ధనికులాండ్రైన స్త్రీలను చూపెట్టుఁ గుదుమని వారు చెప్పుచువచ్చిరి. ఎట్లని నేఁ బ్రశ్నింపఁగా మనసు కుదిరినపుడు మార్గముల కేమికొదువ యనియును, నీతి దుర్నీతులు వట్టి భ్రమ యనియును, పాపముచేయని మనుజులీప్రపంచమున నుచ్చునకైనఁ గానరారనియును, వారు వేదాంతోపన్యాసములు గావించిరి! వారి మాటల సారమును, మొదలియారి యుద్దేశమును నా కిపుడు విశదమయ్యెను: నాశరీర మమ్ముకొనియే నేను సొమ్ము గడింపవలయునని!

“ఈసంగతి గ్రహించిన కొన్ని దినములవఱకును, నాకు మొదలియారిమీఁదఁ జెప్ప నలవిగాని కోపము జనించెను. నాబస కా[illegible]లలో తఱచు రాకుండుట వలననే, వాని మరియాద నిలచినది! కాని, వట్టి కోపము

వలని ప్రయోజన మేమి? 'అమ్మా! మార్గము చూపుమంటిరి గావ, నాకుఁ దోఁచినపద్ధతి నే సూచించితిని. ఇఁక మీ యిష్టము! ఒకడు రెండురోఁజలలో నాసొమ్మియ్యకున్న, మీమాట దక్కదు!' అని యొకనాఁడు కఠినముగఁ బలికి, యతఁడు వెడలిపోయెను.

"నే నేమిచేయుదును? ఊరక వీనిమీఁదఁ గోపించిన లాభ మేమి? ముందేరీతిని దినములు గడపెద ననుకొన్నను? వెంటనే ఋణవిముక్తను గావలయును గదా! కాని, నేనెట్టి యిడుములు పడవలసివచ్చినను, తుదకు ప్రాణములు కోలుపోనున్నను, ఒరులకు నామాన మర్పింప నొడంబడ లేదు!

౨

"సముద్రతీరమందలి వీధిలోని యొక పాకింటికి మొదలియారు నన్నుఁ గొనిపోయెను. అందొక గది నాకిచ్చి, పశుప్రవృత్తిని పెట్టబోసికొని, తన యప్పు దీర్చివేయుమని నన్ను తొందర పెట్టెను. ఆయింటఁ దక్కిన గదులలో, వీఁడుచేర్చిన నావంటి బానిసలైనతి కొందఱు జీ యధమాధమప్రవృత్తితో జీవములు నిలుపఁ బెట్టుకొనుచున్నారు. అతి నీచమును, దుఃఖభాజనమును నగు బ్రదుకనిన నెంతయో రోఁత కలిగెను. వీరు బ్రదుకుచున్నారు! ఇట్టి కష్టజీవితముకంటె మృత్యువె మేలని యెంచుచున్నారు. కాని, యెన్నిరోగములతోఁ గృశించుచున్నను, ఎట్టి బాములకు లోనగుచున్నను, మాయాదైవము వారికి మృత్యువును బ్రసాదింపక, వారిపట్ల క్రౌర్యమును బూనియున్నాఁడు!

"ప్రాణము పోవుటకైన నేను సమ్మతింతును కాని, యిట్టి నీచవృత్తికి నే నొడంబడనని మొదలియారుతోనే జెప్పివేసితిని. నేను చిన్నవాఁటనుండియు, అప్పములు మొదలగు నల్పాహారములు చేయుటయం దారితేరితిని. నే జేసిన దోసె లతి రుచ్యములని కొందరు పదితోల్లియు వినుచుండును. ఇవుకు తినుబండములు చేసి యమ్మి, దానివలన వచ్చిన లాభముతోఁ దన ఋణమిచ్చి వేయుదునని నేను మొదలియారుతో విన్నవించితిని. ఈ పద్ధతి వానికి మొదట బొత్తిగ నిష్టము గాకున్నను, నేను పట్టినపట్టు విడువకుండుటవలన, చేయునదేమియు లేక వాఁడు సమ్మతించెను. ఈ రెండు మూఁడు సంవ రములనుండియు నేనచటనే కాపురముండి, చిఱుతిం వస్తువులు చేసి యమ్ముచుఁ గాలక్షేపము చేయుచున్నా చెడిపలుండెడి యాచోటునఁ గాక వేఱొక ప్రదేశమ నేను నివసించి, నాపనులు చక్కఁబెట్టుకొనుచు, బాకి యిచ్చివేయుదునని నే నెంతచెప్పినను, మొదలా సమ్మతింప లేదు. అందులకై నన్ని విడిచిన యాతఁడు చెప్పివేసెను! ఆతని నిర్బంధములకు నేనెట్టు యోర్చుకొని, యచటనే పనులు చేసికొని జీవించుచున్నాను.

"కాని, గాజుల బేరము భోజనమునకుఁ జాల నాకు వచ్చిన కొంచెము సొమ్మును ఎప్పటికప్పుడే వాని చేతులలోఁ బోయవలయును! మిగిలిన బాకీ తీ వేయుమని యతఁడు నిరతము నన్ను బాధించుచుండు మాకందఱికిని దా నేర్పఱచిన చెఱసాలవంటి యీయి మే మెన్నఁడును దాటిపోకుండ నిండు నౌకరులను గా పెట్టినాఁడు. అనుదినమును దా నక్కడకు వచ్చి జాడలు కనిపెట్టుచుండును. ఎక్కడకుఁ బోవుటకు ఏమిచేయుటకును, మాకు స్వతంత్రము లేదు! ప్రాణ యను బంధములైచి, బానిసలవలె మము బాములఁ బె చున్నాఁడు! అట్టి తక్కిన స్త్రీలకంటె మంచి మన్నానని నాకేమియు సంతోషము లేదు. మొదలియా లాభమునకై తమదేహము లమ్ముకొని గాసినోందెకి యాఁడుకూఁతుండ్ర కష్టములు గనిపెట్టుచు, నాకన్ను కాయలుకాచినవి, మనసు మొద్దువాఱినది! దిక్కు దానను; పరుల దుఃఖప్ర నెటుఁ బాపఁగలను! మన లోని దుఃఖము మఱచిపోవుటకై పార్కు నేడుకలు చూ నీయుమని నేను ప్రతిదినము వేఁడింపఁగా, ఈనాఁ మొదలియారు నన్నిలు కదలనిచ్చినాఁడు! నన్నచటి గొనివచ్చి, ఏపనియో చక్కఁబెట్టుకొనుట కచటి పోయి, తాను వచ్చువఱకును ఇచటనే యుండుమని రాజ్ఞ నిచ్చి నన్నుఁ గనిపెట్టుటకే, అల్లదిగో, క బడెడి యాదండను బెట్టినాఁడు! నాయనా! ఈదురా నిచేతఁ జిక్కుకొన్నాను! నాకేమి దిక్కు!" అనియా గోలుగోలున నేడ్చి, మరల నాపాదముల కెరఁగెను.

రూపాయలు బాకిపడినది. ఆమె నా చెల్లెలనియును, దానిఋణము నే మెల్లగఁ దీర్చుకొందుననియును, నేను వానితోఁ జెప్పితిని. లోపలికేగు తమువఁగా, సీమకమలముల కొనిపెట్టుమని భాగ్య నాకిచ్చిన మూఁడురూపాయల నోటు అందుఁ గానవచ్చెను. అదితీసివానిచేతికంచి ఇది దానియప్పు మొదటివాయిదా చెల్లుసొమ్మనియును, క్వారితము నే తక్కినసొబ్బు పంపుచుందుననియును జెప్పి, ముద్రితమైన నాచిరునామా వానికిచ్చితిని. అరిఁగిపవి మాచుకొని సంతోషముతో నాపరణు నంగీకరించుటకు మాఱుగ, తనయప్పు తీరుటకు కేఁకభియము లేదని గ్రహించి మఱింత బిగిసి, మొగ ఎఱ్ఱ జేసింప్, తనసొమ్మంతియు జెంటనే చెల్లింపనఁగాని యూరకుంతిని వినుపననీ, చీర చెంగుతో నా చేడియను తనవైపు పుఁజులాగెను. "అయ్యో! అన్నా!" అని యాకోమలి కోకకొంగు తప్పించుకొని, నాదెస కడుగిడెను—"పన్నిట్లువిడిచి పోదునోచూతును!" అని యాక్రూరుఁ డంత భయకంపితయైన యాస్త్రీకరము నొడిసిపట్టెను. కోపోద్రేకమందిన నాచేతి బెత్తమంత



వాని వెన్నుమీఁదికి దుమికి, ఎదుటిప్రక్కగోడ మీఁద ప్రతిధ్వని గావించెను! ఒక నిముషములో మాయిద్దఱిచేతులు కలసెను. చుట్టును మూఁగిన గుంపును వెడలఁగొట్టి, రక్షకభటుఁ డొకఁడు మమ్మిరువుర నంత విడఁదీసెను—ఆదుష్టుఁడు నాసోదరిని కులటాలయమ బలాత్కారముగఁ గొనిపోవుచున్నాఁడని నామీఁద భార్యను తనయింటికిఁ దీసికొనిపోవుచున్నానని నే యూరి జవాబు. బ్రాహ్మణాంగనయగు తా నాక్షూ పతి నెట్లు సహించెనని యూచారయుద్దపవాలు! జే నుండి చివాలున నేనంత తెల్లకాకితము తీసి, ప దాని రెండింటిక్రిందఁ జింపి, పడుపున్న తిలోనికి దౌర్జన్యమునఁ గొని పోవు సినుండగనుండి తప్పించి సోదరుని కళేము చేయుమని రక్షకాలయాధిపతికి సముద్రాసి, కావేరిచే నందు చేవ్రాలు చేయించి న ముగ్గురి సమీపపు రక్షకభటాలయమునకుఁ గొనిపో యా పోలీసువానిని గోరితిని.

## ౧౦

ఆకేఁడదినముకే యింటికి దాగి తీయుచుం మేమును వానితో నడచిపోతిమి. జెంటనేయుద్యోగ కీయుమని యగ్జి ని రక్షకభటునిచేత నంపితిమి ఆదినము పెద్దయుద్యోగి యింటికి తనిఖీకివచ్చియుం చేత, మాసంగతి యొప్పటికిని విచారణమునకు రా లేద రక్షకభటులు మమ్మందఱినిగాచుచుండిరి. ఈమధ్య బలుసారులు, మొదలియారు భటులతో గుసగు సల్పుచూ, తనపంతము నెగ్గునను ధైర్యమున మాపై మీసము దువ్వుచుండెను. మేమందఱమును విద్యు వెలుఁగున గూర్చుండి, ఎన్నటికి దొరగారి తనిఖీ ప్తమై, మా తనిఖీ యారంభమగునా యని నిరీక్షించు టిమి.

ఎట్టకేలకు, పెద్దదొర పరీక్ష ముగింపు ప మయ్యెను. భటులలో కదలిక గలిగెను. కాలవ మేమియుఁ గాకుండ, చిన్న యుద్యోగితో నేను గింపవలెనని ముందు నిలువఁబడితిని. వెడలిపోవు దొరగారిచూపు, విద్యుద్దీపమున వెలుఁగు నాము మీఁద నంత ప్రసరించెను. ఆయన నెపుడో నే నట్లు కానవచ్చెను—కాని, మాపని యాయనతోఁ చిన్నయుద్యోగితో నగుటచేత నే నూరకుంటిని. ముందుకు నాలుగడుగులువేసిన పెద్దయధికారి వె

, నా ముఖమును శోధించి, నా జేబ్బమీఁద జేయి “నీవుటో యిపరబ్రహ్మముపంతులూ!” అని హెచ్చ ను. “పరాంకుశముపిళ్లా!” యని నేనొక గంతువేసి కరస్పర్శనముఁ జేసితిని. చిన్నవాఁడు కళాశాలలో పాధ్యాయుఁడైన పరాంకుశ మిప్పుడు బుగ్గమీఁస పెంచి, పావురుఁ బిల్లివలెఁ గావవచ్చెను! ఎవరి ష్టము వారిది! అతఁడిపుడు రక్షకశాఖలో నొక యుద్యోగి. నా సమాచారము స్నేహితునికి హముగఁ దెలిపి వానికి వీడ్కోలొసరించితిని. ఎపు ను వెడలిపోవుదా, స్థానికోద్యోగి మాసంగతి యెప్పు మర్శించునా యని మే మువ్విళ్లూరుచుంటిమి. మయేనా నీచెల్లెలు పంతులూ!” అని యాతఁడు నిని సమీపించి, “అమ్మా! పసిపిల్లవగు నీకే నా యింత ంచినది!” యని పలికి, “మొదల్యారీ! నీవేనా ఇంత సితివి?” అని వానిని సంబోధించెను. “అది కాదండి!” చిఱునవ్వుతో మొదలియారు దొరగారి సందేహ కొని, యాయనతో సంభాషింప నభిలషించెను.

, మెఱుపులతోఁగూడిన వర్షాకాలపు మేఘము శమును గమ్మి గర్జించుటీతని, కోపాద్దీపితము నా త్రి ముఖము మండెలుపడ, “రండెలరా యిఁడా! మాటలు చెప్పెదను నీకు బుద్ధిరాకున్నదే!” అని తఁ గిలిగి, చేతినున్న వెంకిపొన్న శస్త్రముతో లియారు చేతిమణికట్టు ఖంగున గ్రొంగునట్లు వేసి “బ్రహ్మమును రాత్రి లాఁకుపులోనుంచి, తెల్లవార స్టేషనుమొద్ద కేసు పెట్టు!” అని తన తాబేదారున రునొసంగి, నావైపునకుఁ దిరిగి, “పరబ్రహ్మము లూ! నీవు నీ చెల్లెలికి నేటిరాత్రి మాయిల్లు విడిది. మన కేసులో సాక్ష్యముకాఁగానే, నీవు వెళ్లిపో ను. పల్లెప యుద్యోగివగు నీ సాక్ష్యము వెంటనే బ్బాంకుకు లే!” అని కొరచెప్పి, మమ్ముంగును తన బారుగోఁ గొనిపోవ సమకట్టెను. కాని, కొన్ని రు ను లంచపుటచేర, నే నానాఁడే రెయిలులో లెవని చెప్పి, మెత్తగాశించి వానిచే నాకి సెలవుఁ గను చేయుము. మొదలియారుతోఁ గొన్ని మాటలాడ వేడితిని. ఆ దుష్టునితో నింక ప్రసంగము చేయ వలదని నామిత్రుఁడు వారించుచున్నను, నేను మొదలియారిని సమీపించితిని. ఇపు డాతఁడు గుఱ్ఱము దిగియున్నాఁడు! తనకును కావేరికిని సంబంధించిన కాకితములన్నియు వాఁడు నాముందు బైచి, “ఇవి యన్నియు చెల్లువేసి యిచ్చెదను, మీ రిదివఱ కిచ్చెదమనిన మాటు



రూపాయిలు నా కిప్పించండి. ఇకముందు కావేరికి నాకు పెట్టి తగాదాలు వుండవు!” అని మొదలియారు చెప్పివేసెను ఆ దుర్మార్గునితో రాజీ వలదనియు, అట్టి వారలను క్రమముగ శిక్షింపించుటయే తోడి ప్రభుత్వోద్యోగివగు నాకుఁ గర్తవ్యమనియు, పరాంకుశముపిళ్ల హెచ్చరించుచున్నను, నా మోహాయముకే నా మనసు మరలి, మొదలియారితోడి సంధి కొడంబడితిని. ముందు బుద్ధిగలిగి మసలెదనని వాగ్దానముచేసిన మొదలియారంతి నాసమ్మతిని విడుదలయయ్యెను. అన్నచెల్లెల మిరువురమును పిళ్లగారికి కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించి, అప్పుడే వెడల నున్న యుత్తరాదిరెయిలుబండిలోఁ గూర్చుంటిమి.

## ౧౧

రెయిలందుటకును, రైటల్లమీఁద పడకకు తావు దొరకుటకును నేను సంతోషించి, నాఁటిసంగతులు విమర్శనముచేసికొనుచుంటిని. కావేరియు కొందఱు స్త్రీలును

పైఁడిలే డెందైనఁ గలదా?-పాప మట్టులు పండె నవ్వఁడు
తన్ను నంపితిఁ దగనిమా టని-తమ్ము నంపితి నాఁటిమాటలు
మఱచిపొమ్మని చెప్పుమా,
రఘునాయకునితో - తరలి రమ్మని చెప్పుమా!

భీతి విరహము నింద దుస్థితి-పీల్చి పీలిచి పిప్పిచేయఁగ
శోక మొక్కటె తోడు గాఁగ న-శోకవృతముక్రింద నుంటిని
వేగపడు మని చెప్పుమా,
కరుణాకరునితో - సాగి రమ్మని చెప్పుమా!

తిండికిని నిద్రకును దూరయి-దిక్కుమాలిన యీఘటంబునఁ
గదలఁ జూచిన ప్రాణముల నుం-గరము గని నిలఁబెట్టు నాదెస
తప్పు లేదని చెప్పుమా,
నా ప్రాణవిభుతో - తత్త్వ మంతయుఁ జెప్పుమా!

శివునివి ల్లవలీలగాఁగొని-చిటికలోపల విఱిచివేసిన
వీరు నాజీవప్రాణమై యడ-విం జరించిన వీరమానిని
శోకమూర్తిని చూడుమా,
ఆశౌర్యనిధితో - చూచినట్టులు చెప్పుమా!

లేడి కావలె నన్నయంతనె-లేచి వెడలెను ప్రాణనాయకు
నాఁటి నవ్వుమొగంబు మనమున-నాటియున్నది జీవితాశకు
మూలమైయని చెప్పుమా,
ఆ ప్రేమనిధితో - ముందరే యిది చెప్పుమా!

కొంగు మెడ కురిపోసుకొని యొక-గుక్కఁడైతే విడుతు నైనను
ప్రాణహానికి సాహసింపక-బ్రతికితిని పదినెల్లు నినుఁ గను
నాసతోనని చెప్పుమా,
దుఃఖానలంబున - కాఁగలేనని చెప్పుమా!

---




౧

ఆ నాడు నేనాఫీసుకు వెళ్లలేదు. తల దిమ్ముగా నుండుటచే కచేరీ పనిమాని యింటనే కూర్చుండి 'శశిరేఖ'ను జదువుచుంటిని. శశిరేఖ విచిత్రాభిప్రాయములకు నిలయమగు గ్రంథమనియు, నొకసారి దానిని చదివి యుద్దేశమును దెలుపుమనియు నాకొక స్నేహితు డిచ్చెను. నవీనగ్రంథములయందు నాకు గల యభిరుచి చేతను స్నేహితుని మాటయందు గల గౌరవము చేతను నే నా పుస్తకమును దీక్షతో జదువు చుంటిని. సాయంకాల మూరు గంట లైనది. భానుమూర్తి మేఘాచ్ఛాదితు డగుటచే దినకాంతి యప్పటికపుడే చాలవరకు తరిగియున్నను నా కా సంగతియే గోచరించలేదు. నా సంగతి గ్రహించినరసమ్మ హ్యాక్రీకేనులాంతరు వెలిగించి తెచ్చి బల్లపై పెట్టి 'బాబూ మందుకు వేళయింది. పుచ్చుకో; ఇల్లా చదివితే తల దిమ్ము మరింత హెచ్చవుతుంది.' అనుచు లోనికిపోయి అవున్సుగ్లాసును, మందుసీసాయును గొనివచ్చి నాముందిడెను. ఆమాటలు వినిపించినంతనే నేను మరల మామూలు ప్రపంచములోనికి వచ్చితిని. శశిరేఖను సుందరరావున కొక్కడికే వదలుట మంచిదని యెంచి పుస్తకమును బల్లపైపెట్టి మందు పుచ్చుకొని సిగరెట్టు వెలిగించి యీజీచెయిరులో కూర్చుంటిని. నామన మనేక విధముల పోవుచుండెను. క్లబ్బునకు పోవలె ననుకొంటిని. కాని తుంపరలు పడుచు, గాలిబలిష్ఠముగ వీచుచుండుటచే నచ్చటనే కూర్చుంటిని.

'బాబూ! యీపూట అన్నంలోకి ఏం చేయమంటావు? ఇంట్లో దొండకాయలున్నాయి. అరిటికాయలు పొద్దున్నయింది. చారు పెడతాను. మధ్యాహ్నంచేసిన పెరుగుపచ్చడి వుంది.' అని చెప్పుచు నరసమ్మ మరలివచ్చెను.

'నీయిష్టం వచ్చింది చెయ్యమని చెప్పానుగదా? ఎందుకు ఘడీఘడీకీ అడగడం? నువ్వు ఏంచేసినా అమృతం లాగ వుంటుంది.

...చేత నీకెవ్వండూ ఏమీ చెప్పడం మానాను. ...చేసినా సరే......అయితే నేనడిగింది చెప్ప...? ” అని నేనంటిని.



“చాలూ! యీపూట అన్నంలోకి ఏం చేయమంటావు?”

‘నాయనా ఆమాట యెత్తొద్దు. నేనెవరి నైతే నీకేం? ఈసంసార సముద్రంలో యాత్ర చేస్తూన్న మనం యీవొడ్డుకుకొట్టుకొచ్చాం. నేను నీసహాయం కోరాను. నీవిచ్చావు. నీ సహాయం నిలబెట్టుకొని అందుకు తగినట్టుగా వుండడానికి ప్రయత్నిస్తున్నాను. భగవంతుడు నాకావిషయంలో సహాయం చేస్తే చాలును’ అని నరసమ్మ వెడలిపోయెను.

‘జీతము లేకుండా, పూర్వ పరిచయమైనా లేకుండా ఎందుకు మరిమాయింట్లో చాకిరీ చేయడం?’ అని నేనంటిని.

‘నేను డబ్బుకోరి మీయింటికి రాలేదు.’

‘మరి?’

‘నీ మంచితనం చూసి మీయింటికి వచ్చాను. నీవు సద్ధర్ముడవని నేనెరుగుదును. నిన్ను, నమ్ముకుంటే నన్నింత మన్న చేస్తావని నానమ్మకము.’

‘నేను శాశ్వతమా? దీపముండగా యిల్లు చక్కబెట్టుకోవాలి. రెండు రెక్కలూ చల్లగా వున్నప్పుడే పదిరాళ్లు పోగు చేసుకో. ముసలిదానవై కాళ్లుచేతులూ వుడిగిన కాలంలో నిన్నెవ్వరూ ఆదరించరు.’

‘పిచ్చివాడా! ఈ ఆలోచన లేమిటి? నీ జాగ్రత్తగాని, నీగడుసు దనంగాని చివరకు పనికిరావు. అంతా భగవదిచ్ఛ. ఈ అనవసరప్రసంగాలతో ఆలోచనలెందుకు? పొద్దుగూకింది. పెందలాడే మడిగట్టుకుని వంటచేస్తాను. ఎక్కడికైనావెళ్లి టీ తాగి రాకు’ అని లోనికి పోయెను.

౨

నరసమ్మ విషయము నాకు మిక్కిలి ఆశ్చర్యకరముగా నుండెను. మనిషి చాలా నల్లగాను, అందవికారముగాను ఉన్నది. అంత కళా విహీనమైన నలుపును నేనెన్నడును జూచి యుండలేదు. ఆమె మొదట మాయింటికి వచ్చినపు డెదుటనుండి యవతలకు బోయి నచాలు నసిపించెను. కాని కష్టములును, తీరని దుఃఖములును ఆమె ముఖముపై యెన్నటికిని చెరిగిపోని చిహ్నములను గల్పించి యొక్కసారి చూచి నంతనే చూపరుల రాతి

గుండెలను సైతము గరగింప జాలియుండెను. అందుచేతనే అపరిచితురాలగు నామె వచ్చి మీ యింట నూడిగము చేయుచుండుననమారు మాటాడలేక సరే యని యూరకుంటిని.

నరసమ్మవచ్చిన కొలది దినములకే నాకు జీతము వృద్ధియయ్యెను. పిల్లలకై తపించుచున్న నాభార్య గర్భవతియయ్యెను. ఒకరోజు గడచిన కొలదిని నరసమ్మ సుగుణము లొకటొకటిగ బయల్పడ జొచ్చెను. ఆమె రాకను మొగట నిరసించిన నాభార్య కూడ ఆమె యందు మిక్కిలి యభిమానురాలయి ప్రతిపని యందు నామె సలహాను గైకొనుచుండెను. వచ్చిన రెండుమూడు మాసములకే నరసమ్మ మాయింటిలో సర్వాధికారమును వహించెను. గృహనిర్వహణభార మంతయును ఆమె పై బడెను. భారము హెచ్చిన కొలదిని ఆమె మిక్కిలి వినయవిధేయతలతో మెలగుచు, చూచువారందరును 'ఇతనెంత అదృష్టవంతుడమ్మా! ఎంతడబ్బిచ్చినా దొరకని మనిషి. అయాచితంగా వచ్చింది' అని యనునట్లు మెలగుచుండెను. ఆమె యెంత చనవుగానున్నను, మేమెంత బ్రతిమాలినను తనయుదంతమును మాత్రము మాకు జెప్పలేదు.

నరసమ్మ లోనికి వెళ్లిన యనంతరము ఆమె యెవరు? ఈఋణసంబంధ మేమి? ఈమె చరిత్ర యింతగూఢముగ నుండుటకు గత మేమి? యను నాలోచనాపరంపరలలో మునిగి ఎంతసేపు కూర్చుంటినో తెలియదు. అపుడొక

సన్యాసివచ్చి 'నాయనా! యీపూటకు భో



నం పెట్టిస్తావా?' అని యడిగెను.

'సరే' యని యతనితో చెప్పి లోని కే

నరసమ్మ కాసంగతి యెరిగించివచ్చి కుర్చీల

కూర్చుంటిని.

ఆ సన్యాసివంక మరి నేను జూడలేద

అతడు పదినిముసము లట్లే నిలిచియుండి యె

టనున్న కుర్చీపై కూర్చుండెను. అతని చర

నాకాశ్చర్య మయ్యెను. ఒక సిగరెట్టును వె

గించి అతనివంక చూచుచు గూర్చుండ

'నీ పేరేమి?' అని యతడు నన్నడిగెన

'కామేశ్వరరావు.'

'మీ యింటిపేరు?'

'వేమూరివారు.'

'మీదే వూరు?'

'కృష్ణాజిల్లా భీమవరం.'

'ఇక్కడేమి చేస్తున్నావు?'

ఎక్కవుంటెంటు బ్రాంచీలో నూట యుగ వైరూపాయీ లిస్తున్నారు.'

'మీనాన్నగా రెక్కడున్నారు?'

'మానాన్న మా అమ్మకూడా లేరు'.

మీపినతండ్రు లెవరైనా వున్నారా?'

'ఒకాయన వుండేవారు. ఆయన చెన్న పట్నంలో వకీలుగా వుండి చనిపోయారు.'

'ఆయనపిల్లలు భార్యయో?'

'ఆయన భార్యను వదిలేశాడు. పిల్లలు లేరు. భార్య కొంతకాలం పుట్టింటివద్దే వుం డేది. తరువాత జబ్బుచేసి చచ్చిపోయింది.' అని తలపైకెత్తి చూచితిని. సన్యాసి కేవ లము సన్యాసి కాడు. అతని ముఖమున పాండి త్యగరిమ తాండవమాడుచుండెను.

'మీరు పూర్వాశ్రమమున నెవరు?'

'ఎవరైన నేమి నాయనా? ఒక పాపిని. జ్ఞానార్థినై పూర్వార్జిత పాపక్షాళనమునకై దేశముల దిరుగాడుచుంటిని.'

'ఈ యాత్ర చేయుటవలన మీ యుద్దేశ మేమి?'

'ఈమహావిశ్వమున లీనమైయున్న శక్తి స్వరూపమును గనుగొను నాసతో ఆసేతు హిమాచల పర్యంతమును దిరుగుచున్నాను. మీవంటి సత్పురుషు లాదరించిన భుజింతును. లేదా రోజులవెంట నీళ్లే నిలహారము చేయు చుందును.'

'మీరు సంపన్నులవలె జూపట్టుచున్నా రు. సన్యాసులై తిరుగుటేల?'

"పాపక్షయమున కని చెప్పలేదా?"

నే నతనివంక జూచితిని. కాని ఆచూపు లందుగల గాంభీర్యము, ఓర్పు,దుఃఖము ఒక్క మారుగా నాదృష్టిని మిరుమిట్లు గొల్పెను. వెంటనే అవనతముఖుడనైతిని. 'వంటైనది బాబూ, ఆసన్యాసిని లెమ్మని చెప్పుము అతని నాదరించి నీవు భోజనము చేయుము.'అని నర సమ్మ లోనుంచి యనెను. ఆమె మాట విని సన్యాసి పరధ్యానముగ గూర్చుండెను. అతనికి పూర్వస్మృతి యేదోవచ్చినటుల నాలోచింప దొడంగెను. నేను చెప్పినది యతనికి దెలి యుట లేదు.

## 3

పీటవేసి, చెంబుతో మంచినీళ్లుంచి సన్యా సిని భోజనమునకు గూర్చుండ బెట్టితిని. నర సమ్మ వడ్డించుచుండెను. సన్యాసి మాట్లాడ కుండ భుజించుచుండెను. భోజనసమయమున నతనికి మౌనవ్రతమున్న దేమో యని నే నను కొంటిని. సగము భోజనమైనది. అపుడతడు తలపైకెత్తి నరసమ్మ వంక జూచి

'పులుసు దేమైన నున్నదా?' యని యడిగెను.

'చారున్నది.'

'నీహస్తము అమృతహస్తము. పదార్థములు చాలాబాగున్నవి. ఇతడు నీకేమవును?'

నరసమ్మ మాట్లాడలేదు. అతని ప్రశ్న నాకుగూడ అనవసర మనిపించెను. ఆ మాట విని నరసమ్మ తెల్లబోయి నిలుచుండెను.

'నీవిప్పు డిల్లావున్నావేమి?' అని యతడనెను.

నరసమ్మ మరింత తెల్లబోయెను. కాని ధైర్యము గలదగుటచే

'నే నెప్పుడూ యింతే' అని యన్నది.

'కాదు నాకు కేరళములో అభ్యాసమున్నది. నీపూర్వచరిత్ర చెప్పగలను.'

'తెలిస్తే నన్నన్ని ప్రశ్నలేశారేం?' అని అన్నా నేను.

'నీవు నిజం చెపుతావో చెప్పవో అని చూశాను. అల్లాగే యిక్కడా అడిగాను. నిజం రావడము లేదు.'

ఆ మాటలు నాకాశ్చర్యమును గలిగించెను. నిజముగ నితని కామె సంగతులు తెలియును. చెప్పిన బాగుండు ననుకొంటిని. అది మంచిదియో చెడ్డదియో? చెడ్డదైన తెలిసికొనకుండుట భావ్యముకాదా? యని యనుకొనుసంతలో

'నీవు చాలగుణవంతురాలవు. నీచరిత్ర చెప్పుకొనుటకు నీ వేల సిగ్గు పడవలెను? అని సన్యాసి నరసమ్మతో ననెను. నరసమ్మ నిలు



వున నీరైపోయి గోడకు జేర్లబడి ...
యుండెను. ఆమె ముఖము చూచి న...
నాకు విచారము కలిగెను. ఈ సన్యాసి ...
మనస్సు నొప్పించ వలెనని నాకాగ్రహ...
కూడ వచ్చెను.

'అయ్యా' యీ దీనురాలి జీవితం ...
ఖాంధకారములో పడి స్మృతి పథానికి రా...
డా పోవలసిందే. దానిని మళ్లీ మళ్లీ తవ్వి ...
స్రవంతిని ప్రవహింపజేయడ మేల? నీ...
తైనా పుణ్యముంటుంది. దానిని తవ్వ...
అదంతా నేను మరచి పోయాను.'

'నువ్వు మరవ్వచ్చును. ప్రపంచము ...
వకూడదు. మరచిందా వాళ్ల మార్గ...
నశిస్తుంది.' అని ఆయనఅనుటతోడనే నరస...
చరిత్ర వినవలెనని నాకు కుతూహలము ...

ను.అతను చెప్పదలచినది మంచిదే యని
ు నిశ్చయమగుటచే అతనిని బలవంతము
తిని. నరసమ్మకు మాత్రము సుతరామూ
ష్టములేదు. నేను బలవంతము చేయగా
రుగా సన్యాసి యిట్లనెను.

'నాయనా! యీవిడ నరసమ్మగారు. ఒక
న్నుల యింటి ఆడపడుచు. చిన్నప్పటి
డీ మహైశ్వర్యంలో పెరిగింది. తల్లిదండ్రు
కొక్కర్తే కుమార్తె అవడంచేత తిరిగి తిరిగి
స్యో చదువుకుంటున్న ఒకకుర్రవాడి కిచ్చి
ళ్లి చేశారు. కట్నాలు, కానుకలు పుష్క
గా దోచిపెట్టారు. మనుష్యులు చేయవల
దంతా చేశారు. కాని తానొకటి తలిస్తే
వం వొకటి తలుస్తాడు. అతడు ప్లీడరీ చదివి
న్న పట్నంలో బల్లకట్టాడు. అక్కడ చెడు
వాసాలు, తాగుడు, ముండలు లావుగా
బ్బాయి పెళ్లామంటే గిట్టేది కాదు. రాజుని
ాసిన కళ్లకి మొగడిని మొత్త బుద్ధివేసింది.
ని యీపిల్ల ఓర్పుతో చాలా కాలం పడ్డది.
ట్టినా, తిట్టినా, తిండిపెట్టినా పెట్టకపోయినా
రుకుంది.'

'మంచివాడే! మాపింతండ్రి లాటివాడే!
ధవచదువు ఎందుకు తగలెయ్యను చదివారు'
ని నేను రోషముతో నంటిని. నాకు విచా
ము మెండుగా నుండెను. నరసమ్మకుమాత్ర
ా మాటలు కష్టముగా దోచెను.

'అయ్యో! నావల్ల తప్పులుండెడివి. అం
ంవలన ఆయన నన్ను దండించే వారు.
యన శూన్యహృదయులు కారు.'

సన్యాసి ఆమాటలు విని కోపారుణ లో
చను డయ్యెను. 'కారేం? చిన్న పిల్లవు
కావూ నువ్విప్పుడు? తనకున్న తెలివితేటలు
నీవద్దవుండవని తెలుసుకోవద్దూ? నీ వల్లతప్పు
లుంటే దిద్దుకోవాలి. అంతేకాని కేవలంపశు
వులా ప్రవర్తిస్తాడా? ఇరవైయ్యేళ్లు దాటిన
వాడు తలచి చేసినట్లు ముక్కుపచ్చలారని
పదహారేళ్లపిల్ల ఎల్లాచెయ్యగలదనిఆలోచించు
కోవద్దూ?' అని సన్యాసి చాలాకోపంతో
అన్నాడు. అతని వాదనచూస్తే నాకుకూడ
కోపము వచ్చినది.

'ఆలోచించేచేశారు. ఎన్నిసార్లో చెప్పారు.
వారితప్పులేదు. నాదేతప్పు. వారికి తగిన
భార్యనుగాను నేను' అని నరసమ్మ రుద్ధకంఠ
ముతో ననబోవుచుండ

'ఆ మాట నిజం. ఎద్దుజతకి దున్నపో
తునుకట్టడం వంటిది మీదాంపత్యం. నిర్భాగ్యు
డికి నిక్షేపమేమిటి? నిన్నెన్ని విధాల హింసిం
చాలో అన్ని విధాల హింసించలేదూ? కొరడా
లతో కొట్టలేదు? గదిలోపెట్టి తాళంవేసి కఠిన
శిక్ష వాళ్లకుచేసినట్లు ముంతతో నీళ్లుచిప్పలో
అన్నంపెట్టలేదూ? ఒకమారు కట్టెపుల్లపుచ్చు
కొనికొడితే నీబుర్రబద్దలయింది జ్ఞాపకంవుందా?
అప్పుడు డాక్టరుతో యేమన్నావూ? పుల్ల
అటకమీదనుంచి జారిపడిందని కాదూ
చెప్పావు?—'

నా కామాటలు వినినంతనే హృదయ
స్పందనము తీవరించినది. చెవులవెంట హోరు

బయలుదేరినది. ఆగ్రహముతో కూడిన ఒక మోస్తరు ఆవేశ మంకురించెను. 'మహానుభావా! యీ చదువుకున్నవాళ్లు చేసే చేతలన్నీ యిల్లాగే వుంటున్నాయండీ' అని నేను అప్రయత్నముగా నంటిని.

'అందరూ అంతేనా? నాయనా? కాదు కొన్ని వున్నాయి పండితపశువులు. ఇవన్నీ వాటిచర్యలు. ఒళ్లువాచిన పల్లెటూరివారుతమ పిల్లలకు విద్యాధికు లగు మగలు కావలె నని వెదకి వారి పుట్టుపూర్వోత్తరముల నారయక చేసిన సంబంధము లిట్టివి. ఒళ్లూగుల్లే; ఇల్లాగుల్లే. అమాయిక లగు ఆడపిల్లలిది అనుభవం అంతా. రాత్రింబగళ్లను సుఖస్వప్నముల వలె గడపవలసిన కాలంలో జీవితం దుఃఖభాజనమై దుర్భరమైపోవును. అకాలజరత్వమును, మృత్యువును వారిపా లగును.'

నా కామాట లన్నీ నిజంగా కనుపించెను. ఎక్కడ చూచినను ఇట్టి యుదంతములే. "అవును. స్వామీ, అవును. ఇట్టివారి నెందరినో మనం చూస్తున్నాము" అని నే నంటిని.

"అయ్యో! నేను కుకూపిని. నా రూపమును బట్టి సహజముగ దయామయుడగు నా ప్రభువు నన్నట్లాదరించెను. ఏవిధంగా చూచి నా నాథ ర్తకు నేనుతగను. నేనుపాపిని. అందుచేత నేలట్టివారునాకు దక్క లేదు. లోపమంతా నాదే" అనినరసమ్మయనెను. మగనిపై యీమెకుగల యభిమానము నా కాశ్చర్యమయ్యెను. అంత సన్యాసి మరల ఇట్లనెను.

"కాదు; ఎన్నటికీ కాదు. నీ నిర్మల
నడవడి, నీసౌజన్యం, నీధైర్యం ఇప్పటికీఆయి
యందు మూర్తీభవించి కనిపించును. ఒకన
నీభర్త క్రుద్ధుడై పక్కపై పడుకున్న నీపై
చేయివేసి డెస్డెమోనాను ఒథెల్లో చంపిన
చంపుతానని నొక్కలేదూ? నీవు కుయ్యి
అయినా అన్నావా? ఎవరితోనైనాచెప్పా
ఉరుములు అట్టహాసంగా వురుముతూ భ
భోంతరాళాల కొకటే ధారగా వర్షిస్తో
నిన్నవతలికిగెంటి రెండురోజులింట్లోకి రాన
లేదు. జ్ఞాపకమేనా, నీకు ? నీ మగడు మ
వాడా? అతనిపేరు చెపితే నీకు మన
ముండదాయేం ?"

"అయ్యో! నా అవివేకంవల్ల ఆయ
పిచ్చెత్తించేశాను. లేకపోతే చదువుకున్నవా
పదిమందిలో తిరిగేవారు, అనేక మంది
తిరిగేవారు అల్లాచేస్తారా? ఆయన్ని అ
లాభ మేమిటి ?"

"అవును, ఆయన్ని అన్న లాభంలే
ఇల్లా ఆడదాన్ని మగవాడు పడిపిస్తే వ
కునే సంఘాన్ని అనాలి" అని నేనంటిని.

"అది తప్పు. మనసంఘంలో ఆడదాని
అగ్రస్థానం వుంది. అక్కడక్కడ అప్పుడప్పు
అన్యాయం జరుగుచున్న మాట నిజమే కా
అది అరుదు" అని నరసమ్మయనెను.

"అరుదుగానైనా సరే విద్యాధికుల
వుండడము తప్పు. నిన్ను ఆయన అల్లా చేం
డమేమిటి? సుఖంగా పెరిగిన దానవు. 

ట పుట్టి కలయింట పడ్డదానికి నీకీ అవస్థ ుటి ?" అని నేనంటిని.

"నాయనా! యీపిల్ల పడరాని కష్టాలు ు. చివరకు మగడు వదిలేస్తే పుట్టింటికి కు వెళ్లారు. కాని అక్కడ తల్లి దండ్రుల ుం చూడలేక ఎవరో యాత్రికులతో లు దేరింది. దోవలో మశూచికంపడి ాపం నాశనం అయి యీవికృతరూపం ు వళ్లీ యింటికి వెళ్లాని లేక నీ పంచని ుద" అనుచు లేచి సన్యాసిచేయిగడుగు ెను.

నరసమ్మ కంటివెంట నీరుధారగా గారి ుచుండెను. పూర్వవృత్తాంతములు స్ఫురణ ుకెంతో దుఃఖమునకు హేతువయ్యెను. అగ గూర్చి యంత కఠినముగ మాట్లాడితిమని ుకుబోతు తనముగూడ వచ్చెను. ఆ చరి ుని నేను నివ్వెరపోతిని. ఆమెపేరు ఊరు ్రతము నాకింకను తెలియ లేదు.

"అయ్యా! ఆయన యెక్కడున్నారో ్పండి దయుంచి" అని నరసమ్మ కంటి నీరు ుచుకొనుచు నడిగెను. సన్యాసిన్మ్రతి నభి ుంచి

"ఆ యధముడు దుఃఖితుడై దేశాంతరాల్లో ్నాడు. అమితభోగాలతో ఆరోగ్యం చెడి యింది. అప్పటికి తాను భార్యను అన్యా ంగా బాధించానని తెలుసుకుని ఆమెకోసం దకివెదకి కనుక్కోలేక తనకున్న దంతా మెపేర వ్రాసి సన్యాసిగా తిరుగుతున్నాడు. ఆపాఃమాట ఇప్పుడు మనకెందుకు?" అనెను నరసమ్మ ఆమాటలు వినినవెంటనే దుఃఖాతి శయమున క్రిందపడబోయెను. సన్యాసిఆమెను బట్టుకొని క్రింద పరుండబెట్టి ముఖముపై నీళ్లు చల్లెను. కొంతవడి కామెకు తెలివి వచ్చెను. సన్యాసి ఆమెను చూచి "లక్ష్మీ!—" అని యేమో అనబోవుచుండ నామె "అమ్మో!"



యనుచు వెనుకకు పడిపోయెను. సన్యాసి నాలుక కరచుకొని 'ఏమా' యని సందే హించుచున్నట్లుండ నేనామెను సేదదేర్చు చుంటిని. ఈ యనవసర ప్రసంగము వచ్చి యీమెకింత బాధకలిగించనేల యని నేను విచారించితిని. ఆమె మరల సేదదేరి

"మీరిల్లా అయిపోయినారేం? నామూ లాన్ని మీకెంత కష్టాలు వచ్చాయండీ? యీనిర్భాగ్యురాలిని కాక యింకొకరిని చేసు

# కామినియా నూనె

వేనవేల కుటుంబములయందు ఉపయోగించబడుచున్నది

## ఎందుకు?




కామినియా నూనె

వెంట్రుకలు ఊడిపోవుటను ఆటంకపరచును.

కామినియా నూనె

తలను చుండులేక నుంచును.

కామినియా నూనె

తలకు చల్లదనమును గలిగించును.

కామినియా నూనె

తలకు సంబంధించిన వ్యాధు లన్నిటిని కుదుర్చును. ముగా నున్న బుర్రకు చల్లదనమును గలిగించును.

కామినియా నూనె

యందు వెంట్రుకలు పెరుగుట కవసరమైన వస్తువులు, ముఖ్య కావలసిన అమూల్యవస్తువులు గలవు.

కామినియా నూనె మనోహరమైనట్టియు ఆహ్లాదకరమైన సువాసనగలది.

కామినియా నూనె శిరోజములకు ప్రాణము. ఇట్టి సుగుణము లుండుటవలననే వేలకొలది కుటుం లందు కామినియా నూనె ఎక్కువగా వాడబడుచున్నది.

కామినియా నూనెను ఉపయోగించువట్టివారు గనుకనే దీనిని "శిరోజములకు ప్రాణ మని" యందు గల లాభకారియైన సుగుణములను బట్టి తెలుపుచున్నారు.

బుడ్డి 1 కి ధర రు. 1. వి. పి. ఖర్చులు అ. 6. ప్రత్యేకము.

బుడ్లు 3 కి ధర రు. 2-10-0. వి. పి. ఖర్చులు 0-12-0. ప్రత్యేకము.

అత్తరులకు రాజైన

## ఓటో దిల్ బహార్ (రిజిష్టరుడు)

హిందూ దేశమం దంతటను దీనికి గల ఎడతెగని అత్యధిక అమ్మకమే దీనికి గల అసాధారణమైన శ్రేష్ఠత్వమును రుజావుచేయుచున్నది. కొన్ని బొట్లు చేతి రుమాలపైన చల్లిన సీమపువ్వులు, మల్లెపువ్వుల వాసనవలె మనోహరమైన దీర్ఘ సువాసనను గలిగించుచున్నది.



$\frac{1}{2}$ ఔ. బుడ్డి 1 కి రు. 2. $\frac{1}{4}$ ఔ. రు. 1-4-0. 1 డ్రా. 0-12-0.

వి. పి. ఖర్చులు అణాలు 6 ప్రత్యేకము.

3 అణాలు తపాలబిళ్ళలు పంపిన శాంపిల్ బుడ్డి పంపబడును.

కామినియానూనె ఓటోదిల్ బహారు సుప్రసిద్ధమైన స్టోరులన్నిటియందును దొరకును.

## ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ.

తపాలపెట్టె నెం. 2082. బొంబాయి నెం. 2.

# కతియవారు ట్రేడింగు కంపెనీ

జగత్ప్రసిద్ధిగల సర్వజనాదరణీయమైన తలనూనెలు, అత్తరులు
మీరు కోరిన సువాసనలు మీకు లభించగలవు




## మనోహరపరిమళము గల తలనూనెలు

కుసుమాల్ హెయిరాయిలు (రిజిష్టర్డు):— తలనూనెలలో సాటిలేనిది. సంపన్నులు మెచ్చినది.
వెల సీసా 1 కి రు. 1-0-0

వైట్‌రోజ్ హెయిరాయిలు నెం. 777 (రిజిష్టర్డు):— గులాబీపువ్వులనిజసౌరభ మిందుగలదు. రోజాపూవుల కాసక్తి గలవారి కామోద మొసగును.
వెల సీసా 1 కి రు. 0-14-0

కోకోనట్ హెయిరాయిలు నెం. 777 (రిజిష్టర్డు):— టెంకాయనూనె తలనూనె కుపయోగించునని ప్రతివానికిని తెలియును. కాని ఎట్లు సిద్ధముచేసినచో నది ప్రశస్తమో తెలియదు. ఈ 777 నెం॥ రులో (రిజిష్టర్డు) చేసిన ఈ టెంకాయనూనె శుద్ధిచేయబడి దుర్వాసనారహితముగా చేయబడి సూక్ష్మసువాసనాసంకలితముగా జేయబడినది. అందుచే అందరిచే మెప్పునొందినది. వెల సీసా 0-14-0

పుష్పమాలతీ హెయిరాయిలు (రిజిష్టర్డు):— మాలతీ పుష్పసువాసనతో అతిమనోహరమై హృదయరంజక మొప్పు తలనూనె యిది.
వెల సీసా 1 కి రు. 0-14-0

సువర్ణమాలా హెయిరాయిలు (రిజిష్టర్డు):— యిది సర్వజనాదరణీయమైన సుకుమార సువాసనగల తలనూనె.
వెల సీసా 1 కి రు. 0-9-0

## సర్వజనాదరణీయమైన పుష్పముల అత్తరులు

ఆటో మధుకర్ నెం. 777:— ఈ అత్తరునందుగల సొగసైన పూలవాసనచే మోహితులై అనేకమంది అత్తరును తమ యభిమానసౌరభముగా భావించుచున్నారు. ఒకసారి యుపయోగించినచో సర్వదా వరించిన ...ను.
వెల $\frac{1}{2}$ ఔ. సీసా 1 కి 1-12-0 $\frac{1}{4}$ ఔ. సీసా 1 కి 1-0-0

ఓటో కుసుమాల్ (రిజిష్టర్డు) పరిమళములం దపూర్వచిత్రములు:— అప్పుడు కోసిన పూవులవాసన యీ అత్త...ందు కలదని సౌరభప్రియు లందరును అంగీకరించిరి. సారా అరకులతో చేర్చిన యితర అత్తరులను జూచి విసు...చెందినవారి మనోభీష్టమునకు తగిన అత్తరు. నిది సుకుమారమైన సూక్ష్మసౌరభము వెదజల్లును.
వెల $\frac{1}{2}$ ఔన్సు సీసా రు. 2-0-0 $\frac{1}{4}$ ఔన్సు సీసా రు. 1-0-0

నెం. 577 ఓటో జాస్మిన్, ఓటో హీనా, ఓటో రోజ్, ఓటో లిలీబ్లాజం, ఓటో మస్క్, ఓటో వీరోలీ, ...ో బకూల్, ఓటో సురంగి ప్రతిది వెల $\frac{1}{2}$ ఔన్సు సీసా 1 కి రు. 1-12-0 $\frac{1}{4}$ ఔ. సీసా 1 కి రు. 1-0-0

పాకింగు పోస్టేజీ ప్రత్యేకము. రెండణాలుచీట్లు పంపినవారికి కోరిన అత్తరులలో ఒకమాదిరి సీసా లేక ...రిన తలనూనెలు ఏ రెంటినైనను మాదిరిసీసాలు ఉచితముగా పంపబడును.

నేడే వ్రాయుడు. దొంగమాదిరులను చూచి మోసపోకుడు. వీనికిబదులుగా వేనినైనను అంగీకరించకుడు. ఘనానాగల ఔషధముల దుకాణములన్నింటియందును దొరకును లేదా,

## కతియవారు ట్రేడింగు కంపెనీ, బొంబాయి (నెం. 4)

మధురలో ఏజంట్లు:— కాదర్ సాహెబు అండు సన్స్

కుంటే ఎల్లావుండి వుందురండీ? అబ్బాయీ వీరు నీపినతండ్రి సుమీ!" అనుచు ఆతని చరణపద్మములపైబడి హోరున నేడ్వజొచ్చెను. "నాయనా! నేను విశ్వనాథరావును. నువ్వు నన్ను చూచి చాలా యేళ్లయింది. ఆనవాలు పట్టలేక పోయావు" అనుచు కళ్లనీళ్లతో నామెను లేవనెత్తి "లక్ష్మీ! నీవమూల్య రత్నమవు. నీ సుగుణము లిప్పుడెంతో ప్రకాశిస్తున్నాయి. నాకు బుద్ధి వచ్చి నిన్ను వెదకడం మొదలుపెట్టాను. కనబడ లేదు. తిరుగుతున్నాను దేశాలన్నీ. ప్రొద్దున్న

యీవీధిని వెడుతూంటే నీవు దొండకాయ
మనిషిని కేకవేశావు. ఆ మాట ఆనవా
కట్టాను. కాని నీరూపం చూసి అనుమానప
పకీ నిశ్చయం చేసుకుందా మని వచ్చాన
వాకబువల్ల వీడు అన్నయ్యకొడుకని తెలు
కుని ఆనందంతో పొంగిపోయాను. నాయన
ఒక్కమారు నీవుకూడా కౌగలించుకో" అ
మానాన్న నన్ను దగ్గరకు తీసెను. ఆ య
సరమున నా మనోనేత్రమున దాండవమాడి
భావము నెఱిగించుటకు నాతరము గాదు.



# రస్వతీ దధీచుల ప్రథమ పరిచయము

కోమాండూరు కృష్ణమాచార్యులు గారు

అంతట నొక్కనాఁటి యుదయావసరంబునఁ గాననయ్యె దు
ర్దాంత తురంగశాతఖురదారుణ పాతలుఠత్పరాగమా
శాంతరపూరితంబగుచు నంత నిరంతర ఫేనపుంజ సం
క్రాంతముఖంబులై వలిత కంధరముల్ బరతెంచె నశ్వముల్.

ఆశ్వీక బృందమధ్యమునయందు ననంగునిఁ బోలువాఁడు స
ప్తాశ్వసమప్రతాపుఁడు మహాభుజుఁ డూర్జిత తేజుఁ డొక్కఁ డీ
విశ్వము నేలఁ జాలు భుజవీర్య సమన్వితుఁ డబ్ధి వేష్టితో
ర్వీశ్వరుడించు మించుఁ బదునెన్మిది యేఁడులవాఁడు సూడఁగన్.

తొలకరి నల్లమబ్బులకుఁ దుమ్మెదరెక్కల తేట నిగ్గుకున్
దులయగు మేనిచాయగల తోరఁపు గుఱ్ఱము నెక్కి రావుతుల్
పలువురు కుంతపాణులయి పార్శ్వములన్ గొలువంగ మౌళిపైఁ
దెలిగొడు గొప్పవచ్చు రణధీరునివాణి యధీరయై కనెన్.

ఆతని పజ్జ నున్నతహయంబుపయిన్ సితవారవాణ సం
స్ఫీతతనుండు శేషనిభ పీవరబాహుఁడు బాహుజాన్వయ
ఖ్యాతచరిత్రుఁ డుగ్రసమరాంతరశాంతనవుండు శుద్ధ బా
లాతపవర్ణుఁ డొక్కపురుషాగ్రణి యేగుచునుండెఁ జెచ్చెరన్.

ఆతఁడేఁబదియేండ్ల ప్రాయముననుండి-రణములం దారితేరిన రాజపుత్ర
వీరుఁ డగుట నృపాత్మజు వెంటనంటి-యంగరక్షకుఁడై వచ్చు నట్లు దోఁచె.

అతఁడు పురఃప్రధావితపదాతిసమూహము దెల్ప భారతీ
సతి యసమానరూపరుచి సంపద సొంపు తెఱం గెఱింగి వి
స్మితుఁడయి దర్శనోత్సుకత చిత్తమునం బొడమంగ నాశ్విక
ప్రతతిని డించి దూరమున రాజకుమారుఁడు పాదచారియై.

వ. అంగరక్షకుం డపుడు కైదండ యొసఁగుచుండ నక్కన్యకాయుగళంబు సవినయంబు సందర్శించి, వార లొసఁగిన వనవాసోచితాతిథ్యసత్కారంబుల సంప్రీతినొంది సుఖో విష్టులయి యున్నంత, సావిత్రి ప్రయసుం డగు ద్వితీయ పురుషు నుపలక్షించి సప్ర ల్భంబును సవినయంబునుం గా నిట్లనియె.

సహజశాలీనతాగుణస్త్రైణమునకు-సాహసంబట ప్రథమభాషణము దలఁప
వనమృగీముగ్ధలగు కులాంగనలమాట-వేఱ వచియింప వలయునే విబుధవర్య.

అప్రగల్భులనైన మహానుభావు-లాదరంబునఁ గని రేని నపుడ వారు
మధువుద్రావిన కైవడి మనుజనాథ!-అధికవాచాటులగు టొక్కయబ్బురంబె.

అనఘా, మీదర్శనమునఁ-గనులుండిన ఫలము నేఁడు గంటిమి వినఁగాఁ
జనునేని మీయుదంతం-బనుపమగుణధుర్య! తెలుపుమా చెవు లలరన్.

ఆర్య! సాధువులం దప్రయత్నముగనె-కలుగు విస్రంభ మెట్టివా రలకునైనఁ
గాన భవదాగమనశోకకారణమున-శూన్యమగు దేశమెయ్యది శుద్ధచరిత.

కమలసంభవు నిర్మాణ కౌశలంపుఁ - బరమకాష్ఠయన్రైన యీభద్రమూర్తి
విస్మయావహ మగుటొక్క వింతగాదు ధరణిలో నెట్టి ధీరచిత్తములకైన.

గరళకంధరరోష కఠినోగ్రహుంకార గర్వనిర్వాపణా ఖర్వశౌర్యుఁ
డసమానలావణ్యు లసమానవిగ్రహ ప్రసవాస్త్రుఁ డీతఁ డేవసుమతీను
బహుజన్మకృతపుణ్యపరిపాకఫలరూపుఁ డీకుమారకుఁ గన్న లోకపూజ్య
యేనాతిమిన్న దేవానాంప్రియుని పీని యభిధానపుణ్య వర్ణాళు లెవ్వి
యార్యుల యుదంతమునుగూడ నరయువేడ్క-కలదు వచియింప మీకనుగ్రహమయే
ఏముసేసిన తపము వర్ణింపఁ దరమె-తత్త్రియా న్వయవార్ధి రాకాశశాంక.

వ. అని సావిత్రి తదీయోదంతశ్రవణ కుతూహలనై యడుగు వచనంబు లాదరించి య రాజపురుషుండు వినయంబున ని ట్లనియె.

పరమసాధువులకుఁ బ్రియవాదసరణి-తరుణి కులవిద్యయగుట తథ్యంబకాదె
క్రమవదనారవింద యుగ్మకమె కాదు-చిత్తములుగూడ హిమధామశీతలములె.

జంభారిభుజశిలా స్తంభనస్తంభన ప్రౌఢ మెవ్వనితపః ప్రాభవంబు
అలఘుపులోమ దైత్యారణ్యశిఖశిఖా కల్ప మెవ్వని రోష కలుషదృష్టి
సకలసురాధిరా ణ్మకుటరత్నచ్ఛటా భాసురంబెవ్వాని పదయుగంబు
చతురంతవసుమతీ శక్రుండు శర్యాతి-తనయ నెవ్వానికి ధారవోసె
విమలసోమ రసాస్వాద విధురకంఠ - సురభిషగ్యుగ్మకంబు నేశుద్ధమూర్తి
పంక్తిపావనులను జేసి ప్రాయమందె-నతఁడు సామాన్యుఁడే చ్యవనాఖ్యముని.

ఈసుకుమారమూర్తి కమలేక్షణ, యీ ఋషిచంద్రుఁడున్ సుక
న్యాసుదతీవతంసము సహర్నిశ మంచితభక్తిఁ బావకో
పాసనఁజేసి కాంచిన యపత్యము పుట్టిననాఁట నుండియున్
వాసవతేజుఁ డాధరణిపాలుఁడె మన్ననఁ బెంచెఁ బ్రేముడిన్.

వైజననంబునన్ దుహితృవత్సలుఁ డాధరణీధవుండు వి
భ్రాజితశాతకుంభ మణిపంక్తులు కానుక లిచ్చి యల్లునిన్
బూజితుఁ జేసి యాత్మజను బుట్టినయింటికిఁ గొంచుఁ బోయె నీ
రాజకిశోర మంత నుడురాజముఖీ, జనియించె నచ్చటన్.

దేవి! యీతని కపుడు దధీచియనుచు-నామకరణం బొనర్చె మాతామహుండు
ఎత్తికొని పెంచె నితని రాజేంద్రపత్ని-కాలిమంజీర మింతైన ఘల్లుమనక.

బాలకున కన్నివిద్యలు ప్రౌఢమతులఁ-బండితులఁ గూర్చి చెప్పించి పార్థివుండు
ఇంతవానిని జేసి మునీంద్రుకడకు-బంపుచున్నాఁడు దేవి, యీబంటు నిచ్చి.

ఆమహారాజు నాజ్ఞల ననుదినంబు-మౌళిధరియించు సేవకపాళిలోన
భృత్యపరమాణు వొక్కఁ డీవృద్ధజనుఁడు-కూర్మి ననుఁబిల్చు వాఁడు వికుక్షియనుచు.

భృత్యవర్గంబునకు మహీవిభునికొలువు-తండ్రి తాతలనాఁటి నిధాన, మమ్మ
ధరణివంశక్రమాగత దాస్యవృత్తి-ప్రభువుల కటాక్షమునకుఁ బాత్రంబ కాదె.

పారేశోణము మానిచైత్రరథకల్పంబాశ్రమం బీలతా
వారంబచ్చటి కొక్క-క్రోశమగు నశ్వవ్రాతముల్ గొల్వ నీ
వీరాంకూరము తాతపాదులను సేవింపంగ నేతేరఁగా
నారీరత్నములార! నేను మిము సందర్శింపఁగా గల్గుటల్.

తెలిపితి నింత నిక్కము సతీమణి మాచరితంబు దేవతా
కులముల నుద్భవింపఁగల కోమలు లమ్మరొ మీరు భూమిపైఁ
గలుగుట కేమి కారణము? గాఢఘనాఘన గర్భనిర్గత
జ్వలితతటిల్లతల్ ధరణి భాగమునం జనియింప నేర్చునే.

నీలవలాహకంబు లవి నిశ్చలలీల వెలుంగఁ జేయు శం
పాలతవోలె సాంద్రవనపంక్తుల సంతమసంబు వాపుచున్
బాలకదంబశాఖఁ గరపల్లవ మూఁతగ నిల్చియున్న య
బ్బాల త్రిలోకపూజ్యయగు భారతియో రతియో మృడానియో?

అనుటయు లేతనవ్వ వదనాబ్జమునం దొక సొంపునింపఁ బ్రా
మినుకుల తల్లి రావుతుల మేటిని గాంచి నృపాలచంద్ర! యీ
వనములఁ బెద్దకాలము తపంబొనరింపవలెన్ సమీపమం
దునికి యెఱుంగకుండుదురె యున్నవిధం బెఱిగింపకుండుమే.

మాయుదంతము సకలంబు మాన్యచరిత-యచిరకాలంబులోఁ దెలియంగఁ గలదు
కాని యీనాఁటి మీయనుగ్రహమ మెపుడు-సుస్థిరంబుగమాపైని జూపవలయు.

అపుడు దధీచివార్ధిక మహాబ్దరవప్రతిమ స్వరంబునన్
విపినశిఖండిషండములు వేడుకఁ దాండవమాడ నాశ్వికా
ధిపుఁగని పల్కె నార్య! సుదతీమణి మాట సమంజసంబు నేఁ
డుపవనసీమ, కేగి జనకోత్తములం గని వత్త మింకిటన్.

అని వచించి వికుక్షితో నపుడుకదలి-రాజదౌహిత్రుఁ డాశ్వికరాజి గొలువ
భావమున వాణి రూపంబు పాదుకొలిపి-యరిగె మెల్లన తాత పాదాశ్రమంబు

[ఆంధ్రహర్ష చరిత్రము]

———

# ్రేమయున్న చోట దైవమున్నాడు

జయంతి బ్రహ్మానందం గారు

(టాల్‌స్టాయి కథనుండి)

ఒకపట్టణమున మాకన్న యను మాదిగవా
ండెను. వాడు చక్కగా చెప్పులజోళ్లు కుట్టువాడు.
వుండిన యిల్లు లోతైన మూరుగల్గి చిన్నగదియొకటి
ది. ఆగదినున్న యొక్క కిటికీ వీధివైపున నుండెను.
 మిక్కిలి క్రిందికుండుటచే దానిద్వారా వీధిలో నడ
వారి పాదములే కాన్పడును. మరేమియు గానబ
ు. కాని మాకన్న జనులపాదరక్షలు (జోళ్లు)
క్కిరయే వారిని పోల్చుకొనగలిగెడువాడు. వాడాపుర
న చిరకాలముండుటచే ననేకులతో పరిచయముగలదు.
చుట్టుపట్ల నున్నవారి జోళ్లన్నియు, వానివద్దకు నొక
రెండో సారులు మరమ్మతునకు వచ్చియుండినవే;
ందుచేత వాడు తనపనితనమును దినమును కిటికీనుండి
ాచుచుండువాడు. కొన్నిటికి వాడు అడుగుతోళ్లను,
ొడవలను వేసెను; కొన్నింటి కతుకులు వేసెను; కొన్నిం
కి కుట్లు కుట్టెను; కొన్నిటికి పైభాగమంతయును కూడ
త్తగా తానే వేసెను. వానికి చేతులనిండ పనియుండె
ది. కష్టపడి పనిచేయువాడు, మంచిసామగ్రి నుపయో
ంచువాడు, ఎక్కువకూలి పుచ్చుకొనువాడు కాడు,
మ్మదగియుండినవాడు. కావలసిన వాటికి పనిపూర్తి చేసి
యివ్వగలనని తోచినప్పుడే పని కంగీకరించి పుచ్చుకొను
ాడు. లేనిచో వాడు నిజము చెప్పెడివాడే కాని
పక్కా వాగ్దానములు చేసెడివాడు కాడు. ఇందుచేత
వాడు పేరుపడిన పనివాడై, కావలసినంత పనిగల్గి
యుండెను.

మాకన్న మొదటినుండియు మంచివాడే. కాని
వృద్ధాప్యమున నింకను తన యాత్మనుగూర్చి యెక్కువగా
తలంచుచు, పరమేశ్వరున కింకను సమీపస్థుడు కాగోరు
చుండెను. తాను కూలికి యజమానునౌకరీలో నుండి
నపుడే వానిభార్య మూడేండ్ల చిన్నికుమారుని, భర్తపై
విడిచి స్వర్గస్థురాలయ్యెను. అంతకంటె ముందుపుట్టిన
బిడ్డలందరును వారి చిన్నతనములలోనే మరణించిరి.
మొదట వాడు తనచిన్నకుమారుని, గ్రామములోనున్న
తనయక్కగారింటికి పంపివేయ తలచియుండెను. గాని,
చిన్నబాలుని విడిచియుండలేక "మాచిన్నవాయనకు
క్రొత్తవారింట్లో పెరుగుట కష్టముగానుండును, నాతో
నేయుంచుకొనెద"నని యనుకొనెను.

మాకన్న తనయజమాని కొలువువిడిచి చిన్నిబా
లునితో నద్దెయింటికి పోయియుండెను. కాని వానికి
తనబిడ్డలు సుఖముగానుండ జూచుకొను యోగము లేదు.
కొడుకు పెరిగి కొంత పెద్దవాడై, చేతికంది తండ్రికి పని
పాటులలో తోడ్పడి యానంద మొసగూర్చు నీడువ
చ్చిన సమయమున నాచిన్నవానికి జబ్బుచేసి వారము
దినములు తీక్ష్ణమైన జ్వరముతో బాధపడి మరణించెను.
ఈదెబ్బతో మాకన్న ధైర్యముచెడి, యాశలన్నియు
నడుగంటిన వాడయ్యెను. నిరాశచేతను వాడు దైవనింద
కూడ చేయనొడంగెను. దుఃఖాతిశయముచే వాడు
మాటిమాటికి, ముసలియయ్యు తాను బ్రతికియుండిపోతి
ననియు, తాను మిక్కిలి ప్రేమించిన పుత్రుడు, ఏకమా
త్రపుత్రుడు మరణించెననియు, తానుకూడ మరణమునే
యనుక్షణమును గోరుచు నీశ్వరధ్యానము చేయుచుం
డెను. అంతటినుండి వాడు గుడికిపోవుట కూడ మాని
వైచెను.

ఒకనాడు మాకన్న స్వగ్రామనివాసియైన యొక
వృద్ధుడు, అప్పటి కనిమిదేండ్లనుండి తీర్థయాత్రలు
చేయుచుండిన వాడు, గుడినుండి తిరిగివచ్చు మార్గమున
మాకన్న యింటికి వచ్చెను. మాకన్న వానితో మనసిచ్చి
మాట్లాడి తన దుఃఖమును వెళ్లబోసికొనెను. "నాకు మరి
జీవింప కోరికయే లేదు. నేనుకూడ వేగమే చావవలె
ననియే నేనీశ్వరుని కోరునదియెల్లను. నాకు ప్రపంచ
మున నింక నేయాశయును లేదు" అనెను. "మాకన్నా,

యట్లనుటకు నీకు హక్కేమియును లేదోయి. ఆదేవుని కార్యములు మన మాక్షేపింపదగినవారమా? ఆతనియిచ్ఛయేకాని, మన న్యాయవిచారణ, యాలోచనలును పనికిరావు. నీ బాలుడు మరణించి నీవు జీవింపవలెననియే యాతనియిచ్ఛ కావున నదియే యుత్తమమైనదేమో! నీ నిరాశ విషయమైయా? — నీవు నీస్వసుఖముగూర్చియే జీవింపగోరుదువు కాన నీకిది కల్గుచున్నది." "ఐన మరెందుకొరకొకరు జీవింపవలెను?" అని మాకన్న యడిగెను. "దేవునికొఱకేనోయి, యతడే నీకు ప్రాణము నిచ్చెను, నీవాతనికొఱకే జీవింపవలెను. నీ వతనిగూర్చియే జీవింప నేర్చికొనినపుడు నీకు మరి విచారమేయుండదు. అంతయు సుఖముగనే, సుఖముగనే తోచుచుండును" యని యా ముసలివాడనెను. కొంతసేపు మాకన్న మాటాడక, తరువాత నిట్లడిగెను "కాని యెవడైనను దేవునికొఱకు జీవించు టెట్లు?" ముసలివాడు జవాబు చెప్పెను:— "దేవునికొఱకు జీవించుటెట్లో, క్రీస్తుమనకు చూపించియే యున్నాడు. నీకు చదువు వచ్చునా? వచ్చినచో మతగ్రంథములను కొని చదువుము. వానిలో నీవెట్లు జీవింపవలెనని దేవుడు కోరునో తెలుపబడి యున్నది. అంతయు వానిలోనే యున్నది." ఈపలుకులు మాకన్నహృదయమున నాటిపోయినవి. ఆనాడే వాడుపోయి పెద్దయచ్చుగల యొక మతగ్రంథము గొని తెచ్చుకొని చదువ నారంభించెను. మొట్టమొదట వాడు సెలవుదినములలో మాత్రమే చదువ నుద్దేశించెను. కాని, యొకసారి చదువ మొదలిడిన తరువాత నది తన హృదయభారము నతి తేలికచేసినట్లు చూచి యనుదినమును చదువ నారంభించెను. ఒక్కొకసారి యాచదువులో వాడు మేనుమరచి లీనమై పోయెడివాడు. ఇంతలో దీపమున చమురయి పోయి దీప మారిపోయెడిది. ప్రతిరాత్రియు వాడు చదువజొచ్చెను. ఎంతచదివిన నంత చక్కగా వానికి తననుండి దేవు డేమికోరి యున్నాడో, తానెట్లతనికొఱకు (అతని సేవకొఱకు) జీవింపవలెనో బోధపడుచుండెడిది. వాని హృదయభారము తగ్గుచుండెను. ఇంతకుముందు రాత్రి వేళ వాడు పడుకొనబోవునపుడు తన ముద్దుతనయుని వియోగశోకమున మునింగి విలపించు చుండెడివాడు.

కాని, యిపుడో మాటిమాటికి నిట్లు దైవమును ప్ర
చుచుండువాడు. జయము, జయము తండ్రీ, పరమపి
నీయిచ్ఛయే పరిపూర్ణముగా నెరవేరుగాక!

అప్పటినుండి మాకన్న జీవితమంతటియం
మార్పువచ్చెను. ముందు, సెలవుదినములలో వాడు
మందిరమునకుపోయి టీ పుచ్చుకొనుచుండెడి
ఒకటి రెండుగ్లాసుల మద్యముకూడ పుచ్చుకొన
వాడుకాడు. ఒక్కొకసారి యేదో స్నేహితునితో
చేముపుచ్చుకొని బాగుగా మత్తెక్కకపోయినను
చేము మైమరచి తెలివితక్కువ మాటలనాడుచు దా
వువారినిజూచి కేకలువేయుటయో, తిట్టుటయో చే
చుండెడువాడు. ఇప్పు డట్టిదంతయు విడిచిపె
వానిజీవనము శాంతిమయమును, ఆనందమయ
యెను. ఉదయమునసే వాడు తనపనివద్ద కూర్చుండ
దినమంతయు పనిచేసి రాత్రి గోడనున్న దీపము క్రి
దింపి బల్లపైబెట్టి గూటిలోనున్న పుస్తకము
తెరచి చదువ నారంభించును. చదివినకొలది వా
చక్కగా బోధపడుచుండెను. మనస్సున పరిపూ
యిన హాయిని పొందుచుండెను.

ఒకనాడు వాడు రాత్రికాలమువరకు చదువు
డెను. వాడానాడు చదువుచున్న భాగ మతి సుబో
ముగ నుండెను. ఆ గ్రంథములోని యూరవ యధ్యా
ములో నీక్రింది తాత్పర్యముగల పద్యములను వా
చదివెను:— 'నిన్నొక చెంపపై కొట్టినవానికి నీ రెం
చెంపనుకూడ నిమ్ము. నీకోటును దొంగలాడికొని పో
చున్నవానికి, నీ చొక్కానుకూడ నిచ్చుటకు వెనుదీ
కుము. నిన్నడుగు ప్రతివానికిని లేదనక నిచ్చుచుండు
నీ వస్తువులను తీసికొనిపోయిన వానినుండి వాటిని
యడుగకుము. మరియు నీ కితరు లెట్లు చేయవలె
కోరుదువో నీవును వారిపట్ల నట్లే వర్తింపుము.' మరి
భగవంతుని వాక్యములుగా నింకను యీరీతిగా చదివె
'నన్ను మీరేల ప్రభువా! తండ్రీ! యని పిలుచుచును,
చెప్పినట్లెల్ల జేయరు? నావద్ద కెవడువచ్చి నా వాక్య
విని తదనుగుణ్యముగ ప్రవర్తించునో, వాడు లో

...గాదులను త్రవ్వి, రాతిపువాదునువేసి యిల్లు కట్టినటు ...తివాడు. వానయో, వరదయో వచ్చినపు డాయిల్లెంత ...సి వానినను రాతిపునాదుల యిల్లగుటచే చెక్కుచెద ... కాని వాక్యముల వినియు న ట్లాచరింపనివాడు ...నాదిలేనిదె నేలమట్టముపై నిల్లుకట్టినవానివంటివాడు. ...ద రాగానే దానిదెబ్బకు నాయిల్లు వెంటనే కూలి ...యి చాల నష్టము కలుగును." మాకన్న యీవాక్య ...లు చదవగనే వాని యాత్మకు చాల యానందము కలి... వాడు తన కులోచనములను తీసివేసి మోకాళులను ...పై వాని తాను చదివినదానిగూర్చి యట్టె యాలో...చుచుండెను. ఆవాక్యముల ననుసరించి తనజీవితము ...డు పరిశీలించుకొనుచు ని ట్లనుకొనెను "నాగృహము ...తి పునాదిపై గట్టబడినదా, యిసుకపైనా? రాతి ...నాదిరైన సరియే. ఇచ్చట నొంటరిగా (ఏకాకిగా) ...ర్చొని యీశ్వరాజ్ఞానుసార మంతయు చేసితినని తల...యునపుడు సుఖముగనే యున్నది. కాని నేను నా ...వధానత (జాగ్రత)ను తప్పినతోడనే మరల పాప మాచ...తును. ఐనను నింకను నేను పట్టుపీడక ప్రయత్నించె...ను. అది యత్యానందమును చేగూర్చును. ప్రభూ! ...న్ను రక్షించి నాకు తోడ్పడుము."

ఇ ట్లింతయు దలచి పండుకొనబోయి తిరిగి పుస్త...ము విడువ మనసు రాకుండుటవలన నింకను చదువు...చుండెను. ఆభాగములో నొక ధనికుడు ప్రభుని (దైవ...మును) తనయింటికి నాహ్వానించినట్లును, తా నాతనిని ...పాదములు కడిగి తుడిచి గౌరవింపకుండగా, నతనిభార్య, ...పకార్యముల జేసియుండిన యామె యతనిపాదము...ను తన కన్నీటితో కడిగి, తన కుంతలములతో తుడిచి, ...యాతని పాదములను శిరస్సున దాల్చినట్లును, అంతట ప్రభుడు సంతసించి యా యింటియజమానితో, 'నేను ...యింటికి రాగా నీవు నాకు పాదములు కడుగ జల...మును సంగలేదు. నాపాదములను తుడువలేదు. నాపాద...పద్మముల శిరసున దాల్పలేదు. కాని నీభార్య పాపి...యనిపించుకొనుచున్నది, నా కతి భక్తివినయములతో ...సేవజేసినది చూచితివా?' యనిరొనట! ఈకథ నతడు ...చదివి మరిమరి తలపోయుచుండెను. "ఆ ధనికు డెవడో

నావలెనే యున్నాడే! అతడుకూడ తన స్వసుఖమును గూర్చియే చూచుకొనెను—నా భోజనవిషయ మేమి?, నా యిల్లుసంగతి యేమి? నా భార్యాబిడ్డల సంగతి యేమి?—అంతేకాని యింటికివచ్చిన యతనినిగూర్చి యొక్కసారియైన యోచింపలేదు. తన జాగ్రతనే తాను పడెనుగాని, చుట్టముగూర్చి లక్ష్యపెట్టనేలేదు. ఐనను వచ్చినయతిథి యెవరు? ప్రభువే. సాక్షాత్తు భగవానుడే. అతడు నాయింటికివచ్చిన, నే నట్లే చేసియుందునా?" —అనుకొనుచు మాకన్న తన రెండుచేతులపై తల నుంచు కొని నిద్రజెందెను. ఎప్పుడు నిదురపట్టెనో వానికే తెలియదు.

'మాకన్నా!' యని యెవరో తన చెవిదగ్గ పిలిచి నట్లు వానికి తటాలున వినబడెను. వాడు నిద్రనుండి త్రుళ్లిపడి లేచి 'ఎవరది?' యని యడిగెను. వెనుదిరిగి తలుపువైపు జూచెను. ఎవ్వరును లేరు. వా డింకొక సారి పిలిచెను. ఈసారి వాడు స్పష్టముగా నీమాటలను వినెను. 'మాకన్నా, మాకన్నా, రేపు వీధివైపు చూచు చుండుము, నేను వచ్చెదను.'—మాకన్న తెలివితెచ్చు కొనెను. కుర్చీనుండి లేచి కళ్లు నులుముకొనెను కాని యీ మాటలను తాను కలలో వినెనో, తెలిసియుండియే వినెనో వానికి తెలియలేదు. వాడు దీపమార్పివేసి, పండుకొనబోయెను.

మరునాడు సూర్యోదయమునకు పూర్వమే వాడు లేచి, దైవప్రార్థనజేసికొని, నిప్పుచేసి గంజి కాచుకొని, యంబలి చేసికొనివాడు. పొయ్యిమీద నీళ్లుపెట్టి మా మూలుప్రకారము తన పనికి కిటికీప్రక్కను కూర్చొ నెను. కూర్చొని పనిచేయుచు వా డాముందురాత్రి జరిగినదంతయుగూర్చి యాలోచించుకొనెను. ఒకప్పుడు వాని కది కలవలె తోచుచుండెను. ఒకప్పుడు నిజముగ వా డాకంఠస్వరమును విన్నాడనని నిశ్చయించుకొనుచుం డెను. 'పూర్వ మిట్టివి జరుగుట కలదు' అని వా డను కొనెను. ఆనాడు వాడు పనిచేయుటకంటె వీధిలోనికి చూచుటయందే యెక్కుడు శ్రద్ధావంతుడై యుండెను. క్రొత్తజోళ్లు వేసికొని యెవరైన నటునడచిన, వంగి వారి ముఖమునుగూడ చూచుట కాతురపడుచుండెను. క్రొత్త



జో బనరూపథికీ తియరాజతి సో రహ భాతి సిగారని కీయే,
చింతమే కంథకీ చాహ భరీ సఖీ బాత చలావత హీ మన దీయే,
నీలనచాల బనీ ఘున బింజాసీ ఆరసీ దేఖి లజావతి హీయే,
రాగ హిండోలకీ రాగనీ సోహీ బిలావల వామ బిలావన లీయే.

[జయపుర చిత్రము: దివాన్ బహాదూరు చతుర్భుజదాసు గోవిందదాసుగారి అనుమతిని

తోళ్లు వేసికొని యొక నౌఖరును, తరువాత నొక నీళ్ల కావడివాడును నావీధిని నడచిరి. ఇంతలో పూర్వము సిపాయిగానుండిన యొక ముసలివాడు, చేత పారపుచ్చు కొని వాని కిటికీయొద్దకు వచ్చెను. వాని యశుభ్రమైన వస్త్రప్రాతజోళ్లు, వానిపై నతుకులు చూడగనే మాకన్న వానిని గుర్తించెను. ఆముసలివాని పేరు సీతన్న. చేరువ నున్న యొక వర్తకుడు వానిని తనయింట నూరకనే తిండి పెట్టి యుంచెను వానిపని యింటి నౌఖరుకు తోడ్ప డుటమాత్రమే. వాడు మాకన్న యింటి కిటికీ యవతలి చెత్తను తీసివేయ నారంభించెను. మాకన్న వానిపై నొక పారి చూచి తనపని చేసికొనుచుండెను. 'నేను ముసలి వాడ నగుచున్నకొలది నాకు చేదస్తము హెచ్చుచున్న ట్లున్నది. సీతన్న చెత్తయెత్తుచుటకు వచ్చుచుండును' వానిని చూచి నేను ప్రభువు, భగవంతుడే యీరూపమున వచ్చెనా! యనుకొనుచున్నాను. నాకు పిచ్చిపట్టుచున్నది, యనుకొని తన దురూహకు తానే నవ్వుకొనెను. ఐనను తాను కుట్టుచుండిన జోడు మరి కొంచెము కుట్టినంతనే వానికి తిరిగి కిటికీనుండి పైకి చూడవలెనని బుద్ధిపుట్టెను. సీతన్న తనపారను గోడకు జేరబెట్టి తానును కొంత విశ్రాంతిగొనుచు చలిపట్టిన తన శరీరమును వెచ్చగా జేసికొన యత్నించుట మాకన్న చూచెను. వాడు బలహీనుడు, ముస లివాడు చెత్తనూడ్చి యెత్తివేయుటకును శక్తిలేనివాడు.

'వానిని లోనికి పిలిచి కొంచెము టీ యిద్దునా! పొయ్యిమీది నీళ్లు మరుగుచునే యున్నవి' యనుకొనెను. మాకన్న చేతిలోనున్న కంతానె క్రిందబెట్టి వాడు లేచెను. కొంత టీ మరిగించెను. తనవ్రేళ్లతో కిటికీతలుపుపై త ట్టెను. సీతన్న కిటికీపైపునకు వచ్చెను. మాకన్న వానిని లోనికిరమ్మని సంజ్ఞచేసి, తలుపుతీయుటకు తానువెళ్లెను. 'లోనికిరమ్ము. కొంతవెచ్చ బడవచ్చును. నీకచట చలిగా నుండియుండును' యని మాకన్న వానితో ననెను.

'దేవుడు నీకు మేలుచేయుగాక! నిజమే నావళ్లం తయు నొప్పిగా నున్నది' యని సీతన్నలోనికివచ్చి, రొమ్ముపై మంచు దులుపుకొని, యింట తడికాళ్ల గురుతు లుపడునేమో యని కాళ్లు తుడుచుకొనబోయి, నీరస ముచే వడకుచు నేలబడెను.

'కాళ్లు తుడుచుకొన క్కరలేదులే. నేలతడైతే నే తుడుస్తాను. అది నాపని. నీవుకూర్చొని కొంచె టీ త్రాగు' అని మాకన్న యనెను. రెండుపాత్రలలో పోసి యొకటి సీతన్నకిచ్చి రెండవది తాను పళ్ళెముల చల్లారబోసుకొనెను. సీతన్న తనకిచ్చినది త్రాగివేసి పా బోర్లించి మిగిలిపోయిన పంచదారను దానిపైబెట్టి కన్న నభినందించుచుండెను. కాని యతని కింకను కావ యుండె నన్నసంగతి యతనిజూచినచో తెలియుచు యుండెను. 'మరికొంచెము పుచ్చుకొను'మని మరి రెం గ్లాసులటీపోసి మాకన్నమాటిమాటికి కిటికీపైపు జూ చుండెను. ఎవరికైన నెదురుచూచుచున్నావా యేమి యని యతనిచుట్ట మడిగెను.

'ఔనుగాని యెవరికొరకు నే నెదురుజూచుచున నో చెప్పుటకైన, నేను సిగ్గుపడుచున్నాను. ఆశ లెవ వత్తురో లేదో కూడా నేను చెప్పజాలనుగాని నా మ్నులో నొకమాట పడినది. అది యొక కలయో నిజముగానే వింటినో చెప్పజాలను. అసలుసంగతే తెలియునా? నిన్నరాత్రి నేను యేసుక్రీస్తుగూర్చి చద చుంటిని. ఆమహానుభావుడు, తండ్రి, యెట్లుప్రజల కలసి జీవించెనో, యెట్లు బాధ లనుభవించెనో! నీ గూర్చి వినియేయుందువని తలతును?'

'ఔను, నేను వింటిని. కాని నే నజ్ఞానిని. చదువురాదు.'

'నేను చదువుచుంటిని. అతనిని గూర్చి నతడు భువిపై నెట్లు జీవించినదియును, అత డొక వ ధనికునింటికి వచ్చుటయు, నాధనికు డతని గౌరవింపక టయు చదివితిని. చదువునపుడు నే ననుకొంటిని 'అ డు మహాత్ముడగు క్రీస్తును గౌరవింపకుండ నెట్లుం ఆలోచించిన నాకుకూడ నటువంటిది సంభవింపవచ్చు అతనిని తగురీతిని గౌరవించుటెట్లో నాకు తెలియ కాని ధనికు డతని కొర కేమియు జేయలేదు' అని నే లోచించుచుండగనే నిద్రవచ్చినది ఆనిద్రలో నన్ను పేరుపెట్టి పిలిచినట్లయినది నేను త్రుళ్లిపడి లేచి 'రేపు నేను వత్తును, నాకొరకు వేచియుండుము!'

వరో నాచెవిలో చెప్పినట్లు వినబడినది. ఒక్కసారి
దు. రెండు సార్లు వినబడినది. నీవు వత్తువో లేదో
ని యీమాటలు నామనసులో నెట్లుపడినవంటే యీ
మకు నన్ను నేనేయొకప్పుడు నిందించుకొనుచున్నవే,
ఉనికొఱకై నిరీక్షింపక నుండజాలకున్నాను" అన్నా
మాకన్న. సీతన్న తలవంచి యూరకున్నాడు. ఏమీ
ట్లాడలేదు. తన రెండవ గ్లాసు త్రాగుట పూర్తిజేసి
ఒక ప్రక్కను పడవేసెను. కాని మాకన్న దానిని
పి తిరిగీ నింపెను. 'మనస్సుతృప్తిగా త్రాగుము. మాదు,
మహాత్ముడు క్రీస్తు మనజనులలో జీవించినప్పుడతి దేవరిని
త్స్యము చేయలేదు. అతి దెక్కువగా నిరాడంబరులకే
ధచేయువాడు. బీదలతో నే యెక్కువ సంచరించువాడు.
తడు తన శిష్యులుగా మనసోదరులనే, మనవంటి
ర్మికులనే, పాపులనే యెన్నుకొనువాడు. అతడు
ప్పినదేమంటే 'ఎవడు తాను గొప్పవాడనుకొనునో
డు నీచుడగును, తక్కువగా చూడబడును. ఎవడు
ను తక్కువవాడ ననుకొనునో వాడు గొప్పవాడుగా
వింపబడును, వానికౌన్నత్య మొసంగబడును. మీరు
న్ను ప్రభువా యందురు. నేనుమీపాదముల కడుగుదును.
వడు మొదటివాడగునో వాడందరికిని సేవకుడుకావ
ను. ఏలననగా బీదలు, వినయవంతులు, సాధువులు,
యాళువులే పావనులు ధన్యులు."

సీతన్న టీత్రాగుట మరచిపోయెను వాడు వృద్ధుడు
బలువుగా మనసు మెత్తపడిపోవును. ఆమాటలను విను
ండగనే యతనికండ్లవెంబడి నీరు కారుచుండెను. 'ఏమి!
మరికొంత టీపుచ్చుకొనుము' అనెను మాకన్న కాని సీతన్న
గ్లాసు నవతలకు త్రోసివేసెను. తన వందనము లర్పించెను,
లేచిపోయెను.

'మాకన్నా, నాకృతజ్ఞతా వందనములు. నీవు
నాకాహారము నిచ్చితివి. సుఖింపజేసితివి. నాకు దైహిక
మానసికాహారములు రెండును దొరికెను. నాకు శరీర
సౌఖ్యము నిచ్చితివి. యాత్మౌన్నత్యము కలుగజేసితివి."
అని సీతన్న తెలిపెను.

'చాలమంచిది. మళ్లీరమ్ము. నాకవసరయినచుట్టూ
ఉండిన చాలా సంతోషము కలుగును,' అని మాకన్న

యనెను. సీతన్న వెళ్లిపోయిన పైని మాకన్న మిగిలిన టీని పోసికొని త్రాగి, గ్లాసులు పళ్లెము నవతలపెట్టి తిరిగి కిటికీముందు పనిచేయ కూర్చుండెను. కుట్టుచున్నంతసేపును తిరిగి తిరిగి కిటికీపైపే చూచుచుండెను. క్రీస్తువచ్చునని వేచియుండెను — అతనిని, అతని చర్యలనుగూర్చియే ఆలోచించుచుండెను. అప్పుడు వాని హృదయమున క్రీస్తువచనములే, నీతులే నిండియుండెను.

ఆసోద్దున నిరువురు సైనికులు నడచిరి. ఒకడు సర్కారువారిచ్చిన బోళ్లును, రెండవవాడు తన స్వంత పాదరక్షలును వేసికొనిపోయిరి తరువాత పొరుగింటి యజమాని మంచి వస్త్రములతో వెళ్ళెను. అపైని రొట్టెలవాడు గంపనెత్తుకొని వచ్చెను. వారందరు వెళ్లిపోయిరి. తరువాత నొకస్త్రీ యున్ని మేజోళ్లును, పల్లెటూరుజోళ్లును వేసికొనివచ్చెను ఆమెకూడ నీయిల్లు దాటిపోవుచు కిటికీవద్ద వాగెను. మాకన్న తలయెత్తి కిటికీనుండి చూచెను. ఆమె క్రొత్తమనిషి. చింకిగుడ్డలతో, దంటిబిడ్డ నెత్తుకొనియుండెను. ఆమె బిడ్డకు చలిగాలి తగులకుండ నుండుటకై గాలి కడ్డముతిరిగి గోడకు చేరువగా నిలబడెను. బిడ్డను కప్పుట కామెవద్ద నొకగుడ్డయైన లేదు. ఆమెగుడ్డలు వేసవి కాలమునకే తగినవి. ప్రాతవి, చింకివి. ఆబిడ్డ చలిచేత యేడ్చుచుండెను. తల్లి యూరుకోబెట్ట ప్రయత్నించుచుండెను గాని బిడ్డ యూరుకొనదు. మాకన్నకు కిటికీనుండి యేడ్పు వినబడుచుండెను. వాడు లేచి, వీధితలుపు లెరచి, మెట్లుదిగి "ఎమండోవ్, ఏమండోవ్" అని పిలిచెను. ఆమె విని తిరిగిచూచినది. "ఆచలిలో, మంచులో బిడ్డనెత్తుకొని యెందుచే నిలబడియున్నావు? రమ్ము లోనికి రమ్ము. వెచ్చగా నుండును. బిడ్డ యేడ్పు మానును." అని మాకన్న యామెతో ననెను. ఆమె యామాటల కాశ్చర్యపడెను. కాని యాకళ్లజోడు పెట్టుకొన్న ముసలివృద్ధుడు తన్ను యింటిలోనికి రమ్మని పిలుచుటజూచి వాని ననుసరించెను. వారు మెట్లెక్కి యాచిన్నగదిలో ప్రవేశించిరి. మాకన్న యామెను తన పరుపువద్దకు తీసికొనిపోయెను. 'అదుగో, అక్కడ కుంపటిచేరువగా కూర్చొనుము. చలికాచుకొని బిడ్డకు పాలిమ్ము' అని యామెతో వాడనెను. 'నావద్ద

పాలు లేవు. నే నుదయమునుండి యేమియు తినలేదు' అని యామె చెప్పెను. ఐనను బిడ్డను రొమ్మునకు చేర్చుకొనెను. మాకన్న తలవంచుకొని, బల్లవద్దకు పోయి యొక కంచమును రొట్టెను తెచ్చి, గూటిలోనున్న పులుసును కొంత కంచములో బోసెను. పొయ్యిమీదనున్న గంజి చూడగా నింకను కాగియుండలేదు. అందుచేత నాపులుసే బల్లపై నుంచెను. రొట్టెను కొన్ని ముక్కలుగా కోసి మేకునకున్న గుడ్డనొకటితీసి బల్లపై పరచెను. "ఇక్కడ కూర్చొని తినుము. నేను బిడ్డనుగూర్చి చూచెదను. నాకు బిడ్డలుండిరి. వారిని యాడించి యోదార్చుట నాకు తెలియును."

ఆమె బల్లవద్ద కూర్చొని తిన నారంభించెను. మాకన్న బిడ్డయొద్ద పరుపుప్రక్కన కూర్చుండెను. వాడు బిడ్డను తన పెదవులతో ముద్దిడుకొన యత్నించెను కాని పండ్లు లేని వాడగుటచే బాగుగా ముద్దిడలేకపోయెను. బిడ్డ యేడ్పు మానలేదు. అంత, మాకన్న బిడ్డను వ్రేళ్లతో కితకితలు పెట్టి నవ్వింప యత్నించెను. బిడ్డకు వ్రేలుచూపి నోటపాడుచునట్లు నటించి, తిరిగి యా వ్రేళ్లు బిడ్డనోట బెట్టుకొన బోయినపుడు తీసివేయుచుండెను. అవి క్రొవ్వుతో నల్లగా నిండియుండెను. ఆనల్లని వ్రేలివైపు చూచిచూచి యాబిడ్డ యేడ్పు మానివేసెను. మాకన్నకు సంతోష మయ్యెను.

ఆమె తినుచుండెను; తానెవరో, ఎచటికి పోవుచున్నదో, మాకన్నతో చెప్పనారంభించెను. "నేనొక సిపాయిభార్యను, ఎనిమిదినెలల క్రిందట నాభర్తను సర్కారువా రెక్కడికో దూరదేశమునకు పంపివేసిరి. నాటినుండి వారిగూర్చి నాకేమియు తెలియరాలేదు. నేనొక వంటలక్కగా నుంటినిగాని యీబిడ్డపుట్టినపిదప, చంటిబిడ్డతో పనిచేయలేనని వారు నన్ను పనినుండి తొలగించిరి. అందుచేత పనిలేక, తిండికొరకు మూడునెలలనుండి దేవులాడుచుంటిని. నావద్దనున్న సర్వస్వమును తిండికొరకు నమ్మివేసితిని. నేనొక దాది (Nurse) గా నుండదలచితిని గాని నన్నెవరు నుంచుకొనలేదు. నేను చాల పలుచగాను, బలహీనముగాను నుంటినట. అందుచేత పనికిరానని. ఇప్పుడే యొకవర్తకునియింటికి వెళ్లి యుంటిని. ఆయింట మాయూరిమనిషి యొక్తె పని నున్నది. ఆయింటి యజమానురాలు, వర్తకునిభార్య నన్ను పనిలోనికి తీసికొందునని వాగ్దానము చేసె ఇప్పటినుండియే నన్ను పనిచేయుట కుంచుకొనెదర కొంటిని, కాని వారముదినముల తర్వాత రమ్మని యా నన్ను పంపివేసెను. వారియిల్లు చాలదూరము, పాప బిడ్డ నాయాసపెట్టితిని, నే నలసిపోతిని. మేము బసచే యింటియామె మమ్ము కనికరించి, యూరకనే, ధ మున కిచ్చట నుండనిచ్చుచున్నది. ఆమెకు నేను కృత రాలను. లేనియెడల నెచటనుందునో, యెట్లు జీవింతు నే నెఱుఁగను."

మాకన్న దీర్ఘనిశ్వాసము విడిచెను. 'అయి నీకు వెచ్చనిగుడ్డయైన లేదా?' అని యడిగెను. "అయ్యో నాయనా, నావద్ద నెట్లుండును? నిన్ననే నా యా శాలువ నైదణాలకై తాకట్టు పెట్టితిని" అని యా పరుపువద్దకు పోయి బిడ్డ నెత్తుకొనెను. మాకన్న లేచెను. అలమారు తెరచెను. కొంతసేపు వెదకి వెదకి యొ ప్రాతకబ్బాను వెలికి తీసెను. 'ఇదిగో ఇది యంత బాగులేదు. కాని కొంత చుట్టపెట్టుకొనుటకు ప వచ్చును' అనెను. ఆమె యా కబ్బావైపు చూచెను. తిరిగి మాకన్నవైపు చూచెను, ఆ కబ్బా నందుకొనెను కళ్ల నీరు నించుకొనెను. మాకన్న యామెవైపునుం తొంగిపోయి పరుపుక్రింద వెదకి యొక చిన్నపెట్టెను తీ యందులో కొంతసేపు వెదకి యామెవద్దకు వచ్చి యె రుగా కూర్చొనెను.

"నాయనా, నిన్ను దైవ మాశీర్వదించునుగా దైవమే నన్ను నీకిటికీవద్దకు పంపియుండవలెను; బిడ్డ చలి గడ్డకట్టిపోవలసినది. నేను బయలుదేరునపుడు గాలి మం ముగానే యుండెను గాని యిపుడు చలి గడగడ వణకించు చున్నది. నిజముగా దైవమే నిన్ను కిటికీనుండి బైటి చూచి నన్ను కనికరింపజేసినాడు. దీనురాలను, పే రాలను."

మాకన్న చిరునవ్వు నవ్వి యనెను. "ఔను దేవుడు నాకు చెప్పినాడు. నేను కారణములేక, మా

నే కిటికీనుండి చూచుచుండలేదు." తాను కలగన్న గతి, నేను తనయింటికి దైవము వచ్చునని చెప్పినట్లు నొక కంఠస్వరము విన్నసంగతి మాకన్న యామెకు ప్పెను.

"అన్నియు జరుగవచ్చును" అని యామె లేచి బ్బా తోడుసుకొని, యదేబిడ్డకు గొంతచుట్టి తిరిగీ కన్నకు తన హృదయపూర్వకాభివందనము లర్పించెను.

"దైవముకొరకిది తీసుకొనుము" అని మాకన్న మె కైదణాల డబ్బు లిచ్చెను, "నీకాలువ తాకట్టు డిపించుకొనుము" అనెను. వారిద్దరు నొకరికొకరు మస్కరించుకొనిరి. మాకన్న తలుపు తెరచెను. ఆమె ళ్లిపోయెను.

ఆమె పోయినతరువాత, మాకన్న పులుసును గ్రిగా కాచి, దింపివేసి, సామానులను చక్కబెట్టి, నిచేయుటకు తిరుగ కూర్చుండెను. కాని పనిచేయు న్నంతసేపును కిటికీవైపు దృష్టినుంచుట మానలేదు; టికీ కడ్డముగా నొక నీడ రాగానే ఎవరు వచ్చిరో ని వాడటు చూచును. తా నెరిగినవారును, యెరుగని వారునుకూడ నటునుండి నడచిపోయిరి గాని ముఖ్యమైన రెవరును లేరు. ఆఖరు కొక పండ్లమ్ము ముసలిది రిగా వాని కిటికీముందర నే యాగెను. ఆమె యొక ంపతో పండ్ల నమ్మకమునకు తెచ్చియుండెను. అందు ాలభాగము చెల్లిపోయెనుకాని, యింక కొన్నిమాత్రము గిలిపోయినవి. ఆమెభుజముపై నొకకఱ్ఱ పేళ్ల గోనెసంచి యుండెను. ఏకో క్రొత్తగా కట్టుచున్న యింటివద్ద వాని నామెయేరుకొని, తనయింటికి గొనిపోవుచుండెను. ఆగోనెసంచివలన నామె యలసిపోయినది. భుజము మా ర్చుకొనుటకామె యచ్చట నాగినది. ఆమె పండ్లగంప నొకతిన్నెపై దింపి, సంచిని నేలపైపడవేసి, కఱ్ఱపేళ్లను కుదిలించుచుండెను. ఆమె యిటుచేయుచుండగా, నొక ంకిటోపీ పెట్టుకున్న బాలుడు గంపవద్దకు పరుగున చ్చి, యొకపండును లాగుకొని తనతో కొంటి పరుగెత్తి పోవుచుండెను. ముసలిది వానిని చూచెను. వెనుకకు తిరిగెను; వాని చొక్కాచేతిని పట్టుకొనెను. ఆబాలుడు విడిపించుకొనుటకెంతో ప్రయత్నించెను కాని ముసలిది వానిని గట్టిగా రెండుచేతులతోను బట్టుకొని, తుదకు వాని టోపీనూడ్చివేసి, జుట్టును పట్టుకొనెను. బాలుడు మొఱ్ఱోయని యఱచుచుండెను; ముసలిది వానిని కోపించుచుండెను. మాకన్న కంతాణివి జోడున గ్రుచ్చుటకు గూడ నాగలేదు. నేలపడవేసి, పరుగెత్తి మెట్లు దిగి వీధి లోనికి పారెను. అదినటలో వానికండ్లజోడు నేల బడెను. వీడు ముసలిదానిని జేరునప్పటి కామె బాలుని గూబలు పగుల గొట్టుచు, తిట్టుచు, వానిని పోలీసువాని కొప్పగింతునని బెదరించుచుండెను. బాలుడు విడిపించుకొన యత్నించుచు, మొఱ్ఱోయని కేకలు వేయుచుండెను. "నేను పండుతీసుకోలేదు. నన్నెందుకు కొట్టెదవు? నన్నువిడిచిపెట్టు, నేను పోయెదను" అనుచుండెను.

మాకన్న వారిద్దరి నడుమకుబోయి వారిని వేఱ దీసెను. పిమ్మట బాలునిచెయ్యి పట్టుకొని వాడు "అమ్మా, వానిని పోనిమ్మా. దైవముకొరకు వానిని క్షమింపుము." అనెను.

"ఆఁ !! వానిని క్షమించెదను? తిరుగ సంవత్సర మువరకు మరచిపోకుండునట్లు బుద్ధిచెప్పెదను. పోలీసు వాని కొప్పగింతును, దొంగ." మాకన్న ముసలమ్మను శాంతపరుప తిరుగ ప్రయత్నించెను. "వానిని, పోనిమ్మా, అమ్మా, యిక నెప్పుడు నట్లు చేయడులే. పోనిమ్మా. విడువు" అనెను.

ముసలమ్మ విడిచిపెట్టెను. బాలుడు పారిపోవ యత్నించెను కాని మాకన్న వానిని గట్టిగా పట్టుకొని "ముసలమ్మను, క్షమింపుమని వేడుము. మఱెప్పుడు నట్లు చేయకుము. నీవు దొంగిలించుట నేను చూచితిని" అనెను.

బాలు డేడ్వ నారంభించెను. ముసలమ్మను క్షమా ర్పణ వేడెను. "ఇకసరి, ఇదిగో నీకొకపండు తీసికొనుము" అని మాకన్న గంపనుండి యొకపండును తీసి బాలున కిచ్చెను. "దీనిఖరీదు నేను నీకిత్తును, భయపడకుము." అని ముసలమ్మతో ననెను.

"ఆల్లే పిల్లలను వీరు పాడుచేయుదురు, దొంగలను వారముకోజులవరకు లేవలేనట్లు తన్ని

యుండిన, మంచి బహుమానమై యుండును" అని ముసలి దనెను.

"ఆ! ఆ! అవ్వా, మనదృష్టిలో నది న్యాయమేమోకాని, దేవునిదృష్టికది యన్యాయము కాదా? ఒకపండును దొంగిలించినందుకు వానిని తన్నవలసినయెడల, మనపాపములకు మనకేమి చేయనగును?" అని మాకన్న నుడివెను.

ముసలిది యూరకుండెను. మాకన్న యామెకు రాజొకడు తనకు చాల ధనము బాకీయున్నవాని నెట్లు క్షమించెనో; ఆబాకీవారుకు తనకు కొద్దిగా బాకీయున్న యింకొకని నెట్లు బాధించెనో—ఆకథను చెప్పెను. ఆముసలమ్మ, కథను వినెను; బాలుడుకూడ నిశ్శబ్దముగ నిలబడి వినెను. "దైవము, మనలను క్షమింపుమనుచున్నాడు. లేనిచో మనము క్షమింపబడము. ప్రతివానిని క్షమింపవలెను. ముఖ్యముగ నజ్ఞానులయిన బాలురను మన్నింపవలెను" అని మాదిగవాడనగనే ముసలమ్మ తలవంచుకొని, దీర్ఘ నిశ్వాసమును వెలిబుచ్చెను. "ఔను, అదంతయు నిజమే, బాగున్నది. కాని వారు బొత్తిగా చెడిపోయినారు" అనెను. "అయితే, ముసలివారయిన మనము వారికి బుద్ధి గరపవలెను." అని మాకన్న బదులు చెప్పెను.

"నేను చెప్పునదియు నదే. నా కేడుగురు బిడ్డలుండిరి. ఇప్పు డొక్కకూతురే బ్రతికియున్నది" అని యామె ప్రారంభించి, తాను కూతురితో నెట్లు జీవించుచున్నదో, తన కెందరుమనుమ లున్నారో చెప్పి "నా బలమంతయు నిపు డుడిగిపోయినది. ఐనను యింకను నేను కష్టపడుచుందును. నాకు నా మనుమలను జూచిన చాల యిష్టము. వారు చాలా మంచిపిల్లలుకూడను. వారు నన్ను ప్రేమించునంత నెవ్వరును ప్రేమింపరు. నే నింటివద్ద నున్నపుడు మాసరళ నన్ను విడిచిపెట్టదు. ఎప్పుడునూ అమ్మమ్మ, మంచి యమ్మమ్మ, ప్రియమైన యవ్వా—" అనుచు ముసలమ్మ కనుల నీరుపెట్టుకొనెను. అచ్చటనేయున్న బాలునివంక జూచి యామె "ఔను, పాపము, ఇతడు చిన్నబిడ్డడు, దైవ మితని నాశీర్వదించు గాక!" యనెను.

ఆమె గోనెసంచిని భుజమున కెత్తుకొన యత్ని
చెను. బాలు డామెవద్దకు చేరి యనెను "అమ్మా,
దారినే నేనును పోవుదును. నేను సంచి నెత్తు
వత్తును లెమ్మా, పద."

ముసలమ్మ తలవంచుకొని, వానిని సంచి నెత్తు
నిచ్చెను. వారిద్దరును కలిసి వీధివెంబడి పోవుచుం
ముసలిది మాకన్న తీసిన పండు ఖరీదు నడుగుట
మరచిపోయెను. మాకన్న చాల సేపటివరకును వా
రును మాటలాడుకొనుచు కలిసి వెళ్లుట, చూచుచు విన
నిలబడిపోయెను.

వా రిద్దరును పూర్తిగ దృష్టినుండి తొలగిపో
పిదప; మాకన్న యింటికి మరలెను. మెట్లమీద పడి
విరిగిపోకుండిన తన కండ్ల జోడు చూచి తీసికొ
తిరిగి కంసాలి పుచ్చుకొని పనిముందు కూర్చు
కాని త్వరలో చీకటిపడెను. పనిచేయుట కేమి
కనబడకుండెను. వీధి దీపములు వెలిగించువాడు,
ములు వెలిగింప నా వీధిలోనుండి పోవుచుండుట చ
'దీపముల వేళయైనది' యనుకొని లేచి దీపపువత్తి
రించి వెలిగించి పైని వ్రేలాడగట్టి పనిని తిరుగ నా
భించెను. కొంతసేపటిలో తాను కుట్టుచుండిన జో
పూర్తియయ్యెను. దాని నిటునిటు త్రిప్పి, కలం
కుట్టును చూచి, బాగుగా తయారైనదని తృప్తిజెం
తన సామగ్రి నంతయు చక్కబెట్టి, చెత్తనంతయు
గించి, దారము కంసాలి తోలుముక్క తీసి దాచి దీపపు
దించి బల్లపై పెట్టెను. గూటినుండి మతగ్రంథమును
తొలినాడు తోలుముక్క గురుతుగాపెట్టి యుం
పుటను తెరువదలచెను గాని యది మరొకచోట తె
కొనెను. ఇంతలో మాకన్నకు తటాలున గతరాత్రి
జ్ఞప్తికివచ్చి తలచుకొనుచుండి నంతలో తనవెనుక
శబ్దము వానికి వినబడినట్లయ్యెను—గదిలో నడు
చప్పుడు—వాడు వెనుదిరిగి చూచెను. ఆమూల చీ
లో మనుష్యులు నిలబడియున్న ట్లయ్యెను—
పోల్చుకొనజాలని యాకారములు......

ఒక కంఠస్వర మతనిచెవిలో చెప్పినటు లయ్యెను. ...ాకన్నా, మాకన్నా, నీవు నన్నెరుగవూ?" "ఎవరది" ...నేను" అన్నది కంఠస్వరము. చీకటికోణమునుండి నీతన్న ...ాపములు బయటికి కనబడెను; చిరునవ్వు నవ్వెను; ...రికి మేఘమునవలె నదృశ్య మయ్యెను. అప్పుట నెవరును ...రు.

"ఇదిగో, నేనుకూడను" అని కంఠస్వరము విన ...డెను. చీకటివంటి యా స్త్రీ తన చంటిబిడ్డ నెత్తుకొని ...నబడెను; తరుణి చిరునవ్వు నవ్వెను; బిడ్డయు నవ్వెను; ...రుకూడా మాయమైరి.

"ఇదిగో నేనును" అని మరల వాణి వినవచ్చెను. ...ముసలమ్మయు బాలుడును గోచరమైరి; చిరునవ్వు ...వ్విరి; అంతర్హితులైరి.

మాకన్న హృదయ మానందభరితమయ్యెను. దైవము ...కసారి తలచుకొనెను; కళ్ల జోడు పెట్టుకొనెను; పుస్తక మెచట తెరచుకొనెనో యచటనే చదువ నారంభించెను. పత్రముయొక్క పైభాగమున నా డిట్లు చదివెను:—

"నేను క్షుధితుడనై తిని. నీవు నా కాహార మొసంగితివి. నేను పిపాసాబాధితుడనై తిని. నీవు నాకు పానీయ మొసంగితివి. నేను నీ కపరిచితుడనై యుంటిని, ఐనను నీవు నా కాశ్రయప్రదాతవైతివి."

మరియు పత్రముయొక్క దిగువభాగమున నీ రీతి చదివెను:—

"నా సోదరులైన వీరిలో నే యల్పమున కైనను నీ వెంత యొసంగితివో, అంతయు నీవు నా కొసంగితివి"

మాకన్న తన కల స్వప్న కాలేదనియు, యా ధార్యమై వర్తిల్లెననియు, నిజముగ నాడు ప్రభుకు తనకడకు వచ్చె ననియు, తా నతనికి సుస్వాగత మొసగి యాదరించె ననియు తెలిసికొని సంతృప్తు డయ్యెను.

---

## స్వప్న భంగము

మల్లవరపు విశ్వేశ్వర్రావు గారు

నవ్యోమహాన స్వప్న
సంతతానంద ప్ర
పంచమ్ములో సుప్తి
నింతకాలము దాక
వింతవింత సుఖప్ర
వంతీజలాలలో
తేలియాడుచు నింద్రి
యాలు నల్పెను కేళి!

నీలాంబుదాలలో
దూరి దోబూచాడి,
గాలిమేడల శాంతి
గోరి దేహము వాల్చి,
శంపాలతల పూలు
త్రుంపి దామము లల్లి
కవితాప్రియామంజు
కంఠాన మెలివైచి,

సత్యసుందరభావ
సంకల్పనాకేళి
నిత్యమానందైక
నిరతికాలముబుచ్చి,
అత్యద్భుతమ్ముగా
నాటలాడిన జీవి
ఈహాతాస్వప్న భం (?)
గమ్మెట్లు సహియించు?
ఈ వాడబారునై
హికచింత లెటు సైచు?

జ్యోత్స్నాకరాలలో
జోగునిద్రల నుండ
ధూళిధూసరలోక
మేల నన్ను స్పృశించి
మేలుకొల్పి ఎడంద
నీలీల విదళించ?

కాలగర్భము విచ్చి
కరడువారిన భావి
నేల నాకనుదోయి
నీలీల తోపించ?
ఏల దుఃఖసుఖాల
నీరీతి మెరిపించి,
సుఖశంప మరిగించి,
శోకాంబుదమె పెంచి
కరిగించి కరిగించి
కారుజల్లుల ముంచి,

లోకమెల్లను శీత
లీకరించి ఘనీభ
వించి కంపిల జేసి,
ఈజీవనిర్ఝరీ
వారి మంచుగ బేర్చ
క్రూరహృదయమేల
'కాల' కింకరు కింక?

కారుచీకటి దివ్వె
కయి నొంటిగా బూని
దారి జేసుకపోయి
పారమ్ము జేరంగ
నీలేశ భావనా
శీలి కెట్లబ్బునో!
అరవిచ్చు నాశ ల
ల్లనె వాడి రాలగా,
ఫురివిచ్చు నాశయ
మ్ములదృశ్యమైపోవ,
ఆగి వెల్గిను భా
వ్యాలయ జ్యోతులే
యారిపోవునో ఏమొ
యను భీతి దహియించ,
ఆదివ్యస్వప్నాలు
ఆయువ్వన దురాశ (?)
నవసి కృశించునో!
నిలిచి జీవించునో!

———

# పెద్దపండుగ

లీలావతి

రాత్రి ౧౨ గంటలయింది. ప్రపంచమంతా నిద్ర పోతున్నది. అష్టమీచంద్రుడు తుదిసారి ప్రపంచంమీద దృష్టివిసరి నాటికి సెలవుతీసికొన్నాడు. నక్షత్రాలువాటి పనుల నవిచేసికొంటూ అగాధాకాశంలో రువులు పెట్టుకున్నవి. రాత్రి నిశ్శబ్దంగా ఉన్నది.

సుమేరుని హృదయములో తుఫాను రేగుచున్నది. అతనికి సరిగా వారంరోజులనుంచి నిద్రాహారాలు లేవు. ఎప్పుడూ ఒకటే ఆలోచన. వాడిపోయిన మొగంతో ఆజీర్ణగృహంలో, ఒకమూలగదిలో, మట్టినేలమీద, విరియబోసుకొనిన వెండ్రుకలతో కూర్చొని విచారిస్తున్నాడు. తనసమస్యకు ఉత్తరం రాలేదు. మధ్యమధ్య నుస్సురను వేడినిట్టూర్పులుమాత్రమే వస్తున్నవి. నాడు ౧౨ గంటలయినను, ఎంతప్రయత్నం చేసినను నిద్రరాలేదు. "సుమేరూ! నీవు వ్యర్థుడవా? నీకు పౌరుషం లేదూ?" ఈ Challenge ని సాంత్వనవాక్యములలో కప్పి పుచ్చలేకపోయినాడు. ఈ ప్రబోధాన్ని పొందికూడ అచేతనమువలె చచ్చుటా? — లేచి చల్లని గాలికొరకు బయటవచ్చి కూరుచున్నాడు. ఎదురుగా చింతచెట్టు దయ్యమువలె గాలికి కొట్టుకుంటున్నది. "ఏమి! ఆరోజులు—దేశచరిత్రలో పవిత్రమైన ఆరోజులు—ప్రతిమానవుని హృదయసీమలోకూడ చిరంతన నివాసమేర్పఱచుకొని యుండవలసిన ఆరోజులు—ఆకృతయుగపు దివసములు—బ్రహ్మనాథదేశపు ప్రతిభ తక్కు దేశాలన్నిటికి వెలుతురిచ్చిన ఆరోజులు—విజ్ఞానము వెదజల్లినరోజులు—ఆపురందరాది ప్రభువులు—ఆప్రజాపాలనాసమితులు—ఆఎన్నికలు—దేశము నిద్రపోతున్నదే! స్వేచ్ఛావిక్రయముచలిపి గుండెమీద చేయివైచుకొని నిద్రపోతున్నదీ దేశము?— వీండ్ల హృదయాలలో అగ్ని లేదూ?—వీండ్ల శరీరాలలో ఉత్తేజములేదూ?—వీండ్ల ఆత్మలలో వికాసంలేదూ?—వీండ్లకు ప్రాణం లేదూ?—చుట్టుముట్టిన అగ్నిని వీండ్లు చూడలేరూ?—దాని నార్పివేయ ప్రయత్నింపలేరూ? ఔరా! ఔరా! ఎటువంటి దేశంలో—ఎటువంటి ధైర్యవంతులకు — ఎటువంటివారు జన్మించారు. తుచ్ఛదాస్యంలో సంతోషిస్తున్నారా? అదేపరమావధిగా భావిస్తున్నారా?— మీకు విమర్శనజ్ఞానము లేదా? మీవిజ్ఞానముతో సహా—మీహృదయాలెవరికైనా పట్టు వెట్టారా? అయ్యో! ఇంత మౌఢ్యమా? ఇంతమాంద్యమా?—వెనుక ఆసభాగ్రంలో ఆపురందరుని వంశీయులు నిలచి న్యాయంకొరకు తాము తమపుత్రులను, తమవంశీయులను బలిగా ఇచ్చేశారు. ఆ ధైర్యముపోయి పిరికితనం ఆవేశించిందా? మీకు దేశము కనబడుటలేదా? మీకన్నులు పశువులనేత్రములా? మీరు సరియైన వెలుతురుకూడ చూడలేరూ? మీకింక ప్రబోధము కలుగలేదూ?—మీకొకరిమాట వినపడదూ?——"

"తక్కినమాట లావాయువులో విలీనమై పోతున్నవి. మఱికొంతసేపటికి ఆమనస్సులోనే ప్రతిధ్వనిస్తున్నవి. క్రమముగా కాలము గడచిపోతున్నది — ఒకనిముషము వెంబడి మరొకనిముషము—ఒకగంట వెంబడి మరొకగంట లేచి అటూయిటూ తిరగడం ప్రారంభించాడు. ఆముఖం ప్రసన్నభావముచేత ప్రస్ఫుటముగా మొదలుపెట్టింది.

సుమేరుడు ధనికులబిడ్డడు కాడు. సామాన్యసంపన్నులకు జనించాడు. కాని వారాతనికి శ్రమయనుకొనక విద్యాదానంచేశారు. సంస్కృతం మవిచ్ఛిన్నంగా పఠించాడు. (Latin) భాష నేర్చుకొన్నాడు. ఆరెండిట్లో సమధికవిజ్ఞానముతో సత్యవిమర్శనముతో గొప్పగొప్ప చరిత్రలు చదివాడు. గొప్పవారిజీవితచరిత్రలు; ప్రథమముగ తనదేశచరిత్ర. మునుపటిరోజులలో చక్రవర్తులుంటుండేవాండ్లు. వాండ్లు మహాక్రూరులైనందున వాండ్లను తరిమివేసి ప్రజాస్వామిక పరిపాలనను నెలకొల్పారు. ఎన్నికలమీద నొక సంఘముకూడేది. వారున్నతౌదార్యములుగలవారి నిద్దర నెన్నుకొనేవాండ్లు. న్యాయపరిపాలన కింకొకడుకూడ ఉండేవాడు. వీండ్లముగ్గురివలన పరిపాలనక్రమము జరుగుతుండేది. ఆరోజులలో ప్రతి

ొద్దికాలంలో అతనికళాశాల నిజంగాకళాశాలలైు అన్ని కములకళలకు ఆటపట్టయింది. అందులో శాస్త్ర జ్ఞానముగూర్చి శ్రమపడేవాండ్లు, అందులోనే గ్రంథములను చదివి సూత్నాంశములను గ్రహించే వాండ్లు. ప్రత్యేకభావములలో ఒక్కొక్కదాంట్లో పండితులు. వారు దానిలో మంచి గ్రహింపవలెను. ఉచితవిద్య. ప్రతిరోజు ప్రతియింట కొద్దికొద్దిగా ధాన్యమో పణమో గ్రహించేవాండ్లు. ఇవంతానిలన, వాండ్లశ్రమ వాండ్లకు భోజనం పెట్టేది; నిరుపయోగులయిన జనబాహుళ్యములో రత్నములను తెలిసినంతవఱకు దేరాదు. అందఱుకూడ అతడెంతపట్టుదల కలిగియున్నాడో అంతపట్టునిలగలవాడే. దినదినాభివృద్ధి చెందుతున్నది. ప్రతిగ్రామంలోనుంచి కూడ ఒకరో యిద్దరో ముందు మనుష్యులను తయారు చేశాడు. ప్రతిమాండలిక వీరుల చరిత్రలను, భక్తిశ్రద్ధలతో పఠించాడు — పఠింపించాడు. మత విషయంకూడ — దేశ చరిత్రప్రాముఖ్యము. వక్తృత్వకళలవాండ్లుద్యోగనకు, హృదయముకలవాండ్లు తక్కువపనులకు కొన్నికొన్ని గ్రామాలు కలిపి సంస్థలు, వాటికి (Representatives). వీండ్లంతా ఒకకొండదగ్గఱ పల్లెటూరిలో పాకాలలో సమావేశము కార్యాలయము. మొదటి అధ్యక్షుడు తానే. ఆజ్ఞలు వర్తమానములు — అంతా కొద్దికాలంలోనే విచిత్రపరిపాలన యేర్పడ్డది.

పిదప వక్తలనుపంపి తానుకూడ బయలుదేరి పల్లెటూళ్లకు వెళ్లి న్యాయాన్యాయవిచక్షణ ఆరంభించాడు. ఏమాండలిక సంస్థ దానికి. వాండ్లు ఫిర్యాదీలను విచారించి వాండ్లకునచ్చచెప్పి కోర్టులు మాన్పించారు. గ్రామాదులలో విద్యావ్యాపన జరుగుతున్నది. దీనికి ముఖ్యమైనవి. ప్రథమమున రెండే ఆయుధాలు. ఆమాండలికవరుల చరిత్రల నుద్ఘాటించుట, మతవిషయికభయము. ఈప్రకారం మన్నిచోట్ల పెరిగిపోయింది. మాండలికసంస్థలు న్యాయస్థానాలైనవి. ప్రతివిషయంకూడ శ్రమపడి కృషిచేసి నిజముసాధించేవారు. పిదప బోధన. ఒక్కొక్కప్పుడు బోధన సరియైనపాకంలో నిజమును బయల్పఱచి దోషిని సిగ్గుపడి క్షమాపణ వేడుకొనునట్లు చేయుచుండెడిది. అప్పటినుండి వాడే ఆసంస్థకొఱకు పాటుపడేవాం

డ్లలో ముఖ్యుడు. ఈవిధంగా తీర్పులుచెప్పినందుకు, వారి దగ్గఱ కొంతరుసుముకూడ వచ్చుచెప్పి వసూలుచేసేవారు. కోర్టులకొఱకు వేలకొలది ధనముపోయడంలేదూ? అందులో సహస్రాంశం. ఇంకోవిషయంకూడ; కోర్టులలో జరిగే తీర్పులలో అన్యాయము, ధననాశనము. వారి మృదుమధుర వచనాలు సత్యమున కుద్రేకంకలిగించింది.

ఇందులోనే పరిపక్వులు పెట్టుబడులు. రాజ్యంలో దొంగలబాధ తక్కువయింది. మళ్లీ ఒకసారి శాంతము దేశమధ్యమున బయలుదేరింది. చేసేపనులలో రాజద్రోహము లేదు. అంతేయు శాంతము సమకూర్చుటకు, ప్రజలు వారిని వారు కట్టుబాటులలో నుంచుకొనుటకు.

ధన మెక్కువగా చేరడం మొదలుపెట్టింది. దానితో కావలసిన పనిముట్లు, గ్రంథాలు మొదలైనవి కొనుటలారంభమైనవి. మనుష్యుల అభివృద్ధికి ముఖ్యమయింది — ఆశ తగ్గింది. ఇదే పట్టణాలలో ప్రాకింది. జమీందారులుకూడా సానుభూతి చూపారు. యువనేనలు భయముతో కనిపెట్టుకునే యున్నవి. కాని యిందు దురూహ లేదు. కోర్టులకు చాలారోజులు సెలవులు వచ్చినవి. కాఫీహోటల్సు మొదలైనవాటిలో వంటవాండ్లకు తీరిక దొరికింది. ప్రతిపనికూడ వీండ్లే చేస్తుండేవాండ్లు. కొన్నికొన్నిట్లో కుబేరుడు తనతో సమానులను, తనపిదప తనపని కొనసాగించువాండ్లను తయారు చేశాడు. ప్రతివాడు బలిష్ఠుడే. ప్రతివాడు విల్లునమ్ములు పట్టనేర్చినవాడే. ప్రతివాడు విద్యావంతుడే. ఉద్యోగాలిచ్చే కష్టము — యాచించే కష్టముకూడ తప్పింది. ఒక్కపన్ను వసూలు చేయుటమే పరిపాలనాధికారుల క్రింద. దుర్గుణాలు పోయినవి. కావలసిన ప్రతివస్తువు స్వదేశములోనే చేయడం — అనే అందఱు ఉపయోగించడం. ఆశకొఱకుగాను సాగుకు నేరుసెనగ పంటలు పడిపోయినవి. దేశమంత సుభిక్షంగా ఉంది.

శాస్త్రపరిశోధనలలో (Scientific improvement) జయము లభించింది. ఏకార్యమైన పట్టుదల కలిగిచేస్తే అవుతుంది. వీరి శాస్త్రపరిశోధన లితర దేశాలను మించినవి. ఇతర దేశాలకు ప్రాకినవి.

మతవిషయములోకూడ ఎక్కువ ప్రయత్నము జరిగింది. ఏమతమువారు లామతములో. ప్రకృతికంటె మనస్సే యెక్కువ. మనోబలమువలన కానికార్యాలు లేవు. ముఖ్యంగా యోగశాస్త్రం అభివృద్ధిచెందింది.

ఈవిధంగా దేశమంతట ప్రాకిపోయింది. పరిపాలనాధికారుల కెప్పుడూ విశ్రాంతే. కోర్టులలో గబ్బిలాలు. పెద్దపెద్ద రాజకీయభవనాలలో గబ్బిలాలు. ఇదివరకంతా దేవాలయాలలో స్థిరనివాసం యేర్పరచుకొని ఉండేవి. ఇప్పుడక్కడనుంచి transfer కావలసివచ్చింది.

పరిపాలనాధికారు లీమార్పు మొట్టమొదట అశ్రద్ధగాచూచినను, పిదప మోసం గ్రహించారు ఆఖరుకిదొకసామంతరాజ్యంగా మారిపోయింది. వాండ్ల కాకప్పంకూడ వీండ్లే ముందే చెల్లించివేయడంకూడ ప్రారంభించారు. Revenue Department కూడ మూలపడ్డది. ఇక వారు చేయునదేది?

కొన్నాళ్లు సుమేరుని బంధించారు. కాని వెంటనే అతనిప్రదేశము మరొకరాక్రమించుకొన్నారు. తిరిగి యెప్పటివలెనే పనులు సాగుతున్నవి. సుమేరుని నిర్బంధము, లోలోపల అందరికి క్రోధాగ్ని రగుల్కొల్పుతున్నది; కాని అది పైకి పొంగలేదు.

ప్రథమప్రయత్నము నిష్ఫలమయింది. క్రొత్త పన్నొకటి విధించారు. ధనహీనమైన దేశము తిరిగి ధనవంతమయింది. ఆపన్నుకూడ సెమ్మతిగానే యిచ్చేశారు.

ప్రజలలో "సుమేరు" పదమే ప్రోత్సాహకర సాధనమయింది. దేశమంతా నూతనజీవముతో కలకలలాడుతున్నది. అంతమంది మనుష్యు లున్నప్పటికికూడ దానిహృదయము గంభీరమయిపోయింది. అది యితరుల కెవరికి లోబడదు. భేదోపాయము లాభించలేదు. సుమేరుని సామదానభేద దండోపాయము లుపయోగించి వేరు చేయ ప్రయత్నించారు. కాని అదిసాధ్యంకాలేదు.తుదకు సుమేరు డోడిపడినను, కృతసంకల్పుడు కాలేడేమో?— ఆ నూతనోత్సాహములో అతనుమాత్రం ఆగగలడా?—

సేవలో ఒక్కదేశీయుడుకూడ లేడు. అంత విదేశీయులే. కాని అంతిమప్రయత్నముకూడ చేసి మించ సంకల్పించుచున్నారు. అనవసరంగా ఒకచో దౌర్జన్యం చూపించారు.

కాలం సమీపించింది. పరికరణాలన్ని సిద్ధమై వస్తుతత్వం బాగా గ్రహించి రహస్యంగా అవగాహనం కొన్న దేశీయుల కాథయంకరసామగ్రిని విభజించడం (decompose) కష్టం అవసరం లేకపోయింది. మీద యువను లాశపెట్టుకొనియున్నారో ఆ కాళ్ళల దెబ్బతిన్నది. వారు స్థితి గ్రహించారు. Tennys కూడ చెప్పాడు.

"The old order changeth yieldi place to new"

సుమేరునకు విమోచనమయింది. శాస్త్ర మతము—కళలు—ప్రజామూర్తులలో జయజయాభివం ములతో అతనికి స్వాగత మిచ్చినవి. తాను ప్రథమ మున్న గ్రామమే నగరమయింది. ఆ కార్యాలయంలో "ప్రథమాధ్యక్షున కభిషేకము"ని ప్రకటనమయింది. అ మంది వచ్చారు. ఎక్కడచూచిన జయజయశబ్దాలే— సంతోషమే అధ్యక్షుడు నిలవబడారు.

అప్పుడొక పురుషుడువచ్చి తనచేతిలోనున్న పు మాలను చిఱునవ్వునవ్వుతూ వేశాడు సుమేరునిక ములో. సుమేరుడు తేలిపాఱచూచి "నాకుదో్భధా కలిగించింది మొదట, నాపిదప నాప్రదేశంలో జయ దంగా నా పనికొనసాగించింది—దేశోపకారం చేసింది. కు కీర్తిసంతోషము తెచ్చింది నీవేనా రమణీ!—" కౌగిలించుకొన్నా డావ్యక్తివి ఆమె చూచుచుండ స్త్రీవ్యక్తి అయిపోయింది.

ఆనందపతులకు ప్రజలంతా సంతోషంతో దీ చారు. ప్రకృతికూడ ప్రణయపూర్వకంగా మందహ వర్షాలు చిలుకుతూ వారిని ఆశీర్వదించిది—ఆరో పెద్దపండుగ.

---

## రవిక్ష — (సర్కసు)

కొత్తపల్లి సూర్యారావు గారు

ళి నరవిద్యవాఁడ! నినువంటి స్వతంత్రుఁడు లేఁడు ముజ్జగం
బుల నినుఁ బోలు నేర్పరియుఁ బుట్టఁడు నీచతురత్వ మెంతయుం
దెలిసి వచించువాఁడు గణుతించెడువాఁడును లేఁడు సత్కవీ
శుల నొకఁడైన నీచరిత చోద్యముగాదె జనాళి కెన్నఁగన్.
గీ. నీకులాంగనిజంతు వెందేనిఁగలదె - సర్వదమనుండ విష్వ డీజగములోన
నీవ, కావుననే భరతావనీప్ర-శస్తి నేఁటికిఁ గొంత నీచాయ నిల్చె.
మ. మృగరాజుం గరి గూడి యాడుఁ బులితో మిత్రత్వముల్ మేఁకచే
యు గుడారంబున నీప్రభావము పురాయోగ్యాశ్రమఖ్యాతి నీ
యుగమం దున్నది చెల్లరే నిపుణ, నీ యుద్యోగమందున్న వా
రు గరిష్ఠాశ్రమవర్యు లందఱును స్త్రీలుం బూరుషుల్ నిత్యముల్.
పూర్వ రా జెవండొ పులిని మేఁకను నొక్క-చెఱువులోనఁ ద్రాగఁ జేసె నీర
టందు; రొక్కకంచ మందు నీపటకుటీ-రంబులోనఁ ద్రాగు సరిది గాదె.
ప్రజలు నీ కెన్నఁడో యప్పు పడిరి దాని, కెవ్వరికిఁ బద్దుపాయలు నెచ్చుఁదగ్గు
వడ్డియును గొట్టివేఁత నిర్బంధమన్న-మాటయుండ దదెప్పుడో మాది మాకు
నిచ్చుటే చాలు నని నీవు ఋణముతీర్చు-కొనుటయేచాలు ననియును జనులు నుంద్రు
[1]ఏకరగ్రాహియును నీకు నింతలొచ్చు-నీవలె [2]వసూళ్లఁదీసెడు తీవియందు
గడువు పెట్టఁడు; తెమ్మనియడుగ; వెవఁడుఁ-జిల్లిగవ్వయు మానఁడు చెల్లువెట్టు
నీవుగూర్చున్న చోటికి నియతివచ్చి-రెండుమూఁడుపూటలను నీవుండినట్టి
నాళ్లలో నెప్పటికి నప్డు న్యాయమైన-చీటి యిచ్చెదు నీకెంత చెల్లుబడియొ
పాలకులు సొమ్ము దెమ్మన్నఁ బండ లేదు-కఱవు, పసువులు చచ్చెను, గాలివాన,
వఱద నష్టంబు, మల్లెలువట్టె విత్త-నంబు మరలదు, వచ్చు వర్షంబుదాఁక
గావు సేయుఁడు, గొడ్లకు గడ్డిపఱక-కొఱకు సేద్యంబు నేఁజేసికొందుఁగాని
యనును గమ్మతగాఁడు-మాయరఁగుఁగొట్టి-వైచి రంధకారంబు దీపంబు లేదు
వీథిపొడుగున-గాల్గొప్పివి ఱఁగఁబడితి-దారిలో గోతులను బూడ్చుదారి లేదు

1. కరగ్రాహి=Collector. 2. వసు+ళ్లు=వసూళ్లు.

పన్నుపన్న నివత్తు రన్నలుకుఁబల్కు-నాగరకుఁ, డెందుఁజూడశూన్యంబు డబ్బు
కంటఁబడలేదు గుజ్జంబుగొంటి నిన్న-గాసు కానయ్యెనీనెల కానిలెండు,
పోయిరండను ధని; యిన్నిపోవు నిన్నుఁ-దలఁచినప్పుడు ప్రజకు, వత్సరముదాఁటె
నేలరాఁడయ్యె నేరాజ్య మేగినాఁడొ-తీఁగపై నెక్కి యొకకుజ్జనాగులాడె
నెన్నిబంతుల నెగిరించెఁ గన్నెయొకతె-చచ్చునాటకములు వచ్చి చంపెగాని
యనుచు నెకు రెదు రేచూచు చనుదినంబు-నెల్లవారలు నేకారి తెల్లవాఱి
చూచి గోడలపైనున్న చోద్యములను-మేను మఱఁతురు పొరుగూరిలోని కూఁతు
నల్లు రమ్మని జాబులు, నత్తవారి-యింటికేగిన కొడుకున కెదురుచూచి
యింతివార్తలు-నీవన్న నెంతొసంత-సంబు జనులకు నిలునిండ సరకునిండు
బంధువులు స్నేహితులును శోభనదినంబు-లరుగవలెనంద్రు నీవన్న నంగడూన
నిన్నువచ్చెడివానిని నిన్నమొన్న విందు రప్పటినుండియు విత్తమెల్లఁ
గూడఁ బెట్టుచు నడిగించుకొనకయిస్తు-రదియె ప్రతిచోట నూళ్లలో నప్పలిచ్చు
నట్టివారును బుచ్చుకొన్నట్టివారు-నెఱిఁగి యాగతిఁ జరియింతురేని యెంత
గౌరవంబుండు నిరుపుర కారయంగఁ-దగవు లుండునె యెందైన దండుగన్న
మాట యుండునె యేలయో మాటువెట్టి-కాలదోషంబులనుచును గడువులనుచు
మానిపించుకొనుచు నన్నమాట నిలువఁ-బెట్టుకొనకుండ నలతలఁ బెట్టిపడుట
న్యాయముగ నున్నదా యూహసేయ రెవరు-సుందరులఁగాంచి వలతురు మందయాన
లంద్రు; పురుషులు వలచెద రంద్రు రాము-మోహనాకృతికిని నీదు మొగముచూ
కుండ బాలుర వృద్ధులు దండిమగలు-స్త్రీలు జరభులు పడుచులుఁ దెరలి నీక
రగ్రహణ[1]లాలసతకు మెచ్చి రారె నిశల-శక్తిమంతుని మెచ్చని జగముగలదె.
పటకుటీవాసి నీవంటివాఁడె యెల్ల-యవయవంబులను స్వవశం బాచరించి
కొనఁగ నాలైదవయవముల్ గుదియఁబట్టి-పర్ణకుటిలోని యోగి గర్వపడఁదగునె
నీకు నిప్పలు కాలవు, నిన్నుఁ గత్తి-నఱకఁజాలదు భువనంబు కాచియుండు
నాకసం బెత్తి యాడించు నవని పఱపుఁ వలెనె రక్షించు భూతము ల్పాపమూను
నేనుఁ గెదయెక్కి-నను నీకు నెగ్గులేదు-గుండు తలఁబడ్డ నొప్పిలే దెందుగడ్డి
పోఁచద్రెంపిన రీతి నీవుగొలుసులను-ద్రెంపుదువు; నిన్ను మెచ్చెదఁ బ్రియుఁడ యొక్క

1. కరగ్రహణ=చెట్టపట్టుట; పన్నుతీయుట.

డాని కై — నాటకములందుఁ దరుణవేష-ధారులనుగాంచి తరుణులు తగులుగొందుఁ
బెట్టినయది తామేమొ వేషమందె-యట్టులుండుము వట్టియ షండఅవలె
డొక్కి-వారమె యనుకొక చక్కనైన-వారలమెకాన వలచిరీవనితలనుచు
ననుకొనుచుఁ బొంగి ముగ్ధల మనసునాచి-కొనెడువారలు గలరు నీవనిన, నేనుఁ
గక్కినను మోసెదవుగాని యినుపపెట్టె-యెత్తుకొనిపోవఁ జాల విల్లింతమీఁద
నుండి దుమికెదవేగాని మొండిగోడఁ దూఁకఁజాలవు దీపసందోహవిశద
పటకుటీరంబులోన నీప్రజ్ఞయెల్ల-నాటకునివలె నేను సౌందర్యరాశి
ననుకొనుచుఁగాని నేనె సింహబలు నంత-వాఁడననిగాని పొంగవు బళిర! యట్టి
వాఁడవౌటనె నీయూట వసుధలోన-సాగుచున్నది జయము నీసంఘమునకు
ఉడుపతోఁకను స్రేలాడి యురుతరంపు-కోటలెక్కిరి, చెఱసాలగోడదాఁగ
లోకంపైనొక రెక్కి తొంగిచూచి రనుచుఁ-జెప్పుకొనుమాటలెల్ల నీ చెవిని బడిన
నేమిపన్నెదవోయను నించుకంత - భయము లేదయ్య మాకు నీవలన జెట్టి
ఎవ్వఁడైనను దనవృత్తి నిర్ధరీతి- నట్టహాసముగాఁ జేయ యశముగల్గ
కొంచెమున్డిన గొప్ప లోకులకుఁదోఁచు-నట్లు చేయుచు మేలుమే లనఁగ మెలఁగ
వలయు నొంటెద్దుబండి దీపంబుమాడ్కి-మిన్కుమిన్కనుచున్న నేమిఫలముండు
గొప్పవాఁడైన దర్పము ల్చెప్పవలయు-వీథివీథిని దొమ్మరి విద్దెచూపి
యొండనక వాననాక లానెంతసేపు-నిన్నుమించిన యగు మంచికొన్ని పనులు
చేసినను నాల్గుడబ్బులు చేతఁబడవు-చూచెదరు డబ్బు దండుకోఁ జొచ్చినపుడె
యల్ల జరిగెద రెవ్వరు నాదరింప-రంతతోఁబోదు డబ్బీనియట్టివాని
పాపి చండాలుఁ డని చూచి పాఱిపోయె-ననుచునిందించు దొమ్మరి; యతని నేమి
యనక కుక్కిన పేనునా నరుగుజనుఁడు-నీకు వారికి వాసి యెన్నినను జగతి
హాస్తిమశకాంతరమ్ము పుణ్యంబువలన-యశము లభ్యంబగునుగాదె యంద అంద
లంబులెక్కిన బోయీలు, లవణజలధి-మంచి నీరైన నుప్పు లభించుటరుదు.

---

# నాతోటి ప్రయాణీకుడు

బుద్ధిరాజు రాజభూషణరావు గారు, బి. ఏ., బి. య

వారిద్దర్లో రైలుపెట్టెలో ముందెవరు ప్రవేశించారో నాకు తెలియదు. అసలు ఇంకొకరా పెట్టెలో ఉన్నారనే అనుకోలేదు కొంతసేపటిదాకానూ. రైలుబండి రహదారీపడవలాగా ఎక్కడపడితే అక్కడే ఆగుతూ, శాశ్వతత్వమంటే యేమిటో మనస్సుకు గోచరించేటట్లు సావకాశంగా పాక్కుంటూ పోతోంది. మొదట బయల్దేరినప్పుడేమో రైలు కొంతవరకు నిండుగానే ఉంది. కాని ఆగినస్టేషను దగ్గరల్లా ఒకరొకరు, ఇద్దరిద్దరుచొప్పున దిగిపోవడం ఆరంభించారు. ఇలా నాలుగైదుస్టేషన్లు దాటేటప్పటికి నా పెట్టెలో నేనొక్కడ్నే మిగిలిపోయాను; కాదు కాదు, ఒక్కడ్నే మిగిలిపోయా ననుకున్నాను.

రాత్రివేళ కొద్దిగా రొదచేస్తూ కుదుపుకుంటూ పోతున్న రైలుపెట్టెలో ఒకడూ ఉండటంలో ఒకవిధమైన ఆనందం ఉంది. ఎక్కడాలేని స్వేచ్ఛా స్వాతంత్ర్యమూ వస్తాయి మనకి. ఏంతోస్తే అది చెయ్యొచ్చు. ఎంత గట్టిగా మాట్లాడుకోవాలంటే అంత గట్టిగా మాట్లాడుకోవచ్చు; వినేవా డెవడూ వుండడు. ప్రతిపక్షులతో అమాంతంగా వాదంచేసి పట్టీలు కొట్టించొచ్చు; ఎదురుచెప్పే మొనగా డెవడూ వుండడు. నెత్తికిందకీ, కాళ్ళమీదికీ పెట్టి తల్లకిందుగా జపంచేసినా చూసేవా డెవ్వడూ వుండడు. పాడొచ్చు, ఆడొచ్చు, బంతాట అభ్యాసం చెయ్యొచ్చు. అడ్డులేకుండా గోళికాయ లాడుకోవచ్చు. కిటికీతలుపులు వేసినా తీసినా అడిగేవా డెవడూ వుండడు. రెండు తలుపులూ తెరుచుకున్నా సరే, మూసుకున్నా సరే. లేకపోతే అదేపనిగా వేస్తోతీస్తో ఆడుకుంటూ కూర్చున్నా పరవాలేదు. పెట్టెలో ఏమూలపడితే ఆమూలే కూచుంటూ, ఒకచోట్నుంచి ఇంకోచోటికి తిరుగుతో, కూచుంటో లేస్తో, కాలం గడపొచ్చు. నిలువుగా బల్లమీది మెత్తలపైని నిగడదన్నుకు పడుకోవచ్చు.

అయితే, నే నీర్రాత్రి పెట్టెలో ఏపని చేయ
లేదు. అన్నైనా చెయ్యాలని తోచలేదు. నేను చే
దంతకంటె చాలా సర్వసాధారణమైన పని. నా పె
లోంచి ఆఖరుప్రయాణీకుడుకూడా దిగి వెళ్ళిపోయ
తరువాత, ఒక్కసారి నేను చదువుతున్న పేపరు కి
పెట్టాను. కాళ్ళు చేతులు ఒకసారి చాపుకొని వొ
విరుచుకొని, నా పెట్టెలోంచి ఆ ప్రశాంతమైన రా
వేళ కిటికీగుండా ఒకసారి బైటికి చూశాను. ఆ తె
వైపు ఆకాశం కొంచెం వెలవెలలాడుతూ గడచిపోయి
పగటి నింకా జ్ఞాపకం చేస్తోనేవుంది. ఆ కిటికీదగ్గర్నుం
కదిలి రెండోవైపు కిటికీలోంచి చూశాను. తరవాత సిగ
ట్టొక టంటించి కూర్చుని తిరిగీ పేపరు చదువుకోవ
ప్రారంభించాను. పెట్టెలో ఇంకెవరో వున్నట్టు
కప్పుడు తెలిసింది. వచ్చి ముక్కుమీద కూచున్న దా
ఎవరో వున్నట్టు నాకు తెలిసింది కాదు......రెక్క
లండి సన్నని కూనరాగం తీస్తో, నిర్భయంగా తిరుగుతు
మనం సామాన్యంగా దోమలంటూ మీ అపురుగుల్లో వొక
ఆ వచ్చి వాలింది. వెంటనే దాన్ని నా ముక్కుమీం
దులిపేశాను. ఆపెట్టె అంతా కిందనించి పైకి, పైనిం
కిందకీ పరీక్షచేసి చూచింది. ఆమూల కూచున్న
జంతువుకంటె తమాషా అయిన పదార్థం ఇంకోటి లే
నిశ్చయించుకుని దగ్గరకొచ్చి నాకంఠం కేసి పరకాయిం
చూసింది. మళ్లీ నేను దాన్ని విదిలేశాను. అది తప్పిం
కుని పెట్టెలో ఒకసారి సంచారంచేసి మళ్లీ వెనక్కి
సాహసంగా నా చేతిమీద వాలింది. నా కంతట్లో చ
మంది. ఇక చాలు నీ అల్లరన్నాను. 'మంచితనా
గూడ మితముంది. నేను సామాన్యుణ్ణి కానని నీ కప్పు
రెండుమాట్లయింది చెప్పి. కొత్తవాళ్లొచ్చి నాదగ్గ
అవిధేయతగా ప్రవర్తిస్తే నా కోపమొస్తుంది. నీ కి
మరణదండన విధిస్తున్నాను. నువ్వుచేసిన నేరాలు చా
వున్నాయి. నీవు దేశదిమ్మరివి. నీవల్ల ప్రజలకు చా
చిరాకుగాను, బాధగాను ఉంటుంది. పైగా టిక్కె

కుండా ప్రయాణం చేస్తున్నావు. ఇవ్వే కాకుండా నువ్వు చేసేతప్పు లింకా వున్నాయి. వీటన్నిటికీ ప్రతిఫలంగా నువ్వు చావటానికి సిద్ధంగా వున్నావు' అంటూ తొందరగా నేను కుడిచేత్తో వొక్క పెద్దదెబ్బ కొట్టాను. అది అతి లాఘవంగా తప్పించుకుని నన్ను పరాభవం చేసింది. నాలోవున్న దురభిమానం పైకి పొంగింది. చేత్తో వొకమాటూ, పేపరుతో వొకమాటూ దాన్ని కొట్టబోయాను. అమాంతంగా బల్లమీది కురికి దాన్ని దీపంచుట్టూ తరిమాను. పిల్లిలాగ పొంచుంటూ, అదెక్కడైనా ఆగిందాకా ఆగుతూ, అడుగులో అడుగేసుకుంటూ, మెల్లిగా దాన్ని సమీపిస్తూ, గభీమని దాన్ని ఒక పెద్దదెబ్బ కొట్టబోతూ నాచాకచక్యమంతా చూపించాను.

నా ప్రయాసంతా వృథా అయిపోయింది. అది నాతో బహిరంగంగా నిర్లక్ష్యంగా ఆటలాడటం ప్రారంభించింది. సాధనంగా అది ఆనందిస్తున్నట్టు స్పష్టంగా తెలుస్తోనేవుంది. ఆ వినోదంకోసమే నా శాంతాని కది భంగం కలిగించింది. దానికి కొంచెం ఖులాసా కావలిసొచ్చింది. చాలా రుచిగా వున్నాడన్నమాటే కాని, వట్టి చేతకానివాడు బుద్ధిలేనివాడు లాగా వున్నాడే, వీడు పెద్ద కళేబరం వేసుకుని ఈదుకుంటూ కొట్టుకుంటూ నావెనక పరుగెత్తుకుంటూరావడంకంటె వినోదమేమిటుంది అనుకుంది కాబోల్ను. అప్పుడు దాని మనస్తత్వంలో ప్రవేశించడానికి ప్రయత్నించాను. ఇక నాకది ఉత్తపురుగులా కనిపించలేదు. ఈ పెట్టె నీదా నాదా అని నాతో సమానంగా హోరాహోరీని డీకొట్టానికి చాలిన తెలివితేటలుకల ఒక వ్యక్తిగా మారిపోయిందది. దానియందు నాకు ప్రేమ అంకురిస్తున్నట్టు తోచింది. దానికంటె నే నెక్కువవాడ్నని అహంభావ మడుగంటింది. మే మిద్దరం వేసుకున్న యీవొక్క పందెంలో మా నేనోడిపోయాక ఇంకా నాయెక్కువేమిటి అర్థాన్నము. అటువంటప్పుడు నాకు ఔదార్య మెందుకుండకూడదు? ఔదార్యమూ, దయా అనే యీరెండున్నూ మనిషి కుండవలసిన గొప్ప లక్షణాలు. ఈ రెండు లక్షణాలు చూపించితేనే సామర్థ్యం నాకు దక్కుతుంది. ప్రస్తుతం నే నందరూ వుడికించటానికీ, ఏడిపించటానికి వీలైన నిర్భాగ్యుడైపోయాను. నే నిక దయ చూపించినట్టయితే మళ్లీ నాగౌరవం నేను సంపాదించుకోవచ్చు. మరణదండన రద్దుచేసి యథాప్రకారం నామూలకు నేను పోయి గంభీరంగా కూచున్నాను. నేను నిన్ను చంపలేను కాని నీకు కొంచెము బుద్ధి చెప్పవలసి వుంటుందన్నాను.

మళ్లీ నేను పేపరు తీశాను చదవడానికి. అదివచ్చి వెంటనే పేపరుమీద వాలింది... నీవు పట్టెమూర్ఖురాల్లా కనిపిస్తున్నావు. ఇప్పుడు నువ్వు పూర్తిగా నాచేతుల్లో చిక్కావు. ఈపేపరు నేను రెండువైపులా మరచినట్టయితే రెండు కాకితాల సందునీపడి నలిగి చచ్చిపోతావు. నిన్నిందుకోసం మిప్పుడే చివాట్లేశాను. కాని నేను నిన్ను చంపను. ఈ పెద్దజంతువు అన్నమాట తప్పదన్న సంగతి నువ్వు తెలుసుకోవాలి. అంతేకాకుండా నిన్ను చంపటం నా కిష్టంకూడా లేదు. నిన్ను బాగా అర్థంచేసుకున్నకొద్దీ, నీయందు నాకు ప్రేమ ఎక్కువౌతోంది. నీయందు నేను పూర్తిగా సోదరభావం చూపించలేకపోయినా ఒకమోస్తరు దూరపు బంధుత్వం మనిద్దరికీ వుందన్న సంగతి తెలుసుకున్నాను. ఈరాత్రి మనిద్దరం ఇదివరకేస్తు కలిసి ప్రయాణంచేయడం తటస్థించింది. నీకు నేను వినోదం కలిగించాను. నన్ను నువ్వు సంతోషపెట్టావు. ఇలా మనిద్దరం ఒకరికొకరం పరస్పరం ఋణపడివున్నాము. మనిద్దర్లో వున్న తేడాతిరమూ, సృష్టివైచిత్ర్యమూ వొకటే. మనిద్దరికీ మర్త్యత్వం సమానమే. నీకు నీప్రయాణం సంగతేమీ తెలియదనుకుంటాను అల్లాగే నా ప్రయాణంసంగతి నాకూ సరిగ్గా తెలుసునని రూఢిగా చెప్పలేను. నువ్వు ఆలోచించిచూసుకోగలిగితే మనిద్దరికి పోలికలు చాలా వున్నాయని తెలుస్తుంది. మనిద్దరంకూడా కానేపు కనపడి తిరువాతిక్షణంలో మాయమైపోయే దృశ్యాలము. బయటిచీకట్లోంచి వెల్తురున్న బండిలోకివచ్చి దీపం చుట్టూ కొంచెంసేపు రెపరెపలాడుతూ తిరిగి, మరుసటి నిమిషంలో మళ్లీ అంధకారంలోకి పోతాము......

కిటికీదగ్గరికొచ్చి "అయ్యా, యింకా పైకి వెడుతున్నారా?" అని యెవరో నన్నడిగినట్టు వినపడ్డది. నేను దిగవలసిన స్టేషను వచ్చిందని నాకు జ్ఞాపకంచేసి పుణ్యం కట్టుకోటానికొచ్చిన పోర్టరు నన్నల్లా పలకరించాడు. అతన్ని నేను మెచ్చుకొని 'మత్తుగా పడున్నాను కాబోల్నిప్పటిదాకా' నన్నానతన్తో. చేతికర్ర టోపీతీసుకుని బయటి చల్లగాలిలో కాలుపెట్టాను. పెట్టె తలుపు వేస్తు బయట్నుంచిలోపలికి చూశాను. ఇంకా నాతోటి ప్రయాణీకుడు దీపంచుట్టూ తిరుగుతున్నట్టే కనిపించింది.



౬. నవరంగమధ్యమున నున్న 'మదనకి గొంబె' అనుబొమ్మ
దీని కుడిచేతనున్న కంకణము కదలును



౫. స్తంభాగ్రములపైనున్న శిల్పవిగ్రహములు

'మదనకై గొంబె' అనునవి. స్తంభములనడుమ సరంధ్రమయిన రాతి తెర. చెన్నకేశవ దేవాలయము-బేలూరు

# సూర్యకిరణ ప్రభావము

మ॥ శ్రీ మాతులపాటి గోపాలకృష్ణయ్యశాస్త్రిగ

శ్లో. యః కర్తా జగతాం భర్తా సంహర్తా మహసాం నిధిః, ప్రణమామి త మాదిత్యం బహిరంత స్తమోఽపహ

చరాచర నిఖిలప్రపంచ సృష్టిస్థితిలయములకుఁ గారణభూతుండును, కాలస్వరూపుండును, జ్యోతిర్మండలముల కాధారుండును నగు నాదిత్యుని ప్రభావ మనిర్వచనీయము, నప్రతర్క్యంబు, నవాఙ్మానస గోచరంబు. లోకవ్యవహారమంతయు కాలాధీనము. అట్టి దిన పక్షమాస ఋతు సంవత్సర యుగరూపంబగు కాలమెవ్వనిచేఁ గావింపబడుచున్నదో, నిఖిలభూత జీవనాధారంబగు తరుగుల్మలతౌషధీ వ్రీహియవాదికం బెవ్వని కిరణప్రసారంబుచేఁ బోషితమగుచున్నదో, యెవ్వని వెలుంగుచే సకలము వికాసముఁ జెందుచున్నదో, అట్టి సూర్యభగవానుఁడు ప్రత్యక్షదైవతంబని వేఱుగఁ జెప్పవలయునా! "అసావాదిత్యో బ్రహ్మ" యని శ్రుతి నుడువుచున్నది. "అంతరాదిత్యవిద్య" యను నుపాసనంబు ఛాందోగ్యమునందుఁ గలదు. వేదము లనేకవిధములచే స్తుతిచేయుచున్నందున, త్రయీమయుఁడనియుఁ జెప్పఁబడుచున్నాఁడు. ఏదేశమందు సూర్యకిరణప్రసారము చక్కఁగ నుండునో యాదేశమారోగ్య భాగ్యము గలదిగనుండును. సూర్యకిరణ ప్రసారములేని దేశ మితిగవిషయములచే, భాగ్యవంతమయ్యు ననారోగ్యమున కాలవాలమై, జాడ్యమునకు నిలయమై నవయుచుండు. సమశీతోష్ణము గల దేశమే యారోగ్యవంతము. ఉత్తర ధ్రువమండలమందును, దక్షిణధ్రువమండలమందును, సూర్యకిరణప్రసారము. చాలతక్కువగ నుండుటచే, నచ్చటిప్రజలు దుస్సహమగు శీతముచేతను, హిమముచేతను, బాధితులగుదురు. (Siberia) సైబేరియా మొదలగు కొన్నిప్రాంతములయందు సూర్యరశ్మి యెట్టిదయినది యెఱుంగనివారు నుగలరు. వారికొక విధమగు (Aurora Borealuo) జ్యోతిస్సు ఆఱుమాసములవఱ కగపడుచుండు. అధికమయిన చలిచేతను, మంచుచేతను, బాధపడుచు దుప్పిచర్మములఁ గప్పికొనుచుందురు. వారు సూర్యకిరణముల

వలనఁ గలుగుభాగ్యముఁ బడయఁజాలరు. పాశ్చాత్య
దదేశములయందును, సూర్యకిరణప్రసారము చక్క
నందున, వడవడ వణకించుచలియు, మంచును వారిని
ధించుచున్నందున, సూర్యరశ్మికై స్థానాంతరములకు
లుదురు. సూర్యకిరణములచే వ్యాధులకుఁ జికిత్సచే
పద్ధతినిఁ గనిపెట్టి, రోగులపై నియమితకాలముల
కిరణప్రసారము నొనరించి, కొన్ని వన్నెలుగల సీస
యందు నీరునింపి యెండలోనుంచి, యౌషధసంయో
ముచే త్రాగింతురు. లండను మొదలగు మహాపట్టణ
యందు, పసిబిడ్డలజబ్బులకు చికిత్సచేయు వైద్యాల
ములు గలవు. వ్యాధిగ్రస్తులగు పసిబిడ్డలనుఁ జూ
యీ బిడ్డకు సూర్యరశ్మిలేనందున యీవ్యాధివచ్చిన
కాఁబట్టి యొకగంటసేపు సూర్యకిరణములు సోక
వనియు, నీబిడ్డకీవ్యాధి సూర్యకిరణప్రసారము లేమి
గలిగినది కాఁబట్టి సముద్రతీరమం దొకమాసము
సూర్యకిరణములు తగులునట్లు చేయవలెననియు, నచ్చ
జగత్ప్రఖ్యాతిఁగాంచిన వైద్యులు (Doctors) సల
నిచ్చుచుందురు. సుప్రసిద్ధ భిషగ్వరేణ్యులందఱు
త్రీవముగ సూర్యకిరణములయందు ప్రాణశక్తియు, న
తప్రదానశక్తియుఁ గలదని నిశ్చయించి; టీకాలు వే
టకు మాఱుగను, రసాయనము (Tonic) త్రాగుట
మాఱుగను, కిరణప్రసారమే ప్రకారాంతములచే
యోగింతురు. సూర్యకిరణములయం దమృతశక్తి
దని యిటీవల ఘనవైద్యులందఱు నిశ్చయించి, తత్సంబ
చికిత్సలను, వైద్యాలయములను నెలకొలిపి యుపవా
ములద్వారా ప్రబోధించుచున్నవారలు. సూర్యకి
ప్రసరించని చోట్లయందు, సూర్యునికిరణములవంటి కి
ములనిచ్చు దీపములను గనిపెట్టి, వానియెదుట కా
గంటయో, అరగంటయో బిడ్డలను నిలువఁబెట్టుదు
ఎండకాచినరోజు, అక్కడిప్రజలకుఁ బండుగ.

...డ్లవయస్సుగల ముసలిదొరలు, దొరసానులు, పార్కు... నడవవత్తురు. దాదులు పసిబిడ్డలను స్వేచ్ఛగా నడి...మచుందురు. సముద్రతీరములందుఁ గల మహోత్స...ం చెప్పనలవికాదు. స్విట్జర్లాండునందలి కొండల...దఁ బ్రసరించు, నిర్మలసూర్యకిరణముల సేవించుట...అక్కై స్కాట్లండు, డెన్మార్కు లోనగు దేశముల...డి యాత్రలు చేయుదురు. యూరపుఖండమునకంత... యాత్రాస్థానముగ భావింపఁబడుచున్నది. సూర్య...ణముల ప్రభావము, వారు దెలిసికొని యంతశ్రమపడు...ండగ, భారతవర్షమునం దవిచ్ఛిన్నముగఁ బ్రసరించు...ణముల మహిమఁ దెలిసికొనఁజాలక, వ్యర్థము సేయు...న్నవారము. "పెరటిచెట్టు మందుకుఁ బనికిరాదను," ...మెత ప్రకారము మనదేశమునందు, మనయెదుట సుల...ముగ లభించు పదార్థములయందు లక్ష్యము లేకుండుట ...స్వభావసిద్ధమే గదా! పుణ్యభూమియగు నీభారతవర్షము...నందలి యార్యులు వేదసూక్తములచే సూర్యభగవాను...నారాధించుటచేతను, సవితృదేవతాకమగు గాయత్రి...నుపాసించుటచేతను, ఆలోకబాంధవుఁడు తనయమృత...కిరణములనుఁ జక్కఁగఁ బ్రసరింపఁజేయుటచే యీభూ...ని "వసుమతి" యను సన్వర్థాభిధానగ నొసరించి, ...సస్యములను, ఓషధులను, తరుగుల్మలతాదులను వికసిం...పఁజేసి, ప్రాణశక్తినొసంగి ప్రోచుచున్న వాఁడు. హిమాలయ ప్రాంతమందలి పుణ్యపర్వతముల మీదను; పుణ్యారణ్యముల యందును, మహర్షులును మునీశ్వరులును, లోకహితార్థము సూర్యభగవాను నారాధించుచుందురని మహాభారతమునందుఁ గలదు. భారతవర్షము (భరతఖండము)నకు దేశమాతయనియుఁ జెప్పుటయం దొక సత్యవిషయము కలదు. ఏదన? మాత, సాత్త్విక, రాజస, తామసగుణములుగల పుత్రులకు వారికిదగినట్లు, ఆహారములను, అభీష్టపదార్థముల నొసంగి సన్మార్గములోనికిఁ దెచ్చి రక్షించుచందమున, భారతదేశమాతయు కేవలపాశ్చాత్య ఖండములోని శీతలప్రదేశములనుండి వచ్చి, తన్ను నాశ్రయించినవారికి, ఉదకమండలము, సిమ్లాలోనగు ఉష్ణప్రదేశములను, బెంగుళూరు మహాబలేశ్వరము లోనగు కించిచ్ఛీతల సౌఖ్యప్రదేశములను, ఉష్ణమండలములోనుండి వచ్చినవారికిఁ దగినట్లు; దత్తమండలములు లోనగు ఉష్ణప్రదేశములను, సములుగనుండువారికి సమశీతోష్ణ ప్రదేశముల నొసంగి, ధాత్రివలెఁ బ్రోచుచుండును. కాని ఉష్ణప్రదేశములలోనుండి, పాశ్చాత్య ఖండములోనికిఁ జేరినవారు, శీతముచేతను, గాఢమంచుచేతను బాధపడుచు, వైద్యుతాగ్ని, కాష్ఠాగ్ని, లోనగు వానిచే, స్వచ్ఛందనముగలుగునట్లు, ఉష్ణోపచారములఁ గావించుకొందురు. కాని, ఈభారతదేశమునందు వలె వివిధశీతోష్ణప్రదేశములుగాని, సమశీతోష్ణ ప్రదేశములుగాని యచ్చటఁ గానంబడవు. అదియునుంగాక యిచ్చట సూర్యరశ్మిచే నెల్లపంటలు పండును. సూర్యరశ్మిచేఁ బుష్పములు వికసించును. శీతలదేశమందును, నానావిధములగు పుష్పజాతులు పెరుగుచుండును. కాని సత్కవి ప్రపంచమునందు ముఖ్యమగు, కమలము, కల్హారము, పుండరీకము లోనగు తామరజాతులను, అచ్చటికవులు తమవాఙ్మయమునందుఁ దఱుచుగ ప్రయోగించినటులు కనుపింపదు. ఏలన? కమలబాంధవుని కిరణప్రసారము కాసారములయందుఁ బ్రసరింపమిచేఁ గమలములు వికసింపలేదని యూహింపఁదగియున్నది.

సూర్యుఁడు హిరణ్మయకిరీటియనియు, వసుమంతుఁడనియు వేదములయందు స్తుతింపఁబడుచున్న విషయము ఆధునికప్రకృతి శాస్త్రజ్ఞుల పరిశోధనలవలన స్పష్టమయ్యెను. సూర్యకిరణములనుండి (Radium) రేడియమ్మను పదార్థమును గనిపెట్టి దానిద్వారా బంగారమును జేయుచున్నారు కదా! అదియునుంగాక, లండను మహాపట్టణమునందు నెలకొలుపఁబడిన (Edward Hospital) ఎడ్వర్డు ఆస్పత్రియందు రేడియమ్మను శక్తినుపయోగించి, ధనసంపన్నులకుఁ గలిగిన రాచపుండ్లను, క్షయవ్యాధులను, కుష్ఠరోగములను, చికిత్సలచేఁ బోగొట్టుచున్నవారలు. ఈరేడియమ్మను పదార్థమును సాధించుటకు విశేషధనవ్యయ మగును. కావున, సామాన్యజనుల కీచికిత్సఁ గావింప వలనుపడదు. భాగ్యవంతులకు భాగ్యవత్పదార్థముచేతనే చికిత్సఁ గావింపవలసియున్నది. ఇంకను సూర్యకిరణములయం దద్భుతశక్తియున్నదని కనుఁగొనుచున్నవారలు. సూర్యతాపమునందు (ఎం

డయందు) కొన్ని రసాయనములు, ఓషధులు, ఆమ్లములు, శోషింపఁజేసినచో గుణవంతములగునని సుశ్రుత, చరకాది వైద్యశాస్త్రములయందును గలదు. ఈభాస్కరుఁడే, సృష్టి, స్థితి, లయములకుఁ గారకుఁడని యిదివఱలోఁ జెప్పఁబడెను. ఋతుధర్మానుసారముగ తనతీక్ష్ణకిరణములచే, సముద్రనదీతటాకాదులలోని జలమునాకర్షించి మేఘమండలములందుఁ జొనిపి వర్షింపఁజేయును. దీనివలన స్రష్టయగును. సస్యములను, ఓషధులను, తరుగుల్మలతాదులను, కిరణములచే వికసింపఁజేసి, పోషించును. కృత్తిక, రోహిణి కార్తెలలో సూర్యమండలమందుఁ దీక్ష్ణకిరణములఁ బయల్పడుటచే సకలప్రాణులు, సంతప్తులై, కొందఱందు వడఁదెబ్బనుజెంది మృతులగుటచే, సంహర్తయు నగును. సృష్టిలయములకును, లయముసృష్టికినిఁ గారణములగుచుండును. ఉదయాస్తమయములును, అహోరాత్రములును, సూర్యునివలననే కలుగుచున్నందున, మానవాయుష్కాలపరిమితియు, నాయహస్కరుని వలననే కలుగుచున్నది. ఉదయాస్తమయ కాలములయందు నిద్రించువానిఆయుష్యును, సూర్యుఁడు హరించుచున్నాఁడని "శ్లో. ఆయుర్హరతివై పుంసాముద్యన్నస్తం చయన్నసౌ."* శ్రీ భాగవతమునందుఁ జెప్పఁబడినది. సూర్యోదయమునకు మున్నే మేల్కాని సూర్యునకభిముఖుఁడై ధ్యానించుచు, నమస్కరించిన యెడల, అమృతకిరణములద్వారా ప్రాణశక్తిని, ఆయుర్వృద్ధిని, ఆరోగ్యమును బొందుచున్నాఁడు. అటుగాక నిద్రించుచున్నచో నమృతకిరణముల ద్వారా ఆయుర్వృద్ధినిఁ బొందఁజాలక, యనారోగ్యవంతుఁ డగును. అటులనే సాయంసమయము నిద్రించినను ఆయుర్హాస(!)మగును. ఉదయాస్తమయ కాలములకుఁ బూర్వము విహారముసలిపి, శరీరవ్యాయామాదులవలన నారోగ్యంబును, ధ్యాననమస్కారములవలన ప్రాణశక్తియు, మనోబలంబును, ఆయుర్వృద్ధియుఁ బడయనగును.

"శ్లో. ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేన్మోక్ష మిచ్ఛేజ్జనార్దనాత్' అను ఆర్యోక్తినిఁబట్టి యారోగ్యము నపే క్షించువారలు, సూర్యోపాసనమును నమస్కా
లను గావింపవలయు. పూర్వము కుష్ఠవ్యాధి బాధి
డగు మయూరమహాకవి, సూర్యభగవానుని శ్లోకశ
ముచే స్తోత్రముచేసి, యాదయానిధి కృపచే నారో
వంతుఁడయినట్లు, సూర్యశతకమువలన దెలియఁబడ
న్నది. సూర్యనమస్కారముల వలన నారోగ్యము,
ప్తేజో మేధా ప్రజ్ఞాబలంబులు గలుగునని చెప్పెడి ప్ర
నార్యపద్ధతిని, పరిశోధనలవలనఁ దెలిసికొని యిప
ప్రకృతిశాస్త్రజ్ఞులగు నాగరకులు, విద్యాశాఖాధి
రులు పాఠశాలలయందు విద్యార్థులకు, శరీరవ్యాయా
పరిశ్రమల యందు నభ్యసింపవలసినట్టులు ప్రవేశపె
ప్రాచీనార్యపద్ధతులు క్రమక్రమముగ నాచరణములో
వచ్చుచున్నయవి. సూర్యనమస్కారములయం దనే
ద్ధతులు కలవు. ఒంటికాలిమీఁద నిలువఁబడి చే
టయు, సాష్టాంగప్రణిపతనము గావించుటయు, వీని
శూలనొప్పులు, నాడీసంబంధ వ్యాధులును తొలఁగ
కొంతకాలమునకు ముందు దండెములుతీయుట, బస్కీ
తీయుట, పరుగెత్తుట లోనగు వానివలన శరీరబలము
గునని తలఁచిరి. ఇటీవల కొంతకాలమునుండి, మన
లేని శరీరబలము కేవల పశుబలమగునని తలఁచి, ప్రా
యామపూర్వకముగ శారీరక పరిశ్రమఁ గావింప
నియుఁ బ్రాణాయామమునందు గొప్పశక్తికలదని
సంకల్పబలముచేత శరీరమునకు ద్విగుణబలము కల
నియు విషయాంతరాసక్త మనస్కుండెంత శరీర
యామముఁ గావించినను బలము కలుగదనియు నిశ్చ
చిరి. తపాలుకట్టఁదీసికొని పరుగిడువారు (Tapp
Runners), కట్టెలుకొట్టువారు, కూలికై బరువు
వారు, బండ్లులాగువారు, ఇట్టి కష్టజీవులు శారీరక
యామము చేయుచున్నారని చెప్పవగునా? బలమున
అదివారికి జీవనవృత్తికై, నిర్బంధముగ చేయుచున్న
కాని, ఐచ్ఛికముగగాదు. ద్రవ్యములేని బీదవారు,
త్సాహవంతులై కష్టపడి పనిచేయుచున్నను, మాన
త్సాహబలము లేనందున దృఢమయినబలము కా

* దీనికి వ్యాఖ్యాకర్తగారు చెప్పిన అర్థము సరిగ నున్నట్లు తోచదు.

. శరీరమునకు బలము కలుగవలెననెనే, సంకల్పము నిర్బంధము లేక యైచ్ఛికముగఁ బరుగిడు వారికిని, వు లెత్తువారికిని, పనిచేయువారికిని, దృఢమగు బలము గును. ఇట్టి శారీరకబలము, మానసికబలముతోఁ డినందున, పశుబల మనిపించుకొనదు. కాఁబట్టి, స్యనమస్కారములఁ గావించువారు సూర్యకిరణప్ర సమును, అందలి గుణములను, సూర్యభగవానుని మహి ఁ దెలిసికొని, సంకల్పయుక్తులై నమస్కారములను, నమును గావించినయెడల, శరీరబలము, మనోబలము, ఆరోగ్యము, వర్చస్సు, తేజస్సు, ఓజస్సు, మేధా లను బడయుదురనుట కించుకేని సందియముండదు. ర్య మొనరించినను సంకల్పయుక్తముగ నుండవలెనని చీనార్య సంప్రదాయము.

నేత్రమునకును, సూర్యునకును, మిగుల సంబం ము కలదని తెలిసికొనిన ప్రాచీనార్యులు, నేత్రవ్యా లను, కిరణచికిత్సవలనను, ఉపాసనవలనను బోఁగొ ట్టుచుండిరి. నేత్రములకుఁ గలుగు వికాసము, తేజస్సు, పగ్రహణ శక్తియంతయు సూర్యునివలననే కలుగుచు ది. "సర్వేంద్రియాణాం నయనం ప్రధాన" మ్మని, ప్పటి దొరతనమువారు, నేత్రవైద్యాలయములను నెల లిపి, నేత్రవైద్యమునందు నిపుణులగువారిచే, తేజస్స యమునఁ జికిత్సలు గావించుచున్నారు. "చక్షోస్సూర్యోఅజాయత," అని శ్రుతియు నుడువుచున్నది. విరా పురుషుని (పరమేశ్వరుని) నేత్రమునుండి సూర్యుఁడు డమెను. అనఁగా, పరమేశ్వరునికి సూర్యుఁడు నేత్ర నమయినందున, సూర్యునిద్వారా, సకలప్రాణుల పాపపుణ్య కర్మలను గనుఁగొనుచున్నాడని భావము. కర్మసాక్షీ, జగచ్చక్షుః" అని సూర్యునికిఁ బేర్లుకలవు. జగత్తునకంతయు చక్షుస్సు సూర్యుఁడగుచున్నాఁడు. నకు నేత్రములు చక్కఁగనున్నను, తేజస్సాన్నిధ్యము క, పదార్థములఁ గనుఁగొనఁజాలము. అగ్ని, విద్యుత్తు, నక్షత్రము, చంద్రుఁడు గ్రహములలోనగు వాని, ప్రకా శంతయు, సూర్యునివలనఁ గలుగుచున్నదియే. కాఁబట్టి సూర్యునికి, జ్యోతిషాంపతి యనియు, తేజసాంపతి యను నామములు కలవు. అదియునుంగాక, జ్యోతిశ్శాస్త్రమునందు, నేత్రకారకుఁడు సూర్యుఁ డగుచున్నాఁడు. నేత్రస్థానమగు, ద్వితీయమందుఁ బాపులున్నను, పాపులు చూచినను కారకుఁడగు సూర్యుఁడు, నీచశత్రుక్షేత్రములఁ బొందినను, వ్యయగతుఁడైనను, నేత్రరోగములు కలుగుచుండును. పాపయుక్తుఁడైననచో నాంధ్యము (అంధత్వము)ను గలుగును.

సూర్యునకు సప్తాశ్వుఁడని పేరు సప్తవర్ణములను, వాహనముల నధిష్ఠించినవాఁడు. ఇయ్యేడురంగులు ప్రాణుల యారోగ్యమునకును, ఆనందమునకుఁ గారణములు. రంగుల కాంతులవలననే నేత్రవికాసము కలుగును. నేత్రవైద్యులు, నేత్రములలోని వికాసదౌర్బల్యములను గనిపెట్టి యుచితమైన రంగులుగల యద్దములను నిర్ణయించి యారోగ్యము గలుగునటులు చేయుదురు. అత్యధికమయిన వెలుతురును జూచుటవలనను, నేత్రవ్యాధి కలుగును. ఒకానొకప్పుడు, పిడుగుసమీపములో పడుచుండగఁ జూచినవారికి నేత్రములు పోయెను. సూర్యునిసయితము, అరుణోదయకాలమందుఁ జూడఁగలుగుదుము. కాని, మధ్యాహ్నకాలమందుఁ జూడఁజాలము. నేత్రమునందు (Retina) రెటినా యనునొకపదార్థము కలదు. ఇది చూపునకు ముఖ్యము. ఇది తేజోగ్రహణమునకు ముఖ్యమయినందున, సూర్యునివలనఁ గలుగుచున్నది. ఇదిలేనిచో నంధత్వమని చెప్పఁదగును. దయామయుఁడగు పరమేశ్వరుఁడు, దుస్సహమగు తేజస్సువలన కంటికి బాధ కలుగకుండుటకై, పచ్చనియాకులుగల చెట్లను, తీగలను సృజించెను. ఆకుపచ్చ, పసుపుపచ్చ, ఊదా, లోనగురంగులు కంటికి నానందమును నారోగ్యము కలిగించును. ఇయ్యేడురంగులును, ప్రధానమగు శుక్లవర్ణమువలననే కలిగినవి. ఇయ్యది ప్రకృతిశాస్త్ర విద్యార్థులకు స్పష్టముగఁ దెలియుచుండును. పైని చెప్పబడిన సప్తాశ్వ శబ్దవాచ్యుఁడగు సూర్యునివలననే యిన్నివర్ణములు కలుగుచున్నది.

సూర్యమండలముచుట్టు, గ్రహములన్నియుఁ దిరుగుచున్నటులు జ్యోతిశ్శాస్త్రము వలనఁ దెలియుచున్నందున, సూర్యునివలన నెల్లగోళములు ప్రకాశించుచున్నవి. జ్యోతిశ్చక్రమునఁ బరిభ్రమించు, జ్యోతిర్మండలము

# నీటిమీది నెలబాలుడు

రంగనాయకులు (ఆక్సుఫర్డు) గారు

జర్మనీ దేశమునుండి ఇంగ్లండుకు తిరిగి సముద్ర ప్రయాణ మొనర్చునప్పుడు నిండుపూర్ణిమ వెన్నెలను గాంచినప్పుడు దానిప్రత్యేక మనోహరత్వము నాహృదయము నాకర్షింపలేదు. కాని ఇంగ్లండుదేశములో నాకు ప్రియమైన, జ్ఞానప్రదాయకమగు ఆక్సుఫర్డు పట్టణమునందు సాయంకాలమందు వేసవి మాసములలో విహరించునప్పు డనేకమారులు వెన్నెలవన్నెలను జూచి చంద్రునియొక్క చందనపు చాయనుజూచి మేఘఛాయతో నొప్పారుచున్న శ్రీకృష్ణమూర్తి నొసటియందలి తిలకమా యనునట్లు శోభిల్లుచున్న ఆకసమువంక చూచి కడుసంతసించితిని. భరతఖండమునం దిట్టి వెన్నెలరాత్రి యింక నత్యద్భుతముగదా యని భావమునకు దట్టెను.

క్రిందటి వేసవికాలమందు మద్రాసుతీరముపై నసంఖ్యాకములగు యిసుకదిబ్బలపైన నాట్యమాడించుచున్న వెల్తురును, గాలములో చిక్కుకొన్న చేపలపగిది, పైకిచిమ్ముకొన లేచుచున్న సముద్రపు తరంగములపై విహారమొనర్చుచున్న వెన్నెలనుజూచి సుఖమొంది కళకళలాడు మొగమునొంది మరొకసారి వచ్చినప్పుడు వెలవెలబోకుమా యని యాజ్ఞాపించి అంకురించుచున్న సంతోషపు చిగురులకు నూతనమగు పన్నీటిధార విచ్చి ఆనందమొందితి. కాని సముద్రముపై తాండవమాడు వెన్నెలకు యీచిన్నజ్యోతి వెన్నెలపాటియా? ఒక్కనాటి వెల్తురుమాత్రము దానియద్భుత వివిధకళలతో సమానముగుస్థానము నాభావచారిత్ర్యమందు కలదు.

ఇప్పటికి పదునారుసంవత్సరముల క్రితము నాబాల్యమున మరణించినతల్లి, ఆప్రేమసాగరము చంద్రుని వెన్నెలలో యింటిముందునున్న మంచముపై పరుండి చంద్రుని బాలునికిచూపి చందమామ పాటపాడుచు నన్ను ముచ్చటల దేర్చినదినమే అసమానమై వెలుంగుచున్నది.

చంద్రు డొకనాడు గర్వముతో ఆకసముపై విచ్చలవిడిగా పరసమాడుచుండెను. అట్టిసమయమున నెం... పోయను స్నేహితుడు నేను సింహళద్వీపమునకు సమీపించుచుంటిమి. బోటు చల్లగా బోవుచుండెను. సముద్రమంతయు తెల్లనివిభూతి చల్లినట్లు పిండియారబోసినట్లుండెనని చెప్పవగును. కాని పిండియందున్న మెత్తదనముందులేదు. మార్దవమున్నదిగాని పలుకు దానిస్వరూపమైనట్టుల, కారము దానిగుణమైనట్టుల, పాడిదానినైజమగుమాద్పుగా నున్నట్టుల విభూతి కాసొంపులేదు. అది నిజముగా తెల్పైనా లేక సూర్యునికాంతి వెండిరేకులపై ప్రకాశించునపుడు కలుగు స్వచ్ఛమైన తెలుపా? లేక చంద్రునికాంతి బంగారురేకులపై ప్రకాశించునపుడు కలుగు పచ్చనికాంతియా! అదియిది యనరాని తెలుపుగా మెరుపుగా తళుకు తళుక్కుగా కూకూయని కూయుకోవెల నినాదపు సొంపుతో వివిధవర్ణములతో నొప్పారుచున్న ఆవెన్నెల యపరూపమే దానిస్వరూపము. ఇటుల సరాసరి యెదుర్కొనుటకంటే దానిచే ప్రకాశింపఁబడుచున్న వస్తుజాలములనుజూచి ఆదివ్యతేజః ప్రభావమును సంస్మరించుట తేలిక. అటులనేచేయ బ్రయత్నించుట సహజమే యని అట్టికాంతులను బలుమారు గాంచు సృష్టిశ్రీయులకు దోచకపోదు.

ఇక చంద్రునియొక్క బింబప్రభావమును జూచెదము. ఆనాటిరాత్రి చంద్రుడు తనపదునైదు కళలను నలుదిక్కులకు వ్యాపింపజేసి త్రికోణాకారమగు సముద్రభాగమున ప్రత్యేక బలియముతో విరాజిల్లుచున్న సమయమున ఒకస్త్రీ నుబ్బంచుచీరను ధరించి దాహముకొరకై సముద్రముపైగా వెళ్లుచూ అలసటచే సముద్రునియొక్క పాన్పుమీద పవ్వళించి సముద్రునియొక్క సంగీత నినాదము నాలకించుచూ ఆ పిల్లవాయువులచే అలసట దీర్చుకొనుచుండగా గాలిచే సహజముగా అన్నిభాగములందు వేవేగముగా కలుగుచున్న ముడతలు మార్పు

లు జారిపోవుచున్న చీరకొంగులు,రవికల ఎగురులు, మధ్య మధ్యపొరలహాయలు తెల్లచేతిగుడ్డ విదళింపులన్నియు ఆపైనుండి కరుణారహితమై వచ్చుచున్న వెన్నెల ద్వారా కన్పడునేమో యను భయముచే "గబగబా" తన చినుగులున్న వస్త్రములను, ఎగిరిపోయిన చీలికలను దాచుకొనుచున్న యాస్త్రీ సిగ్గు, విసుగు, కోపము మాబోటి చూపరులకు బట్టబయలుగా కన్పడెను.

పదునైదు కళలతో నిండియున్న చంద్రునికి పరిపాలితం బన్నట్లు సముద్రుడు పిల్లిగంతులు గుప్పిగంతులు వేయుచు ఒకటినొకటిగా పొరలుచున్న ఏనుగులమాడ్కి అలలసమూహముచేతను వాని దంతము లెన్నియో కాని లక్షలకొలది ముత్యములవలె విరాజిల్లుచున్న నీటిబొట్టులో లేక వానినెత్తిపై కృష్ణునిపించెములో, చెలరేగుచున్న ముత్యపు చిప్పబుడ్డిలో, మరేమికోయో యనునట్లు అన్నిశృంగారములు ఒక్కొక్కటి యొక్కొక్కచోట అక్కడ నిక్కడ మరియొల్లెడ తళతళా మెఱయు పాదరసపుకాంతులు పొడగట్టుచుండెను. వేనలక్షల కొలదిగాయున్న చేపల తళతళలా, గువ్వలగుబగుబలా, ఘున్నపురాసులా, పాదరసపు ప్రవాహమా యన్నట్లు ఆకరుళ్లనురుగులు మెరయుచుండెను. పాదరసపు సముద్రమా యైనచో పరుగిడు గెంపరులేవి? వలు ప్రక్కలకు చెదరిపోవు ప్రవాహమేది? యను ప్రశ్నలతో తుదకు అయ్యదంతయు ప్రతివస్తువుయొక్క కళలు కొంత కొంతగా కలసిన మిళితమనియును అన్నిటియందున్న కాంతికంటె నూత్నకళతో తాండవమాడుచున్న ప్రియ లేకపైనప్పుడు కలుగు హృదయ సంతసము, స్నేహితులను సంవత్సరములపిమ్మట కలుసుకొన్నప్పుడు కలుగు ఆనందము, కోవెల, గువ్వ, గోరువంకల శృంగారమగు సంగీతనినాదములచే నిండిన సాహృదయ సంతృప్తి వీనియన్నిటి తేజములకంటె అత్యున్నతమై ఆసముద్రభాగము వెన్నెలమయమై చంద్రదయుతమై, ప్రేమఘనమై, శృంగారపునెలవై, సుఖభాజనమై శోభిలుచున్న సమయమున నాతో నొక అమెరికను స్నేహితుడు కూడ యీనిండుపూర్ణిమను చూచెను. అందముగా యున్నది గదా యను నాప్రశ్నకు అతనియొక్క భావచారిత్ర్యమును యీక్రింది విధముగా తెలుపుచూ అత్యద్భుతమని జవాబిచ్చి, 'యిదిగో అటుల నూత్న తేజములు ప్రతినిముషము ఆకసమునుండి క్రిందికి వచ్చునప్పుడు ముత్యపుచిప్పలు తొలకరివర్షపు చినుకులను దిగమ్రింగినట్లు నాకును వాని మ్రింగి జీర్ణించుకొని నాహృదయమునకు మెరుపుగల్గించి ఆచంద్రునివెన్నెలలో నొకచిన్న జీవాణువుగానేయున్న యెంతసంతసము కలిగెడిగదా' యని అనెను. అంత తాను "టెహాటి" ద్వీపమునుండి అమెరికామీదుగా సేనానదిద్వారా యూరపుఖండమునకు వచ్చుచున్నప్పుడు చంద్రుని నిండుబింబమును చూచి వానివెన్నెలను, వానిరేఖలను కిరణములను, నవ్వులసంతకాంతిని భావశక్తి ద్వారా అదేపనిగా దిగమ్రింగి తాను ఆవెన్నెలరేకుల నాకర్షించుకొని లయమొనర్చుకొన్నట్లు తనకుండెనని నావంక తిరిగి నవ్వుచూ తెల్పెను. అతని ముఖవర్చస్సును బట్టి నిజమని నామనంబునకుదోచెను చంద్రుని పదునైదుకళలను దేవతలు దిగమ్రింగెదరనియు, ఆవెన్నెలవెన్నముద్దను భక్షించెదరని నూత్న భావమును సృజించిన మన పూర్వపుటార్యుల సృష్టిరహస్యమునకు కారణము తెలియుచుండుట లేదా!

క్రిందటిసంవత్సరము మనదేశమునకు వచ్చుచున్నప్పుడు ముగ్గురుస్నేహితులు, నేను మాకుర్చీలపై కూర్చొని ఆవెన్నెల చంద్రుని, ఆబాలకృష్ణుని, ఆయశోదమ్మగోపులపాడుగను, నల్లి గంటలకొలది గాంచుచు ప్రతిరాత్రి షుమారు పదిరెండుదినములు సుఖము బొందుచుంటిమి. పగలంతయు చదువుచు, వ్రాయుచు, నాలోచించుచు, తర్కింపుచు శ్రమజెందిన మేమందరము మాకొలదికాలము మాత్ర నాటక సంకర్షణముచే నిద్రపోయి లేచినవారివలె, అలసటదీర్చుకొని దాహముకొని బయలుదేరు బాటసారివలె అత్యధిక దేహమానసహృదయోత్సాహము నొందుచుంటిమి.

సముద్రము దిగంతములను జారుగొనుచుండెను. మరొకదినము చంద్రకాంతియుతమా త్రికోణముల యావరణ మపారమగుచుండెను. ఒకప్పుడు ఏనుగుల తొండములా! ఆవచ్చు జలధారలు తొండములనుండి బయ

గ్వెడలు ఘూర్ణనినాదములా యని యనిపించుచుండెను. మరొకప్పుడు యింద్రచాపములేని, ఆకారములేని, ప్రాణముబాసిన భస్మరాసిపై గాలి వీచుచుండగల్గిన వాయుస్వరూప మావిధముగ పోతనయొక్క భగవత్స్వరూప ప్రదర్శనమువలె బయలుదేరుచుండెను. అంతయు నూత్నమే. ఈక్షణమున్న తేజము, స్వరూపము మరొక క్షణమున నుండదు. అంతయు నొకేమాదిరి నెల్లప్పుడుండుట వెన్నెలస్వరూపమునకు గాని యిందువులకుగాని, నవ్వులకుగాని సహజముకాదు. మానవునికి ఒకేవస్తువునందు ఒకేవిధముగ నెల్లప్పుడు సంతృప్తిలేక మార్పుకావలసినట్లే, భగవత్స్వరూపములైన మానవహృదయములకు శాంతి, సుఖము, భోగము, ముక్తికలుగునటులే చంద్రసుఖభోగపు స్మృతులు వివిధములుగా కళభూయిష్ఠములై యున్నవి. అమెరికను స్నేహితునిపగిది ఆచంద్రుని సౌందర్యరాశిని మేము దిగమింగుచు, ఆవెన్నెలను అఘ్రాణించుచు చెవులద్వారా ఆవెల్తురుయొక్క సంగీతమును వినుచూ, కన్నులద్వారా దాని చిద్విలాసములను జూచుచూ బుద్ధిద్వారా పరకాయప్రవేశ మొనర్చుచు, హృదయముద్వారా నూత్న తేజమునకే యింపును సొంపును కలిగించుచుంటిమి. ఆవెన్నెలకు మేము వెల పెట్టుట లేదనికాని, దానికి నూత్నస్వరూపము కలి చుట లేదని ఎవరుచెప్పగలరు. ఆవెన్నెలయను సము మున మేము స్నానమొనర్చుచుంటిమా! ఆకాంతియ యింటియందు కాపురముంటిమా! ఆచంద్రకిరణముల వాసములపై వానివెన్నెలను కప్పుపెట్టుకొని భూత పిశాచముల బారినుండి దాగొనుచుంటిమా? లేక ఆ న్నెలయను ఎండయందు చలికాచుకొనుచుంటిమా? ఈ ద్ధులన్నియు కొంతకొంతగాకలిసిన ప్రత్యేకబుద్ధితోడ ఆమహామృతమును, ఆమధురరసమును, మన్మథశిఖరము మాసొమ్ముగా గ్రహించుచుంటిమి కాబోలు. కా గలరా!

మనవారు సముద్రప్రయాణము వలదనుటవ కాబోలు మనకవులు సముద్రమున కాచినవెన్నెల, సినవర్షము వృథాయైనట్లు వర్ణించిరి. సముద్రముపైనున యీవెల్తురుయొక్క ప్రభావమును జూచినవారు, యీ జమును ఆనందించినవారు మనకవుల భ్రమను వెంట పరిహసింపగలరు.

---

# రామచంద్ర ప్రభు శతకము

కూచి నరసింహముగా

(౬-వ సంపుటము, ౫-వ సంచిక తరువాయి)

"అంతంబందున నెట్టులుండు మతిభావ్యంబుండు న"ట్లన్న సి
ద్ధాంతంబు న్స్మరియింపఁ గంపమొదవున్! ప్రాణావసానావధిన్
స్వాంతం బేస్థితి నుండునో యెవఁడు చెప్పంజాలు? నా మొక్కుల
న్వింతు న్నీకిదె! యిష్టి! సద్గతుల నీవే! రామచంద్రప్రభూ!

బాధల్లోఁతలు నన్ను లెక్కడుగ సేవ ల్చేయు నావశ్యమున్
క్రోధం బిట్టివిలేని న్మతియు, హృల్లోకశంబునం దష్టు న

ర్వాధివ్యాధిహారత్వకీయ శుభదివ్యాంఘ్రిద్వయి న్నిల్పుకొం
చే ధైర్యంబున నుండుపాటవము, నీవే! రామచంద్రప్రభూ!

అన్యార్థంబు లొసంగుమంచు నిను నే యాచించి పీడింప, ని
ర్దైన్యంబైన సుజీవనంబు, విగతేర్ష్యాలోభదుర్భీరుతా
మన్యుస్వాంతవిశుద్ధియు, న్నరులక్షేమంబు న్సదా కోరు ప్రా
వణ్యంబు, న్దయసేయు దీనజనకల్పా! రామచంద్రప్రభూ!

పరశర్మప్రదకృత్యము ల్సలుపఁబోవ న్ధర్మరాజి న్బర
స్పరవైరుధ్యము దోఁచి మానసము క్షోభం బొందు నప్డప్డు; డ
త్తఱి నే దానిని వీడి దేనిఁగొనఁ గర్తవ్యంబొ బోధించి న
న్సరి యథామార్గమునందుఁ బెట్టు పరమేశా! రామచంద్రప్రభూ!

ధరలో నందఱు సౌఖ్యమొందుదురుగాత న్నీకృప న్సర్వదా!
యొరుల న్వాఙ్మనసంబుల న్గ్రియలనే నొక్కప్డు న్బాధలన్
బొరయంజేయకయుండుఁగాక!—యను సంపూర్ణాభిలాష న్నిరం
తరము న్నేమనమున న్లొనర్పు పరమాత్మా! రామచంద్రప్రభూ!
ఖ్యాతిన్నాతిగఁ జేసి ప్రోచెడు సమర్థత్వంబు నాదే కదా!
శ్రోత్రి న్నిస్తుల భక్తుఁ జేయఁగల నేర్పు న్నాకెగా యుండు! న
న్నేతో గర్వమునొంద! కీడ జడతాచిత్తోరులౌల్యంబుల
న్రాతి న్గోఁతిని మించువాఁడు గలఁడన్నా! రామచంద్రప్రభూ!

పతిపత్నీసుతసోదరప్రభృతు లాపత్కాలమందు న్బలా
యితులై పోదురు చెట్టలైనవిడి; సద్వృత్తంబువా రైనచో
మృతులైపోవు లెకాక తాము పయిగా హృత్తాపముం దెత్తు; రీ
గతి సంసారము నమ్మియుంట వెతయేగా! రామచంద్రప్రభూ!

పరుషోక్తు ల్వచియించి చిత్తమును నొవ్వంజేయఁగా నెవ్వఁడే
దొరఁకొన్నన్ ప్రతినిష్ఠురోక్తులను దద్దుష్టత్వవహ్ని న్మఱిం
త రగుల్ప న్గమకింపకుండ, నతిశీతక్షాంతివార్వృష్టి రూ
పణఁ జల్లార్చుపటుత్వ మీవె పరమేశా! రామచంద్రప్రభూ!

వీరి న్వారిని జూచి స్వార్థపరత న్వ్యగ్రస్తచిత్తంబుతో
నోర న్సత్యమురాఁగ నీకనృతసందోహంబుల న్బల్కు న
ద్దారింబట్టక యెట్టిపట్టులను సత్యంబే వినీతోక్తులన్
ధీరస్వాంతత వెల్బు బుద్ధినిడు తండ్రీ! రామచంద్రప్రభూ!

ఆపత్కాలమునందుఁ గ్రుంగఁబడి దైన్యంబంద, కుద్దామ సౌ
ఖ్యాపాదస్థితిఁ గ్రిందుమీఁ దరయ కత్యౌద్ధత్యముంబొంద, కే
యాపత్సంపద లెప్డు డెంతగను సంప్రాప్తించిన, న్నిశ్చలం
బై పొల్పారెడు చిత్తము న్గరుణ నీవా! రామచంద్రప్రభూ!

కన్నుల్గల్గిన బుద్ధిగల్గిన భవత్కల్యాణధర్మంబు లా
పన్నత్రాణపరత్వ ముఖ్యమహిమ ల్స్పష్టంబుగాఁ దెల్పుఁ బై
మిన్నున్ గ్రిందివిచిత్రవస్తుమయభూమిన్; దర్కవేదాంత వి
ద్యోన్నత్యం బనవశ్యకష్టమగుఁజుమ్మా! రామచంద్రప్రభూ!

“నీకర్మంబున వచ్చినట్టిదొసఁగు న్నే నెట్లు పోఁగొట్ట నిన్
సాఁకంగల్గుదు” నందువేనరియె! కష్టంబు ల్తాలంగింపఁగా
నీకు న్నాపయి లేనిచోఁ గరుణ, తండ్రీ! వానినే సైఁచుకోఁ
జేకూర్పంగదె చాలుతాల్మి యయినన్ శ్రీరామచంద్రప్రభూ!

వసనాన్నౌషధసంగ్రహార్థ మొరుల న్బ్రార్థించియో విత్తపుం
బనలేనట్టి స్వబాంధవప్రకరము న్బాధించియో వార్ధకం
బున నంజేయుక, స్వార్జితార్థమున నన్పోషించుకోఁ గల్గు పూ
ర్ణసమర్థత్వమనుక్షయుంబువలె కీరా! రామచంద్రప్రభూ!

పరు లింతే నొనరించినట్టి హితము న్బ్రేల్మాలి సోపేక్షతన్
మఱవంబోక, నిజోత్కటోపకృతులైన న్జిత్తమం దింతయున్
స్మరియింపం జన, కెప్డు డన్యులకు క్షేమంబు న్ఘటింపంగ నా
తెరువు న్వీడక పట్టి నన్నరుగనిత్తే? రామచంద్రప్రభూ!

ఇహాపూర్వాచరితోరు సత్క్రియలచే నేఁ, గాక నీదా నను
గ్రహముం గాంచుటనేని, చేకుఱు సుఖవ్రాతంబుతోఁ దుష్టి నొం

ది హ్మాది స్వాంతము చేసికొంచు ద్రవిణాదిప్రీతిఁ బోనాడి ని
స్స్పృహత న్గాలము పుచ్చి నిన్నెనయునీవే! రామచంద్రప్రభూ

ప్రణుతస్ఫారవిచిత్ర సృష్టిగతదుర్వైషమ్యనైర్ఘృణ్యకా
రణము ల్తర్కముచేత నెవ్వారికి నగ్రాహ్యంబులే! కాని నే
ర్పున నిన్మానసమందుఁ గట్టినిరతి న్బూజించి సేవించు ధ
న్యునకు న్గన్నులఁగట్టినట్ట యగునేమో! రామచంద్రప్రభూ!

దివ్యంబైన సువర్ణహారఁ బరుసవేదిం దాఁకి యి; న్మట్టులే
భవ్యశ్వాస్పదభక్తి నంటఁగని దుర్వారంబులై సర్వ మ
స్తవ్యస్తంబుగఁజేయుకష్టములు నా సౌఖ్యంబు! లో దేవతా
సేవ్యా! నీమహిమంబు లెన్నఁదరమా? శ్రీరామచంద్రప్రభూ!

ఇంపౌ విగ్రహమైతి తొల్తఁ, బిదప న్హ్వాన్మేకకాంభోద వ
ర్ణంపుంగోమున సచ్చరిత్రమున నార్తత్రాణ శౌర్యంబులన్
బెంపుంగాంచిన రాఘవుండ వయి తా వెన్కన్నమస్తాంతర
స్థంపుం జిత్సుఖసత్యమూర్తివయి తీశా! రామచంద్రప్రభూ!

బొమ్మ ల్వీడక యాడుబాలుఁ డెదుగ న్బోనాడి యాబొమ్మలన్
గొమ్మ న్గూడి సుఖంచుమాడ్కిఁదరుణీ గోభాయశోవిత్త సౌ
ఖ్యమ్ము ల్గోరిలుచునుండువాఁడు నినుఁ దాఁగాంచంగ నన్నింటిఁ బో!
పో! మ్మంచు న్నిను నంటియుండు సతతంబు న్రామచంద్రప్రభూ!

అమితంబౌ ఫలమిచ్చు గొప్పతీజంబౌ మున్ను బీజంబు తా
నమయంగావలె నేల; నట్లె భువిపైఁ జాలంగ నన్యోపకా
రములంజేయు నుదారతత్వమగు పూర్వంబందెటో యీయహా
మ్మమకారాత్మకతత్వ మీల్గవలెఁజుమ్మా! రామచంద్రప్రభూ!

వారాశి న్జనియించు నువ్వాన నొసర్పంబడ్డ పాంచాలి యా
వారాశింబడి లోఁతు గన్గొనఁగఁబోవ న్లీనమై పోవునం;
దారీతి న్గన నీకుఁ వేర్మిఁ జని శుద్ధాత్ముండు నీలోన నే
చేరు న్బేరును రూపు మాపుకొనుచున్ శ్రీరామచంద్రప్రభూ!

---

# జార్జిచక్రవర్తి

## ఆయన అనుదిన జీవితక్రమము

టి. శివశంకరం గార

సార్వభౌమపదవి నందినవాడు తఱచుగ భోగపరుడై తనజీవయాత్రను గడపుననుట జనసామాన్యముయొక్క యాశయముగ నుండ నోపు. ఇంతకుముందు కొన్ని నెలలుగ రోగగ్రస్తుడై భిషగ్వరుల నైపుణ్యముచేతను, భగవదనుగ్రహము చేతను, మేరీరాణీ మాంగల్య బలమోయన మృత్యువువాతబడుట తప్పి జార్జిచక్రవర్తి తెప్పరించుకొని మేరీరాణీ ఐదవతనమును మిగిలించి యుండుట సామ్రాజ్యమునకే విశేషభాగ్యమని యనేకులకు స్ఫురించకపోదు. ఈ సార్వభౌముని దినచర్య లోకులకు నాదర్శముగనుండుటకు తగినది. దానిని యీక్రింద సంక్షేపముగవివరింతము. జార్జిసార్వభౌముడు తన యుడుపుల ధరించుటయందు జాణ. ఇంగ్లాండులో మరియేభాగ్యవంతునకైనను యీయన కుండినన్ని ఉడుపులజతలు లేవందురు. ఇవిగాక సమయసందర్భములకు తగినట్టు వాడవలసిన యుడుపుల జతలే 90 వఱకున్నవి. ఇట్టి జతలలో వేటకుపోవునపుడు ఆయన ధరించు వస్త్రచయము సార్వభౌమునికి మిక్కిలి యొప్పినదై యుండునట. ఆయుడుపులతో నుండునపుడు ఆయన సార్వభౌము డని అనుకొనుటకు నెవరికిని అవకాశముండదు.

జార్జిచక్రవర్తి దంభములేని కష్టజీవి. తన పదవియొక్క కర్తవ్యధర్మముల నడపుటయందు దీక్షగలవాడు. తెల్లవారి పడకనుం 7½ గంటకు లేచును. లేచి పూలచీటి నిలువ టంగి ధరించి సిద్ధమగు నంతలో కంచుకి యొ కడు గిన్నెలో తేనీళ్లు తెచ్చి యిచ్చును. అవి యారగించినతోడనే చన్నీళ్లస్నానము. వార మున కొకతూరి క్షౌరకుడు సార్వభౌముని గడ్డ మును కత్తిరించుటకై ఆయన యుడుపులను ధరించు విడిదియందు నియమితసమయము నకువచ్చి గడ్డమును కత్తిరించును. స్నానమైన పిమ్మట ఒంటరిగ ఒక చిన్నగదియందు పరిచా రికలు ఉపహారమును తెచ్చి పెట్టుదురు. ఇందు లో తేనీళ్లు, మెత్తగపక్వమైన గ్రుడ్లు, నారింజ పండ్ల రసాయనమే ముఖ్యమైన సామగ్రి. అటు పిమ్మట సార్వభౌముని పేరట వచ్చియుండు జాబులు ఒకతట్టయం దుంచుకొని కంచుకి యొకడు తెచ్చియిచ్చును. వానిని విప్పి అందలి కాగితములు ప్రక్కన మరియొకబల్లపై విప్పి యుంతురు.

వీనిని చిత్తగించుటకు అరగంట కాలము పట్టును. అటుపిమ్మట సార్వభౌముడు గుఱ్ఱపు స్వారికి తగిన యుడుపులను ధరించి సిద్ధమగు నంతలో నగరులాయమునుండి గుఱ్ఱము నొక దానిని తెచ్చి నిలబెట్టి యుంతురు. సామాన్య ముగ అనుదినము యిట్లు స్వారి వెడలునపుడు రాజకొమారులలో నొకడుగాని లేక యితర

పరివారముగాని వెంట నరుగుట కలదు. యువ రాజు అప్పటి కింటనేయుండుపట్ల ఆయన కాని హెన్రీ అను మరియొక కుమారుడు కాని తండ్రివెంట స్వారివెడలుట కలదు. ఇట్లు అను దినము సార్వభౌముడు తెల్లవారి నగరోద్యానమునందు విహరించుట స్వారివెడలుట తరుచుగ లండను పురవాసులు నిద్రలేచుటకు ముందే. గురిపెట్టి కాల్చుటయందును అశ్వారోహణచతురతయందును సార్వభౌముని నైపుణ్య మసమానమని చెప్పతగినది. 8½ గంటకు లోపల విహారమునుండి మరల వచ్చిన తోడనే మరియొకతూరి స్నానము చేయును. ఆగొడ్డు చలిదేశమందు ప్రాతఃకాలమున రెండుతూర్లు 62 వ యేట చన్నీళ్ల మునుగుట యన నేమో చదువరు లూహించవచ్చును. ఈ రెండవస్నానము ముగించి వేరుడుపులను ధరించునప్పటికి 8½ లేక 8¾ గంట యగును. 9 గంటలు మొదలుకొని పది గంటల వఱకును వార్తాపత్రికలు చదువుటయు అటుపిమ్మట అరగంటకాలము అన్ని కుటుంబములలో వలెనే సతీసుతులతో గోష్ఠినల్పుటయు జార్జి సార్వభౌముని ప్రాతఃకాల కార్యక్రమములలోనిది.

పదిన్నర గంట సమయమునకు సార్వభౌముని ఆప్తకార్యదర్శి స్టాంఫోర్డుహామ్‌ప్రభువు (Stamfordham) సార్వభౌముని దర్శించుటకు వచ్చును. ప్రత్యుత్తరములు వ్రాయవలసిన లేఖలును సమీక్షించవలసిన రాజకీయపత్రములును పరిష్కరించుటకు సమయమది. అప్పుడే మంత్రులు వ్రాసిపంపిన వ్రాతలను శోధించి యుచితమైన యాజ్ఞలను పాలించుట. ఏచోట, యేకాలమందు సార్వభౌముడు యే కార్యముల నెరవేర్చి పరిష్కరించుటకు మున్ముందుగా ఉచితమయిన సమయముల నియమించుకొనుట అప్పుడే. ఇట్టి కార్య నియామకములుముందు ఆరునెలలవఱకు వ్యాపించియుండునట అటుపిమ్మట ఆనాటి కార్యక్రమములను గమనించి నియమిత కృత్యములను నెరవేర్చుటకు సార్వభౌము డుపక్రమించును. ఒక ఆఫీసులో బ్యాంకు ప్రెసిడెంటో, మరి యేవ్యవహారికుడో బల్లముందు కూర్చొని ఎట్లు తెఱపిలేక పని చేయునో, జార్జిసార్వభౌముడు సైతము అట్లే పనిచేయువాడు. ఒక్కొక్క దినమందును దేశమందు క్రొత్తగావచ్చిన వీరవరులెవరో, శిల్పశ్రేష్ఠులెవరో, వార్తాపత్రిక సంపాదకులెవరో, పండితు లెవరో, కవిపుంగవు లెవరో, దేశాటనపరులెవరో, గమనించి వెతికించుచుండును. అట్టి వారిని తనసన్నిధికి రప్పించుకొనుటయు, వారితో వారివారికి తెలిసిన యంశములను గూర్చి సంభాషించుటయు ఆయనకు అచ్చివచ్చిన పని. ఈ చిన్నవాడుకచే వివిధవిధమైన విజ్ఞానసామగ్రిని యాయన సాధించుచుండును. ఇంగ్లాండులోని ఉత్తమ విజ్ఞానవంతులలో సార్వభౌము డొకడనుటకు సందేహముండదు. ఇట్టి సంభాషణకాలమందు పొగాకుచిలుము చేదుచుండుటయు ఆయనకు వాడుక. మధ్యాహ్నము 12 గంటలప్పుడు తనకువచ్చిన యుత్తరములకు ప్రత్యుత్తరములు చెప్పి వ్రాయిం

చుట. ఒక్కొక్కప్పుడు తానే యీ కొపేనాను మసియుందద్ది స్వయముగ జాబులను వ్రాయుటయు కలదు.

ఇది అరగంటకాలము పట్టును. 12½ గం టకు అనుదినము చేయదలచుకొన్నదాన ధర్మముల పట్టిక విమర్శించబడును. సార్వభౌముని యంతవానికి యిట్టికార్య పరిమాణము యెంత విపులమై యుండనోపునో చదువరు లూహించు కొందురు గాక! ఇంతలో ఒంటి గంట కొట్టును. ఇది మధ్యాహ్న భోజనసమయము. కుటుంబమువారందరు చేరుదురు. మృష్టాన్నముకాక సామాన్యముగ వండిన వంటపదార్థములుతప్ప మరియేమియు యుండదు. ఐరోపాఖండమందు జరిగిన మహాసంగ్రామము పిదప భోజనవైభవము నగరునందు తగ్గించబడీ యుండుట లోకమున సుప్రసిద్ధము. భోజనశాలయందు బల్ల కొకవైపున మేరీరాణీయు, మరియొకవైపున సార్వభౌముడును కూర్చుండుట కలదు. ఆప్తబంధువులే కాక సార్వభౌముని మిత్రులుసైతము పంక్తిభోజనము నలంకరించుట చిరకాలము రాచనగరునం దాచారమై యున్నది. అటుపిమ్మట ఒక గంటకాలము చదువుటయందు గాని ఆప్త మిత్రునితో సంభాషించుట యందు గాని వెచ్చించబడును. చక్రవర్తి యెడతెగని చదువరి. పదులకొలది రాజ్యపరిపాలనకు సంబంధించిన పుస్తకములను చదువును. క్రొత్తగ ప్రచురింపబడుచుండు గ్రంథములన్నియు తెఅ

చుగ పరిశీలించును. తమతాత 4 వ జార్జి క లమునాటి చరిత్రాంశముల శోధించుట అయ నకు పిచ్చి యనవచ్చును. చదువుట, టుపా తో వేటాడుట, గుఱ్ఱపుస్వారి, వివిధమైన ష్టాంపులు సేకరించుట సార్వభౌముని క్రీడ వినోదములని చెప్పవచ్చును. మధ్యాహ్నభో నానంతరము 3½ గంటలవరకు విశ్రమించిన తోడనే అస్త్రములచూచుటయో, కర్మాగార ముల నవిూక్షించుటయో, లేక స్మారకచిహ్న ముల ప్రకాశించుటయో మొదలుగాగల క ర్యములను నెరవేర్చుటకు చక్రవర్తి స్వా వెడలును. 5 గంటలకు మరలి నగరునకు వచ్చినది మొదలు రాత్రిభోజనమగు నంత వరకు తన యిష్టమువచ్చిన చొప్పున విహరిం చుచుండును.

చక్రవర్తికి ఆప్తమిత్రులు యెక్కువమం లేరు. మిక్కిలి శ్రద్ధావంతుడు. వ్యాసంగ మందు ఆయనకు రుచి యెక్కువ. హాస్యరస మంతగా పట్టదు. నడచి షికారి వెళ్లినపుడు చక్రవర్తి అపుడపుడు ఆప్తమిత్రుని ఒకని వెంటబెట్టుకొని పోవుచుండును. మంచిసహ వాసి. సందెవేళయంతయు తఱచుగ సలీసుత లతో గడపును. రాత్రిభోజనమైన పిమ్మట సకుటుంబముగ అపుడపుడు నాటకములకు వెళ్లుచుండును. నాటకములకు పోనపుడు చదు వును. సభాషించును. తమమిత్రవర్గములో ఎవ రికైనను స్వస్థతలేనపుడు యేపరివారము కనే వారిని చూచి ఆదరించుటకు వెళ్లివచ్చు టయు కలదు.

# ద్యూతక్రీడ

గో. రామదాసు గారు (కవితాసమితి)

అన్నిక్రీడలకంటెను, ఈ ద్యూతక్రీడ లోకమం దంతటను వ్యాపించియున్నది. ఆర్యజాతులవారిలో ఈజూజం బహువిస్తారం. ఆర్యులకు జూజమంటే చాలా సరదాటగదూ! అంచేతే కాబోలు అన్ని పండుగలవలె జూజంకూడా ఒక పండుగగ ఆశ్వీజపున్నంనాడు పెట్టేశారు. అది కుమారపున్నం. ఆనా డందరూ జూజ మాడాలట. భాగ్యవంతులు తమ నౌఖర్లకు జూజమాడమని డబ్బిస్తారు. ఆడవాళ్లు, మొగవాళ్లు కలసిగాని వేర వేరగాని ఆడుకుంటారు.

చీట్లపేక, గవ్వలు, పాగటాలు జూజానికి కల్లా ముఖ్యం. ఇంకా పట్టాట, గుండాటట ఏవేవో ఉన్నాయి. కాని మన శాస్త్రాల్లో చెప్పినవి పాగటాలొక్కటే. ఇవాటే నలమహారాజు రాజ్యం కోలుపోయాడు. ధర్మరాజు పన్నెండేళ్లు అరణ్యవాసం, ఒకయేడు అజ్ఞాతవాసం చేయడమే కాకుండా తనబాగారివాళ్లందర్నీ చంపుకున్నాడు! ఈ మహాపురుషులే కాదు; దేవతలు కూడ జూజ మాడుతారట. మరి వాళ్లు కూడుపోవడ మెలాగ? లోకులు పెట్టిన నైవేద్యాలు కొట్టడం కూర్చోవడ మేగదూ! అందుకోసమే వాళ్లాడుకుంటారు. ఆ ఆటలోనూ ఎంత నిదానమంటే సంవత్సరాల కొద్ది. ఏకస్వరములో మొఱపెడుచున్న గజేంద్రుని అరుపు వినబడ్డదిగాదట లక్ష్మితో పాచికలాడుచున్న ఆ నారాయణమూర్తికి! ఏపురాణములోనైన విష్ణు, విష్ణుభక్తులే జూజమాడినట్లుంది గాని శివుడుగాని శివభక్తులు గాని పాచికలాడిన ట్లెక్కడా వినలేదు.

గాని ముఖలింగ దేవాలయంలో ఒకదగ్గర శివుడు పార్వతితో జూజమాడుచున్నట్లు చిత్రవున్నది. ఆలయ ముఖమంటపముయొక్క ఉత్తరద్వారమునకు తోరణకంబముపై నున్న ఫలకముపై నున్న దీబొమ్మ. చూచేవారి ఎడమవైపున మొదలుపెట్టి కుడివైపుకు చూచుకొచ్చిన ఆ బొమ్మయం దిట్లుగుపడును. శివుడు పార్వతి మధ్య పాగటాలపాళీ, ఒక స్త్రీ ఒక ఆబోతుకొడెము కన్నె పట్టుకు లాగుకున్నది; ఆ ఆబోతు ఈడిసిలబడుతున్నది. వెనకనుండి మరొక స్త్రీ తోలుతున్నది. ఒక స్త్రీ త్రిశూలంపట్టుకు నడుస్తున్నది. మరొక స్త్రీ చిప్పపట్టుకునిపోతున్నది. శిల్యావశిష్టుడైన ఒకఆజానుబాహువును కొంతమంది స్త్రీలు కాళ్లు చేతులు పట్టుకుని లాక్కుపోతుంటే అతను వెళ్లడాని కిష్టంలేక కాళ్లు చేతులు విదల్చుకుంటున్నాడు.

ఇదంతా ఒక అడుగున్నర వెడల్పు నాల్గడుగుల పొడవుగల రాతిమీద చెక్కియున్నది. చిన్నపిల్లవాడికైనా ఆ బొమ్మ అర్థమవుతుంది. అంత స్వభావమును వెల్లడిచేస్తున్నది. అంతా బోధపడ్డదిగాని ఆ నిర్భాగ్యుడైన ఆజానుబాహుం డెవరో తెలియదు! శివుడు పార్వతి పాగటాలాడేరు, శివుడు ఓడాడు, అందుచేతనే నందిని తోలుకుపోతున్నారు త్రిశూలం పట్టుకుపోతున్నారు. బ్రహ్మకపాళం పట్టుకుపోతున్నారు. గాని ఆ పురుషు డెవరో ఎవరికీ తెలియలేదు! ఈ కథ యే పుస్తకములో ఉందంటే ఎవరికి తెలియదు. అక్కడున్నవారికైనే మొదలే తెలియదు. ఇతరప్రదేశము లందు శివపార్వతుల జూజం విషయమై ఎవర్ని అడిగినా 'మేం వినలేదంటే మేం వినలేదనే'వారే. ఏం చెయ్యడం. ఇదేమనస్సులో నుంచుకొని పురాణములు, క్షేత్రమహాత్మ్యములు వెదక నారంభించినాను. నేనున్నదే కొండ ప్రదేశము. దగ్గరగా ఏవీ పుస్తకభాండారములు లేవు. ఏ పుస్తకము కావాలన్నా చేతిడబ్బుపెట్టి కొనుక్కోవలసినదే. ఎన్నని అలాగు కొనుక్కోగలను. అక్కడికీ అత్యవసరమైనవి కొనుక్కొంటూనే యున్నాను. ప్రాచీనతాళపత్రగ్రంథములు కొందరి కొందరివద్ద నున్నవని విని వారివద్దకు వెళ్లడుగుతే వారు చూపించరు. వాటి నన్నిటిని కట్టకట్టి దేముడిపీటమీద పెట్టి పూజచేస్తున్నారట!



౭. నరసింహ స్తంభము, చెన్న కేశవ దేవాలయము-బేలూరు




ఈశ్వరదత్తుడు (క్రీ. శ. ౨౩౮)

(ఇతని 'నాణెము' నుండి సంపాదింపబడిన చిత్రము.)

చిత్రకారుడు: శ్రీ కొ. నరసింహాచారిగారు, చెన్నపురి.

[ఇతడు క్షత్రపరాజులలో తొమ్మిదవవాడగు దామసేనునితరువాత క్షత్రపరాజ్యమును జయించిన ఆభీరరాజు. ఇతనితరువాత క్షత్రపులు తమరాజ్యమును మరల జయించి తమ కైవసము కావించుకొనిరి.]

వారు చదువారు; చదువలేరు! ఒకరు చదువుతామంటే ఇవ్వరు! ఆ గ్రంథము లేమిటో తెలియదు. అందులో తేళ్లే యున్నవో పాములే యున్నవో ఎవరికి తెలియదు. ఇలాంటి అవస్థలో పడి చారిత్రపరిశోధనను పూనుకొన్నాను.

ఒక ఏడాది కింద మానుస్క్రాలు లైబ్రరీకి పుస్తకాలు తెప్పించాం. అందులో ఒడియా గ్రంథము లున్నాయి. అవి చూస్తూంటే అందులో స్కాంధపురాణములో ఒక భాగమైన మహేశ్వరఖండమందు ప్రథమ భాగమైన కేదారఖండ మని పేరుగల ఒక పుస్తకము కనిపించింది. బంగాళీ అక్షరములతో ముద్రితమైన సంస్కృత గ్రంథమునుండి తర్జుమా చేస్తినని ఆ గ్రంథకర్త, పండిత శ్రీ భోలానాథమిశ్రా శర్మ కావ్యతీర్థులవారు వ్రాసిరి. ఈ గ్రంథమందు ముప్పదియైదు అధ్యాయము లున్నవి. ముప్పదినాల్గవ అధ్యాయమందు శివపార్వతుల జూజ మాట చెప్పియున్నది.

ఈ గ్రంథమం దిచ్చిన కథనే అనువదించి వ్రాసెదను. నాకు తెలిసినంతవరకు ఈ కథ మనదేశమందు విన లేదు. ముఖలింగక్షేత్ర మందున్న ఈ ఫలకమే నాకీ కథను మొదట చెప్పినది. తర్వాత ఈ పుస్తక మాకథను మరింత స్పష్టపరచినది. నావలె ఈ కథను తెలియని వారెందరో యుందురు వారికి దీనిని వినడానికి సరదా యుండునేమో!

పార్వతి వివాహమైంది. కుమారుడు పుట్టాడు. తారకాసురిణ్ణి సంహరించారు. శివుడు బాగా సంసారములో మునిగిపోయాడు. ఇలాంటి అవస్థలో ఒకనాడు శివుడు కొలువు తీర్చున్నాడు. ప్రక్కను పార్వతి గణపతి, కుమారస్వామి కూర్చున్నారు. ప్రమథగణములతో కూడా వీరభద్రుడు సేవ లొనర్చుచున్నాడు. ఋషులూ, దేవతలు మధ్య నిల్చుని బ్రహ్మ స్తోత్రపాఠములు చదువుచున్నాడు. విష్ణు చేతులు జోడించుకొని పక్కను భృత్యునివలె నిలబడ్డాడు. ఇంద్రుడు ఛత్రముపట్టాడు. గంధర్వులు పాడుతూంటే, విద్యాధరులు, అప్సరసలు నృత్యం చేస్తున్నారు. ఇట్టి సమయంబులో శివుని దర్శించుటకు నారదు డొచ్చాడు.

ద్వారంవద్దకొచ్చి అక్కడ నంది సెలవుపుచ్చు[కుని] లోపల ప్రవేశించాడు. అక్కడ వైభవాభాగ్య[ము] చూచేసరికి అతనికి మతిపోయింది విశుద్ధసువర్ణ [...] మహాదేవుని సురాసురలు గలసి సేవచేయుచున్నారు[.] నాగులు, పన్నగులు పాదములొత్తుచున్నారు. వాసు[కి] కంఠహారమైనాడు. అశ్వతర, రత్నకంబళులు కర్ణకుండములైనారు; ఇతర నాగులు జడలై శివుని శిరస్సు నుండి వ్రేలాడియుండగా అర్ధచంద్రుడు శిరోభూషణమై యున్నాడు. మూడు కళ్లు అయిదు ముఖాలు ప[...] చేతులు, విశాలవక్షస్సుతో గజచర్మం కప్పుకుని శివుడు ప్రకాశించుచుండె. ఆ స్వరూపము—ఆశోభచూసేసరి[కి] నారదునికి చైతన్యం పోయింది. ఇట్లాలోచించాడు "హరపార్వతులిద్దరు అభిన్నులుగదా, ఇక్కడ వేరేవే[రు] ఉన్నా రేంచెప్మా! నిర్గుణులుగదా. ఈ గుణాలు వార్ల[...] కెక్కడినుంచొచ్చాయి! ఆకారంలేనివారి కీ వికారా[...]లేమిటి! ఇక్కడ సుఖమంటే అపేక్షకలవారై యుండ[...] కున్నారుకే?" ఇట్లు తలంచి చేతులు మోడ్చి స్తుతిచేశాడు[.] శివుడు సంతోషించి, 'నారదా! నీకు సుఖమా! [...] కేమి ఉపకారం చెయ్యమంటావో, చెప్పు. ఇప్పుడే చేస్తాను' అని పలికెను.

స్వామీ! తమ దర్శనలాభమువల్ల నాకన్ని సౌఖ్య[ాలు] కలిగినవి. నాకింకేం కావాలి! మీరు పార్వతమ్మగారు కలిసి ఆడితే చూతా మని ఉంది. అందుకోసమే కైలాసానికి వచ్చాను" అని నారదు డన్నాడు.

పార్వతి అది విని, 'ఏమి ఆట ఆడమంటావో చెప్పండి" అంది. "జూజంలో అనేకమోస్తర్లున్నాయి. ఇద్దరుకలసి జూజమాడితే వెంటనే స్త్రీ అపేక్షా సుఖం కలుగుతుంద."న్నాడు నారదుడు.

ఆ మాటలు వినగానే పార్వతి చిరచిరలాడుతూ, "ఏమయా! బ్రహ్మకొడుకువు గదా! అందరికీ గురువు వంటి వాడవుగదా! జ్ఞానోపదేశము చేయక ఇలాంటి అజ్ఞానవ్యసనములు చేయమని చెప్తావేమయా! మూడు లోకాలు తిరుగుతూ యిలాటి ఉపదేశాలే చేస్తున్నావు. ఏమిటికే?" అని అన్నది.

"అమ్మా! చెప్తాను వినండి! శివుని కింకరుడను నేను. ఆయన శేవచేసుకునే నేను తరించినాను. ఆయన చర్యలన్నీ నాకు బాగా తెలుసును. గాని ఆయన రాజమాడ్డం నే నెప్పుడూ చూడలేదు! ఈ విషయమై ఎవరైనా నన్నడిగితే నేనేం చెప్పేది? అందుకు నే న్నాను. నా మనస్సులో మాట చెప్పేశాను. మీ యిష్టం" అని నారదుడు ప్రత్యుత్తర మిచ్చెను.

పార్వతి చిరునవ్వు నవ్వి, "అలాగటయ్యా! అయితే వాడు, ఆడతాం!" అని చెప్పి, దాసీని పిలచి పాచికలు పాళీవప్పాలు తెప్పించి శివునితో ఆడ్డానికి ప్రారంభించింది. శివుని పరిచారకులందరూ శివుని పక్షాన్ని, పార్వతి చెలికత్తెలంతా ఆమెపక్షాన్న కూర్చున్నారు. కొంతసేపాడేసరికి శివుడు గెల్చాడు. పార్వతి పందెం పోయింది. శివుడు కొంచెం ఆమెను కేలీచేసినాడు. అది విని నారదుడు కూడా ఆమె నాస్యం ఆడేసరికి, పార్వతి ఉగ్గమీరక వేలేసుకొని ముఖంవిశిరింది. ఆమె చేర్పుక్కా అల్లాడి ఆమె ముఖకాంతి హెచ్చింది. ఆవొయ్యారం చూచేసరికి శివునికి మతిపోయి ఆమెతో మళ్లీ ఆడాలని మనసేసింది. "రావే! పర్వతరాజపుత్రీ! మళ్లీ ఒక్కాట ఆడదాం!" అని పార్వతిని పిలిచాడు శివుడు. "పోనీ సురూ! పందెం లేని ఆట ఏం ఆట!"

"పందెం ఒడ్డాలా ఏమిటి! అయితే ఇదిగో, మాడు! ఈ చంద్రరేఖ, ఈ రెండు కర్ణావతంసములు పెట్టేను. నీచేతైతే గెల్చుకుపో!" అని చెప్పి ఆ మూడువస్తువలు అక్కడతీసి శివుడు పెట్టేను.

ఇద్దరూ ఆడేరు. పార్వతిగెలిచేసింది. ఇలాగు శివుడు ఒడ్డినదానినల్లా పార్వతి గెల్చేసింది. అన్నీ గెల్చుకుని పార్వతి అన్నది, 'చూచారా! నేను గెల్చాను. మీరు పందెం ఒడ్డినవాటి నల్లా!"

"పార్వతీ! బాగా ఆలోచించు! ఈ మూడు లోకాల్లోను నన్ను గెల్చేవాడెవడే! నా పేరు అజేయుడు! ఇలాటి మాట చెప్ప రాదసు! నన్నేమిటి! నీ శక్తేమిటి? గెలవడం ఏమిటిది?" అని శివుడు చిన్న నవ్వుతో అన్నాడు.

"దేవా! త్రిలోచనా! కొంప్పడకండి మీ అజేయత్వం ఈ ఆట్లో తెలిసిందిగదూ! ఇక ఎందుకీ ప్రతాపాలు!" పరిహాసంగా అని, "ఈ వాదన కేం గాని మీ రొడ్డినవాటి నన్నిటిని అక్కడ పెట్టండి!" అని అన్నది పార్వతి.

శివుడు ఛట్టున, "అదుగో! మళ్లీ ఆలాగే అంటావు! నేను నీదగ్గర కిగిపోవడమేమిటే? ఒట్టినే ఎందుకు మాటలు ఖర్చుపెడుతావు? కొంచెం జ్ఞాపకం తెచ్చుకో! నా సంగతి బోధపడుతుంది!" అని అన్నాడు.

"దానికేం! కడుంవాళ్లకు ఉంటే ఉందురేమో! వాతో ఇవాళ ఓడిపోయారా లేదా చెప్పండి? మరి బుకాయించక!" అంది పార్వతి.

వీరిట్లు తగువులాడుకుంటే, ఊరుకోలేక నారదుడన్నాడు, "వట్టి వాదనెందుకమ్మా! గిరిరాజకన్యా! శివుడు మహానుభావుడని అందరికీ తెలిసిందే! అతను నీకు తీసిపోతాడా? ఏం అబద్ధాలు! ఎన్నెన్నో నానా శ్రమదమాలు పడితేనే గాని అతన్ని పొందలేకపోయావు! అలాటిదిప్పుడతన్ని జయించావా? రూపం లేనివాడని కొందరు, సుందరుడని మరికొందరు, రూపాతీతుడని మిగిలినవారు శివుని విషయమైఅనుకుంటున్నారు. అతను సురలకైనా అసురలకైనా అజేయుడు అని ముల్లోకాల్లోను ప్రఖ్యాతిచెందున్నాడు. అంతటి వాడు శివుడు! నీవో! ఆడదానివి! ఆయన నిజస్వభావము గుర్తించలేక్కపూ! నీకు!" అని అనేసరికి తోకతొక్కిన పాములాగ పార్వతి నారదునివేపు తిరిగి, 'ఓహో తమరా! బ్రహ్మమానసపుత్రులుగదూ! మీ సంగ తెవరికి తెలియదు? మీ తంటాలకోరుతనం, జట్టీలు పెట్టడంలో మీ కున్న కుశలత అందరికీ తెలిసిందే! బాబు! మొక్కుతాను! మీ రిందులోకి రాక నోరుమూసు కూర్చోండి. మీకు తెలిసిన శివతత్వమల్లా నేచెప్పిందేగదూ!" అని అనేసరికి కిక్కురుమిక్కురు మనకుండా నారదు దూరకున్నాడు.

గాని భృంగి శివుని నౌఖరు. వాడూరుకుంటాడా! "పార్వతమ్మా! నా మాట లాలకించు. చిరాకుపడితే

లాభం ఏమిటి? శివుడు నీకు, నాకు, అందరికీ కూడా ప్రభువు! నువ్వు చూస్తే ఆడదానివి! ఆయన సత్తువ నీకెలాగు తెలుస్తుంది? పూర్వం మన్మథునిసాయం చేసుకున్నైనా ఈ త్రిపురారిని పొందలేకపోయావు! హరుని ప్రతాపం అంతా మరిచిపోయావు! కందర్పుని కాల్చి మీ నాయనగారి అడవికిపోయి ఉన్నా ఆయన దగ్గరకు వెళ్లడానికి ఎంత తపించావో జ్ఞాపకం లేదా?" అని భృంగి అన్నాడు.

ఈ మాటలు వినేసరికి పార్వతికి ఒళ్లుమండి, శివుడు వింటున్నాడనైనా వెరవక, "ఓరి మందబుద్ధీ! ఓరి మూఢా! నీకు శివునియందు భక్తి ఉంటే ఉంచుకో; గాని అట్టే పేలకు! నేనొకటి పరమేశ్వరొకటి అనుకున్నావురా? ఆతనెప్పుడూ నా వద్దనే ఉంటాడురా!" అని అంది.

ఇంకా ఊరుకోక భృంగి, శివుని పక్కచేరి, 'హైమతీ! శివుని మించినవారెవరూ ఈ మూడులోకాల్లోను లేరు. ఆయన సేవచేసుకో. నీకు లాభం కలుగుతుంది!" అని జవాబు చెప్పి, శివునికోసం పార్వతి పడ్డ పాట్లు అవన్నీ ఎత్తిపొడిచేటప్పటికి పార్వతికి అతి కోపం వచ్చింది.

దెబ్బతిన్న పులిలాగ గుబ్బని లేచి పైటచెంగు మొలను చుట్టుకొని, తీక్ష్ణంగా భృంగిని చూస్తూ, 'ఒరే! అట్టే పేలకు! నీ మనస్సులో నెవరనుకున్నావేమిటి? నీ పాటి నాకు తెలియదనుకున్నావా? నాఖరీవాడివే నీవు నాకు చెప్పేపాటివాడవురా! నిన్ను శపిస్తాను. నీ కేవరడ్డొస్తారో చూసుకో! ఈ క్షణం నిర్మాంసుడవైపో!" అని తిట్టింది. తక్షణం భృంగి వంట్లో రక్తమాంసాలుపోయి ఒట్టి ఎముకల పంజరమే మిగిలింది.

అటుతర్వాత పార్వతి ఆ ఉగ్రంతోనే శివుని వైపు తిరిగి చంద్రకళా, నాగాభరణములు, గజచర్మము మొదలైనవేగాకుండా ఆఖరికి అతనిగోచీకూడా ఊడ బెరికి లాక్కుంది. గోచీతీసిలాగుకొనేసరికి అక్కడున్నవారంతా సిగ్గుచే తలలు వంచుకున్నారు. అది చూచి, శివుడు, 'ఇదేమి బుద్ధే, పార్వతీ! నా కౌపీనం తీసేదానికి నీకు సిగ్గేసింది కాదే! నీవు గెలిస్తే గెలిచిన వస్తు లేవైనా తీసుకోవలెనుగాని గోచీకూడా తీసుకోవ ఏమిటి?" అని తలవంచుకునే అన్నాడు:

పార్వతి ఫక్కున నవ్వి, "మీరు భావితాత్ములు మహాదేవులుగదా! గోచీలేకపోతే ఏంపోయింది? సిగ్గా వాడు దారుకావనంలో ముని భార్యలను మోహిం చేసినప్పుడు గోచీ ఉంది కాబోలు? మునులు పూజల వరించినప్పుడున్నదా? అప్పుడు లేని సిగ్గు ఇప్పుడెందుక నే గెలిచాను తీసుకున్నాను; మరి వీటికోసం ఆశప కండి, జూదమాడి పీగిపోయిన వారి అందరిగతీ ఇంతే! అని అన్నది.

ఈ వెటకారం మాటలు విని శివునికి కోపం వచ్చి నది. తీక్ష్ణముగా మూడోకన్నుతో పార్వతిని చూచాడు మన్మథునివలె పార్వతికూడా భస్మమై పోతుందని దే తలు, ఋషులు జడిశారు. పార్వతి అప్పుడు శివు చూచి "ఓహో త్రిలోచనములా! మీకు మూడుకళ్లువా యని నాకు తెలుసును! అది నన్నేం చేస్తుంది? నేనే మన్మథుణ్ణా? కాలుణ్ణా? అంధకుణ్ణా? కాలిపోవ నికి! దక్షయజ్ఞము, త్రిపురములు అయితే కాలిపో నేమో! నేను ఈశ్వరిని! నా దగ్గర మీ విరూపా బిరుదు చెల్లదు!" అని వెటకారంగా అంది.

ఈ అయిన పరాభవమునకు చాలా చిన్నబోయి శివుడు అక్కడనుండి లేచి తపోవనమునకు వెళ్లిపోయాడు

ఇది శివపార్వతుల ద్యూతక్రీడకథ. ఇన్ని మా లతో చెప్పిన కథంతయూ కాళింగ శిల్పి మూగిబొమ్మ లచే ప్రదర్శించినాడు. ఏమి చమత్కారము! ఏమి కళా నిపుణత! శివుని వస్తువులు పార్వతితాలూకు చెలికత్తెల తీసుకుపోతున్నట్లు జూపించడమే శివుని పరాభవ చెప్పుట. ఆనిర్మాంసుడైన మహాపురుషుడు భృంగి అం నట్లు ఈ కథవల్ల తెలుస్తున్నది. భృంగికూడా పార్వ స్వాధీనుడై పోయినాడు. వాణ్ణి పార్వతి శపిస్తే శి డేమి చేయలేదు. అందుచేతనే భృంగిని కాళ్లు చేతుల పట్టుకుని పార్వతి పరిచారకులు లాక్కుపోతూన్నట్ల శిల్పిచూపించాడు. ఇంతేకాదు, ఎవరెవరి మనోభా

...లు వారి వారి ముఖములందు కూడా ఉన్నాయి. ...వుని పరాభవము ఆ శివుని విగ్రహముఖమందు చూపిం...డు శిల్పి. ఈ ఫలకమునందున్న శిల్పచాతుర్యము ...ఇతర ఫలకములందు కూడా శిల్పి చూపించేయు...న్నాడు. వీటిని బట్టి ఆ నాటి కాళింగ శిల్పుల చాతుర్యమెంతని కొనియాడగలము.

అంతటి విద్వాంసులుండే ఆ కళింగరాజ్య మిప్పుడు పేరైనా లేకుండా పోయిందిగదా! ఒక్క కాళింగులని చెప్పుకునే జాతివారుమాత్రమే ఇంకనూ ఆ రాజ్యమువతను నిలబెట్టి ఉన్నారు. కళింగపట్నం అని ఒకపట్నం కూడా ఉందిగాని అది కూడా నామావశిష్టమైయున్నది. రాజ్యముపోయినా, ఆ రాజులు పోయినా, అవన్నీ జనులు మరచిపోయినా ముఖలింగాలయమున్నన్నాళ్లు కళింగరాజ్యగౌరవము పోదు. కళింగ శిల్పమువత చెడదు. శివపార్వతుల ద్యూతక్రీడ చెరిగిపోదు!



విద్యార్థినీ సమాజము - కాకినాడ








# భారతీయ చిత్రరచన-కొన్ని విశేషములు

తలిసెట్టి రామారావు గారు

దేవునిచే సృజింపబడిన యే వస్తువుయొక్క చిత్రమునైనను వ్రాయుట సృష్టికర్త ననుకరించుట యగును. కాన చిత్రరచన పాపమని నాగరికతశైశవమునం దుండు కాలమున ప్రజలు తలచుట సహజము. దేవునిచే సృజింపబడిన యేవస్తువుయొక్క రూపమునైనను వ్రాయుట పాప మని ఖురానునం దుంటచే చాలాకాలమువరకు మహమ్మదీయ దేశములందు చిత్రరచన తలయెత్తకయుండెను. ఖురానును విశేషము పాటింపని చక్రవర్తులు రాజ్యమును పాలించు కాలమున మాత్రము చిత్రకారులకు కొంత సాహసము కలుగుచుండెను. సనాతన కాలమున ఈ నియమము ప్రపంచమునం దంతటను ప్రబలియుండుట సంభవము. ప్రజలయందు కవిత్వము, సంగీతము, జ్ఞానము ప్రబలిన చాలాకాలము పిమ్మట చిత్రరచన యభ్యసింపబడెను. అనాదినుండియు హిందువు లాధ్యాత్మికదృష్టి కలవారు కాన యీ నియమము నితరదేశీయులకంటె ఎక్కువ పాటించి యుండవలెను. అయినను గ్రీసుదేశస్థులీ దేశమునందు తమ శిల్పమును ప్రవేశపెట్టక పూర్వము అనేక శతాబ్దములు చిత్రకళ నభ్యసించి అత్యద్భుతమైన కళానియమముల నేర్పరచుకొని యుండిరి.

పూర్వము భారతదేశము ఇతర దేశములపై నే విషయమునందును ఆధారపడక పోవుటచే భారతీయ నాగరికతకు సంపూర్ణమైన వ్యక్తిత్వము కలదు. ఈ విషయము చిత్రకళయందు సుస్పష్టముగ గాన వచ్చుచున్నది.

వేదములు మొదలగు ఆత్మపరిపాకమునకు కావలసిన జ్ఞానమంతయు దేవుడు లోకమునకు ప్రసాదించెనని హిందువుల నమ్మకము. ఈ విషయమై పురాణములం దనేకములు కథలు కలవు. లలితకళలలో నొకటగు చిత్రరచనను బ్రహ్మయొక్క విప్రునకు నేర్పెనని కథ కలదు. ఈ కథ యనేక శతాబ్దములకు పూర్వము వ్రాయబడియుండుటచే చిత్రరచన చాలాకాలమునుండియు మన దేశమున గల దని చెప్పగలము. ఇతరదేశముల నుండి యీ రచనను హిందువులు నేర్చుకొనలే దని కూడ ఈ కథ తెలియజేయును. కాని చరిత్రకారు లిట్టి కథలపై నాధారపడజాలరు. కాన తక్కిన నిదర్శనముల గూర్చి వెతక వలసి యుండును.

వివాహములందు రూపచిత్రములు విరివిగ నుపయోగము నందుండెనని పురాణములందును, పూర్వకాలమునందు వ్రాయబడిన

కావ్యములందును కానవచ్చుచున్నది. దీనికి దక్కని యుదాహరణము ఉషాపరిణయము యొక్క కథ. "చిత్రలేఖ" స్త్రీ యగుటచే స్త్రీలును చిత్రములను వ్రాయుచుండిరి. ఇంతగా ప్రబలియుండినకళ యీకథను వ్రాయుటకు చాలాకాలమునకు పూర్వమునుండియు నభ్యసింపబడు చుండెనని చెప్పవచ్చును.

రాజులగృహములు చిత్తరువులచే నలంకరింపబడు చుండెనని చెప్పుటకు మన సనాతన గ్రంథములం దనేకము లగు నిదర్శనములు కలవు. ఈ గృహములన్నియు మన్నుతో గట్ట బడుటచేత నిప్పుడు నశించినవి. దేశపాలకులు గృహముల నలంకరించుకొనుట సామాన్యమగుటచే చిత్రరచన యీ విధమున నాదరింప బడెనని యొకానొక శాస్త్రజ్ఞుని యభిప్రాయము. ఇది సమంజసముగ గాన వచ్చుచున్నది. కాగితములు లేని కాలమున, గృహనిర్మాణము అభివృద్ధి కాని కాలమున, సామాన్యుల గృహములందు చిత్తరువులను వ్రాయుటకు చోటును, అనుకూలమును ఉండదు. ఇట్టి పరిస్థితులందు రాజులు కాక మరెవరు చిత్రరచన నుపయోగ పరుప గలరు?

శుభకార్యములకు గోడలపై చిత్రములను వ్రాయించి యలంకరించుట యిప్పటికిని కొన్ని ప్రాంతములందు ఆచారము కలదు.

అజంతచిత్రములు లోక ప్రసిద్ధములు. ఇవి యన్నియు బౌద్ధవిహారముల గోడలపై నున్నవి. గోడలపై వ్రాయుట యాచారమై యుండక పోయిన యెడల నొక్కపరి, యింత స్థిరముగ నుండు నటుల నీ యద్భుత చిత్రసమితిని సృజింప గలుగుట యసంభవము. చిత్రకారు లెచ్చట రచనను నేర్చుకొనిరి? గోడలపై వ్రాయుటకు వాటిని సిద్ధపరుచుట వీరి కెటులు సాధ్యమయ్యెను? రంగులను తయారుచేసికొనుట వీరి కెటులు దెలిసెను? ఈ ప్రశ్నలకు జవాబు యింతకు పూర్వము చిత్రరచన దేశమున నుండెనని నిర్ధారణ చేయును. బౌద్ధసన్యాసులు తమ రచనాసామర్థ్యమును తమ మతప్రచారమునకు వినియోగ పరచిరి.

భాష అభివృద్ధి చెంది యుండిన, వ్యాకరణము వ్రాయుట సాధ్యమగును. వ్యాకరణము వ్రాయుటకు భాషయందు ప్రవీణులుండవలెను. ఇటులనే చిత్రకళ మిగుల నున్నత దశయందు లేని యెడల కళయొక్క నియమములను, కట్టుబాట్లను నిర్ధారణ చేయుట సాధ్యముకాదు. మన పూర్వకాలపు గ్రంథములందు చిత్రరచనను గూర్చియు, శిల్పమును గూర్చియు అనేక నియమములు గాన వచ్చుచున్నవి. చిత్రమునకు కావలసిన విషయములను సప్తాంగములుగ విభజించిరి. ఈ విభజనకు కావలసిన జ్ఞాన సూక్ష్మత ఆధునికకళా విమర్శకులకు ఆశ్చర్యమును కలుగ జేయుచున్నది. ఈ సప్తాంగములు కొన్ని మార్పులతో జపాను, చైనా ప్రాంతములందు వాడుకలో నుండినటులు నిదర్శనములు కాన

వచ్చుటచే చైనానుండి యివి భారతభూమిని ప్రవేశించెనా యని కొందరు సంశయించిరి. కాని బౌద్ధ సన్యాసులు మత ప్రచారమునకై యా దేశములకు బోయి హైందవచిత్రరచన నచ్చట బ్రవేశ పెట్టి సప్వ డీ సప్తాంగ విధ జనమును వారికి నేర్పినటుల నిప్పుడు స్పష్ట మయ్యెను.

అజంతచిత్రములను పరీక్షచేసి చూచి నను వీటి యందు విదేశీయ చిత్రరచనాసాం ప్రదాయము లెవ్వియు కానరాక యున్నవి. రాజులు, రాణులు, దుస్తులను అల్పముగ ధరించి యున్నను వీరి సేవకులు చొక్కాయలను, పరాయీలను, టోపీలను ధరించి యున్నటులు నీ చిత్రములందు కానవచ్చుచున్నది. సేవకులు పర్షియా దేశము వారై యుండవలెను. ఇంతమాత్రమున అజంతచిత్రరచన పాశ్చాత్యరచనవలన కొంచెమైనను మార్పు జెంది యుండవలెనని చెప్పజాలము. ఆఫ్ఘను స్థానము, మధ్య ఆసియా, తిబెత్తు, చైనాలందు భారతీయ చిత్రరచన యొక్క చిహ్నములు కానవచ్చు చున్నవి. అజంతచిత్రముల కాలమున వ్రాయబడిన చిత్రముల గొన్నిటిని యీ మధ్యను ఫ్రెంచి అర్షశాస్త్రజ్ఞులు ఆఫ్ఘనుస్థానమున జూచిరి. ఇవి యన్నియు హైందవచిత్రసాంప్రదాయములను, హైందవుల నమ్మకములను అనుసరించి యుండుటచే హైందవ చిత్రరచనను జూచి యా యా ప్రాంతముల వారు వీటిని రచించిరని చెప్పవచ్చును. ఇంత

కుపూర్వ మా దేశములందు చిత్రరచన చా మోటుగ నుండెను. ఇట్టి రచన విశేష మ వృద్ధిజెంది యుండిన గాని ఉన్నత దశయం దుండు రచనయందు మార్పులను కలుగ జేయ లేదు.

గాంధారశిల్పము నందు గ్రీసుదేశపు శిల్ప చిహ్నములు ప్రబలముగ గానవచ్చు చున్నవి బరుహూతుస్తూపము నందును ఇట లీ దేశపు స్తంభములు కానవచ్చు చున్నవి వీటిని జూచి హైందవశిల్పకళ గ్రీసు దేశమునుండి యీ దేశమునకు వ్యాపించెనని కొందరు వ్రాసిరి. గ్రీకులు భారత దేశమునకు రాక పూర్వమే యిచ్చట యీ కళ మిగుల ఉన్నత దశకు వచ్చెను. గాంధారమున యవనశిల్పము బ్రవేశించిన వెంటనే హైందవశిల్పము దీని నా కర్షించి, మార్పుజేసి తనలో జేర్చు కొనెను. బరుహూతునందు అశోకచక్రవర్తి యవనశిల్పు లను నియమించెను. విదేశశిల్పముకంటె భార తీయశిల్ప మెక్కువ శక్తివంతము, ఆవేశపూరి తము కాన యవనశిల్పులు హైందవశిల్పు లకు నేర్పిరనుటకంటె, హైందవశిల్పులు యీ దేశమునకు వచ్చిన యవనశిల్పులకు నేర్పి రనుట ఎక్కువ సమంజసముగ నుండును.

పరదేశములకు దూరముగ నున్న దక్షి ణహిందూదేశమునందే అజంత, సీగిరియచిత్ర సమితులు కానవచ్చు చున్నవి. ఉత్తరహిం దూదేశమున నున్న బాఘ్‌చిత్రములు అజంత చిత్రరచన ననుసరించి వ్రాయబడినవని చెప్ప టకాధారములు కలవు. అజంత చిత్రకారు

లంకరు దక్షిణ దేశీయులే యని చెప్పుట కవకాశము కలదు.

ఈ కారణముల వలన చిత్రకళ పరదేశముల నుండి మన దేశమునకు రా లేదనియు, బౌద్ధమత ప్రచారమునందు మన దేశమునుండి పరదేశీయులకు వ్యాపించెననియు స్పష్టము. ఇతర దేశీయు లనాగరకులైయున్న కాలమున భారత దేశము చిత్రకళ నత్యద్భుతముగ నభివృద్ధి పరచెను. భారతీయనాగరికత కనుగుణ్యముగ నీరచన యేర్పరుపబడెను. దీనికి సంపూర్ణమైన వ్యక్తిత్వము కలదు.

## మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు'సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారులసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము. —భారతి

## మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నపెజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూర దూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమును తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యముల యందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచి పోవు నని మనవి. సంపాదకుడు, భారతి.

## ౧. స్త్రీవిద్యావశ్యకత

ఏ సంఘముయొక్క యభ్యుదయమైనను, దత్సంఘమునందలి విద్యావ్యాప్తి ననుసరించి యుండును. భారతదేశమునందలి స్త్రీసంఘాభివృద్ధి యెట్లుండెనని తెలిసికొనఁగోరువా రాసంఘమునందలి విద్యాభివృద్ధిని ప్రమాణముగ గణించవలెను.

స్త్రీల కున్నతవిద్యఁ జెప్పింపవచ్చునా, కూడదా యని వాదులాడువా రిప్పుడును గలరు. కాని, పాశ్చాత్యదేశముల యభివృద్ధి గాంచియు, భారతనారీమణుల యొక్క హీనస్థితిం గాంచియు, శ్రేయఃకాములగు నిప్పటివారు స్త్రీవిద్యావ్యాప్తికై ముందంజ వేయుచున్నారు.

అయినను సంఘమునందలి కొన్ని యాటంకములనుబట్టి, మన స్త్రీలకు ఆదాయవ్యయపుస్తకమును వ్రాసికొనునంతటి జ్ఞానముగల ప్రాథమికవిద్యయైనను, పరిపూర్ణముగ లబ్బుటలేదు.

పూర్వకాలమునందు ప్రతిగృహమును విద్యాలయముగ నుండెడిది. గృహిణి యుపాధ్యాయి, గృహపతి విద్వాంసుఁడు. అట్లుగాని గృహస్థులయొక్క పుత్రీపుత్రులు సమీపగృహస్థుని నొజ్జగ నేర్పరచుకొనెడువారు. మాతృభాషయందును, సంస్కృతభాషయందును స్త్రీపురుషులు వైదుష్యము గలిగియుండువారఁట. ఇందుల కనేకములగు కథలు దృష్టాంతములు.

భాస్కరాచార్యుని తనయ లీలావతి, కుమ్మరమొల్ల, తరిగొండ వెంకమాంబ, మున్నగు యువతీమణులు వ్రాసిన గ్రంథరత్నము లిప్పటికిని వారి కీర్తిని జాటుచున్నవి.

విద్వాంసులతో వాదప్రతివాదములను సల్పిన గార్గి, మైత్రేయి మున్నగు స్త్రీరత్నములు వేదయుగమునాటి స్త్రీవిద్యామార్గమున సంఖ్యాఫలకములై (Mile-stones) యిప్పటికినిఁ గీర్తికాయముతో నగపడుచున్నారు. రాణీసంయుక్త, రుద్రమదేవి, అహల్యాబాయి, యోధపురరాజ్ఞి మున్నగు చారిత్రకమహిళామణుల చరిత్రములం జూచితిమేని, నిఘంటువులలోని స్త్రీశబ్దపర్యాయపదమైన అబలాశబ్దము దీసివేయఁ దలంపు వొడమును.

వేయేల? పూర్వస్త్రీసంఘ మత్యున్నతదశయం దుండెననుటకు పెక్కు నిదర్శనములు గలవు.

ఇటీవల సర్వసంఘములకును పతనము సంభవించినట్లే, మహిళామండలికిఁ గూడ పతనము సంభవించినది. ఇందుల కనేక కారణములు గలవు. అతిబాల్యవివాహములు, అస్వాతంత్ర్యము, కన్యాశుల్కములు మున్నగు బరువులు సంఘమును బీల్చి పిప్పి చేయుచున్నవి.

మతాంతరులగు క్రైస్తవమత ప్రచారకులును దొరతనమువారును నబలామణులకొరకుఁ బాఠశాలలను కళాశాలలను నిర్మించి స్త్రీవిద్యావ్యాప్తికిఁ గృషి సల్పుచున్నారు.

## ౨. ప్రస్తుత స్త్రీవిద్యావిధానము

స్త్రీవిద్యాలత క్రమక్రమముగ దేశమున నల్లుకొనుచున్నది. కాని విద్యావిధానము స్త్రీజాతి కనుకూలించు పద్ధతులలో లేదు. పురుషుల కొసంగఁబడుచున్న విద్యయందుఁగాని, స్త్రీల కొసంగఁబడుచున్న విద్యయందుఁగాని, భవిష్యద్వీక్షణ ముద్యోగవ్యామోహమే కాని వేరొకటి గన్పట్టదు. ఉద్యోగవాంఛ లేక స్వాతంత్ర్యాశయముల నొసంగజాలనట్టియు, స్త్రీసంఘము నభివృద్ధికిఁ దేఁదగినట్టియు విద్య స్త్రీభవిష్యజ్జీవితమున కావశ్యకమై యున్నది.

ప్రస్తుత బాలికాపాఠశాలలయం దొసంగఁబడుచున్న విద్య విద్యార్థినీబృందమునకు నవనాగరికత, అహంభావము, పారతంత్ర్యమును గలుగఁజేయుట కవకాశమున్నది. స్త్రీత్వమును, బాలికామానసిక పరిస్థితులను గుణములను దెలిసి శిక్షణమొసంగు నొజ్జలు స్త్రీసంఘమునందే బయల్వెడలవలెను.

పురుష ఉపాధ్యాయులగ నుండు బాలికా ఠశాలలందును, కళాశాలలందును స్త్రీల కుచితమైన లభించుట కష్టము. దొరతనమువారు స్త్రీవిద్యాభి ద్ధికి ప్రోత్సాహ మొసంగుచున్నారు. కాని మన శము నందలి యువతుల యున్నతవిద్యాప్రదానము మనపురుషులు వెనుకంజ వేయుచుండుట శోచ ము.

## 3. విద్యావిధానమునందు వలయు సంస్కరణములు

ప్రస్తుత స్త్రీ విద్యావిధానమునందు పెక్కు సం రణము లావశ్యకములై యున్నవి.

అందు ముఖ్యముగ స్త్రీల కర్తవ్యమగు జాతీయ ద్య యావశ్యకము.

భారతీయులకొలఁ జేర్పడియున్న చతుష్షష్టికళ లో స్త్రీ జీవితమున కర్హమైన నిర్మాణకళలు (mechanical arts) ను మానసికానందము నొడఁగూర్చు లితకళలు (fine arts) ను కలాశాలలందు జెప్పుటకు సతుల జేర్పరుపవలయును.

స్త్రీల కావశ్యకములగు నిర్మాణకళలు ఊలుపని, కుపని, వైద్యవిజ్ఞానము, శిశుసంరక్షణము, మున్నగు నియందు సద్గ్రంథములను, రచియింపఁ జేయవల ను. కలాశాలలం దాయా పాఠభాగముల నుంచ లయును. సంగీతము, చిత్రలేఖనము మున్నగు లలితకళ కుఁగూడ యువతీ కలాశాలలందు స్థాన ముండవలెను.

భారతీయుల యంత్రములలో నుత్తమమగు వీణా గానము యువతుల కలవడఁ జేయవలయును. వాణి, వీణాపుస్తకపాణి యనియును, కచ్ఛపి యను వీణం గొని భారతీదేవి గాన మొనరించుచుండు ననియును మన పురాణములందు వర్ణించియున్నారు. సాధారణముగ పురుష గాత్రముల (కంఠస్వరము) కంటె స్త్రీ గాత్రము మనోజ్ఞము. సంగీతమును స్త్రీల కభ్యసింపఁ జేయుటయం దాధిక్యము గలదు.

ప్రాచీనస్త్రీలు సంగీతమునందు వైదుష్యము గల వారై యున్నట్లు పెక్కులు నిదర్శనములు గలవు.

## కవిత్వము

కవిత్వము లలితకళలలో నొకటి. పురుషులకంటె స్త్రీలకు బుద్ధి నిశితము. హిందూయువతులకు హైందవ గృహిణీ జీవితమునందుఁ దీరిక యధికము. కాఁబట్టి యువతులు భాషావైదుష్యము గలవారై ఛందశ్శాస్త్రము నభ్యసించిరేని గొప్ప కవయిత్రులగుటకు సందియము లేదు. విశ్వవిద్యాలయములందు కవిత్వ మను కళను కలాశాలలం దుంచుటకును, గ్రంథరచనమునందు పోటీపరీక్షలు మున్నగువాని చేర్పరచుటకును విద్యావిచారణకర్తలు యోచింపవలసియున్నది. ఆంధ్రభాషయందు లలితశైలిని కవనముఁ జెప్ప నేర్చిన పూర్వపు కవయిత్రులు ముగ్గురు స్త్రీప్రపంచమునందుఁ బ్రకాశించుచున్నారు.

వారిలో రామాయణమును రచియించిన కుమ్మర మొల్ల యగ్రగణ్య.

రాజయోగసారమును, వేంకటాచలమాహాత్మ్యము రచియించిన తరిగొండ వెంకమాంబగారును, రాధికాసాంత్వనమును రచియించిన ముద్దుపళని యను యువతియుఁ గీర్తికాయలై విలసిల్లుచున్నారు.

విశ్వవిద్యాలయములును, ప్రభుత్వమువారును స్త్రీవిద్యాభివృద్ధికి వలయు సంస్కరణములను గావించి పెక్కుమంది విద్యాభ్యాస మొనరించుటకుఁ గలాశాలల నందుబాటులో స్థాపింపవలయును. ఆచార్యవర్గమును నిర్ణయించునపుడు స్త్రీలనే నియమింపవలయును. కలాశాలావసతిగృహములందు వర్ణాశ్రమధర్మములకు లోపము లేని వసతుల జేర్పరుపవలయును. ఇంకను అవసరమైన సంస్కరణములఁ గావించినచో, నిప్పటికంటె నధికముగ స్త్రీలు, శాస్త్రముల నభ్యసింపఁగలరు.

## ౪. ప్రస్తుత భారతస్త్రీసంఘ స్థితి

ఆర్యావర్తమునందు స్త్రీసంఘము పతనావస్థయం దున్నది. దేశసౌభాగ్యమునకును, దేశసౌఖ్యమునకును స్త్రీసంఘమే కారణము. పూర్వకాలమునందు స్త్రీలు విదుషీమణులై, నిర్వాహకురాండ్రై యుండెడువారు. వారికి శరీరదార్ఢ్యము మెండు. వీరమాతలును, వీరపత్నులును

లెక్కకుండెడువారు. వీరమాతలై సంగ్రామరంగమున మహిషాసురమర్దనియగు భవానీదేవివలెను, నరకాసుర గర్వసంహారిణియగు సాత్రాజితీదేవివలెను రణమొనరించి, దేశముకొఱకుఁ ద్యాగమొనరించిన మహిళామణు లనేకు లుండెడువారు.

ఇందులకుఁ గారణము లప్పటి సంఘసదాచారములే. ప్రస్తుతమున హైందవస్త్రీసంఘము దుస్థితియందుండుటకు సంఘమునందలి దురాచారములు మాత్రమే కారణము గాక, పురుషులయొక్క నిరంకుశత్వమును, వారి మూఢత్వమునుగూడఁ గొంతవఱకుఁ గారణములై యున్నవి. "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" స్త్రీకి స్వాతంత్ర్యమున క్కఱ లేదు. ఈ మొదలయిన లోకోక్తులను రచియించి స్త్రీజాతి నణఁచియుండిరి.

యువతీవిద్య కూడదనిరి. బాల్యవివాహములకుఁ గారకులైరి. వండుట, వార్చుట, మున్నగు కార్యములు దక్క తక్కినవను లేవియు, స్త్రీ లొనరింప రాదనిరి. హిందూవితంతువులను బానిసలం జేసిరి. "విద్యావిహీనః పశుః" అని పురుషులంగూర్చి చెప్పిరికాని విద్యావిహీన యగు స్త్రీయెట్టిదో తెలుపలేదు. కడచిన జనసంఖ్యం బట్టి చూచినయెడల చదువను వ్రాయను నేర్చిన యువతులు ౧౦౦ కి యేడుగురుచొప్పున కంటె నధికముగ లేరని తేలినది. దీనినిబట్టి సంఘ మెట్టిదుస్థితియం దున్నదో యోచింపుఁడు. శివాజీనిగన్న జిజాబాయి జన్మించిన యీభారతదేశమునందే శిశువులను తమపుత్రులను భయపెట్టుటకు బూచివాఁడు వచ్చెననియు, నిన్నెత్తుకొని పోవుననియు, బల్కుచుండు మూఢలగు జననులఁ బుట్టుచున్నారు.

యుద్ధరంగమునుండి మరలివచ్చిన భర్తకు స్త్రీలకు వలె స్నానవసతి యొనరించి, 'ముసరాడవార మైతి'మని యభిమానమును జూపిన ఖడ్గతిక్కనపత్ని పుట్టిన యీయాంధ్రావనియందు భర్తకు పిరికిమందుఁ బెట్టి, చీకటిలో వీధిలోనికిఁ బోనీయని వీరపత్ను లుద్భవించుచున్నారు.

అనిలో మార్తురను సంహరించి భర్తయగు పృథ్వీరాజునకు బాసటయై యఖండపరాక్రమము జూపిన రాణీసంయుక్త జన్మించినట్టి యీయార్యావర్తమున 'దివాకాకరుశాద్దీతి' లగు వనితలు జన్మించుచున్నా

కటకటా, మహిళాసంఘము నిస్తేజమై, మూఢ యల్పాయువు మగుచున్నది. విద్యాశూన్యత భారతయువతీసంఘమున జ్ఞానవతులగు వెజ్జులును, లును, లేనికొఱంత గల్గెను. శిశుపోషణధర్మముల గనిమాతలు బయల్వెడలిరి.

మోటుతనముగల ఎఱుకుమంత్రసానుల కృత్య లవలన ప్రసూతికష్టము లెక్కువగుచున్నవి. బాల్య హమువలన బాలవితంతువులును, వారివలన ననేకా ములును గలుగుచున్నవి.

## ౫. స్త్రీ సంఘదురాచారములు

పురుషుల లోపమువలనను, పరిపాలకుల యు క్షవలనను, పరజాత్యనుకరణమువలనను, స్త్రీ సంఘ నందుఁ బ్రస్తుతమందు పెక్కుదురాచారము లుదయి నవి; సంస్కర్తలయొక్కయు, సంస్కారిణుల యొక్క యు సేవవలన నవి కొంతవఱకు సమయుచున్నవి. స దురాచారము లెంత త్వరితముగ నంతరించునో, య శీఘ్రముగ భారతీయులు పారతంత్ర్య శృంఖలావిము లగుదురు. మన మగవారే కారణమువనో, "అష్టవ భవే ద్గౌరీ" యని ఎనిమిదవయేటనే వివాహ మొనరి తమకొమరితల గొంతులం గోయుచున్నారు. లుబ్ధ వృద్ధ పిశాచములు కన్యాశుల్కములం గొని తమ కన కూఁతులను వృద్ధజంబుకములకుఁ గట్టఁబెట్టుచున్నా ప్రాజ్ఞులమని విఱ్ఱవీఁగుచుండు మన పెద్దలు ఘో యము నెపమున మన సోదరీమణుల ననూర్యంపశ్యల నొనరించి కూపకూర్మములుగఁ జేయుచున్నారు.

"మా అమ్మాయి ఉద్యోగములు సేయ నా ఉళ్లేలునా?" అని కొందఱు తమ కొమరితలను నిరక్ష కుక్షులుగ నొనరించి దుఃఖభాజనలుగఁ జేయుచున్నా

పై కారణములవలన మహిళామండలి యం కొందఱు మూఢలు తాఁగలు, పిటికిపందలు, గయ ళులు, వ్యభిచారిణులు బయల్వెడలుచున్నారు.

ఈ కారణములను బురస్కరించుకొని పాశ్చాత్యులు మనల ననాగరికులఁగను, మన దేశమును నాగరికత లేని దేశముగను, పరిగణించుచున్నారు.

శ్రీమతి బండారు అచ్చమాంబగారు రచియించిన "అబలాసచ్చరిత్ర రత్నమాల" యను గ్రంథమును దిలకించినచో, మహమ్మదీయ పరిపాలనమునకుఁ బూర్వ మబలాసమాజమునం దెంతటి విదుషీమణులు, ఎంతటి వీరమాతలు, ఎంతటి వీరపత్నులు, ఎంతటి వీరవనితలు ఎంతటి కవయిత్రులు, ఎంతటి ధాత్రీమణు లుండెడివారో తెలియఁగలదు.

ఇప్పుడు దేశ మిట్లు నిర్భాగ్యమగుటకుఁ గారణమేమో విద్యార్థిని నగు నేను వివరించి చెప్పఁజాలను. కారణము లూహించి తెలిసికొనవలసినదే. ప్రస్తుతసంఘ దురాచారములను నిర్మూలింపఁజేయుటకు మన సోదరీమణులలోఁ గొందఱు దమ జీవితమును సంఘము నిమిత్తము ధారవోయుచున్నారు.

స్త్రీజన కల్పలతా మతల్లియగు, శ్రీమతి ముత్తులక్ష్మి అమ్మాళ్ తల్లిగారు తమ సేవాదీక్షమువలన నబలాలోకము నుద్ధరింపఁగలరు. సంఘమునందలి లోపములం తెరింపఁగలవు. సంఘనౌకను నడుపంజాలు కర్ణధారిణి లేనికొలంతవలన నింతదనుక సంఘము పతనమగుచున్నది. కాని సంఘమునందు శక్తి యంతరింపలేదు.

ఇటీవల జరుగుచున్న దేశీయమహాసభా నిర్వహణమునందు స్త్రీ సేవకబళ మొనరించుచున్న సేవ పత్రికాపాఠకబృందమునకు విశదమే. దేశీయోద్యమమునందు పాల్గొనుచున్న వనితామణులం జూచిన స్త్రీ సంఘమునందలి పటుత్వము, కార్యదీక్ష విశదము కాఁగలవు. సంఘ మభివృద్ధికి రావలయునని సంఘసేవ యవసరము. విద్యావతియగు వనిత తన సంఘమున కట్టిసేవ యొనరింపఁగలదు? జీవితమును స్వసంఘముల నిమిత్త మెట్టుల వినియోగింపవలెను? అను విషయములంగూర్చి యించుక ముచ్చటించెదను.

౬. సాంఘిక సేవ

స్వసంఘోద్ధరణమునకై స్త్రీలు పాటుపడు టావశ్యకము. పురుషులును, స్వార్థత్యాగులు నగు వారు స్త్రీసంఘమును సేవించుట కుత్సాహము గలవారైయున్నను కొన్ని యాటంకములు గలుగుచుండును. మఱియును, ఎవరికార్యమును వారే యొనరించుకొనుటలో శ్రద్ధాభక్తు లెక్కుడుగ నుండును.

ప్రస్తుతమందు విద్యావతులై యున్న స్త్రీలు స్వార్థత్యాగశీలము గలవారలై, స్త్రీసంఘమునఁ గల దురాచారముల నడఁచివేయుటయును, హైందవగృహిణులను వివేకవతులం జేయుటయును బాటుపడవలసియున్నది.

సంతానవతులై, సంసార మొనరించుచున్న ప్రస్తుత హైందవనారీమణులలో విద్యాశూన్యత మెండుగా నుండుటవలన మూఢాచారములు పెక్కులు గలవు.

విదుషీమణులగు మనసోదరీమణులు దేశసంచార మొనరించుచు, గ్రామగ్రామమునకును నేఁగి స్త్రీసంఘములను స్థాపించి, సంఘాభివృద్ధికి జేయునగు విధులం దెల్పి యెట్టిసంఘమున కుపయుక్తములగు మాసపత్రికలు మున్నగువానిని దెప్పించుకొనునట్టి యేర్పాటులను, భజనమందిరములను, పురాణపఠనమును, నేర్పఱచి ప్రవృద్ధి యొనరించుకొనుటకు సహాయ మొనరింపవలయును.

౭. రాజకీయ విజ్ఞానము

ఇటీవల మనస్త్రీలలోఁ బెక్కుమంది పరిపాలనావ్యవహారము లెట్లు నడచుచున్నదియును, దేశీయపారతంత్ర్యక్లేశములును, వాంఛితములును సంయుక్తము దెలియనిస్థితిలో నుండిరి. అసహాయోద్యమ మారంభముగ నిప్పుడిప్పుడు మనవారు దేశవిషయములం దెలిసికొను నాత్రమును గలిగియున్నారు. కాని దేశీయోద్యమప్రచారకులు సర్వసాధారణముగఁ బురుషు లగుటవలనను, ప్రత్యేక స్త్రీసమావేశములం లేమిం జేసియు గ్రామములో నడచుచున్న విషయముల నాకర్ణించుటకు సహితము హిందూగృహిణుల కవకాశము గలుగుటలేదు.

అందువలన స్త్రీప్రచారక సమితి బయలుదేరి సాంఘికవిషయములను, రాజకీయవిషయములు నుద్బోధించుచుండవలయును. అట్టి యుద్బోధనమువలన మహత్తరమైన లాభములు గలుగును. అధీతియు, బోధయు, నాచరణంబును బ్రచారణంబును విజ్ఞానాభివృద్ధి కుపా

ధులు. అధ్యయన మొనరించుట (చదువుట) అధీతి; ఒరులకు బోధించుట బోధ, తా నాచరించు టాచరణము; దేశమునందుఁ బ్రచార మొనరించుట ప్రచారణంబు నాఁ బడు. నీనాలు గుపాధులకును నాటంకములు గలుగుటం జేసి మనదేశమున ముఖ్యముగ స్త్రీలకు విద్యాశూన్యత గలిగెను. ౧. గృహనిర్వాహక విషయములు; ౨. గృహిణీధర్మములు; ౩. పూర్వపు స్త్రీల యౌన్నత్యము; ౪. వైదిక, పౌరాణిక, చారిత్రిక, స్త్రీల ప్రసిద్ధి; ౫. స్త్రీసంఘమున కావశ్యములగు విషయములును జనపదములం దుండు స్త్రీలకుఁ దెలియున ట్లుపన్యాసముల నొసంగుచుండవలయును.

గ్రామసంఘములు, ఉపమండలసంఘములు, మండలసంఘములను చేర్పఱిచి, కనీసము సంవత్సరంబున కొకపరియైనను మహిళాసభలను సమావేశపఱిచి యావశ్యకములగు విషయములం దెల్పుచుండవలయును.

స్త్రీలకు ౧. వివాహవయోనిర్ణయము; ౨. బ్రహ్మచర్యవిధులు; ౩. వితంతువులకు విహితకృత్యములు మున్నగువానిని నిర్ణయించి ప్రభుత్వమువారితో రాయబార మొనరింపఁదగు నవసరములను, నందులకు సామర్థ్యము గలవారి నెన్నుకొని సంఘాభివృద్ధికై పాటుపడవలసియున్నది.

హిందు స్త్రీ సంఘమునందు వ్యభిచారమే వృత్తిగాఁగల వేశ్యాజాతి యొక్కటి గలదు. ఆజాతి వ్యభిచారమం దను కులాచార మని చెప్పుచు దుర్వృత్తికి లోఁబడి ద్రవ్యోపార్జనమునకై తుచ్ఛమగు శరీర విక్రయ మొనరించుచున్నది.

వారాంగనల దురాచారములను రూపుమాపుటకును, వారిని గూడ గృహిణులుగ నొనరించుటకును స్త్రీసంఘము పాటుపడవలసి యున్నది. ఏతత్కార్యనిర్వహణము నెడల జీవితమును ధారవోయుచున్న కళావంతులు గొందఱు గలరు. అట్టివారిని మహిళాసభలలోఁ జాల్గొనఁ జేసి వేశ్యాసంస్కరణము స్త్రీ సంఘ సంస్కరణములలో నొక దానినిగఁ బరిగణింపవలెను.

రజోదోషము ముఖ్యకారణముగ నెంచి కాఁబోలును, మన పురుషులు స్త్రీలకు వేదాధ్యయనాధికారము లేదని శాసించిరి. వేదోక్తమైన సంధ్యావందనము స్త్రీలకుపాసనార్హము కాదు గాన మహిళామణు లనుదినము ప్రాతస్సాయంసంధ్యలయం దొనరింపవలసిన సంధ్యావందనమును రచియించి ప్రకటించి, యనుదినము స్త్రీలు సంధ్యోపాసన మొనరించునట్లు సదుపాయము లొనరింపవలయును.

స్వవృద్ధి స్త్రీ సంఘములు ప్రతిగ్రామమునందును స్థాపింపఁబడుటకు గృషి సలుపవలసియున్నది. స్త్రీసంఘవాంఛితములను, నభిప్రాయములను నిస్సంశయముగ వెల్లడించుటకుఁగాను ప్రతిభాషలోను స్త్రీ సంఘము నుండి వెలువడు పత్రిక, యొండు బయల్వెడలవలయును.

ఇవ్విధమునఁ గృషిసలుపుటకు స్వార్థత్యాగినులగు సేవకురాండ్రు పెక్కురు మన కావశ్యకము. కార్యదీక్ష గలిగి, విద్యావతులగు, ప్రతియువతియు పై విషయములను దృష్టియం దుంచుకొని సంఘసేవ యొనరించినచో భారతమహిళామండలి యున్నతదశ కచిరకాలమునసే రాఁగలదు.

## ౮. వైద్యవృత్తి-స్త్రీ వైద్యులయావశ్యకము

స్త్రీ సంఘమునందుఁ బైని చేర్కొనబడిన దురాచారములు గారణములుగ ననంతములగు రోగములు స్త్రీజాతియం దావిర్భవించుచున్నవి. మఱియును, పురుషజాతికంటె స్త్రీ జాతికి పునర్జన్మ సదృశమగు ప్రసూతియను గొప్పగండము గలదు.

గర్భవతులగు స్త్రీలు సుఖప్రసవలైనంతనె 'గండముగడచి పిండము బయటబడె' నను లోకోక్తి ననుసరించి గొప్పగండము తొలఁగె నని భావించుచుందురు.

భారతదేశమున వైద్యవిశారద లగు స్త్రీలు లేమిం జేసి పెక్కురు సోదరీమణులు ప్రసూతిరోగములకుఁ బాల్పడుచున్నారు.

బాల్యవివాహములు నిషేకవయోనిర్ణయము లేకుండ స్త్రీ పురుష సమాగమ మొనరించుట మున్నగు

దుష్కార్యములవలన ననేక విధము లగు స్త్రీ వ్యాధు లంకురించుచున్నవి. స్త్రీలకు సాధారణముగఁ బ్రాణములకంటెను మానసంరక్షణము మీఁదియాశ హెచ్చు. ఆకారణము వలన వ్యాధిగ్రస్తలగు స్త్రీలు పురుషవైద్యులకుఁ దమకుఁగల బాధలను వ్యక్తము చేయక తమలోఁ దామె యనుభవించుచు నకాలమరణములకుఁ బాల్పడుచున్నారు.

ప్రభుత్వమువారి వైద్యనిలయములం దెచ్చటనో కాని వైద్యురాండ్రు లేరు. ఉన్నస్థలములందయినను పాశ్చాత్యస్త్రీలే కాని భారతీయ వైద్యురాండ్రు లేరు.

క్రైస్తవమతాచారక సమితివారు వనితావైద్య నిలయముల నచ్చటచ్చట నెలకొల్పి స్త్రీ సంఘమున కమితోపకార మొనరించుచున్నారు కాని యందు కూడ పాశ్చాత్యులే వైద్యురాండ్రు. సాధారణముగ పాశ్చాత్యులకు హైందవుల యాహార నియమములు, శీతోష్ణస్థితులు, శరీరతత్త్వములును, భారతదేశమునందలి శాకాదులయొక్క వస్తుగుణములును భారతదేశస్థులకు దెలిసినంతగఁ దెలియవు. ఆ కారణములవలన మనశరీరతత్త్వముల ననుసరించి చికిత్స లొనరించుటయందును, పథ్యాపథ్య వస్తునిర్ణయము నందును, ననేకప్రమాదములు సంభవించుచున్నవి. సంఘముయొక్క ఆచారపు కట్టుబాట్లకు లోనుగావలసియుండుట వలన మతాంతరులయొక్కయు, నన్యజాతియొక్కయు, వైద్యలాభము నందలేక కొందఱు బాధపడుచున్నారు.

పురుషులు వైద్యులుగనుండు వైద్యనిలయము లందుఁ జికిత్స లొనరించుకొనుచుండు స్త్రీలదుస్స్థితి వర్ణనాతీతము. శస్త్రచికిత్సల నొనరించినపుడు మత్తుమందు నొసంగి చైతన్యము నడంచినపుడు చెప్పఁజాలము గాని, దేస్త్రీయును బురుషునిచేత రోగపరీక్షం జేయించుకొనుట కిష్టపడఁగదా. ప్రాణముపోవుటకైన స్త్రీ సమ్మతించును గాని పురుషవైద్యునితో రోగరహస్యములం జెప్పుట కిష్టపడదు. కాఁబట్టి హైందవస్త్రీలు శరీరతత్త్వ మెఱింగి వైద్య మొనరింపఁజాలు వైద్యురాండ్రావశ్యకము.

హైందవస్త్రీలలో నున్నతవిద్య నభ్యసించినవారును, కళాశాలలందుఁ జదివినవారును, ముఖ్యముగా వైద్యవిద్య నభ్యసింపవలెను.

ఆయుర్వేద వైద్యకళాశాలల స్త్రీలకొఱకుఁ బ్రత్యేకముగ సంస్థాపనలు లేకున్నను, పురుషులనిమిత్తము నిర్ణీతమైన వానియందే స్త్రీలు విద్య నభ్యసింపఁదగును. అట్టికళాశాలలందు శిక్షణముఁ బడసి వచ్చినతరువాత నుద్యోగముకొఱకే వాంఛింపక తమ వృత్తిని జనులకందఱికి నుపయోగపడునటు లొనరింపవలయును. ఆయుర్వేద వైద్యపరీక్షలకు స్త్రీలు చదివి యందుత్తీర్ణలై వచ్చినపిమ్మటఁ దాము గృహిణీధర్మముల నిర్వహించుచుండియు, వ్యాధిపీడితులకు వైద్యము గావించి పారమార్థికము నార్జింపవచ్చును, అర్థమునుగూడ నార్జింపవచ్చును.

ఇంకను నెల్లవారికిని స్త్రీవైద్య మందుబాటున నుండుటకుఁ గొన్ని మార్గములు గలవు.

ఉపాధ్యాయినీ శిక్షణమున కేర్పడియున్న బోధనాభ్యాస కళాశాలలందు స్త్రీలకొఱకు ముఖ్యపఠనీయములుగా ౧. ప్రథమచికిత్స; ౨. ప్రసవచికిత్స; ౩. శిశుసంరక్షణము (చంటిబిడ్డ) అనుపాఠములను నిర్బంధములుగ నుంచి చదివించినచో నందుత్తీర్ణలైనవారు సంఘసేవ యొనరించుట కవకాశము కలుగును.

స్త్రీవైద్యప్రబోధము నొనరింపఁగల మాసపత్రిక గూడ నొకటి యావశ్యకము.

స్త్రీలలో వైద్యవృత్తియం దుండువారు తీరికసమయ మేర్పఱుచుకొని సమీపపు గేస్తురాండ్ర నొకచో సమావేశపఱుచుచు వైద్యవిషయికోపన్యాసముల నిచ్చుచుండవలెను. ప్రసవసంబంధము లగువ్యాధులు, ప్రదరసంబంధము లగువ్యాధులు, ఋతుకాలలు, గర్భధారణవిధులు, గర్భసంరక్షణము, గర్భిణీహితచర్య, గర్భస్రావములు గలుగకుండు మార్గములు మున్నగు విషయములను గూర్చి కరపత్రములను బ్రకటించి వైద్యశాఖాధికారులు స్త్రీలకొఱకు పంచిపెట్టించవలెను.

సామాన్యముగ స్త్రీలకు సంభవించుచుండు వ్యాధులు, లక్షణములు, వానిచికిత్సలు, గ్రంథములను సులభశైలిని వ్రాసి స్త్రీలకొఱకు ప్రకటింపఁబడవలెను.

పైని తెలిపినరీతులచే స్త్రీలయందు వైద్యవిజ్ఞానము వ్యాపింపఁజేయవచ్చును.

## ౯. వైద్యచికిత్సను స్త్రీలకుఁ గావించుటకు ఉపయోగకరము లగు సూచనలు

ప్రాథమిక పాఠశాలోపాధ్యాయి వైద్యజ్ఞానము గలదై యుండినపక్షమునఁ బ్రతిగ్రామమునందును సర్వసాధారణముగ బాలికాపాఠశాల యుండును. గాన, ప్రథమచికిత్సలపైనను ననుకూలముగఁజేయుట కవకాశముండును.

విద్యావతులగు స్త్రీలు పురుషులవలెనే ఆయుర్వేద వైద్యగ్రంథములం జదువుచు స్త్రీ వైద్య విషయములం దెలిసికొని, అనుభవజ్ఞానము నార్జించుచు గ్రామాదులలో స్త్రీ వైద్య మొనరింపవచ్చును.

స్థానికసంఘములవారు స్త్రీలకొఱకు రూరల్ డిస్పెన్సరీలను నెలకొల్పి యందు వైద్యురాండ్రనే నియమించి స్త్రీవైద్యమును ప్రోత్సాహపఱుపవలెను.

దొరతనమువారి వైద్యనిలయము లందు స్థానము లందు వైద్యురాండ్రనుకూడ నియమించి గ్రామములోని వివిధగృహముల కరిగి ప్రసవవైద్య మొనరించునట్లు చేయవలెను. ఆశ్రమములను స్థాపించి బీద యువతులకు ధనవంతు లగు వా రుచితముగ ప్రసవవైద్య సౌకర్యములను గల్గించు టావశ్యకము. ఈ రీతిగ స్త్రీలకు వైద్యచికిత్స గావింపవచ్చును.

## ౧౦. ఉపచారిణులు (ధాత్రి)

వైద్యవిజ్ఞానము నార్జించిన ఉపచారిణులు (ఇండియన్ నర్సెస్) స్త్రీల కావశ్యకమై యున్నారు. రోగియైన స్త్రీ సాధారణముగ డాక్టరుకంటె నుపచారిణి నెక్కువగ విశ్వసించును. తనరోగరహస్యములను డాక్టరుతోకంటె నర్సుతోఁ జెప్పుట కిష్టపడుచుండును. డాక్టరుకంటె నుపచారిణికి (ధాత్రికి) రోగితో నెక్కువ చనవుండును. అందువలన ధాత్రి వైద్యజ్ఞానముగలదై, రహస్యగోపనశక్తిగలదై, సత్యశౌచదయాదిగుణములుగలదై, ముఖ్యముగ నోరిమి, శాంతము గలదై యుండవలెను.

ఉపచారిణీ శిక్షణము నొసంగు విద్యాలయములు గొన్ని గలవు. కాని అం దొసంగఁబడునట్టి శిక్షణము బహుస్వల్పము. ఆంగ్లదేశపు టుపచారిణుల కొసంగఁబడునట్టి శిక్షణము (తర్బియతు) వంటి శిక్షణమును హిందూధాత్రికిఁ గూడ నొసంగఁదగు. ఉపచారిణీ శిక్షణాలయము (నర్సింగు హోమ్) లందు హిందూయువతులు చాలతక్కువగ శిక్షణమఁ బడయుచున్నారు. అయ్యది దేశమునకు గొప్పలోపము. వైద్యాలయములం దుపచారిణీ-ఉద్యోగము నీచమని పెక్కుమంది స్త్రీ లభిప్రాయపడుచున్నారు. అయ్యది పొరఁబాటు. ఆంగ్లేయులలో నిట్టి మూఢాభిప్రాయము లేదు. నర్సుయొక్క జీవితము పవిత్రమైనదని ప్రాజ్ఞుల యభిప్రాయము. గొప్పకుటుంబములందలి స్త్రీ లుపచారముం జేయుటకాంగ్లదేశ వైద్యాలయములందు నియుక్తలై యుందురు.

క్రైస్తవమతప్రచారకసంఘములవారు (మిషనరీలు) నర్సులనిమిత్తము శిక్షణాలయముల నేర్పఱచినారు. ఉపచారిణీపదమును (నర్సు-ఉద్యోగమును) పవిత్రమైనదిగ నెంచి వారు స్వయముగ రోగుల కుపచారములఁ జేయుచుందురు మహాత్మ గాంధిగారు పూనానగరమున నుండు సాసూన్ వైద్యాలయమునఁ జికిత్స నందినప్పు డొకమిషనరీ యుపచారిణిగ నుండి మహాత్మున కుపచారము సల్పెను. అప్పు డాయన మిషనరీ నర్సులయొక్క సత్యశౌచదయాదిగుణములను గూర్చి తెలిపియున్నారు. అట్టి యుపచారిణులు హిందూదేశమున కావశ్యకలై యున్నారు.

కాఁబట్టి యుపచారిణీ శిక్షణాలయములకు హిందూసంఘమునందలి యన్ని కులములలోని స్త్రీలను బోయి శిక్షణముఁ బడసివచ్చి రోగుల కుపచారము సల్పుటావశ్యకము. హిందూవితంతువులు ముఖ్యముగ తరించుటకు నర్సింగుశిక్షణము గారణము కాఁగలదు.

## ౧౧. జీవితసాఫల్యము

'పరోపకారార్థ మిదం శరీర' మని యార్యవచనము గలదు. మానవజన్మము సార్థకము గావలయునన్నచోఁ బరోపకారము సలుపవలయును. అయ్యది మానవునకు స్వధర్మనిరతి. ఇందుల కొకచిన్నకథ గలదు. ఒకబాటప్రక్క నొక్కకాలువ గలదఁట. బాటప్రక్కలనుండు వృక్షము లాకాలువలోనికి వంగి యుండెనఁట. ఆబాటవెంబడి నొకయోగి పయన మొనరించుచుండ బాటమీఁద నుండు వృక్షమునుండి యొకతేలు జారి నీటఁబడెను. అది నీటియందు విలవిలఁగొట్టుకొనుచు చనిపోవనుండ నాయోగి నీటఁదిగి యా వృశ్చికమును దనకరమున నెత్తి తీరమునఁ బడవేయఁబోవ నదికుట్టెను. రెండవచేతిం దీయఁబోవ నాతేలు రెండవచేతిని గూడఁ గుట్టెను. అంతట నాపరివ్రాజకుండు మొదటిచేతితో దానిం దీయఁబోయెనఁట. అది మరలఁ గుట్టెను. బాటవెంబడి నరుగు నొకయువకుఁ డాదృశ్యముం గాంచి యాయోగితో 'ఓ మహాత్మా, మీ కేటిపెట్టి! చేతిని నొవ్వగుట్టు నావృశ్చికము నేల రక్షింపఁ బూనెదరు?' అన నాపరివ్రాజకుం డిట్లనె. మిత్రమా! వృశ్చికము దన మరణకాలమునఁ గూడఁ దనధర్మమును (కొండెలోఁ బొడ్చుట) విడుచుటలేదు. మానవుఁడు మాత్ర మేల స్వధర్మమును వీడవలెను? మానవునకుఁ బరోపకారము స్వధర్మము. ఈవృశ్చికము నన్నుఁ గుట్టుచున్నకొలందిని స్వధర్మాచరణమునందు (పరోపకారాచరణమునందు) దీక్ష యధికమగుచున్నది' అని

కాఁబట్టి జీవితసాఫల్యము సాధించు నారీమణులు పరోపకారము నొనరించు సామర్థ్యమును గడించవలెను. ధర్మపత్ని యనుపదమునకు భర్తతోఁ గూడి ధర్మము నాచరించునది యని యర్థము.

వైద్యవృత్తియును, ఉపచారిణీవృత్తియు, ఉపాధ్యాయినీవృత్తియుఁ బరోపకారమున కవకాశములిచ్చు వృత్తులు. కాఁబట్టి స్త్రీరత్నములు విద్యాధనము నార్జించి తమజీవితమును సఫలము నొనరించుకొందురుగాత. మనహిందూదేశమునందు దురదృష్టవశమున బాల్యముననే భర్తలం గోల్పోయి, బాలవితంతువులయి, పునర్వివాహమున కిష్టపడక పారమార్థికచింత గల యువతీమణు లనేకులు గలరు. వారందఱును పరోపకారము నొనరించుటకు వలయు జ్ఞానము నార్జించి సోదరీమణులకు సేవ యొనర్చి, ధన్యత్వము నొందుదురుగాత.

## ౧౨. ముగింపు

యువతీమణులు స్వసంఘసేవ యొనర్చుటకుఁ బెక్కుమార్గములు గలవు. ఈచిన్నివ్యాసమునందు ముఖ్యముగ స్త్రీవిద్యావశ్యకత దెలుపఁబడినది. పురుషులు వైద్యులుగ నుండు నొక వైద్యనిలయమున నిటీవల మాప్రాంతమున నొకయద్భుతము జరిగెను.

మాగ్రామమున కనతిదూరమున నొక మిషన్ యువతీ వైద్యనిలయము గలదు. అచ్చట దయార్ద్రహృదయ యగు నొకవైద్యవిదుషీమణి యావైద్యాలయమున కధికారిణి. ఆమె తనకొక సహాయవైద్యుఁ డావశ్యకమగుటచే నొకయువకుని (L. M. P.) మాసవేతనమునకు నియమించెను. అతండు సత్ప్రవర్తన గలవాఁడు గాఁడు. అందువలన వైద్యాలయమున నివసించి వైద్యము నొనరించుకొను నొకరోగికి దురుపదేశము గావించి యొకనాఁ డామె నెటకో పంపెను. రోగియొక్క తండ్రియు, సోదరులును నామెకొఱకు వెదకివెదకి నిస్పృహం జెందిరి. లేడీడాక్టరు దొరసానమ్మగారీ యద్భుతకృత్యమునకు విచారించి యాసహాయవైద్యుని బనినుండి తొలఁగించెను.

ఇట్టివిపరీతములు వైద్యురాండ్రున్న ప్రదేశములందు జరుగుట కవకాశము లుండవు. కాఁబట్టి స్త్రీలలో పలువురు వైద్యవిజ్ఞానమును బడసి, స్త్రీవైద్యమునందుఁ దమజీవితములను గడపి, స్త్రీల నకాలమరణములనుండియు, బ్రసూతిబాధలనుండియుఁ దప్పింతురుగాత.

ఈచిన్నవ్యాసమునందు మహత్తరమైన వైద్యవిషయములను సూచించుట కవకాశము లేదు. మఱియు వ్యాసము ౩౦ నిమిషములలోఁ జదువఁదగియుండు నియమముగలదు.

వ్యాసకర్త్రినగు నేను విదుషీమణిని గాను. ఈ వ్యాసము గ్రంథసహాయమున వ్రాయఁదగినది కాదు. స్వకపోలకల్పితము గాని వేఱొండుగాదు. నీరక్షీరన్యాయముగ నిందలిగుణములను గ్రహించి పాఠకులు లోపములను క్షమింప వేఁడుచున్నాను.

---



౮. హొయిసలేశ్వర దేవాలయము-హాళెబీడు



౯. హొయిసలేశ్వర దేవాలయము, తూర్పువైపు-హాళెబీడు
గోడనున్న రంధ్రములు గల రాతి తెరలు, సుందర శిల్పచిత్రములు, నిండు గానవగును

# లండన్ పోలీసు విశ్వవిద్యాలయము

ఓగేటి వెంకటసుబ్బయ్యశాస్త్రి గారు, బి.

లండన్ నగరము ఆంగ్ల దేశమునకు రాజధాని. వైశాల్యమునందును, జనసంఖ్యయందును, వైభవమునందును, విజ్ఞానమునందును ఈ మహానగరము ప్రపంచములో రాజధాని నగరములన్నిటిని తిరస్కరించును. మేరుపర్వతోపమానములగు సౌధములతోడను, విశాలరమణీయ రాజమార్గములతోడను, చిత్రవిచిత్రవస్తుశోభితమగు విపణివీధులతోడను నీనగరమయ్యలకాధినాథు రాజధానినపహసించుచుండును. కలకత్తానగరమున కేడురెట్లు జనాభాగల పట్టామునందు జనసమ్మర్దమెంతగా నుండునో యూహించుకొనవచ్చును. బొంబాయి, మద్రాస్ పట్టణములయందే యింతమోసము, యింతదగా యుండగా ప్రపంచమునందలి మహాభాగ్యవంతుల కాకరమై, నానా దేశములనుండివచ్చిన ప్రజాసమూహములచే కిటకిటలాడు నగరమున జారచోరులయొక్కయు, మోసగాండ్రయొక్కయు బాధ యెంతగా నుండవలెనో యూహించుకొనగలము. కాని యీ మహానగర రాజమార్గములయందలి రాకపోకలను నియమించి, నగరమును దుండగీండ్ల బారినుండియు, మోసగాండ్ర బారినుండియు తప్పించి, నగరవాసులకు శాంతిసౌఖ్యము లొడగూర్చునది లండన్ పోలీసుదళమని దృఢముగా చెప్పవచ్చును. ఇంతగొప్పపట్టణమునందు బాగుగా శిక్షనొంది సర్వజ్ఞులగు రక్షకభటులు లేనిచో ప్రజ లెంత కష్టపడవలసియుండునో గదా! లండన్ పోలీసువారి యాజ్ఞలు శిలాక్షరములు. రాజాధిరాజైనను వాని నుల్లంఘింప వీలులేదు. లండన్ పోలీసు చేయియెత్తినచో చక్రవర్తియైనను, చక్రవర్తితనూజుడైనను, ప్రధానామాత్యుడైనను ఆగవలసినదే. ఇట్లగుటవలన పోలీసులు నిరంకుశులనియు, యిష్టమువచ్చినట్లు ప్రవర్తింతురనియు తలంచరాదు. వారు సుశిక్షితులు; విద్యావిజ్ఞాన సంయుతులు. మర్యాదనిచ్చి పుచ్చుకొనగలవారు. ప్రజల నచ్చినబంట్లు. సంఘశ్రేయమునకే తాము బ్రతుకుటయని గ్రహించి తమ కర్మలయందప్రమత్తులై మెలంగువారు. ప్రపంచమందెల్ల నీ లండన్ పోలీసువారే శ్రేష్ఠులని యందరు ఒప్పుకొనినవిషయమే. కావుననే న్యూయార్కు, పారిస్, బర్లిన్ మొదలగు మహానగరములకంటె లండన్ నగరమందు నేరములు తక్కువ. ప్రమాదములు తక్కువ. లండన్ నగరమును కంటికిరెప్పవలె గాచి, పౌరులకు శాంతిసౌఖ్యములను సమకూర్చు పోలీసుదళమునకు ప్రాశస్త్యమెట్లు గలిగెనదో వివరించుటయే యీ వ్యాసముయొక్క ఉద్దేశ్యము.

రక్షకభటులు ప్రజాసముదాయములకు సంబంధించిన యన్నివిషయములను తెలిసికొని యుండవలెను. యుద్ధభటుల కవసరమగు ధైర్యము వారి కుండవలెను. తుపాకులను పేల్చుటయందును, కత్తి త్రిప్పుటయందును వారు ప్రవీణులై యుండవలెను. రాజ్యతంత్రజ్ఞున కవసరమగు చాకచక్యము వారి కుండవలెను. న్యాయవాది కవసరమగు జ్ఞానము, వైద్యుని కవసరములగు నైపుణ్యము, దయాదాక్షిణ్యాదిగుణములు వారి కుండవలెను. పోలీసు సర్వజ్ఞుడై వేయికన్నులతో మెలగినగాని యతడు తనకును సంఘమునకును మేలు చేయజాలడు. అన్ని స్వతంత్ర దేశములయందును, ముఖ్యముగా ఆంగ్ల దేశమునందును పోలీసులు తాము ప్రజలసేవకులమని గ్రహించుచున్నారు. పోలీసులు ప్రజలపై నధికారమును చలాయించి వారిని హింసించుట కేర్పడి యుండలేదనియు, ప్రజాక్షేమమునకు వారు తోడ్పడవలెననియు వారికి విద్యాధికారులే చక్కగా బోధించెదరు. భారతదేశమునందలి పోలీసులు లండన్ పోలీసులనుండి నేర్చుకొనవలసిన విషయము లనేకములు గలవు.

లండన్ నగరమున విక్టోరియా స్టేషనుకు సమీపమున 'పీల్ హౌస్' అను నొకమందిరము గలదు. అది పోలీసులు నివసించు స్థలముమాత్రమే గాదు. పోలీసులకు

విద్యార్థులనుగరపి, కొంచెముగనో గొప్పగనో కవాతు నేర్పిపంపు పాఠశాలమాత్రమే గాదు. అది యొక విశ్వవిద్యాలయము. కవాతు, శరీరశిక్షణముతో బాటు పోలీసువృత్తికి సంబంధించిన సమస్తవిషయములు నచ్చట నేర్పబడును. పోలీసులకు, మంచి నడవడి, నియమము, సద్భావము, ఓర్పు మొదలగు గుణము లచ్చట నేర్పబడును. అచ్చట ౨౦౦ మంది యుండుటకు వసతి గలదు. ప్రతివానికి ఒకగది, ఆహార పదార్థములను యితరవస్తువులను పెట్టుకొనుటకొక బీర్వా; వ్యాయామ మందిరము, పఠనమందిరము, ఆసుపత్రి, భోజనశాలలు, స్నానపుగదులు విద్యాబోధకై ౧౩ గదులు కవాతు కొక విశాలమైన మైదానమును గలవు.

ఈ విద్యాలయమునందు నేర్పువిషయము లేవియో, అవి యెట్లు నేర్పబడుచున్నవో తెలిసికొనుట యవసరము. లండన్ పోలీసుల ఖ్యాతి యింతయు నిచ్చట గరపబడు శిక్షణముమీదనే యాధారపడి యున్నది.

మొదట విద్యార్థులను చేర్చుకొనుపద్ధతి గమనింప దగినది. పోలీసుదళములో చేరదలచిన వారిలో నూటికి ౧౫ మందికంటె హెచ్చుగా నిచ్చట చేర్చుకొనబడరు. యోగ్యత, దేహబలము, మంచి స్వభావములనుబట్టియే విద్యార్థులు చేర్చుకొనబడుదురు. లండన్ పోలీసు కాదలచినవాడు దరఖాస్తును స్థానిక పోలీసుస్టేషనుకే పంపుకొనును. అతనికన్ని యోగ్యతలును ఉన్నయెడల, అనగా ౫ అడుగుల ౯ అంగుళముల యెత్తుగలిగి, ఆరోగ్యవంతుడని వైద్యులవలన యోగ్యతాపత్రమును బడసి, పాఠశాలను వదలినప్పటినుండి అప్పటివరకు మంచి శీలము కలవాడని ధ్రువపడినచో యతని పేరు పైకి పంపబడును. ఇట్లు పంపబడినవారు స్కాట్లెండుయార్డులో వారమునకు ౧౦౦ చొప్పున పరీక్షింపబడుదురు. ఇచ్చట జరుగు వైద్యపరీక్ష మిక్కిలి కష్టతరమైనది. క్రిందిపరీక్షలో నంగీకరింపబడిన వారిలో నూటికి ౬౫ యీపరీక్షలో నిరాకరింపబడుదురు. ఎంత స్వల్పలోపమున్నను సరే అభ్యర్థులు నిరాకరింపబడి సర్వోత్తములే గ్రహింపబడుదురు. అంగీకరింపబడిన వారి కింకొక పరీక్ష గలదు. సెలెక్షను కమిటీయను పరీక్షాసంఘమొకటి వీరిని పరీక్షించి నూటికి ౧౫ చొప్పున నిరాకరించును. కావున దరఖాస్తులలో నూటికి ౨౦ మందికంటె హెచ్చుగా పాఠశాలయందు చేర్చుకొనబడుట కవకాశము లేదు.

పాఠశాలలో చేరిన తరువాత విద్యార్థులకు మరియొక సామాన్యవిద్యాపరీక్ష గలదు. దానిలో మొదటిమారు చాలమంది తప్పుటగలరు. కాని తప్పినవారిని వెడలగొట్టక, వారికి ప్రత్యేకగురువులవలన విద్య నేర్పించి పోలీసు శక్తులకు యోగ్యులనుగా పాఠశాలాధికారులు చేసెదరు. పోలీసుశిక్షణము ముగియుటకు పూర్వము ప్రతివాడు నీ సామాన్య విద్యాపరీక్షయందు ఉత్తీర్ణుడు కాక తప్పదు.

పోలీసువృత్తిలో ప్రవేశించుట కేమి శిక్షణముగావలెను? మనిషి పొడగరియై, దృఢకాయుడై యుండి, 'ఏమిటిది జెల్లిపాండి' అనుమాటలతో గద్దించిన జాలునని సాధారణముగా ప్రజలు తలంచుచుందురు. కాని పోలీసులు నేర్చుకొనవలసిన విషయము లనేకములు గలవు. ఎవడు నిజముగా నిర్దోషియో, ఎవడు దోషియయ్యు నిర్దోషివలె నటించుచున్నాడో పోలీసు గ్రహించవలెను. శరీరబల మతని కుండవలెను, బుద్ధికుశలత యుండవలెను. వీధులలో వహ్యాముగు పనులుచేయుట, విమానములు, వ్రేలిముద్రలు, తప్పుకుసంతకములు, లైసెన్సులు మొదలగు విషయములనుగూర్చి పోలీసు బాగుగా నెరింగియుండుట యవసరము. ఈ జ్ఞానము 'పీల్ హౌస్' విశ్వవిద్యాలయమునం దెంత యాకర్షణీయముగా, యెంతవివరముగా, యెంత సులభముగా నుపదేశింపబడుచున్నదో వినినచో పాఠక మహాశయు లాశ్చర్యమగ్నులు కాక మానరు. ౧౬ వారముల శిక్షణమునందు ౧౬ సంవత్సరముల యనుభవముగలుగునట్లు పాఠశాలాధికారులు చేయుచున్నారు. ఈ బోధనాపద్ధతులను గూర్చి పాఠశాలను దర్శించి, యచటి విద్యాగురువుల యుపన్యాసములనువినిన 'ఫెన్ షెర్లీ' యను నతడు స్ట్రాండుమాగజీనులో నీ పాఠశాలలోని బోధనాపద్ధతియొక్క ప్రాశస్త్యమునుగూర్చి వివరించియున్నాడు. అతడు పాఠశాలను దర్శించినప్పుడు ఒకతరగతియందు వ్యాకరణపాఠము జరుగుచుండెను.

మరియొకగదిలో చేతిముద్రలనుగురించి యుపన్యాసము జరుగుచుండెను. ఈ యుపన్యాసమువలన మిక్కిలి యాకర్షితుడై షెన్ షెట్టిగారు ఉపాధ్యాయుని యాజ్ఞగైకొని యొకచోట గూర్చుండి వినెను. విద్యార్థులవలె తానును కాగితమును పెన్సిలునుతీసికొని ఉపాధ్యాయుడు బోధించుచుండిన పద్ధతియొక్క ప్రాశస్త్యమును పరీక్షించెను. మొదట విద్యార్థులకు తెల్లకాగితములనొసంగి ఆకాగితములపై తమవ్రేలిని, గట్టిగా ఒత్తకుండ నుంచవలసినదని యుపన్యాసకుడు చెప్పెను. అందరును అట్లే చేసిరి. ఆప్రదేశమును ఒకద్రవములోనుంచి గుడ్డగా వ్రేలిముద్ర స్పష్టముగా నల్లసిరాతో అద్దినట్లు కనబడెను. ఈ విచిత్రము



౧. చేతిముద్రలనుగురించిన ఉపన్యాసము.

నకు షెట్టిగారత్యద్భుత మందిరి. ఈ యుపన్యాసము వలన కేవలము చేతిముద్రలనుతీయు పద్ధతిమాత్రమే గాక అనేకవిషయములను విద్యార్థులు గ్రహించిరి. చార్జిచేయబడిన సమయమందు ఖైదీతనవ్రేలిముద్ర నివ్వ నిరాకరించినచో పోలీసులు బలవంతముచేయ నక్కరలేదని యుపన్యాసకుడు చెప్పెను. ఖైదీల వ్రేలిముద్రలు స్కాట్లెండు యార్డులో ౫ నిమిషములలో దొరకగలవనియు, ఉదయము ౮ గంటలకు స్కాట్లెండు యార్డులో కొన్ని ముద్రలు వచ్చినను రికార్డులనుబట్టి యవియెవరివో కనుగొ కోర్టుపెట్టుటకు పూర్వమే టెలిఫోను ద్వారాగాని తం ద్వారాగాని ఆసమాచారములను పంపుదురనియు ఉపా ధ్యాయుడు చెప్పెను.

ఇంకొక తరగతిలో బండ్లవారితో వచ్చు తగాదా లనుగురించి యొక యుపాధ్యాయుడు వివరించుచుండెను. పోలీసులకు న్యాయశాస్త్రపరిజ్ఞానము బాగుగానుం డవలెను. పొరబడి నేరస్థులుకానివారిని అరెస్టుచేసినచో చాలప్రమాదము సంభవించును. గుఱ్ఱపుబండివానిని, ట్రా బండి, మోటారుబస్సువానిని మోసముచేసినచో చే దగినదాని వరుస చక్కగా చెప్పుచుండెను. కొన్ని సం ర్భములలో అరెస్టుచేయవచ్చును. కొన్ని సందర్భములల అరెస్టు చేయరాదు. ఎప్పుడు చేయవచ్చు ఎప్పుడు చేయరాదు అనువిషయము నిర్ణయ చుట సులభసాధ్యముకాదు. ఆ సందర్భము నన్నిటిని ఉపాధ్యాయుడు తెల్పుచుండెను.

ఈ తరగతులనుదర్శించి క్రొత్తయను ములనుసంపాదించుచు షెట్టిగారు దొంగనోట్ల నాణెములనుగూర్చి యుపన్యాసము జరుగుచు డిన యొకతరగతికి పోయెను. ఈయుపన్యాస చాల చిత్తాకర్షణీయముగానుండెను. ఈయు న్యాసమువలె పాఠశాలలో నొసంగు న న్యాసము లన్నియు మిక్కిలి యాకర్షణీ ముగా నుండునట్లు ఉపాధ్యాయులు చేయ ఇదియే విద్యాబోధన కగిన పద్ధతి. విద్యా లకు కుతూహలము పుట్టించి విద్య నేర్పిన వారు దానిని సులభముగా గ్రహింతు విద్యార్థి నేర్చుకొన కుతూహలముగా సమయమున అతని కనేకసంగతులను చెప్పి వాని నన్నింటిని విద్యార్థి గ్రహించు విద్యార్థుల హృదయముల నాకర్షించకుండ వారికి బో చేయదలచుట ఆకలిలేనివారి కన్నము పెట్టుటవంటిది

ఈ విద్యాలయమునం దుపన్యాసకులుగా ను వారు నిపుణులుమాత్రమే గాక మానవస్వభావము చక్కగా నెఱింగినవారు. తాము బోధించు విషయము న్నింటిని వారు అనుభవపూర్వకముగా గ్రహించినవా షెట్టిగారు యీతరగతిలో ప్రవేశించినప్పుడు ఉపన్యా సకుడు విద్యార్థులతో నిట్లు చెప్పుచుండెను.

"నేను పోలీసుఉద్యోగములో ప్రవేశించిన క్రొత్త
ములో ఒకదుకాణపువాడు నాదగ్గరకువచ్చి ఒకచెల్లని
ణెమును తనకిచ్చినందుల కొకనిని అరెస్టుచేయవలసిన
కోరెను. నాణెమునిచ్చినవా డది మంచిదేయని
దించెను. దుకాణదారు ఆనాణెమునుతీసి రాతిమీద
మ్రోగించెను. నాణెము ఖంగున మ్రోగలేదు. అంతట
ను దానిని పట్టుకొని చూచితిని. అది మంచిదిగానే
కనుపడెను. కాని మ్రోగలేదు. ఆస్థితిలో నెవరు
షియో, యెవరు నిర్దోషియో నేను తెలిసికొనలేక
యితిని. నే నప్పు డేమి చేసియుండవలెను?"

ఒకయువకుడు లేచి 'దుకాణదారు కోరినట్లు
వారు ఆమనిషిని అరెస్టుచేసి అరెస్టుబాధ్యత నతని
దనే పెట్టియుండవలెను' అని బదులుచెప్పెను.

దానికి ఉపాధ్యాయు డిట్లనెను. "అట్లుగాదు.
తుకథటు చైనంతమాత్రమున అతడు యిష్టమువచ్చినట్లు
జల నరెస్టు చేయవచ్చునని మీయుద్దేశము గాబోలు.
దురభిప్రాయమును మీరు పోగొట్టుకొనవలెను."

ఇంకొక విద్యార్థిలేచి "ఇద్దరను ఒక నాణెపరీక్ష
కుని కడకు గొంపోయి నాణెమును పరీక్షింపించవలసి
ది."

అందుకు ఉపాధ్యాయు డిట్లనెను. "నాణెపరీ
క్షకుడు దానిమంచిదికాదని చెప్ప ననుకొనుడు. అప్పుడు
రేమి చేసియుండవలెను."

ఈప్రశ్న కెవ్వరును జవాబు చెప్పరైరి. విద్యార్థు
లందరు అరెస్టుచేయుటయే మంచిదని తలచుచుండిరి.
కాని దానిని చెప్పుటకు సందేహించుచుండిరి. అంతట
ఉపాధ్యాయు డిట్లనెను:—

"ఇట్టివిషయములయందు మనము సందర్భానుసార
ముగా ప్రవర్తింపవలసి యుండును. తప్పని తెలిసి యిట్టి
పని నొకడుచేసినట్లు సాక్ష్యమున్న గాని మనము త్వరపడి
అరెస్టు చేయుటకు వీలులేదు."

విద్యార్థులకు తెలియవలసిన న్యాయశాస్త్రజ్ఞాన
మున కచ్చేరునందు షెట్టీగా రింకొకచోటికి గదలిరి.
విశాలమగు మైదానములో నొకసార్జెంటు విద్యార్థులకు
కవాతు నేర్పుచుండెను. ఆచోటుదాటి యతడు రెండు
మోటారుబస్సులుడీకొని, ఒకనికి దెబ్బలుతగిలిన ప్రదేశము
నకు వచ్చెను ఒకబస్సుయొక్క మడ్గార్డు (Mud guard)
విరిగిపోయెను. రెండవకారు దీపము పగిలిపోయెను. విద్యా
ర్థులకు ప్రమాదములను గూర్చి బోధించుటకే యీమో
టారుప్రమాదము కల్పింపబడెను. కాని నిజముగా రెం
డుమోటారులు డీకొనలేదు. ఉపాధ్యాయుడు బీటు
లోనున్న పోలీసువానివలె నటించుచు ఆసమయమున
జరిగిన దానినంతయు పూసగ్రుచ్చినట్లు తనచేతిపుస్తక
మునందు వ్రాసికొనుచుండెను. దూరములను కొలచి
కొనుచుండెను మోటారుకారులను నడుపువారినుండి
వాఙ్మూలమును పుచ్చుకొనెను. ఆపుస్తకములో నతడు
వ్రాసికొనుచున్న విషయము లంతవివరముగా నుండవ
లెనా యని షెట్టీగా రడిగిరి. అందుకొక యినస్పెక్ట
రిట్లు చెప్పెను.

"ఔను. చాల వివరముగానే యున్నది. ఒకస్వ
ల్పవిషయమును గూర్చియైనను పోలీసు ౨౦ సంగతులు
వ్రాసికొనవలసి యుండును. బజారులో రెండుబస్సులు
డీకొనుట యను ముఖ్యవిషయమునం దొక వివరమైన
నను పోలీసు వదలిపెట్టదగదు. మీరొక్కనిమిష మాగి
నచో యింతకంటె విషమమగు పరిస్థితి కల్పింపబడును.
పోలీసు లట్టిసందర్భమునం దేమిచేయదగుదురో ప్రదర్శిం
పబడును." నేనొక్కనిమిష మాగితిని. ఇంతలో నొక
ప్రమాదము తటస్థించిన ట్లొకరంగము కల్పింపబడెను.
ఈమాటు రెండుమోటారులు డీకొనుటగాదు. ఒకమో
టారుకారు ఒక త్రొక్కుడుబండిపై బడి దానిమీద
నున్నవానిని గాయపరిచెను. ఆసమయమున పాఠశా
లోపాధ్యాయులను యిద్దరుపోలీసులు బీటువచ్చిరి.
ఒకడు దెబ్బలుతగిలినవానికి ప్రాథమికచికిత్స జేసెను.
రెండవవాడు తనపుస్తకములో సంగతులన్నిటిని వ్రాసి
కొనుచుండెను. ఆసుపత్రికి గొనిపోవుటకు మోటారుకై
టెలిఫోనుద్వారా చెప్పుటకు విద్యార్థి యొకడు నియో
గింపబడెను. ఇదియంతయు నిజముగా జరిగినట్లే యుం

డెనుగాని కల్పింపబడిన స్థితిగా నగుపడలేదు. అంతట నిజముగా మోటారువచ్చెను. దెబ్బలు తగిలినవానిని దానిలోనుంచి ఆసుపత్రికి బంపుటగూడ జరిగెను.



౨. వీథిలో బండ్లప్రమాదము.

మోటారుకారులు ఢీకొనుచున్నప్పుడును, ఇంకయిట్టి ప్రమాదములు జరిగినప్పుడును, పోలీసులు చేయదగిన దంతయు పాఠశాలలో అనుభవపూర్వకముగా విద్యార్థులకు నేర్పబడును. విద్యార్థులను ఒకరోడ్డుమీదికి గొని పోయి యచ్చట బండ్లరాకపోకలను నియమించుపద్ధతిని వారికి ఉపాధ్యాయులు దగ్గరయుండి నేర్పెదరు. ఒక బండికి ఆపుట నిమిషమాలస్యమైనను ప్రమాదము జరుగును. లండన్ వంటి మహానగరమున రాకపోకల నియమించుట కెంత సమయోచితబుద్ధి, యెంత శాకచక్యమో యుండవలెను. పెత్తిగారుండగా నొక సందిగ్ధస్థితి కల్పింపబడి దాని నెదుర్కొనుట యెట్లో విద్యార్థులకు ప్రత్యక్షముగా చూపబడెను. ఒకవిద్యార్థి బండ్లరాకపోకలను నియమించుటకు నియోగింపబడెను. అసమయమున రెండు రిక్షాబండ్లు యిరువైపులనుండి వచ్చుచుండెను. వెనుకనుండి ఒక మోటారు వచ్చుచుండెను. ఆబండి సరాసరి వెళ్ళ నుంకించెను. దాని వెనుక నొక లారీబండి ఎడమవైపుకు తిరుగవలెనని యుద్దేశ్యము గలిగియుండెను. చాలమంది జనులు వీథిని దాటదలచి మధ్యకువచ్చి పోవుదారిలేక నిలువబడిపోయిరి. ఇన్ని బండ్లు, యిందరు ప్రజలు అచ్చట నుండగా ఏబండిని ముందు పోనీయవలెను, దేనిని పోనీయరాదు అని యాలోచించుచు వీటులో నున్న విద్యార్థి ఒక్కనిమిషము జాగుచేసెను ఇంతలో మోటారుబండి తనమీదికే వచ్చెను. అతడు చేతి చాచెను. బండివాడు బ్రేకువేసి బండినాపెను. అతడట్లు చేయుచుండగా వెనుకనుండి వచ్చుచున్న లారీబండి పోలీసుమీదికే వచ్చెను. ఇదంతయు నిజముగానే యగుపడెను. రాకపోకలను నియమించుటయందు గల కష్టములను, మెళుకువలను అనుభవపూర్వకముగా విద్యార్థులకు దెలుపుటకై పరిస్థితి కల్పింపబడెను. ఇట్టి సందర్భములయందు తొందరపడినను కష్టమే; ఆలస్యముచేసినను కష్టమే. ఇట్టి ప్రదర్శనముల ద్వారా క్లిష్టపరిస్థితుల నెదుర్కొనుటకు నేర్పినచో విద్యార్థి యెప్పటికైన వానిని మరచునా!

ఇంత మంచిశిక్షణమును విద్యార్థులు పొందుదురు గనుకనే లండన్ పోలీసులు జగత్ప్రఖ్యాతి గాంచినారు. ఎట్టిసందిగ్ధసమయములయందును లండన్ పోలీసు లప్రమత్తులై యుండి తమబుద్ధిసూక్ష్మతచేతను, నైపుణ్యము



3. బండ్లరాకపోకలను నియమించుట.

చేతను అపాయము లేకుండ జేయగలుగుదురని లండన్ ప్రజలకు గట్టినమ్మకము. పీల్ భవనమునందు శిక్షితులై యపార శాస్త్రజ్ఞానమును, అనుభవమును గడించిన పోలీసు లీవిశ్వాసమునకు పాత్రులై పరంపరాను గతముగ వచ్చుచున్న లండన్ పోలీసుల ఖ్యాతిని నిలువబెట్టుచున్నారనుట జగత్ప్రసిద్ధము. ఈవిద్యాశాలయందు శిక్షణము బడసినతరువాత వారు సెంట్ జాన్ ఆంబ్యులెన్సు సంఘమునందు ప్రాథమిక చికిత్సయందు కౌశలమును బడసి, తత్సంఘాధికారులనుండి యొకయోగ్యతాపత్రమును బడసినగాని వారియుద్యోగము ఖాయము చేయబడదు.

అరెస్టుచేయువిధము, అరెస్టయినవారిని పోలీసు స్టేషనుకు గొనిపోయి ఛార్జిచేయువిధము, కోర్టులో సాక్ష్యము చెప్పువిధము విద్యార్థుల కిచ్చట నేర్పుదురు. మెస్త్రీగారు పాఠశాలను దర్శించిన సమయమున నీవిషయములను ప్రత్యక్షముగా జూపుటకై మూడంకముల నాటక మొకటి ప్రదర్శింపబడెను.

## మొదటి రంగము:

పోలీసు వీథిలో కావలిగాయుచుండగా నతనిముందరగా నొకడుపోవుచుండెను. అతడు ముందు కొంతదూర మేగిన తరువాత ఒకదుకాణమునుండి యొకడువచ్చి ముందుపోవువానిని జూపి కేకలువేయుచుండెను. అంతట పోలీసు ముందుపోవువానివద్దకు బోయి యతనిచేయి బట్టుకొని యాపెను.

'నన్నెందుకు బట్టుకొనెదవు' అని యామనిషి కోపముతో నడిగెను.

'అయ్యా, ఒక్కమాట' అని పోలీసనెను.

ఇంతలో దుకాణదారుడు వచ్చి తన దుకాణమున కాపురుషుడువచ్చి ఒక్క గడియారమును దొంగలించెనని పోలీసునకెరిగించెను. దుకాణములోనికి బోయినమాట సత్యమేగాని గడియారము విషయమై తనకేమియు దెలియదని నేరముమోపబడిన పురుషుడు కోపముతో నడిగెను. పోలీసు అతనిని మంచిమాటలచే నోడబరచి పోలీసు స్టేషనుకు దీసికొనిపోయెను. ఈవిషయములు ప్రదర్శింపబడుచుండగా ఉపాధ్యాయుడు ప్రతివిద్యార్థి తనపుస్తకములో వ్రాసికొనవలసిన వివరములను గురించియు, వారు పోలీసుస్టేషనులో చెప్పవలసిన విషయములను గురించియు హెచ్చరించుచుండెను.

## రెండవ రంగము:

పోలీసుస్టేషనులోని అధికారివద్దకు వీరుముగ్గురు వచ్చిరి. పోలీసు తాను అరెస్టుచేసిన వానిని జూపెను.

'తోమ్సా, ఏమిది' అని స్టేషన్ఆఫీసరు అనెను.

"అయ్యా, నేను రెండున్నరకు హైస్ట్రీటులో గస్తీ దిరుగుచుంటిని. నేను ౨౭ నెంబరు దుకాణమువద్ద నుండగా నీమనిషి నాముందు వెళ్లుచుండెను. ఇంతలో ౨౭ నంబరుగల దుకాణమునుండి యీమనిషివచ్చి కేకలు వేయుచు నాతో నేమో చెప్పెను. అందువలన నేను ముందరికిబోయి యితని నాపితిని. అరెస్టుచేయవలసినదని కోరిన దుకాణదారు యింతలో నావద్దకువచ్చి యిట్లు చెప్పెను. అని తనచేతి పుస్తకమునుదీసి యిట్లు చదివెను. "అరగంటకు పూర్వము ఈమనిషి నాదుకాణములోనికివచ్చి బల్లమీదనున్న గడియారమును దొంగిలించెను. అతనిని అరెస్టు చేయవలసినదని మిమ్ములను కోరుచున్నాను." పోలీసుతరువాత ఈక్రిందివిధముగా చెప్పనారంభించెను. అంతట నేను నేరముమోపబడినవానిపై పు దిరిగి "ఈయన చెప్పుమాటలను మీరు వినుచున్నారుగదా! మిమ్ముల నాచార్జిమీద అరెస్టు చేయబోవుచున్నాను" అని యంటిని. అంతట యతడు 'నేనుకాదు దొంగిలించినది,' అని యనెను. అపైని ఇతని స్టేషను వద్దకు దీసికొనివచ్చితిని.

అటుతరువాత స్టేషను ఆఫీసరు ఖైదీయొక్క ఊరు, పేరు, వయస్సు, యిత్యాది విషయములను వివరముగా పుస్తకములో నమోదుచేసికొనెను. ఖైదీ అమాయకుని వలె కూర్చుండియుండెను. ఇదంతయు అయిన తరువాత స్టేషనుఆఫీసరు ఖైదీని సోదాచేయుట కాజ్ఞయిచ్చెను. పోలీసు జేబులు వెదుకగా గడియారము కనబడెను.

## మూడవ రంగము:

ఈరంగమున కేసంతయు పోలీసుకోర్టులో విచారింపబడెను. కోర్టులో ఎట్లు సాక్ష్యమివ్వవలెనో ప్రతివిద్యా

ర్థికిని ప్రత్యేకముగా బోధింపబడెను. వీరైనతప్పుపోయినచో, "అదియట్లుగాదు, యిట్లు" అని ఉపాధ్యాయుడు చెప్పుచుండెను. ఈసందర్భమున విద్యార్థుల కెన్నియేని విషయములు తెలిసెను. అరెస్టుచేయునప్పుడు మెలంగవలసినవిధము, నేరస్థుడు మోటుగా ప్రవర్తించినచో



౮. లొంగని ఖైదీని పట్టుకొనువిధము

చేయవలసినపని కత్తితో పొడవవచ్చినప్పుడు ఎదిరివానికి దెబ్బతగులకుండ తిన్నగా తాను రక్షించుకొనగలసిన విధము విద్యార్థులకు బోధింపబడెను. ఎవరైనను తమమీదకలియ బడినచో వానిని కదలమెదలనీయకుండ చేయుటకు కొన్ని పట్లుగూడ విద్యార్థులకు నేర్పబడెను. అత్యవసరసమయములయందే తామాచర్య నవలంబింపవలెననియు, సాధారణముగా ఒకరిని కష్టపెట్టక, తాము కష్టపడక సరళముగా మర్యాదగా మెలంగుటయే ఉత్తమమార్గమనియు, వారికి నచ్చునట్లు ఉపాధ్యాయుడు బోధించును. పోలీసులు ప్రజలను శాసించుటకు గాదనియు, దుండగీండ్లు తమపై దిరుగబడినను క్రోధము వహించక వారిని మేజిస్ట్రేటు కొప్పజెప్పి వారిచే శిక్షనిప్పింపవలెనుగాని తామే వారిని శిక్షించుట తమపనిగాదనియు వారికి బాగుగా బోధింపబడును.

విద్యార్థులను చెరసాలలోనికి గొంపోయి ఉపాధ్యాయులు చెరసాలపరిస్థితుల నన్నిటిని వివరించెదరు. పోలీసు ఖైదీసెల్లు చూడవలెను; వారికి కావలసిన సౌకర్యము లేవి అనునవిగూడ వారు విద్యార్థులకు చెప్పెదరు. విచారణ జరిగి శిక్షవిధించునవరకు ముద్దాయిలు నిర్దోషులుగా పరిగణింపబడవలెనని ఉపాధ్యాయులు స్పష్టము చేయుదురు. ఖైదీలసౌకర్యములయెడల ఉదాసీనభావము వహించినందుల కనేకులు చీవాట్లు పెట్టబడిరనిగూడ ఉపాధ్యాయుడు వివరముచేయును.

ఇట్టి ప్రశస్తమగు శిక్షణ మొసంగబడును గనుకనే లండన్ పోలీసులకు ప్రపంచములో నెచ్చటను లేని గౌరవముగలదు. పీల్ భవనమునందు శిక్షణమునొందిన యనంతరము విద్యార్థులు ఆరునెలల పాటు ప్రొబేషనరుగా ప్రత్యేకోద్యోగియొక్క యజమాయిషీని పనిచేర్చుకొని అనుభవము సంపాదించుకొనవలెను. అటుతరువాత వారు రెండు పరీక్షలలోను తీర్ణులై మంచి యోగ్యతగలవారని యుపాధ్యాయులవలన యోగ్యతాపత్రములను బడసినచో వారి యుద్యోగము ఖాయమగును.



౯. విచారణ.

ఈ విశ్వవిద్యాలయమునందు స్త్రీలుగూడ గలరు. శరీరవ్యాయామమునందును, ప్రాథమిక చికిత్సయందును తప్ప తక్కినవిషయములన్నిటియందును విద్యార్థినులు గూడ విద్యార్థులతో సమానముగానే శిక్షనొందుదురు. స్త్రీలు పురుషులకన్న విషయములను శీఘ్రముగా గ్రహింపగలరనియు, ౧౬ వారములపాటు అభ్యసింపవలసిన విద్యను వారు ౯ వారములలోనే పూర్తిచేయగలరనియు పాఠశాలా ప్రధానోపాధ్యాయుడు శెట్టిగారితో జెప్పెను.

---

## సఖి

జి. జామున గారు

తూరుపు తెల్లవారినది తోయజబంధుఁడు నీదు చూపుటం
కూరము దొంగిలించు ననుకొందును ముందు పరిగ్రహించు నా
చారము నాది మేల్కొనుము చల్లనిగాడ్పులు నిద్రలేచి సం
చారము చేయుచున్నవి ప్రసన్నములై మనకోస మంగనా!

రెప్పలు వాల్చుకాలమును రేలఘటిల్లెడు నిద్రవేళ నీ
యొప్పున కప్పగించుట కయో! ప్రతిబంధకమయ్యె నంచు నే
నెప్పుడు గుందుచుందును సఖీ! గణియించిన రెప్పపాటులో
యిప్పటి నీ విలాస మొకయించుక లేతగదా? వయస్సునన్.

కాలము ముందుజిక్కనని కన్నులు మూసి వచించుచుండు మూ
ర్ఖాళి, యెవండు వ్రాసి యిడు నయ్యది యేరికి భుక్తమౌనో? వ్యా
లోలములైన దేహములలో సుఖముండదు ముందు నర్ధచం
ద్రాలిక! ప్రక్కలింతు హృదయంబున నీ హృదయంబుఁ జేర్చవే!.

లేవను మాటలో మనశరీరము సంశయమన్న యర్థముం
గాపురమున్న దీ దినమునం గడచన్న దసంశయంబు చా
నా! పరిపుష్టి నందు ప్రణయంబును దూరము సేసుకొన్న చోఁ
బాపము! పుణ్యమో! మెఱుఁగ వచ్చునె? ఖేదము రాజ్యమేలెడిన్.

పాలకులై ప్రపంచవిభవంబును జుఱ్ఱిన గొప్పవారి గో
రీ లవిగో; శ్మశానమునఁ బ్రేయసి! వారి ప్రశంసలెల్ల ని
ర్మాల్యములయ్యెఁ బొంది విడి పోవకముందు సుఖించు వారిదే
మేలనుకొందుఁ గాలము గమింతము రమ్ము, కవుంగిలింతలన్.

కేవలరత్నకాంతులను గేరెడు, నీజిగి మోవిగిన్నెలో
నీవరకే మరందరస మించుక యంచులు దాఁటుచుండె, న
య్యో! వనితా, తదీయలవ మొల్కిన నేను సహింపఁజాల, నా
భావము దోసిలొగ్గెడిని పండిన నవ్వున నందఁజేయవే.

తాళుము తాళుమం చొకవిధంబున నూరటపుచ్చఁ జూతు, వె
న్నాళులు తాళుమందువు? మనంబులు చేరువలైనమీద నీ
కాలవిలంబనంబు నరకంబుగదా? సఖి, కీలుగంటులో
పూలు సుగంధముల్ దొరఁగి పోయిన ముద్దునఁ దీపి నిల్చునే.

నీకనుగోనల న్నగవునిగ్గులు మొగ్గలు దీరినంతఁ జీ
కాకుపడుల్ జగంబను నొకానొక టక్కరినమ్మకం బెదల్
రేకులు దీరియున్నయది, నీనునుజూపుల ముత్తియాలతో
నా కభిషేకమిమ్ము, తరుణం బిక వచ్చునొ రాదొ నెచ్చెలీ!

హృదయము శాంతిలేని బ్రదు కెందుల కూరట వెందుమంచుఁ బ
ల్కెడు రసవర్గవాదులు తలోదరి, లాభము గానరాదు, నీ
పెదవులనుండి చిందిపడు పిన్ననినవ్వను తేనెమాటలో
మెదిపిన భుక్తిపాత్రము సమీపము సేయుము, కోడిగూసెడిన్.

కామిని, కౌతుకంబనెడు గ్రంథము నేఁటికిపూర్తి యైనదే
మో! మన కెల్లి పైకొనఁగ నున్నది దీర్ఘవిచారమో! గృహా
రామము పూచియున్నది కరంబుననున్న పసిండివీణెతోఁ
బ్రేమరహస్యము ల్పలుకవే కడకన్నుల మ్రొక్కు లిచ్చుచున్.

---



విమానమార్గము-భారత దేశమునుండి ఇంగ్లాండునకు

# మైసూరు పురాతన శిల్పకళ

బి. సుబ్రహ్మణ్యముగా



చెన్నకేశవదేవాలయ ప్రాంగణము, బేలూరు.

## బేలూరు

మైసూరులో హాస్సన్ జిల్లాయందున్న ఒక తాలూకాకు బేలూరు ముఖ్యపట్టణము. బెంగుళూరు-పూనా రైలుదారిపై నున్న దొడ్డ బాణావర్ స్టేషనుకు ౨౦ మైళ్ల దూరమున నీయూరున్నది. మైసూరు-అర్సికెరె రైలుమార్గమున నున్న హాస్సన్ స్టేషనుకు ౨౪ మైళ్లదూరమున నుండును. క్రీ. శ. ౧౧౨౩ సంవత్సరమున హొయసల విష్ణువర్ధనుడు దానిని తనరాజధానిగ జేసికొనెను. అటుపై ద్వారసముద్రము మీదికి మహమ్మదీయులు దండెత్తివచ్చిన తరువాత బేలూరు హొయసల రాజుల రాజధాని యయ్యెను. ఇది యొక పవిత్రస్థానముగ పేరందినది 'దక్షిణ వారణాసి' యనియు 'అభినవశోణివైకుంఠ' 'త్రిలోక మహాస్థాన' మనియు దీనికి పేరులు గలవు.

విష్ణువర్ధనుడు కట్టించిన చెన్నకేశవాలయము దీ
ప్రసిద్ధికి కారణము. ఆలయము పూర్వముఖముగ నున్న
దానికి నలువైపుల పెద్దపెద్ద గోడలతో ౪౪౩ అడు
లపొడవు, ౩౯౬ అడుగుల వెడల్పుగలిగిన యొక ప్రా
రము గలదు. ప్రాకారమునకు తూర్పుదెస మహాద్వా
మనియు, ఆనెబాగిలు (గజద్వారము) అనియు రెం
పెద్దపెద్ద ద్వారము లున్నవి. మహాద్వారమున గో
పెద్దగోపురము గలదు. మహాద్వారమే ప్రస్తుతము రా
పోకల కుపయోగపడుచున్నది. ఆనెబాగిలు పూర్తి
మూసివేయబడియే యున్న దనవచ్చును.

ప్రాకారములో ప్రధానముగు చెన్నకేశవాల
మునకు తోడు మరి నాలుగైదు చిన్నచిన్న యాల
ములును, ఇంక నెన్నియో కట్టడములును గలవు. కుడిచే

ాక మూల వాసుదేవతీర్థ మను పెద్దకోనే రొకటి యున్నది. దేవాలయ కార్యములకు వలయు నీరంతయు నీనినుండియే యుపయోగింతురు.



చెన్న కేశవదేవాలయగోపురము, బేలూరు

చెన్న కేశవాలయము మూడడుగులయెత్తున నున్న యొక యున్నతస్థానముపై నిలిచియున్నది. ఆలయము పొడుగు తూర్పుపడమరలు, ౧౭౮ అడుగులు; వెడల్పు ఉత్తరదక్షిణములు, ౧౫౬ అడుగులు. దేవాలయము మూడు భాగములుగ నున్నది: గర్భగృహము, ప్రఘాణము, ముఖమంటపము. ముఖమంటపమునకు తూర్పునను, ఉత్తరదక్షిణములను, మూడు ద్వారములు గలవు. వీనిలో గడపటి రెంటికిని వరుసగ శుక్రవారవాకిలి అనియు, స్వర్గదవాకిలి అనియు పేర్లు. తూరుపు ద్వారపు ద్వారబంధన శిలలపై రతీమన్మథులు, దక్షిణపువాటిపై గరుడహనుమంతులు, ఉత్తరపువాటిపై చామరధారిణులును చిత్రింపబడియున్నారు.

మంటప ముఖోపరిభాగముల (Pediments) గరుడవిగ్రహము గల ఉన్నతత్రాతిపలక యొకటి కలదు. ఈగరుడవిగ్రహమునకు పైభాగమున నిరుగడల మకరములు గలిగి హిరణ్యకశిపువధయు, హిరణ్యాక్షువధయు జిత్రింపబడి యున్నవి. ఉత్తరమున కేశవవిగ్రహము గలదు. ఉత్తరదక్షిణముల నున్న మంటపముఖోపరిభాగములు వెనుకవైపున గూడ జిత్రితములై యున్నవి.

పూర్వద్వారమునుండి ప్రఘాణపు వెలుపలిగోడల వరకు ఆలయముచుట్టును, వరుసగ నొకదానిపై నొకటిగ నున్న చిత్రింపబడిన యెనిమిది బద్దెలు గల పిల్లగోడ యొకటి కలదు. దానికిచుట్టు కటకటాలున్నవి. ఈవరుసలలో (స్తంభాగ్రశిల్పములు) మొదటిదానిపై నేనుగులున్నవి. దీనికి తరువాత సింహలలాటములచే నలంకృతమైన శోభపీట ఉన్నది. దానిపై వరుసగ కొన్ని చిన్నచిన్న విగ్రహములు ఉన్నతముగకట్టిన గూళ్లయందు చిత్రింపబడినవి. ఈ బొమ్మలవరుసకు నడుమ నందందు యతివిగ్రహములు కొన్ని కూర్చుండి యున్నట్లు చిత్రితములైనవి. కుడ్య-స్తంభములకు నడుమ గూడ ఉన్నతశిల్పమును వెలిబుచ్చు చెక్కడములు - చాలభాగము స్త్రీవిగ్రహములు-కలవు. వాచూరుపలకలకు ఆచివరనుండి యీచివరవరకు లతలు, సింహములు మున్నగు నలంకరణము లెన్నియో చిత్రింపబడి యున్నవి. కడపటిది ఒక కటకటాలవరుస. ఈకటకటాలలో రెండు వరుసలుగ నున్న వడిమిపలకలపై నెన్నియో బొమ్మలు చిత్రింపబడినవి. ఈబొమ్మలవరుసపై నలంకృతములగు బద్దెలు గలవు. కటకటాలపై రామాయణ మహాభారతములకు సంబంధించిన చిత్రములు విశేషముగ గలవు. ఈపెద్దపెద్ద బొమ్మలకు నడుమ గూరుచుండి జంత్రములపై సంగీతము పాడుచున్నట్లు చిన్న చిన్న విగ్రహము లక్కడక్కడ మిక్కిలి అందముగ జిత్రింపబడి యున్నవి.

పిల్లగోడకు పైన చుట్టునున్న గోడలపై పురాణములకు సంబంధించిన విగ్రహములు ౮౦ చెక్కబడి యున్నవి. కాని యివి యన్నియు సోమనాథపురములో

వలె నొక్కనరుసగ లేవు. ఒక విగ్రహమునకు మరియొక విగ్రహమునకు నడుమ కొంత ఖాళీస్థల ముండును. ఈ ఖాళీస్థము లన్నిటిలో మరల శిల్పము గలదు.

ఈ చిత్రములనుగూర్చి ఫెర్గూసనుగారి ట్లు వ్రాసి యున్నారు: "ఈకిటికీల యడుగున నున్న శిల్పము హైందవశిల్పకారుని యలంకరణనైపుణి వెలిబుచ్చు సమగ్రసౌష్ఠవముగల యుదాహరణములలో నొకటి. ప్రధానసూత్రము లవిచ్ఛిన్నములుగ చిత్రింపబడినవి. ఈ శిల్పములో గల పలువిధముల పొకడలను, దీని సొగసును గాంచినచో విశేషమైన ప్రతిభాశాలితయు, సహనశక్తియు గల హైందవ శిల్పకారుని కొక్కనికే యిది సాధ్యమని స్పష్టపడును. దీని (ఈదేవాలయము యొక్క) నిర్మాణసౌష్ఠవముతో నలంకరణసంపద సమగ్రముగ మేళవించిపోయినది. దీనిని మించగల మేళవింపులు ప్రపంచమున చాల నరుదు."

కటకటాలకును ముంజూరుకును నడుమ అందమైన యీ యాలయమునకు మనోహరాలంకారములుగనున్న సచిత్రములైన రాతిపలకల తెరలు గలవు. ఇవి యిరువది యున్నవి. ప్రధానద్వారమున కిరుగడల నటునై పాకపదియు, నిటునై పాకపదియు నమర్పబడినవి. ఈ యిరువదింటిలో సగము పౌరాణిక చిత్రములతో నిండి యుండును. తక్కినవానిపై రేఖాగణితమునకు సంబంధించిన వివిధముల చిత్రములు గలవు. ఈచిత్రములు గూడ పూర్వద్వారమున కిరుగడల హెచ్చుతగ్గులు లేక సమానముగ నుండున ట్లేర్పరుప బడినవి. ముంగలి ద్వారమున కిరుదెసల, కుడిప్రైపున విష్ణువర్ధనునియొక్కయు, ఎడమప్రైపున మొదటినరసింహుని యొక్కయు కొలువు కూటములు చిత్రితములై యుండును. ఈరెండు తెరల చిట్టచివరి శిఖరఫలకముల (Panels) మీదను వరుసగ కేశవ నరసింహుల విగ్రహములు గలవు. కుడిప్రైపున, విష్ణువర్ధనుని కొలువుకూటమునకు తరువాత తొమ్మిది తెర లున్నవి. వీనిలో మొదటిదానిపై నొక రేఖాగణిత చిత్రము గలదు. తరువాత దానిపై బలిచక్రవర్తి కథ చిత్రింపబడినది. మరల రే. గ. చిత్రములు నాలుగు. ఇవి నాల్గును నాల్గువిధములవి. అటుపై కాళీయమర్దనము; తరువాత నందివాహనారూఢుడగు శివుడు; చివర ప్రహ్లాదచరిత్రము. ఎడమప్రైపున గూడ నరసింహుని దర్బారు దాటిన తరువాత తొమ్మిది తెర లున్నవి. వీనిలో మొదటి రెంటిపై రేఖాగణితచిత్రములు. మూడవదానిపై క్షీరసాగరమథనము. తరువాత మరల రెండు రే. గ. చిత్రములు; ఆరవదానిపై కంసవధ; అటుపై మరల రే. గ. చిత్రము; ఎనిమిదవదానిమీద రంగనాథస్వామి విగ్రహము; కడపటి దానిపై గరుడగర్వభంగము (గరుడహనుమంతుల యుద్ధము) చిత్రింపబడియున్నవి.

ఈనడిమికూటమునకు జెందిన తెరలు, తలుపులు మున్నగువానిని విష్ణువర్ధనుని మనుమడగు రెండవబల్లాలుడు (౧౧౭౩-౧౨౨౦) కట్టించెను. ఆలయనిర్మాణమంతయు ముగిసిపోయినపై గొంతకాలమున కిప్పుడో యివి యన్నియు నిర్మింపబడుటచేతనే, ఆలయపు వెలుపలి గోడలలోని తెరలును, వాని నడుమనడుమ నున్న స్తంభములును హత్తుకొనకున్నవి. అవి యతుకులు వెట్టినట్లు కనబడుచుండును.

స్తంభాగ్రములపై నుండి ముంజూరు నతికిన ౪౦ బొమ్మలు గలవు. 'మదనకైగొంబె' అని వీనికి పేరు. ఇవి యన్నియు నద్భుతావహములగు కళానిదర్శనములు. అవియన్నియు స్త్రీలవిగ్రహములు. ప్రస్తుతము వానిలో రెం డగపడుటలేదు. ప్రతివిగ్రహమునకును అడుగున పీఠముపై వానిని చెక్కిన శిల్పకారుని పే రుండును.

గర్భగృహపు వెలుపలిగోడలపై రథాకృతినున్న మూడు పెద్దపెద్దగూండ్లు గలవు. ఇవి రెండంతస్థులుగలిగి యున్నవి. ఈ మూటిలోను మూడు దెసలకును మూడు విష్ణువిగ్రహములు చిత్రింపబడినవి. ప్రతియంతస్తును ఒక కటకటాల పిల్లగోడను గలిగియుండి నడిమికూటపు వెలుపలి గోడల మాదిరిగనే ఇంచు మించుగ నాపద్ధతినే యలంకృతమైయున్నది.

దేవాలయము లోపలిభాగమునకు బోయిన నింత కన్న గొప్ప విచిత్రముల గనవచ్చును. నడిమికూటమున

వివిధముగ జిత్రింపబడిన స్తంభము లనేకములు గలవు. వీనిపై శిల్పమత్యుత్తమము. ఈశిల్పము లన్నియు నొక దానితో మరియొకటి భేదించిన, నడిమి నాల్గును దప్ప వీనికన్నిటికి నొక విధమగు పోలిక గలదు. ఆమంటపము గాంభీర్యమునకు, దానియలంకారములకు నవి విశేషముగ వన్నె పెట్టుచున్నవి. ఈ స్తంభము లన్నిటిలో తక్కినవానికన్న విశేషముగ నాకర్షించునది 'నరసింహ స్తంభ' మను పేరు గలది. బహుశః దానిపైనున్న నరసింహవిగ్రహము మూలమున దాని కీ పేరువచ్చియుండును. ఒకప్పుడు ఈ కంబముగ నుండెడిదట (Revolving pillar). తిరుగుచు ఈ స్తంభ మడుగునుండి పైవరకు నిండుగ నెన్నియో సున్నితములైన శిల్పవిగ్రహములతో నలంకరింపబడియున్నది. దక్షిణపువైపున మాత్రము కొంతభాగము వదిలివేయబడినది. ఈ స్తంభమును జెక్కిన శిల్పకారుడు సమర్థులెవరైన నున్నచో క్రమము దప్పక యాభాగమును జిత్రింపవచ్చునని తోడిశిల్పులకు సవాలుగ నాభాగము నట్లు శూన్యముగ నుంచెనని చెప్పుకొందురు. దానిపై 'కడలెబసవ' యను పేరుగల చిన్న వృషభవిగ్రహ మొకటి కలదు. 'కడలె' యనగా సెనగగింజ. ఈవిగ్రహము సెనగగింజంత యుండుటచే దీని కా పేరు వచ్చినది.

మరియొక యందమైన స్తంభము ప్రధానద్వారమునకు కుడివైపున గలదు. దీనిపైగల నగిషీపని యద్భుతమైనది. దానికిముం దొక పెద్ద స్త్రీవిగ్రహ మున్నది. క్రిందినుండి పైకి ఎనిమిది బద్దెలు కలవు. వీని యావర్తములయందు దశావతారములు, అష్టదిక్పాలకులు మొదలగు నెన్నియో బొమ్మలు మిగుల సున్నితముగ జెక్కబడి యున్నవి.

మంటపము పైకప్పు నడిమిభాగము గుమ్మటము వలె నున్నది. దీని యడ్డుకొలత పదియడుగులు, లోతు ఆరడుగులు. "ఇది యలంకరణ సంపదను, శిల్పవిశేషములను వెలిబుచ్చు నొక యద్భుతమగు పనితనము." ఇందలి పైభాగము నానుకొనియున్న పద్మములలో త్రిమూర్తుల విగ్రహములు చిత్రితములై నవి. దాని యడుగుభాగమున రామాయణకథకు జెందిన చిత్రములు విశేషముగ గలవు. ఈ గుమ్మటమున కాధారముగ నున్న నాలుగు స్తంభములును శిల్పముతో నిండిన 'మదనకిగొంచె'లను గలిగియున్నవి. వీనిలో మూటిపై నాయాశిల్పుల పేరు లున్నవి. ఆగ్నేయమూల నున్న స్తంభముపైని విగ్రహము చేతిమీద నొక చిలుక కూర్చుండియున్నది. ఈచేతికంకణమును క్రిందికి, పైకి జరుపవచ్చును. నైరృతిమూల నున్న స్తంభముపై సరస్వతి నాట్యమాడుచున్న ట్లున్నది. ఈవిగ్రహము శిరస్సుపైని కిరీటమును కదుపవచ్చును. వాయవ్యమూల స్తంభముపై నాట్యమాడుచున్న విగ్రహ మొకటి కలదు. ఈశాన్యమున నున్న దానిపై తలదువ్వుచున్న ట్లొక విగ్రహము కలదు.

పూర్వ దక్షిణ ఉత్తర ద్వారముల పైకప్పు మీద ఈద్వారముల శిఖరాలంకరణములో గనబడు నరసింహ, వరాహ, కేశవ విగ్రహములే ఆవరుసనే చిత్రింపబడినవి. ఇవి కాక మిగుల సున్నితమై అందమైన శిల్పముతో నిండినకప్పు లెన్నియో కలవు.

చెన్న కేశవ విగ్రహము (గర్భగృహమున నిది విజయనారాయణ యను పేరు గలిగి యుండెను) చక్కనిది. దీనిపొడవు ౬ అడుగులు. ౩ అడుగులు యెత్తుగల పీఠముపై నిది నిలిచియున్నది. విగ్రహము చుట్టును ప్రభామండలము కలదు. కేశవుని కిరువైపుల నతని భార్య లిరువురు గలరు. ప్రభామండలమున దశావతారములకు సంబంధించినవో, మరియేవో, విగ్రహములు కొన్ని చక్కనివి కలవు.

"History of Indian and Eastern Architecture" అను తమగ్రంథమున ఫెర్గూసన్‌గారిట్లు వ్రాయుచున్నారు:—

"దీని పరిమాణము గాని, నమూనాగాని ఈదేవాలయపు గొప్పదనమునకు కారణములు కావు. అనిర్మాణ విశేషముల సౌందర్యమే, పొందికయే, దాని యౌన్నత్యమునకు మూలము. చిత్రితములైన యారాతి పలకల తెరలశిల్పము ఎట్లయినను, దాని యడుగున

నున్న శిల్పమునకును, తోరణపీటలపై నున్న శిల్పమునకును సరి రాజాలను. ఈమొగసాల పట్టెల నిర్మాణమునకు బట్టినంత పని దీని పరిమాణమే గల ప్రపంచమునందలి మరి రే యితరనిర్మాణమునకును బట్టియుండదని నానమ్మకము. కళాదృష్టినిబట్టి చూచిన నీనిర్మాణమంత గొప్పది కాదు. కాని, సౌందర్య సౌష్ఠవములనుబట్టి యున్నతమగు కళాభిరుచి కది వెగటుగమాత్ర ముండదు."

ఈయావరణలోని తక్కిన యాలయములలో కప్పెచన్నిగరాయాలయము మంచి శిల్పసౌందర్యముతో నొప్పుచుండును. వీరనారాయణాలయము, సోమనాయక, ఆండాళ్ మున్నగు నితరదేవతల యాలయములును మరికొన్ని కలవు.

దాసోజా, అతని కుమారుడు చవనుడు, చిక్కహంప, మల్లియన, పడరిమల్లోజ, కెంచమల్లియన్న, మసద, నాగోజ— వీరు బేలూరు దేవాలయనిర్మాణమున పాల్గొన్న కొందరు శిల్పులు.

## హాలెబీడ్

ఆరువందలయేండ్లకుపూర్వము హోయసలరాజుల రాజధానియై పెంపందిన హాళిబీడ్ నగరము నేడు బేలూరు ప్రక్కనొక చిన్నపల్లెయై యున్నది. ఇది దొడ్డబాణావర్ రైలుస్టేషనునుండి బేలూరుకుపోవురోడ్డుప్రక్క బేలూరునుండి ౧౦ మైళ్ళదూరమున నుండును. దొడ్డబాణావర్ రైలుస్టేషనిచ్చటికి ౧౭ మైళ్ళదూరములో నుండును. హాస్సన్ నుండికూడ అచ్చటికి దారి కలదు. ఆదారిని బోయిన బేలూరుకుండ పోవలయును.

హోయసల శిల్పమునకు సంబంధించిన రెండు దేవాలయము లిందు గలవు. ఇవికాక జైనబస్తీ ఒకటి యున్నది. ఆలయములు రెండును—హోయసలేశ్వరాలయము, కేదారేశ్వరాలయము—శివాలయములే.

హోయసలేశ్వరాలయము రెంటిలో నెక్కువ పురాతనమైనది. ఇది కష్టావ్యయపరిమితము. రెండవ హోయసలరాజగు వినయాదిత్యునికాలమున (౧౦౪౩-౧౧౦౪) ఈయాలయ నిర్మాణము ప్రారంభమైయుండును. ఈకట్టడముపని ౮౬ యేండ్లు సాగింపబడినదనియు, వినను అదిపూర్తికాలేదనియు జెప్పికొందురు. కాని యిది నమ్మటకు వీలులేనిగాథ.

ఇదియు నక్షత్రాకృతిగల కట్టడమే. ఇంచుమించైదడుగుల యెత్తుగల యున్నతప్రదేశముపై నిర్మింపబడియున్నది. దీనిపొడవు ౧౬౦ అడుగులు (ఉ- ద.). వెడల్పు ౧౨౨ అడుగులు (తూ- ప.). గర్భగృహములు రెండును ఒకదానిప్రక్క నొకటిగ నున్నవి. సరిగా నీరెంటికి నెదురుగ, దేవాలయమునకు వెలుపల, రెండు మంటపములు గలవు. రెండు మంటపములలోను రెండు గర్భగృహములలోని దేవతలకు సభిముఖముగనున్న రెండు నందివిగ్రహము లున్నవి.

ఆలయపు వెలుపలిగోడలు, బేలూరు దేవాలయమునవలెనే, అడుగునుండి పైవరకు నపారమగు శిల్పసంపదతో నొప్పారుచుండును. అడుగున ఏనుగులు చిత్రింపబడియున్నవి. ఇవి అసామాన్యమగు సౌందర్యముతో, సున్నితమగు పనితనముతో నొప్పుచుండును. అసలు హోయసలరాజుల చిహ్నము శార్దూలము. కాని యిచ్చటమాత్ర మేనుగులు చిత్రింపబడినవి. అటుపైసఱ్ఱపు రౌతులచిత్రములువచ్చును. వానిపై మరల నొక యలంకరణము; ఇందు ఉబ్బెత్తుపనితో (ఉబ్బెత్తుపని యనగా, శిల్పచిత్రణములలో బొమ్మలను పైకుబికినట్లు తయారు చేయుట.) రామాయణమునుండి కొన్నిదృశ్యములు విచిత్రముగ తయారుచేయబడియున్నవి. వీనికి వెనుక దివ్యములగు మృగపక్షులవరుస యొకటియు, పూర్వముఖమున మానవజీవితమును విశదపరచు వివిధచిత్రములును గలవు. దీనికిపైన రెండు ప్రతిమలుగల తోరణపీటయున్నది. తరువాత బేలూరు దేవాలయమున యట్లే చిత్రితములగు రాతిపలక—తెర లుండును. కాని యివి బేలూరు తెరలంత యందమైనవి కావు.

ఆలయమధ్యభాగమున, తూర్పువైపున గల రెండు గర్భగృహములకును నడుమ, రాతిపలక-కిటికీలకు మారుగ హిందూపురాణములకు సంబంధించిన విగ్రహముల వరుస

యొకటి కలదు; ఇందలి ప్రతివిగ్రహమును ఇంచుమించుగ ౪౹౨ అడుగులయెత్తుగలిగియుండును. పశ్చిమభాగమంతయు మరల నిట్లే యొక ౯౦౦ అడుగులదూరము పౌరాణిక ప్రతిమల పఙ్క్తులతో నిండియున్నది. ఈపంక్తిలో చేరని హిందువులముఖ్యదేవత లెవ్వరును లేరు. "వీనిలో కొన్ని అతిసూక్ష్మములగు శిల్పవిశేషములనుగూడ వ్యక్తపరుచుచుండును. ఇట్టివిశేషములను 'ఫొటోగ్రాఫీ'లో మాత్రమే విశదీకరించుట కవకాశము గలదు. ఓరిమియధికముగ గల ప్రాచ్యదేశమునగూడ మానవుని కార్యకౌశలమును వెలిబుచ్చునద్భుతతమములగు నిదర్శనములలో నిది (పైన వివరించిన శిల్పము)యొక్కటి యని చెప్పవచ్చును."

'పూలపట్టము' నకు పైభాగమునను్న ఏనుగుల వరుసలో ౨,౦౦౦ ఏనుగు లున్నవి. ఈపంక్తి ౭౦౦ అడుగుల పొడవుండును. దీనినిబట్టి వీనిలో ప్రతియొక్కటియు సుప్రసిద్ధములగు పౌరాణిక ప్రతిమలకంటె పెద్దదని తెలియును. పౌరాణికవిగ్రహముల పంక్తి ౫౫౦ అడుగుల కన్న నెక్కువపొడవు గలది కాదు.

దేవాలయమునకు నాలుగుద్వారములు గలవు: తూర్పున రెండు, దక్షిణమున నొకటి, ఉత్తరమున నొకటి. ఈద్వారముల యుపరిభాగముల యొక్కయు ద్వారముల ప్రక్కలయొక్కయు శిల్పము గొప్ప కళాప్రాచుర్యము గలిగియున్నది. దీనికై వినియోగపరుపబడిన యపరిమితమగు కళానైపుణియొక్క పరిశ్రమయు నిందు విస్పష్టమగుచుండును.

రెండు నంది-మంటపములలోను, పెద్దదానిలోని స్తంభములు తరిమెనబట్టినట్లు గానవచ్చుచు, నపారమగు తమస్నిగ్ధతచే చూచువారికి ఒక్కొక్కటి రెండుగ గానవచ్చును. ఇట్లొకవస్తువునే రెండుగగాంచుదృష్టిప్రభావ విశేషమును ద్వయీభావన (Double-reflection) మందురు.

ఈదేవాలయముయొక్క నిర్మాణమున పాల్గొన్న శిల్పులలో కొందరు దేవోజా, కేసిమోజాకుమారుడు మాసన, మాయన, తన సుందరాదుహరిషుడు అనువారు.

ఈదేవాలయమును గూర్చి ఫెర్గూసన్ గారి ట్లు వ్రాసియున్నారు: "ఇందగపడు, సహనయుక్తమగు పనితనమొకటియే యీనిర్మాణము యొక్క గొప్పతనమునకు కారణమని తలపరాదు. ఔన్నత్యము, వెలుతురు నీడలుగలుగునట్లుగ ఆలయపూర్వముఖము నిర్మింపబడిన పద్ధతి 'గోథిక్' శిల్పు లవలంబించిన యుపాయములకన్న మంచిది. దీనినిగూడ మించినది పశ్చిమముఖమున నున్న శిల్పము. అచ్చటి స్వరూపచిత్రణము, ఆస్వరూపముల కాధారములైన ఆయాబద్ధల యేర్పాటు ఆతరగతికి జెందిన రచనలలో నెల్ల నుత్తమమైనది. దేవతావిగ్రహములవరుస ఒకసాదా మట్టముపై చేర్చరుపబడెనేని యది తనప్రభావములో చాలభాగము గోలుపోవును. ఇప్పుడు ఉపరిభాగము నందలి యావర్తములు పంక్తిపరంపర కెట్టి భంగమును గలిగింపకయే కట్టడమునకంతకు నౌన్నత్యమును, బలమును గలిగించును. క్రింది దరుజులకు సంబంధించిన అడ్డురేఖల రచనముగూడ అంతటి ప్రభావవంతముగనే యున్నది."

కేదారేశ్వరాలయ మొక చిన్న దేవాలయము. కాని యిది సమగ్రమగు నిర్మాణము. దీనిని నిర్మించినవారు వీరబల్లాలుడు (రెండవబల్లాలుడు), అతని చిన్న రాణియగు అభినవకేతలదేవి. ఇది యతని పరిపాలన కడపటి దినములలో క్రీ. శ. ౧౨౧౯ సంవత్సరమున నిర్మితమైనది. ఇది అత్యద్భుతమగు నొకచిన్న శిల్పనిర్మాణము. దీనిని గట్టినవాడు దేవోజాయని చెప్పికొందురు. ఇదియు నున్నతప్రదేశముపై నిర్మింపబడిన నక్షత్రాకృతి గల కట్టడమే; శిఖరము కిరీటాకృతితో నుండును. మొన్నమొన్నటివరకు నిది మిగుల పాడువడి పోయినదిగనే యుండినది. కాని, మైసూరు సంస్థానముయొక్క యాదరమున నిప్పుడిది మంచిస్థితికి వచ్చినది.

"అడుగునుండి పైవరకు నది భారతీయకళకు జెందిన యుత్తమోత్తమములగు శిల్పచిత్రములతో నిండియున్నది. ఇది ఆలయబహిఃస్వరూపము నెట్టివిధమునను భంగపరుపకుండ, భారతీయకళ కాదర్శముగ నుండదగిన శిల్పసంపదను దాని కమర్చిపెట్టినది. ఈదేవాలయమునకు సంపూర్ణత్వము కలదని నిరూపింపగలిగినచో భారతీయ



౧౦. హొయిసలేశ్వర దేవాలయము, పడమరవైపు హాలెబీ



౧౧. హొయిసలేశ్వర దేవాలయపు గోడ నడిమిభాగము

సుందర శిల్పనైపుణ్యము కానవగును

శిల్పుల కళాకౌశలమునకు, బహుశః, దీనికన్న గొప్ప నిదర్శనము మరియొకటి యుండబోదు."

హాలెబీడులోని దర్శనీయములగు ప్రదేశములలో పార్శ్వనాథబస్తీ యొకటి. ఈ జైనదేవాలయము విష్ణువర్ధనుని కాలములో ౧౧౩౩ సంవత్సరమున నిర్మింపబడినది. ఇచ్చటి 'హొయిసల' నిర్మాణములలో నిది యన్నిటికంటె పురాతనమైనది.

ఈ యాలయపు మధ్య మంటపముయొక్క ముందుభాగమున నందిమంటపములోని స్తంభములవంటివే రెండు స్తంభములు గలవు. ఉత్కృష్టములగు నా స్తంభములపై కొంచెము నీరుంచిన నవి దృష్టికన్నియో భ్రమలు గల్గించును. ప్రేక్షకునికి వినోదము గూర్చుట కిది యొక నిజమైన తమాషా.

---




# అజంతా చిత్రములు

## ౧. ఋషిసందర్శనము

ఈ చిత్రము పదునేడవగుహాలయమున వెనుకటి గోడపై కుడిమూల నున్నది. ఒక యువకుడు తన గుఱ్ఱమును వెనుక విడిచివచ్చి ఋషితో సంభాషించుచున్నాడు. పైన నొకఋషి తటాకమునుండి నీరు తెచ్చుకొనుచున్నాడు. తటాకము గట్టున కొన్నిహంస లున్నవి. క్రింద నొకడొక ముసలివానిని చేతులపై నెత్తికొని పోవుచున్నాడు. ఇంకొకడు స్త్రీ పురుషుల నిద్దరిని కావడియం దుంచుకొని మోసికొనిపోవుచున్నాడు. కావడి నున్నవారు ఋషిసందర్శనార్థము పోవుచున్న వికలాంగులు కాబోలును.

(కొ. న.)




౨. బుద్ధపూజ

ఈ చిత్రము రెండవగుహాలయమున వెనుకటిగోడపై నున్నది. రాజాంతఃపురమంటపమున కొందఱు స్త్రీలు బుద్ధు నాసీనుంజేసి పూజించుచున్నారు. ఒకతె మోకరించి యాతనికి నమస్కరించుచున్నది. ఇంకొకతె యాతనికి భిక్షను గొనితెచ్చియున్నది. వాకిట సేవకుడు కూర్చొనియున్నాడు. (కొ. వె.)




## 'వెం. ర.' గారి విమర్శనము-ఒక్క మనవి.

'విద్యానగరచరిత్ర' విషయమున గత భారతి (వెం.ర.)విమర్శనము చూచితిని. తత్త్వము బోధపడినది. కొన్ని సంకుచితాభిప్రాయములు విద్యాధికులగు మన విమర్శకుల నింకను వీడకుండుట విచారకరమగు సంగతి. చరిత్ర రచయితలకును, గ్రాహకులకును శ్రేయముగూర్చు నుద్దేశము గల్గి, విమర్శకుని వ్రాఁత విశాలదృష్టిని బ్రకటించుచు, నుదారభావ సంకలితమయి వెలయుచుండ వలయుననుట లోకసమ్మతమగు మతము. కాని 'వెం.ర.' గారి విమర్శనమున నట్టిది చాలఁ దక్కువ. శాస్త్రిలు, పండితులు, కవులు, అవధానులు చరిత్రరచనమునకుఁ గడఁగుచుండుట యీవిమర్శకు నసారతము బాధించెడు విషయమై కన్పట్టెడిని.

విమర్శనవ్యాస మూఁడుకాలములకుఁ బైఁబడిన స్థల మాక్రమించినది. అందు విమర్శకుఁడు కనఁబఱచిన దోషములు మొత్తమున మూఁడు. 1. రచయిత శాసనాధారములు చూప లేదనుట. 2. కృష్ణరాయని నిధనకాల మెప్పుడనుట. 3. స్థలవిచారము. ఇందుఁ జివరయంశము ప్రమాద జనితమనుట నామనవి. తక్కిన రెండును తెలిపి చేసిన వేను.

పీఠికలో 'నాంగ్ల చరిత్ర గ్రంథములు, ౧౪-౧౫ శతాబ్దములలో విద్యానగరమున వెలసిన సంస్కృతాంధ్ర ప్రబంధ పీఠికలు, చాటువులు, శాసనములుఁ గొల్లలుగ నాకు లభించిన' వనుటలో నాంధ్ర ప్రపంచమునఁగల యాధారసర్వస్వము నని విమర్శకుఁ డర్థము చేయరాదు. నా యెఱిఁగినంతవఱకు, నవసరములని తోఁచిన పట్టుల, నాధారములఁ జూపియే యున్నాఁడను. ప్రతి వా... మునకు 'రిఫరెన్సు' నీయఁ దలంచుకోలేదు.

కృష్ణరాయని నిధనకాలమును గూర్చి, యీ... వెలువడిన యొకటి రెండు శాసనములు, శాలివాహనశక ౧౪౫౧ అని వాకొనుచున్నవి. నేను క్రీ.శ. ౧౫౩... యని వ్రాసినాను. ఇది ప్రామాణికములని యెంచఁబడ... బహుగ్రంథముల యభిప్రాయము; పెక్కు శాసన... లొక్కవిధమునఁ బల్కిన పల్కుగూడ. కాని కొన్ని శాసనములయందు కృష్ణరాయలు ౧౫౨౯ ప్రాంతము... యందు మరణము నందినట్లున్నదని విమర్శకుఁడు తెల్పె... ౧౫౨౯ కాదు. ౧౫౩౦ వ యేఁటనే. ప్రభవనా... సంవత్సరాషాఢమాస భారతి సంచిక (౯౩-౯౬ పుట... లో, శ్రీమాన్ పెనుగొండ టి. శివశంకరముగారు ప్ర... టించిన, రౌద్రపురి (రొద్దము) శాసనములఁ గను... అందు రెండవదియగు నళియ రామరాయల (పెనుగొండ... శాసనము పెడ ౧—

ఉ. "ఆరయ శాలివాహన శ
కంబులు సర్వ యుగాబ్ధి మద్యుతుల్
శారణ వత్సరంబున ని
దాఘదివంబున జ్యేష్ఠ శుద్ధ ష
ష్ఠీ రవివాసరంబున నృ
సింహుని కృష్ణుఁడు చేర ద్వారకన్."

అని శాలివాహన శక ౧౪౫౧ శారణవత్సర జ్యేష్ఠ శుద్ధ షష్ఠీదినము మరణించినట్లు నుడువుచున్నది. ఆ... కాలము క్రీ. శ. ౧౫౩౦-వ సంవత్సరము జూలై నెల... వచ్చును. బలని త్తమములగు నిట్టియాధారము లీక నొక... రెండు కాన్పించు నేమొ చూపలసియున్నది.

కృష్ణరాయని నిధనకాలము చర్చించుటతో విమర్శకుఁ డసందర్భముగ నా చరిత్ర రచనాపద్ధతినిగూర్చి యించుక వర్ణించెను. చరమదశలోఁ దిమ్మరుసు, కృష్ణరాయనికుమారుని నాఁడెండ్ల బాలుని విషప్రయోగమునఁ జంపిన హేతువున, తన కావలసియుండిన గౌరవము గోల్పడి, కారాగారమున బంధితుఁడై, మరణించెనఁట యని వ్రాసినది విమర్శకున కహితముగఁ దోఁచియుండెను. తిమ్మరుసు కనుగ్రుడ్లు పెరికించి, యాకోపము కృష్ణరాయని కంటఁగట్టవలసి యుండినదికూడ. ఈ రెండును జరుగనే లేదను విచారమునకు మరల వత్తము.

లోపములు పెక్కు గలవని విమర్శకుఁ డొక్కచోఁ దెల్పియుఁ, బై దోషముల మూఁడింటితో వ్యాఖ్యానము చాలించి, 'ఇంతవఱకు ప్రస్తుతము విమర్శింపఁబడు గ్రంథములో మాకు లోపములుగఁ గన్పించిన వానిని వచించితిమి' అనుచు, స్వోక్తి వ్యాఘాతమునకు గుఱియై విమర్శనము విరమించుట, యెవరి శ్రేయము కోరియో!

తిరస్కార భావబోధకములు, సురభిమానపూర్వకములు నగు పదజాలముఁదీసి, న్యాయవిధమున-దోషసర్వస్వముఁగలదియొ, సక్రమపథమున-సప్రమాణపద్ధతిని-జూపుచు, రచయితలకును, వాచకప్రపంచమునకును, నుత్తమసాహాయ్య మొనర్చి, వారికృతజ్ఞతకు పాత్రులగుట లెస్సయని, 'వెం. ర.' గారివంటి విమర్శకులకు మనవిచేయుచున్నాఁడను.

[సీరిపి ఆంజనేయులు]

## 'విద్యానగర చరిత్రము'

ఈ జ్యేష్ఠమాసపు "భారతి" సంచికలో ౬౩౮ వ పుటయందు శీరిపి ఆంజనేయులగారిచే రచింపబడిన "విద్యానగరచరిత్రము" విమర్శింపబడియున్నది. కృష్ణదేవరాయల నిధనకాలముగూర్చి యింకను నిర్ణీతముకాలేదని యావిమర్శనయందు సూచించియున్నారు. ఈపుణ్యదివసమునుగూర్చినసందేహము ప్రభవ సం॥ ఆషాఢమందే తీరినది. కృష్ణదేవరాయలు శాలివాహనశకము తారణ సం॥ జ్యేష్ఠ శుద్ధ షష్ఠి పరమపదించినట్లు మా పెనుగొండతాలూకు రొద్దమందు దొరికిన తామ్రశాసనమువలన వ్యక్తమైనది. ఈతామ్రశాసనము ప్రభవ సం॥ ఆషాఢమాసపు సంచిక ౯౫ వ పుటయందు చిత్రింపబడియున్నది. రాయల నిర్యాణదినము శాసించియుండు అందలి పద్యము మరియొకసారి ఈక్రింద వ్రాయుచున్నాను:

"శా. ఆరయ శాలివాహనశకంబులు మర్వి యుగాబ్ధి
షడ్భృశుల్, తారణవత్సరంబున విదాఘదినంబున
జ్యేష్ఠశుద్ధ షష్ఠి రవివాసరంబున నృసింహుని కృష్ణుడు
చేరె ద్వారకన్."

ఈ పద్యమునుబట్టి చూచినపుడు శ్రీరాయలు శాలివాహనశక తారణ సం॥ జ్యేష్ఠ శుద్ధ షష్ఠి దినమున నగు సరియైన ౧౫౨౯ సం॥ సుమారు జూన్, జూలై నెలగా నుండవచ్చునని, నిర్ణయింపదగును.

కీ॥ శే॥ స్వామి కణ్ణుపిళ్ళైగారి "ఎఫిమిరిస్" ("Ephimeris") పంచాంగమును శోధించిన యీపుణ్యదినము యిదమిత్థమని తెల్పుటకు కష్టమైయుండదు.

[టి. శివశంకరం]

కొ. నరసింహాచారిగారు

# వినోదశిల్పము—సోఫా, కుర్చీ







సోఫా

→: సూచిక :←

1 - - - - - - ఆధారరేఖలు.

2 —·—·—·. సగములోతునకు కోయవలసిన భాగము.

3 ———— అడుగంట కోయవలసిన భాగము.

4 [hatched box] కోసి తీసివేయవలసిన భాగము.







కుర్చీ

ఎనిమిదంగుళముల పొడవును, నంతేవెడల్పును గల యొక నలుచదరపు అట్టను తీసికొనవలసినది. దాని యొక్కొక్కప్రక్కను నాలుగు సమభాగములుగాచేసి అడ్డముగను, నిలువుగను గీతలువేసిన యెడల పదునారు చిన్న చదరములు, లేక, గళ్లు ఏర్పడును. (చిత్రము ౧.) పైవరుసయందుగల నాలుగు చదరములను వదలి రెండవ వరుసలో చిత్రమునందు చూపిన రీతిని వంపుగీతను గీయ వలసినది, రెండవ వరుసయందలి నడిమి రెండు చదరములును సోఫాకు వీపుగా ఏర్పడును. వీపునకును కుడియెడమలలోని చదరములు చేతులగును. తర్వాత సూచికయందలి 4 వలె గుర్తించియుండు భాగమును కోసి తీసివేయవలసినది. అట్టకు అడుగు అంచుననుండు అర్ధ వలయము అందమునకై యేర్పడినది కాబట్టి దాని

కోసితీసివేసినను లేకున్నను లోపములేదు. సూచికయందలి ౮ వలె నుండు రేఖలవెంబడి అడుగంట కోయవలెను. తర్వాత చిత్రమునందు ము, ము, ము, అని గుర్తించియుండు గొలుసు రేఖలవెంబడి అట్ట, పైప్రక్కన సగములోతునకు కోతవేయవలెను. అనగా తునకలుగా విడిరాకుండ సగము అతుకుకొనియుండునట్లు కోయవలెను.

వె, వె, వె, అని గుర్తించియుండు రేఖలవెంబడి అట్ట వెనుకభాగమున సగములోతునకు కోతవేయవలెను. వెనుకభాగమున పదునాలు చదరములు గుర్తించబడనందున పైభాగమునందలి రేఖలకు సరిగా వెనుకగూడ రేఖలను వేసికొని పైరీతిగ కోయవలెను. తర్వాత వీపునకును పీటకును మధ్యరేఖవెంబడి అట్టను ముందునకును, పీటకు క్రిందనుండు రేఖవెంబడి అట్టను వెనుకకును వంచవలెను. (చిత్రము ౨.) క, క, అనుభాగములను వెనుకకు వంచి వాటిని కప్పునట్లు ప, ప అను భాగములను ముందునకు వంచవలెను. (చిత్రము ౨.) కుడి ఎడమలందు క, ప భాగములను చేర్చి అతికించిగాని చిన్నకుట్టును వేసిగాని గట్టిపఱచవలెను.

సోఫాను కాగితముతో చేయవలెనన్న రేఖలు గీయనక్కరలేదు. ఒక సమచదరపు కాగితమును మొదట సగమునకును తర్వాత ఆసగములను మరల సగమునకును మడువవలెను. పిమ్మట మడతలను విప్పి అడ్డముగా నదే రీతిని మడిచి విప్పిన ఎడల పదునాఱు చిన్న చదరముల గుర్తులేర్పడును. పిమ్మట చేయవలసినదంతయు అట్టలో చేసినరీతిగనే యుండును. కాగితములో చేయునపుడు సగములోతుకోతలుండజాలవు. వాటికి బదులుగా కాగితములను మడిచి వంచవచ్చును. (కుర్చీ చిత్రము ౪.)

సోఫాకుచేసినరీతిని యొకయట్టనుగాని కాగితమునుగాని పదునాఱుచదరములుగా భాగించుకొని పైవరుసనుగల నాలుగు చదరములను తీసివేసి కుడితట్టుగాని, ఎడమతట్టుగాని గల మూడు చదరములనుగూడ తీసివేయవలెను. (చిత్రము ౩). ఇంక తొమ్మిదిచదరములుమాత్రము మిగులును. అందు నడిమి చదరము కుర్చీకి పీటయగును. సోఫాలో పీటకు రెండుచదరములును, కుర్చీకి ఒక చదరమును నుండుటయే వీటి రెంటికిని గల భేదము. తక్కిన విషయములందు రెండును ఒకే విధముగా జేయబడుచున్నవి.

---

# (శ్రీ. శే.) వేదము వేంకటరాయశాస్త్రిగారు

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ

---

## గురుస్మృతి

త్రైన కీవు కడుఁ గూర్తు వని పొంగు న్నాత్రయి కడుపునఁ దీఱనియుడుకు వెట్టి,
తనకాంచి నీవు గూర్చిన కింకిణులు మ్రోఁగ, నుప్పొంగు శారదయుబ్బు నణఁచి,
పోటిమై నిన్నోము బోటుల యాంధ్రి యాంగ్లేయి ద్రావిడి దైవి లీలఁ జెఱచి,
తనకేడుగడ యీవె యని నమ్ముకొనిన సత్కవిత నిరాధారగా నొనర్చి,
నేత్రమఖమని దీక్షమై నీవు ప్రోవ-నెగడు నాటకకళ పేర్మి నీటఁ గలిపి,
సరసత, మనీష, దయ, నీతి, చాయ మాయ-మాయమైతివె; వేంకటరాయశాస్త్రి!

నీసుధామధురంపు నెఱివాక్కులను గ్రోలు నోట నీస్మృతిఁ బల్క మాట రాదు;
భారతీ దేవతాపరరూపు నినుఁ గొల్చు కనులు నీస్మృతిఁ గాంచఁ గానఁబడవు;
ప్రత్యహంబును నీదుభవ్యమూర్తికి మోడ్చుకరము నీస్మృతి వ్రాయఁ గరము వడఁకు;
నీ కవనోపవనీవాటికలఁ జొక్కు మనము నీస్మృతి నెంచ మ్రానుపడును;
నీవరప్రసాదమున జనించి మించు-బుద్ధి సంస్కారమె యిపు డున్మాలహతా వి
ధంబుదోఁచెడి; నిఁక నిన్నుఁ దలఁపఁ, గొలువఁ-గాంచ, నుతియింపగురువర్య, కనుదు నెట్లు

తిక్కన మెచ్చిన సోమన - యక్కవిరాజేఁగ, నలము నాడీనతయే
నెక్కొనె సింహపురీసతి-కిక్కరణిని గవివతంస మీ వరుగుటచేఁ.

వ్యాకృతి సాహితీవార్ధిఁ గుంభజులీల నాపోశనముఁ గొన్న యరిదిమేధ,
నైషధాముక్తాది నవపయోంబుధిఁ ద్రచ్చి యమృతంబుఁ బంచు మహామనీష,
ప్రతిపక్షకోటి హోరాహోరి నొంటిమై సాధించి యోర్చిన సాహసంబు,
ఏకపుత్త్రుఁ డకాలమృతివాతఁ బడిన యత్తఱిని బాఠము సెప్పు ధైర్య మహిమ,
ఛాత్రకోటి ప్రచారంబు సాఁగ, నాట-కములు వ్రాసి యాడించిన కార్యదీక్ష,
దైన్య మెన్నఁ డెఱుంగని దైవభక్తి-కావలేవయ్యె నకట! నిఁక గాలునుండి.

కృతి శరజ్జ్యోత్స్న ౨ గోపాలకృష్ణుఁ దనిపి-రామలింగేశుఁ డౌదల రమణ మీఱఁ
దాల్పఁ, గల్పపువిరి సౌరుఁ దాల్చి, తొంటి-లాగుఁ దప్పితె యిప్డు కళాప్రపూర్ణ!

నవరస కేళి సీమ యగునాటకరంగమునందు, సంస్కృతాం
ధ్ర వివిధశ్రవ్య దృశ్యకృతి రాజములన్, నవమల్లినాథుఁడన్
ప్రవిమలకీర్తి హేతువులు భవ్యవిమర్శనలందు, శిష్యలో
క వినుతగోష్ఠి, నూఱటను గందు, నటన్ గని సీదుఛాయ నేన్.

గుఱ్ఱం వేంకట సుబ్బరామయ్య, యం. ఏ.

* * * * * * * *

నిర్యాణము

ఉ. వారక దేశమంతయును వంత మునుంగఁ గలాప్రపూర్ణము
ఖ్యోరు పదాంకయుక్తుఁ డభియుక్తుఁడు వేంకటరాయశాస్త్రి తాఁ
జేర దినంబు శుక్ల సమ, జ్యేష్ఠ సితంబున ద్వాదశీనమే
తార దినాది, వత్సరము లాదట డెబ్బదియైదు నిండఁగాన్.

* * * * * * *

అయ్యొ! యెంతటియన్యాయ్యమయ్యె-నాంధ్రవిషయ విద్వాంసులకునెల్లఁ బెద్దవాఁడు
రాజమాన్యుండు, వేంకటరాయ శాస్త్రి-తనువుఁ జాలించె నాస్త బృందంబు కుంద.

చిరవియోగక్లేశభరము తీఱఁగ, నెదు రరుదెంచి, తండ్రి ని న్నాదరింప
'స్వఃపురికిని వెంటఁబడె సీతఁ' డంచుఁ బ్రసన్న రాఘవకర్త జడిసి, చూడ
తమత్తోడి పండిత తండంబుతో లేచి కవియును, గురువు స్వాగతముఁ బలుక
పండితాదరణమ్ము పాటించి, చయ్యన నాకేశుఁ డర్హాన నమ్మొసంగఁ
గుదురుకొంటివె, వేల్పుల కొలువులోన?-మహితగుణగణ్య! మాఱటమల్లినాథ!
అప్రతిమకీర్తి కలిత! కళాప్రపూర్ణ!-ప్రౌఢచారిత్ర! సర్వతంత్ర స్వతంత్ర!

సంతరించితి వాంధ్రసంస్కృత ద్రావిడ హూణవాక్పాండిత్య ముజ్జ్వలముగ,
విరచించితివి చారుతరకల్పనాచమత్కృతు లొప్పఁగ స్వతంత్రకృతులు కొన్ని
తెనిఁగించితివి కష్టమునకోర్చి తూ,చా,లు చెడకుండఁగొన్ని సంస్కృతపుఁగృతులు
వివరించితి వభేద్య విషయసంఘటితమ్ములగు ప్రౌఢకావ్య గూఢార్థములను

కలముఁగొన్నదిసుత, తుదిగడియదాఁక-జీవితంబెల్ల, శారదాసేవకొఱకె
ధారవోసితి, సాటియెవ్వారు నీకు-ప్రాజ్ఞనుతకీర్తి! వేంకటరాయశాస్త్రి.

వితతమతులగు సుకవిపండితులనడుమ- నిన్నుఁ బూజింప, సమకట్టియున్న శిష్య
వరులయత్నమ్ము సర్వమ్ము వమ్ముగాఁగ, తరలిపోయితి వెంత నిర్దయుఁడవయ్య!

పాండిత్యంబున కేమి, సారకవితావ్యాపార సందర్భవాక్
శౌండీర్యంబున కేమిగాని, రసభాస్వత్కావ్య భావార్థపుం
బండారమ్మును విప్పి నీకరణిఁ జెప్పంజాలు, ధీశాలి, యొ
క్కండుఁ లేఁడుగదయ్య, మాకు నిఁక వేంకట్రాయవిద్వన్మణీ!

నీ సరసవాక్కు, నీయుపన్యాసశక్తి-నీచమత్కృతి నీతోన నిష్క్రమించెఁ
బృథివి నొక్కనినైన, నీపేరు నిలుపఁ-గల కలాధికు నిలుపకే కదలితకట.

కడముట్ట శారదకాంచిక సాగసెల్ల చివరకు నాలుగజ్జియలతోన,
సముచితవివరణ సామగ్రి నెనయక కొఱవడిపోయె శాకుంతలంబు
ఎంతెంతొ కాంక్ష నిరీక్షించు మిత్రుల కందకపోయె గీతార్థవివృతి
కాదంబరి రసంబుఁ గనఁగల్గునంచు, నోరూరువారల కోర్కె లాఱిపోయె
నీవు త్రిదశాలయంబున కేఁగుకతన-నెవ్వరిఁక నీ కృతులు నిర్వహించువారు ?
తెలుఁగుబాసకుఁ గొదువలు తీర్చువారు?-నిపుణమతి నిన్ను మఱిపింప నేర్చువారు?

ఎంతటి వెఱ్ఱి! నీస్మృతికి నేఁడ్చెదరంట భవజ్జనం బహో
సంతతిఁగాంచి, సత్కృతులు సల్పి, బహూకృతులంది, పెద్దకొం
డంత ప్రతిష్ఠనాఁచికొని, యారవితారక కీర్తికాయ మి
ట్లింతయు, నుత్తముల్ పొగడ, నెన్నదియేండ్లకు నీవు కైకొనన్.

కవికులంబయి తావక గ్రంథపటలి, యవని నెందాఁకవర్తిల్లు, నంత దనుక
భావుకాఖండ దివ్యవైభవముతోడ- స్వర్గసుఖములు తనివోవఁ బడయు మయ్య!

దీపాల పిచ్చయ్య శాస్త్రి

---

# (కీ. శే.) వేదము వేంకటరాయశాస్త్రిగారు

### మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ

ప్రపంచమున నప్పుడప్పుడు మహానుభావు లవతరించుచుందురు. వారు తమ జీవితమునం తయు మానవాభ్యుదయమునకై వినియోగించి కీర్తిమూర్తినిదాల్చి చిరంజీవులయి వెలయుచుం దురు. అట్టివారియుగము క్రుంగినను నూతన రూపమున నది కాలముతోపాటు పొంగుచుండు టను ప్రాచీన చరిత్రములు చాటుచున్నవి.

కళాప్రపూర్ణు డట్టి మహానుభావులలో నొకడు. తనజన్మముచే నాంధ్రావనిని ధన్యను జేసినాడు. తన యఖండపాండిత్యముచే నాం ధ్రవాణిని వికసింపజేసినాడు. తనప్రతిభావిశేష ముచే నాంధ్రులను నూత్నభావామృతమును గ్రోలి యానందింపజేసినాడు. ఈ మహాను భావుడు ప్రమాదీచనామ సంవత్సర మార్గశీర్ష బహుళ ౬ (౧౨-౧౨-౧౮౫౩) బుధవారము నాడు జన్మించి తనజీవితమునంతయు నాంధ్ర గీర్వాణసాహిత్యములనుద్ధరించుటయందు గడపి ఈశుక్ల సంవత్సర జ్యేష్ఠశుద్ధ ౧౧ (౧౮-౬-౨౯) మంగళవారమునా డుదయమున నస్తమించి నాడు. ఈకళాప్రపూర్ణుని యస్తమయ మాంధ్ర లోకమును శోకాంధకారమున ముంచినది. విధి నియమ మవిలంఘ్యమే కాని, యిందువలన నాంధ్రలోకమునకు తీరనికొరత వాటిల్లినది. ఆంధ్రులలో నేడును మంచి పండితు లున్నారు. కాని కళాప్రపూర్ణునిస్థానము నలంకరింపదగిన సర్వాంకషసాహితీమండితులు మాత్రము కాన రాలేదనుట సాహసముకాజాలదు. ఈమహో పాధ్యాయుడు రచియించి యాంధ్రలోకమునకు ప్రసాదించిన యమూల్యసంస్కృతాంధ్రగ్రంథ ములే ఇందుకు గొప్పనిదర్శనములు. కృష్ణా పత్రిక

"కవి, వ్యాఖ్యాత, ఉపాధ్యాయుడు:—ఈమూ డురూపాలు వేంకట్రాయశాస్త్రి గారిలో సమానంగా ప్రకాశించినవి. ఈత్రైక్యము అపూర్వము కావచ్చును గాని అందు వైపరీత్యమేమీ లేదు. కవి తనరసాను భవాన్ని స్వకీయ రచనలతో వెల్లడిపరుస్తాడు. వ్యాఖ్యా త పరుల రచనలలోని రసమర్మములను వెల్లడిపరుస్తాడు. ఉపాధ్యాయుడు విద్యార్థులలో రసగ్రహణశక్తి నుద్దీ పన చేస్తాడు. ఈమూడింటిలో ఉపాధులు వేరుకాని, అంతర్యము మాత్రము ఒక్కటే. తనలో భావనిమగ్నత యుంటే, స్వతంత్రంగా రూపకల్పన చేయగలఁడు. ఇతరుల భావసరణులను గనుపెట్టగలడు. శిష్యులలో భావాన్ని ఉద్దీపన చేయగలఁడు. వేంకట్రాయశాస్త్రి యీమూటిని సాధించి ధన్యుడైనాడు."

అనినది. ఇది కళాప్రపూర్ణుని యథార్థ స్వరూపము. పెక్కేల! సంస్కృతాం ధ్రాంగ్ల వాఙ్మయములయందు పరినిష్ఠితమైన వీరిపాండిత్యము సర్వథా యాంధ్రులయభ్యుద యమునకే యైనది. ఇట్టి సారస్వతారాధకుని సంపూర్ణ జీవితచారిత్ర ముత్పన్నము కావలసి యున్నది. కళాప్రపూర్ణుని జీవితవిశేషముల యొక్క పరిజ్ఞానముగల సమర్థు లిందుకుపూను కొనవలెను.

ఈసాహిత్యచక్రవర్తిజీవితము తుదినాళ్లు పెక్కుకష్టములకులోనయినవి. ఏకైకపుత్రుడు నలుగురు చిన్నిసిసుగులనువిడిచి మృతుడయి నాడు; కన్నులు కానరాకపోయినవి; ఆయతియు తప్పినది; విచారము పైకొనినది; ఆరోగ్యము చెడినది; తుదకు మృత్యువున కివియన్నియు సాధనములైనవి కళాప్రపూర్ణుని మింగివేయుటకు. సాధ్వీమణియగు వీరి ధర్మపత్ని వృద్ధురాలు. పతివియోగముచే శోకమూర్తియై దయనీయమగుస్థితియందున్నది.

మహోపాధ్యాయుడు స్వాతంత్ర్యప్రియుడు. ధనార్జనమునకై యెవరినేని నాశ్రయించినవాడుకాడు. కాన కుటుంబమునకిపుడు జీవనోపాయము మృగ్యమైనది. హీనస్థితియందున్నమహోపాధ్యాయునికుటుంబమునుపోషించుభారము ఆయనసారస్వతసంపదవలనమహోపకారమును బడిసిన ఆంధ్రలోకముపై గలదు. కేవలము నాత్మశాంతి ప్రార్థనములు సలుపుటచేతను, సానుభూతిసందేశముల నాకుటుంబమున కందజేయుటచేతను లాభములేదు. ఈ విషయమున 'నీమండలమువారేమిచేయుదురో ఆమండలమువారేమిచేయుదురో' అని వంతులు వేసికొనుటయు నుచితముగాదు. ఏమండలము వారుగాని తమ సర్వశక్తులను ఈమహోపాధ్యాయుని కుటుంబపోషణమునకయి వినియోగించుటుచితము.

"మేము పదివేలరూప్యముల ప్రోగుచేసి అడుమానమున నున్న శాస్త్రిలవారి గృహమును విడుదలచేసితిమి. ఆదస్తావేజు నావద్ద యున్నది. వేసవివేగము కొంత తగ్గినపిదప, ఇంక కొంతచేర్చి శ్రీశాస్త్రిలవారిని నెల్లూరికిరప్పించి మహాకవిపూజగా సమర్పింపదలచుకొని యున్నందుకు, ఇంతలోనే దైవము చిన్నచూపు చూచెను. ఇట్టి ప్రతిభావంతులు మఱియొకరు పుట్టుట ఎన్ని పురుషాంతరములకో కదా!"

అని తమ హృదయసంతాపమును వెలిపుచ్చిన నెల్లూరుమండలమువారును, రెడ్డికులజులును, మహోపాధ్యాయుని ప్రియశిష్యులును నగు శ్రీయుతులు గునుపాటి యేనాదిరెడ్డిగారు తాము సమర్పింపదలచిన కానుకను మహోపాధ్యాయుని కుటుంబమునకు సమర్పించి కృతార్థులగుదురని గట్టిగా విశ్వసింపదగును. మఱియు శాస్త్రిలుగారు రచియించిన యముద్రితగ్రంథముల నన్నిటిని సేకరించి ముద్రించుటకు శాస్త్రిలుగారికి గల ఋణములను దీరిచి వారి సర్వవ్యవహారములను విచారించుకొనుచుండు రెడ్డిసంసంఘము నిశ్చయించినదనియు, ఆసంఘమునకు శ్రీయేనాదిరెడ్డిగారే కార్యదర్శులనియు, శాస్త్రిలుగారి ముద్రితాముద్రిత గ్రంథములనుగలవారి శిష్యులు, మిత్రులుమున్నగువారు వానిని రెడ్డిగారి కందజేయవలయుననియు, శాస్త్రిగారి ప్రియశిష్యులలో నొకరగు శ్రీమాన్ నేలటూరి రామదాసుగారు (యం. ఏ.) ప్రకటించినారు. రెడ్డిసంఘముయొక్క యీనిశ్చయమెంతయు శ్లాఘింపదగినది.

ఇంతియకాక శాస్త్రిలుగారి జ్ఞాపకార్థము శాశ్వతచిహ్నము నొకదాని నాంధ్రదేశమున నెలకొల్పుటావశక్యము. ఈవిషయమున

గూర్చి కృష్ణాపత్రిక

"శాస్త్రిగారు తమధర్మమ్ని తాము నిర్వహించారు. కృతులు రచించి శాశ్వత కీర్తి నార్జించుకొని నారు. సోదర దేశీయులు వీరియెడల ఋణముదీర్చుకొన వలసిన బాధ్యత మాత్రం మిగిలియున్నది. ఎట్లా తీర్చుకొనేది? శ్మశాన వైరాగ్యంలో రెండు అశ్రుబిందువులు రాల్చుటతో తీరుతుందా? లేక వీరికేమైనా శాశ్వతంగా నిలచే జ్ఞాపకచిహ్నం నిలుపడానికి కోరిక కలుగుతున్నదా? అట్టికోరికే కలిగితే, దానికొకరూపం రాక పోదు. దేశంలో ఇప్పుడు పూర్వముకంటె సంస్కృత సాహిత్యం మీద ఎక్కువ అభిరుచి కలుగుచున్నది. చాలచోట్ల సంస్కృత విద్యాలయాలు వెలుస్తున్నాయి. యూనివర్సిటీలవారు పండితపరీక్షలను స్థాపించి సంస్కృతవిద్యావ్యాప్తికి దోడ్పడ నారంభించినారు. ఆంధ్ర యూనివర్సిటీకి నేటికి స్థావరము చిక్కి విద్యాపీఠములను స్థాపింప బోవుచున్నది. ఇట్టితరుణములో దేశమునందలి సంస్కృత విద్యాలయాల కన్నిటికి మకుటాయమానంగా వేంకట్రాయశాస్త్రిగారి పేరున సంస్కృత విద్యాపీఠ మొకదానిని ఆంధ్రయూనివర్సిటీ ప్రతిష్ఠిస్తే ఎంతగౌరవంగా ఉంటుందో, ఆంధ్రమహాజను లాలోచించెదరు గాక!"

అనిసూచించినది. అదియెంతయునొప్పియున్నది. ఆ సూచన నాంధ్రవిశ్వవిద్యాలయ మామోదించి కళాప్రపూర్ణునికీర్తి చిరప్రతిష్ఠమగు నట్లొనర్చినచో నాత్మగౌరవమును పెంపొందించుకొనినదగును. ఇందుల కాంధ్ర మహాజనులును పనిపూని తగినసాహాయ్యమును జేయుదురుగాక!

---

## కీ. శే. మద్దిపట్ల వేంకటరమణయ్యకవి

అంధ్ర శేషగిరిరావుగారు, బి. ఏ.

భారతి పత్రికామతల్లి మూలమున లోకమునకు ఎఱుకపడిన కవికుమారులలో మిత్రుఁడు మద్దిపట్ల వేంకటరమణయ్య యొకఁడు. అయితే ఇప్పుడా తఁడు లోకమును వీడినాఁడు. దివంగతుఁడైన ఆసారస్వతార్చకుని గూర్చి ఒకటిరెండు వాక్యములు ఆతనిరచనములకు దివ్యప్రచారమిచ్చిన 'భారతి' యందే వ్రాయుట సమంజసమని అట్లు చేయుచున్నాను.

వేంకటరమణయ్యకవి ఆంధ్రకవితకు ఆదిసీమయగు గోదావరిమండలమున వెంగళితుఱ్ఱుఅను గ్రామమునందు ౧౮౬౬-వ సంవత్సరమున జన్మించెను. తాలూకా గ్రామమగు నరసాపురమున హైలరు హైస్కూలులో నాతఁడు ౧౮౮౩-వ సంవత్సరమున స్కూలుఫైనలు పరీక్షయందుఁ గృతార్థుఁడయ్యెను. అప్పటికే ఆతనికిఁ దోడి వారికంటె అధికమైన స్వభాషాజ్ఞానమును, కవితారచనమునందు నొక్కింతవ్యాసంగమును ఉండెను.

రాజమహేంద్రవరములోని గవర్నమెంటు ఆర్ట్సు కాలేజిలో ౧౮౮౩-వ సంవత్సరమున శ్రీయుత వడ్డాది సుబ్బారాయుఁడుగారు ఆంధ్రపండితులుగా నియమితులైరి. ఆసంవత్సరముననే నరసాపురము వీడి వేంకటరమణయ్యకవి రాజమండ్రి కళాశాలలో ఇంటరు మీడియటు క్లాసులోఁ జేరెను. కంచుమ్రోఁతను గ్రించుపఱచు శ్రుతి మధురమగు కంఠధ్వని—అర్థానుసంధానముగనుండు పద్యపఠనక్రమము—వడ్డాది సుబ్బారాయుఁడుగారు పాఠము చెప్పుచుండగ ప్రిన్సిపాలు కూల్డ్రివంటి తెలుఁగు తెలియని విజాతీయుఁడు గూడ సమ్మోహితుఁడై కార్యములను మఱచి వరండాలో నిలిచి వినుచుండువాఁడు. అట్టిచో 'తెలుఁగుతెలివి' దానియందు రుచిగలిగియున్న వేంకటరమణయ్య 'వసురాయ' కవిగారి పాదాంకములచెంతఁ గూర్చుండి ఆంధ్రసారస్వతోద్యాన వనములో వికసించిన కావ్యపుష్పసౌరభము

నాస్వాదించిన మధుపముగుటలో వింత యేమియును లేదు. అతని హృదయక్షేత్రమును సమ్మృష్టముచేసి అందిమిడియున్న కవితాబీజములను తనబోధామృతవర్షమున మొలకెత్తునట్లు చేసినకీర్తి 'వసురాయ' కవిగారిది.

మొదటినుంచియు వేంకటరమణయ్య ఆరోగ్యవద్దేహుఁడు కాఁడు. సర్వదా ఏదో ఒకరోగముతో మూలుగుచుండు వాఁడు అగుటచే అతని కళాశాలావిద్య బాగుగా ప్రాఁకుపట్టినది కాదు. అతఁడు బియ్యే రెండవతరగతిలోనికి వచ్చుసరికి దేశమంతయు అసహాయోద్యమముతోఁ గల్లోలమగుచుండెను. కళాశాలల బహిష్కరణము కొనలు సాగినది. దేశాభిమాన పూరితుఁడగు వేంకటరమణయ్య దేశమాతపిలుపు నాలించి వెంటనే కళాశాలను వీడి హూణవిద్యకు స్వస్తిచెప్పెను. ముందు చేయవలసినదేమి? మహాత్ములవారి ఆదేశానుసారము కళాశాలలను విడిచివచ్చిన విద్యార్థులు ఉద్యమ ప్రచారకులుగనో, నిర్మాణకార్యక్రమ నిర్వాహకులుగనో దేశమున సంచారము చేయఁదొడఁగిరి. వేంకటరమణయ్య వాచాలతయందు ఉత్కృష్టుండు కాఁడు; అగుటచే నాతఁడు ఉపన్యాసకుఁడై ఉద్యమప్రచారము చేయలేకపోయెను. అతఁడు జనులను కూడఁగట్టుకొని వారిని ఏకకార్యప్రవృత్తులుగఁ జేయఁజాలిన ప్రజ్ఞాశాలియుఁ గాఁడు; అగుటచే నాతఁడు ప్రయోజకుఁడై నిర్మాణకార్యక్రమ నిర్వహణమును చేయఁలేకపోయెను. ఇంతకును అతఁడు ఆరోగ్యవద్దేహుఁడు కూడఁ గాఁడు. అగుటచేఁ నాతఁడు సత్రవుభోజనము, మఠమునిద్ర, చేయుచు దేశసంచారమొనర్చి యేరీతినైనను ఉద్యమమునకు సాయపడలేకపోయెను.

ఇఁక నా దేశాభిమాని చేయఁగల కార్యమేమి? కార్యదక్షుఁడు కాకపోయినను కవితాత్మకలవాఁడు. కావున నాతఁడు దేశవిషయమున నీశ్వరప్రార్థనము చేసినాఁడు. చూడుఁడు :—

చ. అలయక విన్నవించినను
నాంగలరాజులచే ననాదృతిఁ
బడయుటఁ జేసి భారత జ
నమ్ములు కాంచెదు కష్టజాలముం
దెలిపెద నీకు నీవయినఁ
దీర్చెదవేమొ యటంచుఁ జక్రవ
ర్తులకును జక్రవర్తి! దయ
తో వినవే కడముట్ట నీశ్వరా!

"భారతమాతృవిలాపము" (౧౯౨౨వ సం॥ ఉగాదిసంచిక)

దేశస్థితిని వెలువరించు నిట్టి ప్రబోధికలను గానము చేయుచు నాతఁ డెంతకాలము వెళ్లఁబుచ్చఁగలఁడు? కాలముయొక్క విలువ యెఱిఁగిన ఆయుచితజ్ఞుఁడు గోళ్లగిల్లికొనుచు నిర్వ్యాపారిగ నుండుటకుఁ గంటగిల్లెను. కావున హిందీభాషాభ్యసనమునకు దొరకొనెను. దేశమాతపిలుపు నాలించి ఆంగ్లపాఠశాలను వీడి బయటికి వచ్చి అప్పటికే హిందీభాషలో సుప్రవేశమును సంపాదించియున్న సునిశితబుద్ధి ఖండవల్లి రాజశేఖరశర్మ వీరికి ఒజ్జ. అయినను మాతృభాషాభిమాని యగు వేంకటరమణయ్య మనస్సునకు హిందీయందు లాంపట్యము కుదురలేదు. కావుట నది యచిరకాలముననే కొనాకువేసినది.

అందుమీఁద నాతఁడు ఆంధ్రభాషావ్యాసంగములో నిమగ్నుఁడైనాఁడు. సారస్వతోపాసకుఁడగు చాగంటి విశ్వపతిశాస్త్రి సబ్రహ్మచారి; వసురాయకవి సార్వభౌముఁడు దేశికుఁడు; ప్రౌఢప్రబంధరాజమగు పాండురంగమాహాత్మ్యము అధ్యయన గ్రంథము. అది అతనికి వెన్నంటి వచ్చినవిద్యయే. కాని పారతంత్ర్యకరమైన దేశము విషయమై ఆందోళితమగుచున్న అతని హృదయమునకు ఆవిద్య శాంతిని చేకూర్పలేకపోయినది.

హృదయమునందు ఉడుకాఱుచున్న నిర్వేదము నపనయింప అతఁడు ఆత్మదేశ చరిత్రావలోకనమున నిష్ఠుఁడైనాఁడు. ఉద్యమ ప్రచారమునకు వలయుశక్తి, నిర్మాణకార్యక్రమ నిర్వహణమునకు వలయుప్రజ్ఞ, హిందీభాష నభ్యసించుటకు వలయుదీక్ష, అతనికి ప్రసాదింపలేకపోయిన అతని దేశాభిమానవ్యగ్రహృదయము హిందూదేశచరిత్రగ్రంథావలోకనమునం దాతనికి తుష్టినొల్లని తృష్ణ కల్గించినది. చేతికిలభించినఁ జారిత్రకగ్రంథములనెల్ల నాతఁడు వ్యగ్రోత్సాహముతోఁ బఠింపుచుండెను.

ఆంధ్రదేశ గ్రంథాలయములందు రాజమహేంద్రవరములోని గౌతమీగ్రంథాలయము హీరమణి. దానికి

వేంకటరమణయ్య కార్యదర్శిగనో పాలకుఁడుగనో ఉండెడివాఁడు. పుస్తకప్రకటన వ్యవసాయియగు నాతనికి ఆకారణమున గ్రంథసంపాదనము సుకరమైనది. గ్రంథాలయముతో నాతనికిగల సంబంధము తద్గ్రంథాలయ నిర్వాహకులలో నొకరగు నాళము కృష్ణారావుగారితోఁ బరిచయమును పెంచినది. ఆంగ్ల సారస్వతమండలి పద్యకథానకములను పుంఖానుపుంఖములుగ అనువదించిన కృష్ణారావుగారు వేంకటరమణయ్యను అట్టిరచనములకుఁబురికొల్పిరి.

కవితాత్మగల వేంకటరమణయ్య ఈ ప్రోత్సాహము నందుకొని కొన్ని గీతములను వ్రాసినాఁడు. కాని దేశస్వాతంత్ర్యము కొఱకుఁ గళ్ళాళాలపీడిన అతనికి సౌరభమువెదజల్లు స్వాతంత్ర్యభావములకుఁ దావులేని అనువాదములగు నట్టిరచనములతోఁ దృప్తి కలుగలేదు. భారతస్వాతంత్ర్య యోధులగు శివాజీ, జస్వంతసింగు, పృథ్వీరాజు, ప్రతాపసింహుఁడు, మొదలగువారిని కీర్తింపవలెనని ఆ దేశాభిమానికిఁ దలంపు గలిగినది. ఫలముగా సింహగడము, బాజీప్రభువు, ఆరాధనము, శబ్దభేదనము, రుహికరణము, మొదలగు చారిత్రకములగు కథలు గసవత్పద్యరూపమున నునయము నొందినవి. నచ్చినదీక్షనెంపున రచియించినవి. కావుననే వేంకటరమణయ్య కవిత వీనియందు అమృతమధురమై, అభూతోపమాకలితమై, 'నోరూరగఁ జవులుపుట్ట' నొప్పుచున్నది.

ఉద్యమప్రచారము చేయలేదన్న చింత, నిర్మాణకార్యక్రమనిర్వహణము చేయలేదన్నచీకు భారతజాతీయవీరుల యశోవైభవమును బునశ్చరణము చేయఁగల్గితినిగదా యనుసంతోషమున నాతఁడు పూర్తిగ మఱచిపోయెను.

వేంకటరమణయ్య కవితాగుణములను వివరించుట కిక్కడ తావుచాలదు, కావున ఒక్కసంగతి మాత్రము చెప్పి విరమించెదను. వేంకటరమణయ్య గుణగ్రహణపారీణుఁడు. పాండురంగని ప్రబంధరాజమును ఈతఁడు కూలంకషముగఁ జదివినాఁడు; అయినను ఆతనిపదశిల్పమే కాని సమాసార్భటి నీతఁ డలవఱచుకొనలేదు. వసురాయకవికి ఈతఁడు నెయ్యంపు శిష్యుఁడు. అయినను వారి భావగాంభీర్యమే కాని అన్వయకాఠిన్యము నీతఁడు పట్టించుకొనలేదు. ఈవిషయములు వేంకటరమణయ్యకవి చారిత్రకములగు పద్యకథలను బఠించియుండిన భారతీపాఠకులకు అనుభవ పునరుక్తమే.

వేంకటరమణయ్యకవి గ్రంథాలయాభిమానము మెచ్చఁదగినది. మూడుమాసముల క్రితము తనకు వ్యాధియంకురించుపఱకు మహాభిమానముతో నతఁడు గౌతమీగ్రంథాలయ కార్యనిర్వహణము గావించుచుండెను. ఆతనికి అంకురించినవ్యాధి కాలక్రమమున పెంపొందుచు, యగా మాఱి ౨౧-౮-౨౭ ఆదివారమునాఁడు అపరాహ్ణము మూఁడుగంటలకు అతనిని భ్రమింపఁజేసి గర్భవతిగానున్న యతనిభార్యను, నాలుగేండ్ల చిన్నికుమారుని దుఃఖసముద్రమునఁ బడఁద్రోసెను. ఆంధ్రకవితా ప్రపంచమునకుఁ దీరని లోటు కల్గించెను.

సహజముగా నాతనికిఁ గల కవితాభిరుచిని ఉద్దీపనకారియగు వసురాయ కవిగారి అవబోధము పెంచెను. కవితాప్రియుఁడగు నాళము కృష్ణారావుగారి ప్రోత్సాహము దానిని పోషించెను; హైందవచారిత్రక గ్రంథనిక్షేపక భూమియగు గౌతమీగ్రంథాలయ సంబంధము దానిని నిలిపి తీగ సాగించెను; సచిత్రాంధ్ర మాసపత్రికారాజమగు 'భారతి' దానిని ఆంధ్రవిశ్వమున కందించి ఉచితోపయోగ్యవ్యాప్తి గల్గించెను.

మరణకాలమునాటికి వేంకటరమణయ్యకు మూఁడుపదులైనను నిండలేదు. ఆంధ్రసారస్వతసుందరి తపోవృక్షమున ఆరపండఁదగినకాయ అపరిపక్వస్థితియందే పగిలిపోయినది. అగుటనే వెక్కసముగు మన్యువేగమున పొటుంబోటుగా నుప్పతిల్లుచున్న బాష్పధారలు దిగమ్రింగుటకుఁ గూడ నైతిగాకున్నది. కావుననే కదా లోకజ్ఞుఁడగు కవి యిట్లు గానము చేయుచున్నాఁడు.

"మృదులసుమవల్లి పొదలియుఁ బొదలకుండఁ
దొగరుఁజిగురాకు తోచియుఁ దోఁపకుండఁ
దొడఁగునుమొగ్గ తొడిగియుఁ దొడుగకుండఁ
సురుచిరకుసుంబు విరిసియు విరియకుండఁ
బూఁపపిందియ పుట్టియుఁ బుట్టకుండ
మధురమధుమాసమునను గ్రీష్మంబుదోఁపఁ
దాఁకు వడగాలి చేత నాతపము చేతఁ
గాలవశమున వసివాఁడి రాలుచుండఁ
కన్నుగలవారు హృదయంబుఁ గన్నవారు
కష్టసుఖముల భేదంబుఁ గన్నవారు
కడుపుచల్లగ బిడ్డలఁ గన్నవారు
కరుణవెదజల్లు నొకచూపుఁ బరపఁజేసి
వేడినిట్టూరు పొకటైన విడువకుండ
బండతనమున నూరకయుండఁగలరె?"

—వేంకట పార్వతీశ్వర కవులు.






సాంగ్లీ రాణీసాహెబ-శ్రీమతి సరస్వతీబాయి గారు

"శ్రీమతి 'సరస్వతీపట్వర్ధ' నను నామమును గల సాంగ్లీ రాణీసాహెబగారు ౧౮౯౧ సం. సెప్టెంబరు ౪వ తేదినాడు జననమందెను. ఆమె అమరావతిలో ప్రవేశ పరీక్ష (Matriculation) వఱకును, బొంబాయిలో మధ్యమపరీక్ష (Intermediate)వఱకును చదువుకొనెను. ౧౯౧౧ సం. జూలై ౨౯వ తేదినాడు సాంగ్లీ మహారాజు గారిని వివాహమాడెను. అదిమొదలు రాణీసాహెబ యాసంస్థానము నందలి స్త్రీలయభివృద్ధికై పాటుపడ దొడగెను. సాంగ్లీ స్త్రీవిద్యాసంఘమున కధ్యక్షురాలుగ నుండి సాంగ్లీలో నున్న 'మహిళా విద్యాలయమును' చక్కగా సాగించెను. ఈమహిళావిద్యాలయమున బాలి కలకు మాత్రమేకాక యువతులకును వారిగృహముల యందు విద్యను పరిశ్రమలను నేర్పుటకు తగిన ఏర్పాటు లనురాణీసాహెబ కల్పించెను. ఈవిద్యాలయపర్యవేక్షణ మును స్వయముగ రాణీగారే కావించుచుందురు. స్త్రీలకు విద్య నేర్పుటకు స్త్రీలే సర్వధా తగుదురనుట కీమహిళా విద్యాలయము గొప్పనిదర్శనమని యెన్నికగన్నది.

సాంగ్లీలో నిటీవల రెండుమూడేండ్లు జరిగిన శిశు, ఆరోగ్యప్రదర్శనముల యందు శ్రీమతి రాణీసాహెబ గారు అత్యుత్సాహముతో పనిచేసి, సంస్థాన స్త్రీల హృదయముల యందు పిల్లలయు, పిల్లల తల్లు యు, నారోగ్యావశ్యకమును నాటుకొన జేసిరి. మఱియు నీమె సంస్థానమున నొక ప్రసవాలయమును మొన్న ఏప్రిలునెల ౬వ తేదినాడు నెలకొన్పినది. ఈప్రాంత ములయం దిట్టి ప్రసవాలయ మింకొకటి కాన్పింపదు. సంస్థానప్రజలకోరిక మేరకీప్రసవాలయము రాణీసాహెబ గారిపేర వెలసినది.

ఇంతేకాక శిశురక్షణాలయములను పెక్కిటిని, స్థాపించి పిల్లలకు మంచిపాలను, బట్టలను ఉచితముగా తానే యొసంగుచుండును. వీనికార్యముల నన్నిటిని తానే స్వయముగ చూచుకొనును. సంస్థానమున నిటీవల నీమె పెక్కుకళా పారిశ్రామిక ప్రదర్శనములను జరి పించెను. రాణీసాహెబ కేవలము తమసంస్థానమునందలి స్త్రీల యభివృద్ధినిమాత్రమే చూచుకొనుటతో. యూరక యుండలేదు. ౧౯౩౫ వ సంవత్సరమున, పూనాసేవా సదనసంఘమున కధ్యక్షురాలుగానుండిన శ్రీమతిరమా బాయిరానడెగారు కీర్తిశేషులు కాగా నామెస్థానమున రాణీసాహెబ కుదురుకొని అపారమైన స్త్రీసంఘసేవను గావించి ప్రభుత్వము యొక్కయు, స్వదేశవిదేశముల యందలి పెద్దలయొక్కయు మెప్పునుగాంచినది. మఱియు

నీమె స్త్రీవిద్యాలయములకు, స్త్రీసంఘాభివృద్ధి సంఘము లకు పెక్కింటికి ధనసాహాయ్యమును గావించెను."

ఏరీ మన ఆంధ్రరాష్ట్రమున నిట్టి రాణులు! సంస్థానములకు కొఱతయా, వాని సంపదకు కొఱతయా; లేదు. కాని విద్య, సంఘాభిమానము స్వార్థత్యాగము కొఱత వడి నవి. అవి లేకున్నపుడు కదా, ఈసాంగ్లీ రాణీ సాహెబగారివంటి రాణులు మన రాష్ట్రము నను గాన్పింప గలరు.

---



జనాబాయి రాక్డేసతిగారు

"జనాబాయిరాక్డేసతిగారు మహారాష్ట్రములో వెనుకబడిన జాతులకు సంబంధించిన సంస్కర్త్రి. ఇరువది యైదుసంవత్సరములనుంచి మంత్రసానిగానుండి తన సంపాదనలో ఎక్కువభాగము బీదపనివాండ్రకొరకు ఖర్చుపెట్టుచుండెను. ఇరవై సంవత్సరములనుంచి ఈమె మాండ్వీ కొలివాడలో ఒక ప్రాథమికపాఠశాలను నిర్వహించుచుండెను. ఈపాఠశాల ప్రథమమున ఈమె తండ్రిగారగు మాధవరావు రఘోజిరాక్డే గారిచే ౬౦ సంవత్సరముల క్రితము స్థాపింపబడినది. ఆయనఅనంతరము ఈమె పెద్దన్నగారును, సోదరీమణియును జరుపుచు వచ్చిరి. వీరితదనంతరము ఈపాఠశాలాకార్యనిర్వహణభారమంతయు ఈమె వహించెను. ౫ సంవత్సరముల క్రితము ఈమె స్నేహితుల సహాయమున కొంతధనమును ప్రోగుచేసి ఈ పాఠశాలను మాండ్వీలో నూతనభవనమునందుంచి ఉచితముగా జరుపు వీర్పాటుమీద ఆధనమును బొంబాయి మునిసిపాలిటీవారి కిచ్చివేసెను. ఈ పాఠశాల ఇప్పుడు మాధవరావురాక్డే గారి పేరున వెలసియున్నది. ఈపాఠశాల పంచాశద్వార్షికోత్సవము (Diamond Jubilee) గత వత్సరమునచే జరుపబడెను.

పాఠశాల యాజమాన్యమును వదలుకొనినప్పటి నుండియు ఈమె తనసోదరీమణియగు అహల్యాబాయి పేర ఒక ప్రసవాలయమును స్థాపించి దాని ఖర్చుల నన్నిటిని ఆమె స్వయముగ భరించుచుండెను. ఇంకను నీమె వాల్గు సంవత్సరములనుండి ఒక ఉచిత ప్రసవాలయమును స్థాపించి స్వయముగా జరుపుచున్నది.

ఈమె చేయుచున్న ప్రజోపయోగమైన కార్యములను గమనించి ప్రభుత్వమువారు, ఈమెకు రెండవ తరగతి కైజరీహిందీపతకము నిచ్చి గౌరవించిరి."

ఆంధ్రదేశముకూడ సంఘసేవాపరాయణలగు నిట్టిస్త్రీలను ప్రసవింపవలెను.

---



శ్రీమతి రాధాకృష్ణమ్మ గారు

నెల్లూరుజిల్లా బోర్డు విద్యా సంఘసభ్యురాలుగా నియమింపబడినది.




శ్రీమతి పద్మాబాయి
సంజీవరావు బెనిగలుగారు బి. ఎ.

కాశీలో స్త్రీశిక్షాశాల ప్రధానోపాధ్యాయిని. మంగుళూరు జన్మస్థానము. ఈవిద్యాసేవను మెచ్చి ప్రభుత్వమువారు కైజరి హింద్ పతకము బహుమతిగ నొసంగిరి.




శ్రీమతి కె. పార్వతి అమ్మగారు

కంగనూరు నివాసి. బి. ఏ. తరగతియందు (కెమిస్ట్రీ) మొదటితరగతియందు ఉత్తీర్ణురాలయ్యెను ఉన్నతవిద్యకై ఇంగ్లాండునకు బోవుచున్నది.



శ్రీమతి ఇంద్రాణి బాలసుబ్రహ్మణ్యంగారు

ఈమె బరంపురము మునిసిపల్ సంఘమునకు ఉపాధ్యక్షురాలుగా నియమింపబడినది.



శ్రీమతి శకుంతల పరంజపేకన్య గారు

ఇండియా కౌన్సిలు సభ్యులగు డా. ఆర్. పి. పరంజపేగారికుమారితెయగు నీమె ఈసంవత్సరము కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమునగణితశాస్త్రమునపట్టమును బొందినది.



శ్రీమాధవర్ణనతిగారు

తిరువాన్కూరు ప్రభుత్వపు సెక్రెటేరియట్ కార్యాలయమున నియమింపబడిన ప్రథమ యువతి.



శ్రీమతి డి. కమలరత్నంగారు

ఈమె అనంతపూరుజిల్లా విద్యాసంఘమునకు సభ్యురాలుగా నున్నది.



శ్రీ ఇ. పైరైరానతిగారు, యం. ఏ.

ఈమె చిత్తూరుజిల్లా విద్యాసంఘుసభ్యురాలుగా నియమింపబడినది.



శ్రీమతి వేదాంతం కమలాదేవిగారు(కాకినాడ)

కాకినాడలో కాంగ్రెసు మహాసభలో ఈమె స్త్రీసేవాదళమునకు ఆధిపత్యము వహించి యుండినది. ఇపు డీమె, శ్రీదువ్వూరి సుబ్బమ్మగారి స్థానమున కాంగ్రెసుసంఘమునకు సభ్యురాలుగా నెన్నుకొనబడినది.




## శ్రీ కృష్ణదేవరాయల ఛత్రధారి

ఆంధ్రభోజుడగు శ్రీ కృష్ణదేవరాయల వారికి గొడుగుపట్టువాని పేరు 'పోలుడు' అనియు, వాఁడొకఅగ్రహారము నిలిపెననియు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున లోకలురికార్డు వాల్యూము నెం. ౧-కమలాపురం వగైరా కైఫీయత్తువల్ల తెలియుచున్నది. ఈవిషయమును నిర్ధారించువాక్యములు దానినుండి ఎత్తి ఇచ్చట వ్రాయుచున్నాను.

"......విజయనగరం సింహాసనాధీశ్వరుండైన శ్రీ కృష్ణదేవరాయ మహారాయలు విజయనగరమందు వజ్రసింహాసనారూఢుండై పృథివి సామ్రాజ్యము చేయుచుండగా రాయలవారికి గొడుగుపట్టే పోలుడుఅనేవాడు దేశంలో కొన్ని అగ్రహారములు రాయలవారి ఆనతిని బ్రాహ్మణులకు యిచ్చినందున ఆతనికి గొడుగుభూమానాయడనే పేరుకలిగివుండెను. ఆభూమానాయడు యీ గ్రామానికి ఆగ్నేయం అరపరువుదూరమున యీగ్రామం పొలంలోనె తనపేరుతో భూమానాయనిపల్లె అని కట్టించిన కొన్ని దినములకు తెలికచర్ల గోపాలాచార్యులనే శ్రీవైష్ణవులకు సర్వమాన్యఅగ్రహారంగా యేకభోగంచేసి ఆ భూమానాయనిపల్లెకు ప్రతి నామమైన వేదాంతాచార్యపురం అని నామనిశ్చయంచేసి ఆభూమాయనిపల్లెకు బ ౨. చేను యిచ్చినారని స్థలీకులు చెప్పుతున్నారు. యిందుకు దాఖలా ఆ భూమానాయనిపల్లె పొలిమేర నాల్గుదిక్కుల రాళ్లపైన పక్షి ప్రతిమె గొడుగున్ను ఝూరవహస్తులలో ధరించి అందుకు దిగువ వ్రాసి వుండే వాటిలో పక్షకాసనం దిగువ వ్రాసినాను.

శ్రీమతేరామానుజాయనమః, తెలికచర్ల గోపాలాచార్యులకు భోగపుసర్వమాన్యం అగ్రహారమైన భూమానాయని పల్లెకు ప్రతినామమైన వేదాంతాచార్యపురానకు పొలయవామనముద్రస్తంభం అనివ్రాసివున్నది.

పైని వివరించిన 'భూమానాయని పల్లె' అగ్రహారము అన్యాక్రాంతమైన విషయము ఆ కమలాపురం వగైరా కయిఫియ్యతునందె వేఱొకచో నిట్లు తెలుపఁబడినది.

"తరువాత దేశం మ్లేచ్ఛాక్రాంతమై మీరు జుల్లఫకారఖాను (Mir Julfokkar Khan) పేరుమంది కోట దేశంకట్టుకుని యీ దేశము యేలుతూవుండగాను దేవాలయములకు నడిచే ౧౧ గ్రామకొంత సర్కారుదాఖలు చేసుకుని అల్పస్వల్పం నడిపిస్తూవచ్చిరి. పైవ్రాసిన భూమానాయని అగ్రహారమున్ను సరకారుదాఖలు చేసికొనిరి. గనుక అగ్రహారీకులు ఓదేశగతులైపోయినారు. A. D. ౧౬౬౭ కు పూర్వము."

ఈవిషయము లోకల్ రికార్డు వాల్యూము నెంబరు ౧౫ లో గూడ ప్రస్తావింపబడినది.

(ఆం. శే)

---

## డాక్టరు - జె. టి. సండర్లెండు గారు

"The Spark in the Cloud"-"మట్టిగడ్డలో నిప్పురవ్వ", "Travel and Life in Palestine"-"పాలస్తీనులో సంచారము జీవితము", "The Origin and Character of the Bible" - "బైబిలుయొక్క మూలము, స్వభావము", "Because Men are not

Stones"-"మనుష్యుల శిలలు కారుకొనుట", "Oh! to be Rich and young"-"ధనమును, యౌవనమును గలిగి యుండుట", "Wealth, Beauty and Youth for All"-"అందరికి సంపద, సౌందర్యము యౌవనము", "What is the Bible"-"బైబిలు అనగా నేమి?", "India, America and World Brotherhood"-"ఇండియా, అమెరికాలయు, ప్రపంచముయొక్కయు సౌందర్యము", "The Cause of Famines in India"-"భారతదేశమున క్షామకారణము", "Rising Japan"-"వృద్ధినొందుచున్న జపాను", "Religion and Evolu-



డాక్టరు జె. టి. సండర్లండుగారు

tion"-"మతము పరిణామము మొదలయిన గ్రంథములను వీరు రచియించియున్నారు. ఇటీవల వీరు" "India in Bondage: he Right to Freedom" "బానిసయైయున్న భారతదేశము, స్వాతంత్ర్యమును బడయుటకు దానికిగల హక్కు". అను గ్రంథమును రచియించి ప్రకటించిరి. ఈ పుస్తకమును రచియించిన కారణమున వీరిపై రాజద్రోహనిందను మోపిరి.

వీరితోపాటు ఈ గ్రంథప్రకటనాదులతో సంబంధము గలిగి యున్నందునకు శ్రీమాడరన్ రివ్యూపత్రికా సంపాదకులు శ్రీరామానంద చాటర్జీగారును, రజనీకాంతదాసుగారును అరెస్టు కావింపబడిరి.

డాక్టరు సండర్లండుగారు సుప్రసిద్ధ గ్రంథకర్త. ఇతని గ్రంథములు అమెరికా, భారతదేశములందు మిక్కిలి హెచ్చుగా చదువబడుచున్నవి. మతవిషయమందును, యితర విషయములందును యితడు చాలా బాగుగా వ్రాయునని యితనికి మంచిపేరు కలదు. గాన నితడు వ్రాసిన గ్రంథముపైని రాజద్రోహపు కేసువచ్చినందున భారతదేశమునం దధికముగ సంచలనము కలిగినది. ఇది కొంచెమించుమించుగా అంతర్జాతీయసమస్యయే యగును. కాన భారతదేశీయులనందరినిగూడ నిది యాకర్షింపగలదు. సండర్లండుగారు అమెరికా ప్రభుత్వపౌరుడు కావున బ్రిటిషుయిండియా దేశమునందలి చట్టముల నుల్లంఘించినందున కతనిపైని కేసుచేయబడదనియే తోచుచున్నది. ఈ గ్రంథమును గూర్చి యిప్పుడభియోగము జరుగనుండుటచే దీనిని గూర్చి వ్రాయుట న్యాయసమ్మతము సమంజసమునుగూడ కాదు. కాని యాతనినిగూర్చి ప్రజలు బాగుగా తెలుసుకొనగలుగుటకు నితడు వ్రాసిన యితర గ్రంథములను గూర్చి కొంతవివరింప వచ్చును.

ఇతనికిప్పుడు దాదాపుగా 90 వత్సరముల వయసు కలదు. కాని తాను ముసలివాడైతినని యితడు నమ్ముట లేదు. ఇతడు వ్రాసిన ముఖ్యమగు నొక గ్రంథమందు సర్వజనులకును శాశ్వతయౌవనము నేవిధించెను. "కాటో" అను నతడు 80 ఏండ్ల వయసులో గ్రీసుభాష నభ్యసించెను. "థియోఫ్రస్టసు" అను నతడు 90 ఏండ్ల వయసులో "కారెక్టరు అఫ్ మెను" (మనుష్యుల స్వభావములు) అను గ్రంథమును వ్రాయనారంభించెను. "గొయిథే" యను నతడు 80 ఏండ్ల వయసులో "ఫౌస్టు" అను గ్రంథమును పూర్తిచేసెను. "మైకేలుయాంజిలో" అను నతడు 88 వ ఏటనుగూడ నధికముగు దీక్షను కలిగియుండెను. "మార్టినో", "పామరస్టను", "విలియమ్సు" మున్నగువారు మరిపెక్కుమంది గూడ వార్ధక్యమునందు చాల

ఘనకార్యములను చేసిరి" అని సండర్లండుగా రొక గ్రంథము వ్రాసెను. "ఇండియా ఇన్ బాండేజీ" అను గ్రంథమును సండర్లండుగారుగూడ 80 వ యేటనే వ్రాసెను.

భగవంతునియం దితనికి నమ్మకముగలదు. నిరాక్ష పారత్వమునందు నమ్మకము లేదు.

ఇతడు యూనిటేరియను చర్చికి నాయకుడుగాన నితనికి భగవంతునిపట్ల అధికమగు విశ్వాసము కలదు. కావుననే కేవలము నాస్తికులగువారి మనములను గూడ మార్చగలిగినంత పటుత్వముతో నితడు కొన్ని గ్రంథములలో భగవంతునిగూర్చి వ్రాసెను.

ప్రార్థనయందు నమ్మకముగలవా రందరును సామాన్యముగా తమకు సకలమును భగవంతుడే సమకూర్చవలెనని కోరుచుందురుగాని సండర్లండుగారి అభిప్రాయ మీవిషయమున భిన్నముగా నేయున్నది. "మనుష్యులు శిలలు కారు కాబట్టి" అను గ్రంథమున సండర్లండుగా రీదిగువ వృత్తాంతమును వ్రాసెను.

"ఒకసారి మహమదు సపరివారముగా ఎడారిలో ప్రయాణముచేయుచుండెను. ఒకనాడు రాత్రి వారొకచో విశ్రమించిరి. "నేను నా ఒంటెను భగవంతుని అధీనముచేసెదను, గాని కట్టిపెట్టను" అని అనుచరులలో నొకడు మహమ్మదుతో చెప్పెను. "మొదట ఒంటెను కట్టిపెట్టుము, పిమ్మట దానిని భగవదధీనము చేయుము" అని మహమ్మదు ప్రత్యుత్తరమొసగెను."

"ఇది యే ప్రార్థనయొక్క సరియగుభావము. ఏలనగా భగవంతుండు మన నవుకరి కాడు. మనము సోమరులముగా నుండినను గూడ కార్యసిద్ధిని బడయగలుగుటకు ప్రార్థనమునకు శక్తి నొసంగదు. మనము చేసికొనగలిగిన పనినిగూడ చేసుకొనకుండ భగవంతుడే అన్నిపనులను చేయవలెననికోరుట భగవంతుని అవమానించుటయే యగునుగాని గౌరవించుట కాజాలదు." అని సండర్లండుగారు వ్రాసిరి.

భారతదేశీయులలో మతమునందు నమ్మకముగలవారందరును ఈ యుపదేశమును గ్రహింతురుగాక.

ఇతడు ఆస్తికుడగు యూనిటేరియను క్రైస్తవుడైయున్నను, బైబిలులో వ్రాయబడినదంతయు యథార్థమనువిషయము నితడు విశ్వసింపడు. "బైబిలుయొక్క మూలము స్వభావము" అను గ్రంథమునం దితడు బైబిలులోని పెక్కువిషయములను విమర్శించెను. సృష్టిచరిత్ర "జోనా" అను నతడు చాలకాలము మొసలిలో నివసించుట, "సెబూవదెంజరు" అను నతడు పెక్కుయేండ్లపాటు ఎద్దువలె గడ్డితినుట మున్నగు విషయముల నితడాక్షేపించెను.

బైబిలునందున్న చారిత్రక, శాస్త్రీయ (సయింటిఫిక్) దోషములను, అతిశయోక్తులను భగవంతుని శిశువుగాను, దుర్నీతిపరునిగాను చిత్రించుట అక్రమములగు వానిని చేర్చుట మున్నగువానిని గూడ నితడు నిరసించెను. అసత్యము, అన్యాయము, నీతిబాహ్యము, నీచము అని తోచినచో సండర్లండుగారు మిన్నకుండజాలరు.

ఇతని స్వభావమునందు భూతదయయును ప్రపంచమునం దంతటను న్యాయమును శాంతిని నెలకొల్పవలెనను సంకల్పములు ముఖ్యతమములు.

విశ్వసోదరాశయము సిద్ధించుటకు విరోధకములుగానున్న సంస్థ లెచటనుండినను వానినన్నిటిని గూడ నితడు నిరసించును. తన స్వదేశమునుసయితము ఇతడు విమర్శించును.

"కొన్ని యేండ్లక్రితము మేము ఒకజాతిగా తాత్కాలికముగా మా ప్రాచీనచరిత్రను" "న్యాయముగా పరిపాలించెడు ప్రభుత్వముల కన్నిటికిని పాలితులసమ్మతియె ఆధారము" అనువట్టియు ప్రజాధికార ప్రభుత్వమునకు మూలాధారమైనట్టియు ప్రధాన సూత్రమును గూడ మరచిపోయి, ఐరోపాఖండమునందలి జాతు లవలంబించుచున్న చెడుపద్ధతినే అనుసరించి ప్రాచ్యదేశములలో నొక అధినివేశనమును బడయగలిగిన విషయమును చాల లజ్జతో నిపుడు స్మరణకు తెచ్చుచున్నాను. ఫిలిపైను దీవులలోని ప్రజలు కాఠిన్యముతో గూడిన విదేశీయ పరిపాలనమునుండి తప్పించుకొనుటకు చాలదీక్షతో

పని చేయుచుండగా వారికి మేము తోడ్పడుటకు బదులుగా వారిదేశమును వశపరుచుకొనుట వారిని లొంగదీయుటకు క్రూరత్వముతో పోరుసలుపుటయును నపరాధమును గూడ చేసితిమి. మితవాదగా వారిని మా ఆధీనమునందే యుంచుకొంటిమి. వారు మాకంటె చిన్నజాతి వారగుటచే యిటులు చేయుటకు మాకు స్వేచ్ఛగలదని మేము నిస్సంశయముగ భావించుచుంటిమి." అని అమెరికాను గూర్చి యితడు వ్రాసెను.

భారతదేశమునందు నివసించుచున్న కోట్లకొలది ప్రజల పౌరుషమును అతిసామాన్యములును, అతిముఖ్యములునగు హక్కులను గూడ ముద్రింప బడుచుండు నంతకాలము దేశమునందు జాతీయమగు నైకమత్యమెటులు చేకూరగలదు. "ప్రజల కొరకు ప్రజలు పాలించుట" యను సిద్ధాంతము గల ప్రజాధికారయుత ప్రభుత్వము ఆ దేశమునం దెటుల నేర్పడగలదు. ఆ దేశమున వారి మధ్య నివసించు చున్నంత మాత్రముననే సకల దేశములలోని న్యాయపక్షపాతు లగువారి సానుభూతియును గౌరవమును తొలగిపోవుచున్నవి. భారతదేశము స్వాతంత్ర్యమును బడయవలసినచో లేక స్వాతంత్ర్యమున కర్హమైనచో ఈ దురదృష్టవంతుల (అస్పృశ్యుల) హక్కులను మరల వారికొసగవలెను. ఈ విషయమును భారతీయులే యిపుడు గ్రహింప గలుగుచున్నారు గావన దాని ననుసరించి వారు పనిచేయ నారంభించుచున్నారు" అని భారతదేశమును గూర్చి యితడు వ్రాసెను.

'చీనాదేశమువారు నల్లమందు వ్యాపారమును జేయు నట్లు వారిని నిర్బంధించుటకు గ్రేటుబ్రిటను దేశమువారు రెండుసారులు చీనాపై యుద్ధమునకు గడగుటయును, ఆరీతిగా వారిని నీచస్థితికి వినాశమునకు పాలుపరచి అందువలన తాము ధనమును బడయగోరుటయును నవీన చరిత్రయందలి మలీమస ఘట్టములలో నొకటియై యున్నది' అని గ్రేటుబ్రిటనునుగూర్చి యితడు వ్రాసెను.

డాక్టరు సండర్లండు కేవలము విమర్శకొరకై విమర్శించునట్టి విమర్శకుడు కాడు. నవీనమానవసంస్థల లోని అక్రమములను శుద్ధినొందించుటయే అతని సంకల్పము. ఆరీతిగా పనిచేసినచో విశ్వమానవ సోదరత్వమను మహాసిద్ధాంతము సఫలముకాగలదని అతడు విశ్వసించుచున్నాడు.

"ఇది కేవలము స్వప్నమాత్రము కాదు. ఇది భగవంతుడొసంగిన దృశ్యము. ఏది సిద్ధింపదగినదో, ఏదిసిద్ధించునో దానిని భగవంతుడు ఈరీతిగా మానవులకు చూపించుచున్నాడు. ఏల ననగా భగవంతుని వరములే మానవుల ఆశయములు. భగవంతుడు కలడనుట యెంతస్థిరమో అసత్యముకంటె సత్యము ఘనమనుట యెంతస్థిరమో, అన్యాయముకంటె న్యాయము బలయుతమనుట యెంతస్థిరమో, ద్వేషముకంటె ప్రేమ సమర్థమనుట యెంతస్థిరమో విశ్వమానవ సోదరత్వ మేర్పడుటగూడ నంతస్థిరమే యగును." అని సండర్లండుగారు వ్రాసిరి.

"రమ్ము అటులైన మార్గమును శుభ్రపరుచుము." "నిరాధారములగు నమ్మకములకును రాజలక్షణముగల అధికారమిపుడు తొలగిపోయినది."

"ధీరుడగు మానవునిపైననే మేము మాశ పెట్టుకొని యున్నాము."

"నక్షత్ర ప్రచోదితుడై అతడీ ప్రపంచమును మరల నిర్మింపవలెను."

"దీనికొరకు గతకాలము చెల్లిపోయినది."

"మానవ సోదరత్వమునకు దారినొసగుడు. మానవులకు దారినొసగుడు." (మాడరను రివ్యూ)

# బ్రిటీషు కార్మిక ప్రభుత్వవర్గము



జె. హెచ్. తామస్‌గారు
లార్డు ప్రీవీసీలు, నిరుద్యోగసమస్యా పరిష్కారమంత్రి



రాంసే మక్డనాల్డుగారు
(ప్రధానమంత్రి)



కెప్టెను వెడ్జివుడు బెన్‌గారు
ఇండియా మంత్రి



మార్గరెటు బాండుఫీల్డు కన్య
కార్మికశాఖమంత్రి (కాబినెటునందు ప్రథమ స్త్రీసభ్యురాలు)



జార్జి లాంసుబరీగారు
పర్యాలోకమీమాంసరు



సర్ సి. పి. ట్రెవిలినుగారు



జె. ఆర్. క్లైన్సుగారు



ఆర్థరు హెండర్సనుగారు



థామ్సను ప్రభువుగారు
విమానశాఖా మంత్రి



ఆస్వాల్డు మాస్లేగారు
లాంకాస్టరు మంత్రి



డబ్ల్యు. ఆడమ్సనుగారు
స్కాట్లాండు మంత్రి



పార్మూరు ప్రభువు
కౌన్సిలు అధ్యక్షుడు



టామ్‌షాగారు
యుద్ధశాఖా మంత్రి



సిడ్నీ వెబ్ గారు
అధినివేశరాజ్యముల మంత్రి



నియోలు బక్స్టనుగారు
వ్యవసాయశాఖా మంత్రి



ఫిలిపు స్నోడనుగారు
కోశాధికారి



## మతదర్పణము

డెమ్మీసైజు, ౩౫ పుటలు. వెల ౧-౮-౦. బ్రహ్మశ్రీ పెమ్మరాజు సీతారామయ్య దీక్షితులవారిచేత రచింపఁబడినది.

ఇందు మతముయొక్క యౌక్త్యాయౌక్త్యము, తద్ద్వారా మోక్షప్రాప్తి మొదలగునవి వ్రాయఁబడినవి మఱియు శైవ పాశుపతాది మత వివరణమును, ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతాభిప్రాయములును సుబోధకముగ వ్రాయఁబడినవి. "బ్రహ్మ సత్యం, జగన్మిథ్యా" యనుదానిలో బ్రహ్మయొక్క సత్తునుగూర్చి వివరముగా, సహేతుకముగాఁ జర్చింపఁబడినది. వేదాంతవిచారణ చేయువారి కిది యెంతయు నుపయోగమైనది.

వలయువారు మానేజరు, స్వధర్మప్రకాశిని, కీలుపాకు, మదరాసు అని వ్రాయవలయును.

సూరిగుచ్చి కృష్ణమూర్తి.

## బిల్వ

కర్త: డాక్టరు కే. యన్. కేసరిగారు. క్రౌను ౮౬ పుటలు. వెల రు. ౦-౯-౦. విలాసము: గృహలక్ష్మి కార్యాలయము, పోస్టుబాక్సు నెం. ౭౫౨; ఎగ్మూరు, మదరాసు.

ఈ గ్రంథము 'గృహలక్ష్మి గ్రంథమాల'లో రెండవదిగా వెలువడినది. 'బిల్వ' (మారేడుచెట్టు) యొక్క ప్రభావమును తెలుపు నొక పౌరాణికగాథ యిందు కలదు. మఱియు దాని గుణములు, ఔషధములయందు వివిధోపయోగములు, ఆ యౌషధములవలన తీరు రోగములు మొదలయిన విషయములను ప్రాచీనవైద్యగ్రంథములనుండి యెత్తి గ్రంథకర్తయిందు వివరించినారు. కాని ఔషధములను చేయుటకు, వానిని ప్రయోగించుటకు అనుభవ మెక్కువ కావలయు ననువిషయమునుమాత్రము నేత గ్రంథపాఠకులు మరవ జనదు.

ఈ ౮౬ పుటల చిన్ని పుస్తకమున 'శాస్త్రవిషయసంగ్రహా' మను శీర్షిక క్రింద బిల్వమాహాత్మ్యాదులను తెలుపు లేఖన ముద్రణ ప్రమాదాదిదోషజుష్టములయిన శ్లోకములు—సంస్కృత పురాణాదులనుండి యుద్ధృతములైనవి—ఎనిమిదిపుటలు నిండియున్నవి. 'విశేష విద్యాగంధము లేని స్త్రీలకు, బాలబాలికలకు...బోధించుటకు అనువైన గ్రంథములను' వెలయింపనెంచిన యీ గ్రంథమాల యిట్లు తెలుఁగుతాత్పర్యము లేని సంస్కృతమూలమును మాత్రము ప్రకటించుటచే కృతకృత్యత గాంచినట్లు తలపరాకున్నయది.

## కల్యాణి

గ్రంథకర్తలు: శ్రీ కే. యామునాచార్యులుగారు [శ్రీవైష్ణవాగ్రహారము, పోస్టు గద్వాల (సంస్థానము)]; వి. నరసింహాచార్యులు గారు, [రాజానగరము, పోస్టు వనపర్తి (సంస్థానము)]. క్రౌను ౫౦ పుటలు, వెల ౦-౬-౦.

ఇది మూడు ప్రకరణముల పద్యకావ్యము. 'ఆశుకృతము' అట. ఇతివృత్తము పౌరాణికము. బృహద్రథపుత్రుడగు కువలాశ్వుడు 'విశాల' దేశాధీశుడగు వీరసేనుని బట్టి చెరనుంచిన 'దుంధు'వను రాక్షసుని జంపి యావీరసేనుని విడిపించి చిన్నవాటనుండి తాను ప్రేమించి వలచియున్న యాతనికూతును కల్యాణి యనునామెను పెండ్లాడు కథ. ఇతివృత్తమువలెనే వర్ణనవిధానమును పురాతనమార్గముననే యున్నను స్వభావమున కంతగా

దూరముగాకున్నది. కవిత సంస్కృతపదబహుళమయ్యు ధారాశుద్ధిగలిగి సరసముగ నున్నది. కథలో యోగిని ఉదంకునితో తొలుత వీరసేనకువలాశ్వుల వృత్తాంత మంతయు చెప్పి మరల క్రొత్తగా చెప్పినట్లు 'సాకేతాభిధాన పత్తనం బెసంగు' అందు 'కువలాశ్వుడనురాజు గలడు. వారికిఁ జుట్టంబు' అని చెప్పవలసిన యావశ్యకము కానరాదు. అచ్చుతప్పులు హెచ్చుగనుండుట ఈ రసవత్కావ్యమున కొకమచ్చ అయినది. మచ్చునకు:—

ఉ. మనముననే గోర్కు లుప్పతిల
మాటికి మానిని తన్ముఖంబుఁ గ
న్గొను నతఁడట్లె తన్నపినఁ
గొంగు సవర్చుచు మోమువాంచి మె
ల్లన నునుసిగ్గు మాల్కొన ఝు
ళంఝుళితోజ్జ్వలహాంసకంబుగా
జనఁ గడఁగన్ విలాసముల
సంగ నెపం బిడి నిల్చుఁ గ్రమ్మరన్.

సీ. ఉదయాదలాటవి మదితమా శోణభా
స్వత్కింశుకద్రుమ స్తబక మనఁగ
అభినవకృతకుంకుమాలేప సముదంచి
తం బగు నైంద్రీకుచంబు వాఁగ
సమయాహార్యశు భిన్నమయి రక్తార్థ్యమా
ఘోరతమఃకుంభికుంభ మనఁగ
ఖలజన సంహృతిఁ గావింప నిల డిను
నారాయణు సుదర్శనంబనంగ
కనులకిసీవిటుఁ దుదయించి క్రమముగాను
గగనభిత్తికిఁ బ్రాకుచుకాలమందుఁ
బరిచరాగ్రణి శైందత్రో బలసి కొలువ
నహుర పేరోలగంబుండె నసమరీతి.

చ. కనుగొన లెస్సఁబాటిన వి
కాసికలై దను శత్రుసైన్య మా
నసము ప్రసన్నతం గదుర
నవ్యసుధాంబుధి నోలలాడు స
జ్జనతతి యందుచే నతఁడు
శాత్రవభేదవిధిన్ భుజంగభూ
షణుఁడు దయన్ భుజంగపతి
కాయి యటంచు పఠింతు రెల్లరున్.

తే. గీ. పిండి యారంగబోసినవిధముదోఁప
పాలగచ్చు నొనర్చినభంగిఁ దనర
నమృతవర్షంబుకురిసిన యందమొంద
మెల్ల మెల్లన వెన్నెల లిమ్మనఁ బొడిగె.

## ఆహ్నికకాండః

గ్రంథకర్త: బ్ర. శ్రీ. ముదిగొండ నాగలింగ శాస్త్రిగారు. డెమ్మీసైజు, ౧౫౧ పుటలు, వెల ౧-౮-౦.

ఇది కేవలము శైవమతాభిమానులభినందింపఁదగిన పుస్తకము. ఇందు శివుఁడే మోక్షప్రదాతయనియు, వాఁడే దేవదేవుఁడనియు, శివకేశవులకు భేదమేకాని యభేదము లేదనియు నిర్ధారింపఁబడినది. "శివతత్వసుధానిధా: తిష్ఠతిష్ఠ సదా స్త్రీణాం మోహకో ప్యధమాధమ......వీతస్పృలింగార్చనం పరమేశ్వరానమ స్మరాన్ దారుకావనస్థాన్ ఋషీ మద్దిశ్య విహితం" అను మొదలగు సూక్తులచే శివలింగమాహాత్మ్యము వివరింపఁబడినది. శివారాధనము సర్వులకు నిత్యము గాన "స్త్రీణా మనుపనీతానాం శూద్రాణాంచ జనేశ్వర, స్పర్శనే నాధికారోఽస్తి విష్ణో ర్వా శంకరస్యచ, ఇతి స్త్రీశూద్రాణాం లింగస్పర్శనేనాధికార ఇతి యదుక్త తత్స్వానధికృత లింగవిషయం" అని స్త్రీశూద్రులకును, అనుపనీతద్విజులకు లకు నైతము లింగార్చనయం దధికారముగలదని వివరింపఁబడినది.

గ్రంథమునందు ముద్రణస్ఖాలిత్యములున్నవి. విశేషించి ముద్రణమధ్యేత్రులకంతగా సులభపఠనముగా లేదు. రచయితలు సంస్కృతమునందు నిరుపమాన సాహితీసంపన్నులగుటయే గాక యితఃపూర్వ మనేకము లుద్గ్రంథములు రచించి ప్రఖ్యాతిగన్నవారును, విశేషించి మహోపాధ్యాయ బిరుదము నందినవారును. తాదృశ విద్వద్రచిత గ్రంథముల నెల్లరు చదివి యానందింపవలెను. విశేషించి యభిమానులు గ్రంథకర్తగారికిని, ప్రకాశకులకును దగిన యుత్సాహము నొసంగి తోడ్పడుదురుగాక!

వలయువారు:—శైవప్రచారిణి, వరంగల్ అని వ్రాయవలెను.

సూ. కృ.

## శ్రీమద్వాల్మీకిరామాయణము

(బాలకాండము)

బ్ర. శ్రీ. ఘండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచేఁ బరిష్కరింపఁబడినది. క్రౌనుసైజు, ౪౮౦ పుటలు. వెల రు. ౧-౪-౦

ఇది వాల్మీకిచే సంస్కృతమున వ్రాయఁబడిన శ్లోకములకు 'సుబోధినీ'యను పేరుగల వ్యాఖ్యానము. టీకా తాత్పర్యములును వ్రాయఁబడినవి. వాల్మీకిరామాయణ మభ్యసించుబాలుర కియ్యది యెంతయు నుపయోగకరము. కొన్నియెడల విశేషార్థములును, తదితర వ్యాఖ్యాతల యభిప్రాయములును వివరింపఁబడినవి. వలసినచోట్ల మితముగ సంస్కృతవ్యాకరణప్రత్యయాదులును వ్రాయఁబడినవి. అచటచట నిఘంటుప్రమాణములు నియ్యఁబడుటచే మిగుల శ్రమంపడి యాదినుండి తుదివఱకును సమముగా వ్రాయఁబడినట్లు తోఁచెడిని. ముద్రణస్ఖాలిత్యములు సకృత్తుగ నున్నవి. ౩౫వ సర్గములో ౮వ శ్లోకమునందు "అయంశోణ శ్శుభజలోగాధః" యనుచోట వ్యాఖ్యానాంతరమున "అగాధః" యను పదవిభాగము చేసినట్లును, వీరి యభిప్రాయముమాత్రము "గాధః" యనియే యని వ్రాసినారు. కాని లోతులేనియెడ నేమార్గమునఁబోవుట యను ప్రశ్నకే యవకాశముండదు గాన "అగాధః" యనియే పదవిభాగము చేయవలయును. 'అగాధత్వేప్యుభినమండితత్వ' మెట్లను శంకయు నుండదు. శోణనదమత్యధిక వైశాల్యము గలది గాన మధ్యేభాగము నందగాధత్వమును, పార్శ్వములఁ బులినమండనత్వము ననికవి యభిప్రాయమైనట్లు తోఁచెడిని. వివిధవ్యాఖ్యలఁ బరిశీలించి యర్థసారస్యముల నేర్చి కూర్చిన యీ టీకా తాత్పర్య మెంతయు నాంధ్రబాలకుల కుపయోగకరమైనది.

సూ. కృ.

## శ్రీ ధర్మవ్యవస్థావజ్రదర్పణము(సంస్కృతము)

గ్రంథకర్త పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు. డెమ్మీసైజు, ౮౩ పుటలు.

ఇది రజస్వలావివాహములు, విధవావివాహములు నశాస్త్రీయములని శాస్త్రదృష్ట్యా విమర్శించి వ్రాయఁబడినది. అచ్చటచ్చట స్మృత్యర్థములను వివేచించి వి రింపఁబడినవి.

"హన్త, హన్త, సనాతన ధర్మదేవతానఃయాయన పరా ఇవ పురాలక్ష్యమాణాః...మహామహోపాధ్యాయ బిరుదాంకితాశ్చ లోక మాకులీకుర్వంతి" యని శాస్త్రి గారు రజస్వలావివాహములందుఁ దమకుండు విశేష నిరసనభావమును సూచించినారు. "ప్రాప్తేతుద్వాదశేవర్షే యః కన్యాం నప్రయచ్ఛతి। మాసిమాసి రజస్తస్యాః పిబంతి పితరోఽనిశం..."ఇత్యాది ప్రామాణికశ్లోకములచేఁ దమ యభిప్రాయమును సిద్ధాంతీకరించిరి. మహామహోపాధ్యాయేత్యాది బిరుదాంకిత పండితప్రకాండు లర్వాచీనులు ఈసూక్తుల కర్థముల భిన్నముగ నచించి ప్రకృతిపండిత ఖండితరజస్వలావివాహములు శాస్త్రీయములే యని వచించుచున్నారు. కేవల ధర్మశాస్త్రముమీఁదనే యాధారపడి తత్తత్సూక్తుల యర్థమునే వివదించు విషయము ధర్మశాస్త్రపండితుల బాధ్యతయై యున్నది.

వలయువారు:—'శ్రీ హామరాజచంద్రమౌళీశ్వరశర్మగారు, మారుతిముద్రానిలయముఁ, అమలాపురంతో' అని వ్రాయవలెను.

సూ. కృ.

## శ్రీ విద్యారత్నసూత్రములు

శ్రీమద్గౌడపాదాచార్య విరచితములు, శ్రీ శంకరారణ్య, శ్రీ వాసుదేవపరబ్రహ్మ యను పండితులచే రచింపఁబడిన వ్యాఖ్యాద్వయముతోఁ గూడినవి. శ్రీ క. మార్కండేయశర్మగారిచే ప్రకటింపఁబడినవి. డెమ్మీసైజు, పుటలు ౭౪, వెల ౦-౮-౦.

ఇందు శ్రీబీజమునకు నామములు, శ్రీ విద్యో పాసకుల కవశ్యకర్తవ్యములగు నియమములు మొదలగునవి

చెప్పఁబడినవి. పూర్వపక్షసిద్ధాంతములతోఁ గూడిన యీ సంస్కృతగ్రంథమ్ము కేవల సంస్కృతపండితులకే తత్రాపి తత్వశాస్త్రాభిమానులకే యవగాహముగ నున్నది. దీని కాంధ్రవివరణము విపులముగ వ్రాసియుండినచో సంస్కృత భాషాపరిచయము లేనివారలకు సైతము నీ విద్యావిషయము తెలియుట కనుకూలముగ నుండెడిది.

వలయువారు:— మేనేజరు, స్వధర్మప్రకాశిని, పూనమల్లి హైరోడ్, కీలుపాకు, మద్రాసు అని వ్రాయ వలయును.

సూ. కృ.

## సూతపురాణము

త్రిపురనేని రామస్వామి చౌదరిగారు రచించినది. డెమ్మీసైజు. పుటలు ౭౪.

పురాణములయందుండు విషయములు కల్పితములు, విపరీతములు నని యెంచిన గ్రంథకర్తగారు కేవల ప్రతీపకారార్థమై సత్యమును ప్రపంచమున విస్తరించుటకై కార్యవ్యగ్రులైన శ్రీమయమునికి సూతముని యొద్దకుఁ జనుటయుఁ దత్సూతిమహాముని యా స్వర్గము దేవతలు, మొదలగు విషయములను గ్రంథకర్తగారి యొక్క నిర్వ్యాజముగు దయతోఁ జెప్పుటయు, ననువిషయములు గల నీ సూతపురాణము విశ్వామిత్రసృష్టిని స్మృతికిఁ దెచ్చుచుఁ బఠనీయముగనే యున్నది. వీరు తెనుఁగు స్వభావయందే యిష్టము గలవారు. వీరలై వంతివఱకుఁ దఱచు తెలుఁగుపదములనే కవిత్వమునం దుపయోగించుచు వచ్చిరి. ధారాళమైన కవితాధార. విచ్ఛికముగను పదప్రయోగమునకు వెనుదీయనివారు (బాంగెము, తారాపథగాముఁడు, ఒచేలు బడరు అను మొదలగునవి.), విషయనిర్మాణమున విశేషప్రశంసార్హులే యైనను, "సూతుండు శౌనకాది మహామునీంద్రులకుం జెప్పె" నన్నది యసత్యమును, నప్రత్యక్షమును నని గ్రంథకర్తగారు తలంచినరీతి, సూతుండు రామస్వామి చౌదరిగారికిం జెప్పినదియుఁ నై దాని ననుగమనించుటం జేసి యీ పురాణము నందును సత్యత్వబుద్ధి లేక మఱియొకరు మఱియొక పురాణమును వ్రాయఁ బ్రారంభింపవచ్చును. ఇట్టి ప్రయోజనముమాలిన మతకలహములచే దేశమున కట్టి ప్రయోజనము గలదు అనువిషయమును ముందుచర్చించి తరువాత నీదృశపుస్తకరచనలకుం దొరకొన ధీశాలురగూర్చి యొనర్చు ప్రార్థన.

పక్షపాతైకదృష్టియే గలిగిన నిట్టివి వేనవేలు పురాణములు పుట్టుట కవకాశము విశేషమున్నది గాన సర్వవిధముల వెనుకటిపురాణములనే యనుకరించు నీసూతపురాణమంత ప్రయోజనకారి కావట్లు తోఁచెడిని.

వెల రూ. ౧-౦-౦. వలయువారు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు, శతావధాని, బారిస్టరు, మునిసిపల్ చైర్మన్, తెనాలి అని వ్రాయవలెను.

సూ. కృ.

## శ్రీరామకృష్ణ వచనామృతము

ప్రథమసంపుటము. రామకృష్ణమఠము వారిచేఁ బ్రకటింపఁబడినది. క్రౌనుసైజు. ౩౧౧ పుటలు.

వెల రు ౧-౮-౦.

ఇది శ్రీ గురువుగారి (శ్రీరామకృష్ణ పరమహంస ను గురువని పిలుచుటయే యీ గ్రంథమునం దలవాటు) ప్రియశిష్యులలో నొకఁడగు "ఎమ్" అను వానిచే వంగభాషలో రచింపఁబడినది. శ్రీగురువుగారు లోకమునకాదర్శపురుషులగుటఁ దద్వాక్యము లెంతయు నమూల్యములు గాన, ముముక్షువుల కెంతయుఁ బఠనీయము లగుటం జేసి, మద్రాసు రామకృష్ణమఠమువారు "ఎమ్" అనతిచే నాంధ్రమున సులభోపపదరూపమున బరివర్తించి యెంతయు వంద్యులయిరి.

లౌకికవ్యాపారములం దగిలి కేవల బాహ్యకృత్రిమవేషమే జీవితమునకుఁ బరమావధియని యెంచు ప్రకృతకాలమునందు దైవభక్తి సన్నగిల్లినదనుటలో సందియము లేదు. విశేషించి యొకానొకండు దేవాలయాదుల కరుగ వానిఁజూచి పరిహాస మొనర్చుటయుఁ గనుచున్నాము. ఇట్టి యీ పరిస్థితులలో నున్న యాంధ్రలోకమునకు, విశేషించి యువకులకిట్టి పుస్తకములు సత్యముగ జ్ఞానదాయకములని యొప్పుకొనవలసి యున్నది. రామాయణము చదివిన బుద్ధిమంతునకు "రామాదివత్ప్ర

వర్తితవ్యం, వరాహణాదివత్" అని తోఁచి సత్ప్రవర్తన గలిగియుండ యత్నించుచుందురు, నీపుస్తకము చదివిన వారలును శ్రీరామకృష్ణుని చర్యలును, అతని యమూల్యోపదేశములును, శిష్యులందలి నిరతిశయ ప్రేమయు, శిష్యులకును శ్రీగురువుగారియెడ భక్తియు, నరేంద్రుని, (వివేకానందుని) కేశవుని, ప్రవర్తనలును జూచి, తమకును నట్టి గురువును, ఆశ్రమమును నుండిన బాగుండునని యనుకొందురు. తాము వారివలె వసత్యాదులఁ జెప్పక వినయశీలత్వములతో మెలంగిన నైహికాముష్మికములు గలుగును గదా యని యనుకొందురు.

శ్రీరామకృష్ణుని వేదాంతమంత్రము "విశ్వాసము" అను పదమే. విశ్వసించినవారికే దేవుఁడుతన దివ్యదర్శన మొసంగును. విశ్వాసమునుగూర్చి యాతఁడు తన శిష్యుల కెన్నియో కథలనుదాహరణముగ నిచ్చెను. ప్రపంచము సర్వము భగవదధీనమనియుఁ బౌరుషమున శక్తిలేదనియు నాతని మతము. చండాలుఁడైనను శివస్మరణమొనర్చిన పవిత్రుఁ డగునను.

చండాలుఁడు పవిత్రుఁడు కానీ, పౌరుషమున శక్తి లేకపోనీ, ప్రతివ్యక్తియుఁ బరమేశ్వరునియందు విశ్వాసము గలిగి "దేవా, నీవే నాకు గతి, నా దోషము లన్నియు క్షమింపు"మని హృదయపూర్వకముగ ధ్యానించెనేని యాతఁడు తప్పక శుభముల నందఁగలఁడు, విముక్తినందఁగలఁడని శ్రీరామకృష్ణుని యుద్దేశమే కాక యీ తొమ్మనుభవము చేతను దెలిసికొనఁగలము.

శ్రీగురువుగారి వచనామృతము పేర మానవుల కెంతయు నీతిదాయకమును, భక్తిని గలిగించునదియు నైన నీపుస్తకమును నాంధ్రులెల్లరును జదివి భగవంతుని యందు విశ్వాసముంచి జీవితసాఫల్యము నందుదురు గాక.

ఆంధ్రలోక మీ మఠమువారికిఁ దగు ప్రోత్సాహ మొసంగుఁ గాక. శ్రీ మఠమువారును నీతిదాయకములగు నిట్టివి పెక్కులు ప్రకటించి లోకమున కుపకార మొనర్చి యితోధికముగ యశస్సునందుదురు గాక.

వలయువారు:—రామకృష్ణమఠము, మద్రాసు. అని వ్రాయవలెను.

సూ. కృ.

## వాల్మీకి

కాళ్ళకూరి గోపాలరాయ ప్రణీతము. ప్రకాశకులు: విశాల్యాడిపో వారు, ౪, ఆచారప్పన్ సందు, జార్జిటవున్, మదరాసు. క్రౌను సైజు ౧౦౪ పుటలు.

వెల రు ౧-౦-౦.

ఆదికవి వాల్మీకి జీవితకథ వస్తువుగ నవలంబించి రచించిన అందమగు రూపక మిది. ఇందు జటిలమగు వస్తుకల్పనము లేకున్నను అట్టి మహచ్చరిత్రమును పరిణమింపజేసిన మనస్తత్త్వము నిరూపింప యత్నించి యీ చిన్నివస్తువునకు జీవము పోయఁగల్గినాఁడు కవి.

చౌర్యము నుత్తరించి ప్రాచేతసుడు 'సమానసంపత్స్వరాజ్య' స్థాపనాసంకల్పమున నాటవికుల కూడగట్టుకొని పరిసర రాజ్యముల దనరోఁలుబడిలోనికి లాఁగ దీసికొను యత్నములు నడుపుచుండ, నారదప్రేరితులగు వసిష్ఠ విశ్వామిత్రు లాత్మస్వత్తపరిశీలన ముద్బోధించుటతో వివేకమురేకెత్తిన యాతని మానసిక జీవనము ఆతడు 'వాల్మీకి'యై, ఆదికవియై, నిర్వహణమున సరస్వతీ ప్రసాదము చూఱకొనుపర్యంతము చక్కని యితివృత్తమున సమంజసమగు చిత్రణము గాంచినది. గర్భసంధి యందలి ప్రాచేతసుని భావవిక్షోభము కడు తగియున్నది. ప్రాచేతసుడు మృతప్రాయుడై నారకయాతన లనుభవించి ఆయుపాధియందే పునరుజ్జీవితుడయిన దృశ్యము, వసిష్ఠ విశ్వామిత్రుల వ్యాఖ్యానములతో ప్రభావమినుమడించి, కవి నాటకకళానిరూఢికి నిదర్శనముగ నున్నది. అచేతన దశయందు మహర్షుల్యపదిష్టమైన రామమంత్రస్ఫురణ మొకవంక విరక్తిశిఖరమున కాకర్షించుచుండ, కొమరిత లేచిపోవుటచేతను, భర్త విరాగి యయిపోవుట చేతను పరిఖిన్నయై దీనదశయందు ప్రత్యక్షమగు తనప్రేయసి పరిత్యక్తకానుండుట వేఱొకవంక పీఁటబీకు కూర్చుచు ప్రాచేతసుని కడుబాధపెట్టును. ఇట్టిపట్టులు నటకుల సామర్థ్యమును పరీక్షించును.

మన స్తత్త్వప్రవాహమున మవలను సూక్ష్మమార్గ ముల నంతగ నడుపింపక తఱచు బాహ్యపరివర్తనములనే చూపినను, ప్రధాన పరిణామసూత్రములను కవి రేమఱ లేదు. ప్రతిపాత్రయు సార్థకతను, మంచి పరిణతిని పొందినది. తత్తరపడక స్వతంత్రకల్పనతో కవి సహజ సాధ్యగతుల నవలంబించి రూపకమును ప్రశంసాపాత్ర ముగ నిర్వహించినాడు.

శైలి కడుహృద్యము; శోభాన్వితము. ఇంపైన భావసంపదతో కవిత లలితముగ నున్నది.

పద్యరచన కుదాహరణము:—

ధరణిఁ వాఙ్మయ పీఠ మెక్కి బహుధా
ధర్మంబు శాసించి, త
త్పరణిఁ దూషణ భూషణంబులను శి
క్షారక్షలుద్దించుచుఁ,
పరపామోదముగాఁగ మానవమున
స్సామ్రాజ్య మశ్రాంతముఁ
పరిపాలించు కవీశువైభవము వి
శ్వశ్రేయముఁ గూర్చుతన్.

కుసుమోమంజుల మందహాస రచనల్
జొబ్బిల్ల నల్లారు జొం
పముచేమోడ్పులఁ గోకిలోత్తముల పమా
హ్వానించి, పుష్పాఁదేనె న
ర్ఘ్యమ్ముఁ బాద్యంబు నొసంగి, నమ్రమయయి పం
క్తిర్పించి సేవించి, ని
త్యము నిత్యశ్రీ ఋలక్ష్మి పొంగులకు బ్ర
హ్మానందముఁ గూర్చెడిన్.

ఆనందమయ శైశవావ్యాజసరహాస
శోచిర్విభూతి దూబూచియాడి,
క్రీడావతీసధూటి ప్రేకరూపులకుఁ దార్చు
క్రేఁజూపు మెఱుపులఁ గ్రేళ్లు దాఁటి,
పొదరిండ్ల విహరించు పుణ్యదంపతుల లీ
లాలల దమృతాబ్ధి నోలలాడి,
విరహాదైన్యోత్పన్న విభ్రమభ్రమణా త
రంగ రంగములఁ దుఱంగలించి,
ఖండనోద్దండకాండప్రకాండకాండ
చండకోదండటంక్రియఁ దాండవించి,
పరమపురుషార్థసిద్ధులఁ బ్రజ్వలించు
నల రసస్వరూపిణి వాణి నభినుతింతు.

ఇంకలి గ్రామ్యభాషా గేయముల శైలిలో తూను తక్కువ నున్నది. ఈరూపకమున గుణములు మెండు. ఇది ఆంధ్రవాఙ్మయమున మంచిస్థాన మలంకరింప గలిగి యున్నది.

కొం. జ.

## వైదికనిలయము

(ఆర్యుల ఉత్తరధ్రువ నివాసము.) 'భగవాన్ తిలకాచార్యకృతము.' అనువాదకులు: మానికొండ సత్యనారాయణశాస్త్రి గారు. విజ్ఞానచంద్రికా గ్రంథ మాల, ౩౮. విజ్ఞానచంద్రికామండలి, బెజవాడ. క్రౌను సైజు; ౫౪౮ పుటలు. వెల రు ౨-౮-౦.

## నెపోలియన్ బోనోపార్టి జీవితము

ప్రథమభాగము. గ్రంథకర్త: జయంతి వెంకటజగ న్నాథరావుగారు, బి. ఎ., యల్. టి., ఛత్రపురము (గంజాం). క్రౌనుసైజు ౯౨ పుటలు. వెల తెలియదు.

## శ్రీసోమశైలేశ్వరీయము

ఇది యొక పంచాశ్వాస ప్రబంధము. ఉప్పల వర సింహశర్మ విరచితము. క్రౌన్ 1/8 సైజు ౨౩౦ పుటలు గలది. వెల రు ౧-౮-౦. చెన్నపురి ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము.

# సాభిప్రాయ విశేషములు

ప్రపంచపరిస్థితులు వర్తమాన యుగమునం దన్యోన్యాశ్రయములై సామాన్యవిషయములను ప్రపంచమునం దంతటను ప్రతిధ్వనిల్లుచు భావసంచలనమును గలుగజేయుచున్నవి. దూరశ్రవణము, దూరదృష్టి, టెలిగ్రాము, విమానములు, పొగయోడలు, పొగబండ్లు, మోటారులు, వార్తాపత్రికలు దేశకాల ప్రాకావరణములను భేదించుచు విశ్వమునకు గల సన్నిహిత సంబంధమును అనంతముఖముల ననవరతము ప్రత్యక్షము చేయుచున్నవి. సుఖదుఃఖములు, జయాపజయములు, ఆపదలు విశ్వసమానత్వమును ప్రతిపాదించుచున్నవి. అస్సామువరదలు, వెల్లింగ్టను భూకంపము, ఆఫ్గను విప్లవము, మద్యపాన నిషేధము, జర్మనునష్టపరిహారములు, జార్జిచక్రవర్తి ఆరోగ్యము, సోవియటుపరివర్తనము, ముసోలినీ ప్రగల్భములు, బ్రిటీషు ఎన్నికలు, స్త్రీస్వాతంత్ర్యము, మేయోపుస్తకము, భారతీయ స్వాతంత్ర్యము ప్రపంచదృష్టి నాకర్షించుచున్నవి. ప్రపంచవ్యవహారములందు బలముగల శ్వేతరాజ్యముల వ్యవహారములు ప్రపంచలక్ష్యము నాకర్షించుచున్న విధమున బలములేని శ్వేతేతర వ్యవహారములు ప్రపంచలక్ష్యము నాకర్షించుటలేదు. శ్వేతప్రజలు దేవతలు; శ్వేతజనుల వాక్యములు వేదవాక్యములు; శ్వేతక్షేమము ప్రపంచక్షేమము. శ్వేతప్రయోజనములు విశ్వప్రయోజనములు; శ్వేతప్రజాధర్మము మానవధర్మము. శ్వేతప్రజాప్రయోజనములను సమర్థించుటకు, ఘోషించుటకు, రక్షించుటకును శ్వేతపత్రికలు మహాఘోషను జేయుచుండును; శ్వేతసైన్యములు, శ్వేతజాతుల ఆయుధములు మహాఘోషను సమర్థించుచుండును. లండను టైమ్సుపత్రిక, టైమ్సుఆఫ్ ఇండియాపత్రిక, మార్నింగుపోస్టు, న్యూయార్కు హెరాల్డు వ్రాసెడి వ్రాతలు వేదవాక్యములుగ నుండును. ఆత్మవిశ్వాసము లేని శ్వేతేతరజాతులవారు లండను టైమ్సుపత్రికాభిప్రాయములను శిరసావహించుచు నిరుత్సాహులై కృశించుచున్నారు. బ్రిటీషు పార్లమెంటు ఎన్నికలు భారతీయవ్యవహారములందు గలుగజేసిన సంచలనము భారతీయుల దుర్దశను విశదము చేయుచున్నది.

## బ్రిటీషు సామ్రాజ్యము

బ్రిటీషువ్యవహారము లితరవిషయముల వలెనే ప్రపంచదృష్టి నాకర్షించినవి. ప్రపంచవ్యాప్తమైన సామ్రాజ్యమును, ప్రపంచవ్యాప్తమైన వ్యవహారములును గల బ్రిటీషు వ్యవహారములు ప్రపంచలక్ష్యము నాకర్షించుటయందు విచిత్రము గనుపడదు. పదేండ్లకు పూర్వము ప్రపంచవ్యవహారములకు కేంద్రస్థానముగా నుండిన బ్రిటీషువ్యవహారములు ప్రపంచలక్ష్యము నాక్రమించుటయును, ప్రపంచ శాంతికిని

ప్రపంచక్షేమమునకును వినియోగపడుటయును ధర్మము. ప్రపంచక్షేమమునకు వినియోగపడని బలసంపదలు నిరర్థకములు. ప్రపంచ శాంతికి సాధనభూతములైన బలసంప దధికారములను బ్రిటీషురాజ్యము స్వప్రయోజనములకై వినియోగించుకొనుచు ధర్మబలమునుగోల్పోవుచు క్షీణించుట కుపక్రమించినది. స్వప్రయోజనపరాయణము లైన బలసంపదలు రాక్షససంపదలై ఆత్మనాశనమునకు గారణంబు లగుచున్నవి. రావణరాజ్యము, రోమకరాజ్యము విలయమును పొందిన విధము ప్రపంచేతిహాసములందు గుణపాఠమును నేర్పుటకు దగియున్నది. అయినను స్వప్రయోజనపరాయణత్వము సమస్తమును విస్మరింపజేయుచున్నది. బ్రిటీషుప్రభుత్వము మహాసంగ్రామసమయమునందు జేసిన ప్రతిజ్ఞలను మరచిపోయినది. మహాదుఃఖమునకు మూలమైన పరపీడనమును పూర్వమువలెనే చేయుటకు బూనుకొనుచున్నది. ఆత్మవంచనము ఆత్మవిజయ మని భ్రమపడుచున్నది. పరపీడనమును పరోపకారమని విశ్వసించి యానందించుచున్నది. తెలియనివానికి తెలుపుట సుకరము. తెలిసియును తెలియనటులనటించెడివానికి తెలుపుట దుష్కరము. శ్వేతేతరులను పీడించుచు శ్వేతేతరులను రక్షించుచున్నటులు చాటుట కేవలమాత్మవంచనము. భరతవర్షముమూలమున బలియుచు భరతవర్షమును రక్షించుచున్నటులు ప్రకటించుట యనుచితము. బ్రిటీషుప్రభుత్వ మవలంబించిన యధర్మము ప్రపంచమునందంతటను నసహ్యమును గలుగజేసినది. అమెరికా సంయుక్తరాష్ట్రములందు బ్రిటీషురాజ్యముపట్ల విశ్వాసము పోయినది. చీనాయందు బ్రిటీషురాజ్యమునకు పరాభవము గలిగినది. రుష్యారాజ్యము బ్రిటీషురాజ్యమునకు ప్రతిఘటనమును బూనినది. భరతవర్షము బ్రిటీషురాజ్యముపట్ల విముఖత్వమును బూనుచున్నది. స్వతంత్రప్రియులు సంపూర్ణస్వాతంత్ర్యము భారతజాతీయాశయమని ప్రకటించుచున్నారు. బ్రిటీషుప్రజలే వర్తమాన రాజ్యాంగ విధానమును నిరసించుచున్నారు. ప్రపంచమునం దంతటను బ్రిటీషు సామ్రాజ్యముపట్ల వైమనస్యము వృద్ధిని బొందుచున్నది. స్వార్థపరాయణులైన కన్సర్వేటివు పక్షమువారికి పరాజయము గలిగినను బ్రిటీషుప్రజాహృదయమునందు ధర్మవికాసము గలుగదు. బ్రిటీషుపార్లమెంటు ఎన్నికలు కన్సర్వేటివు పక్షమునకు గుణపాఠము నేర్పుటకు దగియున్నను బ్రిటీషుప్రజాహృదయము నందు మార్పును గలుగజేయలేదని లేబరుపక్ష ప్రవర్తనము విశదము చేయుచున్నది.

### బ్రిటీషు ఎన్నికలు

బ్రిటీషు ఎన్నికలందు లేబరుపక్షమునకు సంపూర్ణవిజయము గలిగినను స్వపక్ష నిర్వాహణమున కవసరమైన బలము గలుగలేదు. ఎన్నికలందు లేబరుపక్షాభ్యర్థులు 289, కన్సర్వేటివు పక్షాభ్యర్థులు 260, లిబరలు పక్షాభ్యర్థులు 58,ఇతరులు 8గురు విజయమును బడసిరి.

కన్సర్వేటివులు పరాజయమును పొందినను ప్రతిపక్షులైన రెండుపక్షములుగలసి లేబరుపక్షము నోడించుటకు బలము గలదు. లేబరుపక్షము తగినంతబలమును గలిగియుండకపోయినను రాజ్యభారమును వహించుట రాజ్యాంగముల కనురూపముగ నున్నది. రాజాదేశానుసారముగ లేబరుపక్షము రాజ్యభారమును వహించుచున్నది. రామ్సేమేక్డొనాల్డు గారు మంత్రిత్వమును స్వీకరించిరి. వెడ్జివుడ్ బెన్ గారు భారత రాజ్యాంగ మంత్రిగాను, డ్రమండుషీల్సుగారు సహాయమంత్రిగను నియమింపబడిరి.

జె. హెచ్. థామస్ గారు, లార్డు ప్రీవీసీ, నిరుద్యోగసమస్యా పరిష్కారమంత్రి; జార్జి లాంసుబరీగారు, పబ్లిక్ వర్క్సు మంత్రి?; సర్ సి. పి. ట్రెవెలినుగారు, విద్యాశాఖాధ్యక్షులు; జె. ఆర్. క్లైన్సుగారు, దేశీయాంగ మంత్రి (హోమ్ సెక్రటరీ); ఆర్థరు హెండర్సనుగారు, విదేశాంగ మంత్రి; థామ్సను ప్రభువుగారు, విమానశాఖా మంత్రి; ఆస్వాల్డు మాస్లీగారు, లాంకాష్టరుమంత్రి; పార్మూరు ప్రభువు, కౌన్సిలు అధ్యక్షుడు; టామ్‌షా గారు, యుద్ధశాఖామంత్రి; సిడ్నీ వెబ్ గారు, అధినివేశ రాజ్యముల మంత్రి; నియోలు బక్స్టనుగారు, వ్యవసాయ శాఖా మంత్రి; ఫిలిపు స్నోడనుగారు, కోశాధికారి.

ఈ మంత్రివర్గమునందు యువతీరత్నము మార్గరెటు బాండ్ ఫీల్డ్ కన్య కార్మికమంత్రిగ నియమింపబడినది. మంత్రుల నియామకము విచక్షణతో జేయబడినను స్వదేశమునకును, విదేశములకును, భరతవర్షమునకును గలుగ గల ప్రయోజన మతి స్వల్పమని విశదమగుచున్నది. లేబరుపక్షము నిర్ణయింపవలసిన సమస్యలందు 1. నిరుద్యోగము, 2. రుష్యామిత్రత్వము, 3. ఆయుధనియమనము, 4. జర్మను రిపరేషనులు, 5. మద్యపాన నిర్ణయములు, 6. కెల్లాగు సంధిషరతులు ప్రధానములని రాజసందేశము విశదముచేయుచున్నది. ఈ సమస్యలేరీతిని లేబరుపక్షము సాధించునదియు కాలము విశదముచేయగలదు. భారతీయులకు ప్రాణప్రదమైన భారత రాజ్యాంగ సమస్య విషయమై రాజసందేశమునందు సూచనలు లేకుండుట బ్రిటీషు ప్రభుత్వమునకు భారత రాజ్యాంగము పట్లగల గౌరవాభిమానములను వెల్లడి చేయుచున్నది. భారతీయులు బ్రిటీషు ప్రజాప్రయోజనముల లాభమునకై వినియోగపడునటులు స్వీయప్రయోజనములకు వినియోగపడజాలరని భారతీయుల స్థితిగతుల వలెనే రాజసందేశమును విశదము చేసినది.

రాజసందేశమునందు భారత రాజ్యాంగ సమస్యను రామ్సేమాక్డొనాల్డుగారు విడిచిపెట్టియు చర్చయందు చేసిన ప్రసంగ మసంబద్ధముగ నున్నది. అన్నిపక్షముల వారును కలిసి సైమనుకమిషను నియమించిన విధముననే అన్నిపక్షములవారును చేరి భారతరాజ్యాంగ సమస్యను సయితము నిరాకరించుచున్నారు. ప్రతికార సహకారములు నిరాకరించిన వారిద్వారా రావలయును కాని సంబంధము లేని వారిద్వారా రాజాలవు. చావుబ్రతుకులమీద నున్న భారతీయుల మనస్సు ఆత్మరక్షణమును జేసికొనుట కెప్పుడును సిద్ధముగానే యున్నది.

పిలిచిన పలుకనివారితో సమాధానమును జేసికొనుట బ్రహ్మకైనను సాధ్యముగాదు. భారతీయులను ప్రతిషేధించిన బ్రిటీషుపార్లమెంటు భారతీయుల సాహచర్యమార్గమును నిర్ణయింపవలసియున్నది. భారతీయులు సైమను కమిషనును బహిష్కరించిన విషయము జగద్విఖ్యాతము. బహిష్కరణ విధానము విజయమును పొందినవిషయమును రామ్సేమాక్డొనాల్డుగారికి తెలిసియున్నది. సంధిమార్గమును నిర్ణయించుటకు రామ్సేమేక్డొనాల్డుగారు పూనుకొనవలసియుందురు. సైమనుకమిషనును నియమించిన ప్రభుత్వము మారినది; మంత్రులు మారిరి; పరిస్థితులు మారినవి; ప్రభుత్వము మారినది. అయినను రామ్సేమాక్డొనాల్డుగారుమాత్రము పూర్వపద్ధతినె సమర్థించుచున్నారు. ప్రభుత్వపదవియందు లేని లేబరుపక్షమునకును మాక్డొనాల్డుగారికిని, ప్రభుత్వపదవియందున్న లేబరుపక్షమునకును మాక్డొనాల్డుగారికిని భేదము గనుపించుచున్నది. మానవ స్వాతంత్ర్యమును, డొమినియను స్టేటసును బోధించిన రామ్సేమాక్డొనాల్డుగారిపుడు బ్రిటీషుప్రభుత్వప్రయోజనములనే బాల్డువినుగారివలెనే సమర్థించుచున్నారు. బాల్డువినుగారు మాక్డొనాల్డుగారికి సూచించిన లక్ష్యము మాక్డొనాల్డుగారి కాశ్చోద్వేగమును గలిగించి యుండును. భారతరాజ్యాంగముల విషయమై లేబరుపక్ష మవలంబించెడి పద్ధతిమీద కన్సర్వేటివు పక్షము వారిప్రవర్తన ఆధారపడియుండునని బాల్డువినుగారు విశదము చేసియుండిరి. ఈ విషయనిర్ధారణమునకు బాల్డువినుగారి సిద్ధాంతములే యవసరము లేదు. వారి చిత్తవృత్తి తెలిసిన తరువాత లేబరుపక్ష చిత్తవృత్తిని విమర్శింపవలసిన యవసరము గనుపడదు. లేబరుపక్షము ప్రారంభమునందు భారతరాజ్యాంగము పట్ల జూపిన చిత్తవృత్తిని వారి ప్రభుత్వకాలమునందును జూపునని ఆరంభోదంతము విశదము చేయుచున్నది. మానవజీవితమునం దాశకు హద్దులు లేవు. రామ్సేమాక్డొనాల్డుగారి మీద గల యాశ పోయినను ఇర్విన్ప్రభువుగారిమీద గల యాశ బాధించుచున్నది.

ఇర్విను ప్రభువు

ఇర్విన్ప్రభువు భారతరాజ్యాంగవిషయములను సంప్రతించుటకు గ్రేట్బ్రిటనుకు వెడలిపోయిరి. ఇర్విన్ప్రభువు సిమ్లాయందు చేసిన ప్రసంగము భారతహృదయమునందు నిరాశను గలుగజేసినది. మానవులకు వారి పాపపుణ్యముల ననురూపముగు ఫలము గలుగుట లేదని ఇర్విన్ప్రభువు చేసిన యుపదేశము ధర్మవిరుద్ధముగ నున్నది. ఫలము పాపపుణ్యముల ననురూపముగ గలుగనపుడు పాపపుణ్యములతో ప్రపంచమునకు నిమిత్తమేయుండదు. మీరటు కుట్రకేసువిషయమై రాజప్రతినిధియును నితరులును తెలిపిన యభిప్రాయములు న్యాయ విరుద్ధములని డెయిలీహెరాల్డు చేసిన యుపదేశమును నిరంకుశవర్గాభిమాను లందరును గ్రహింపవలసి యుందురు. దోషారోపణచేసి రుజువుచేయకయె దోషమును నిర్ణయించుట యన్యాయమని బాలిశులు సయితమంగీకరిం

తురు. కేంద్రసంఘమునకు సైమనుసంఘము
చూపుచున్న విశ్వాసగౌరవములను సర్
శంకర్ణ నాయరుగారు శ్రీప్రెస్సు ప్రతినిధికి విశ
దముచేసిరి. వారికి చేసిన పర్దావిందువిషయమై
సభ్యుడు తెలిపిన 'నేనునిన్ను కొనియాడెదను.
నీవు నన్ను శ్లాఘింపుము.' అను భావమునకు
తగినటు లున్నది. కేంద్రసంఘమునకును భార
తీయులకును వారి నిస్సహాయస్థితియందు గలు
గగల గౌరవప్రతిపత్తులను సైమను సంఘ వ్యవ
హారములు పార్లమెంటు వ్యవహారములు విశ
దము చేయుచున్నవి. అయినను భారతీయ
నాయకుల లక్ష్యము లేబరుపక్షము మీదను
రామ్సేమాక్డొనాల్డు గారి మీదను ప్రసరిం
చుట యనుచితముగ నున్నది. ఈ సందర్భము
లందు బర్నార్డ్షు హాటనుగారి హితోపదేశ
ము గమనార్హముగ నున్నది.

స్వయంసహాయము

వెడ్జివుడ్ బెన్నుగారు వారి యధికారదశ
యందు కష్టముల ననుభవింపవలసి యుండు
రని మేక్డొనాల్డుగారు చెప్పియుండిరి. ఆలివి
యరు ప్రభువునకు సంప్రాప్తమైన కష్టస్థితియె
బెన్నుగారికిని గలుగ నున్నది. సోవియటు
ప్రచారనేరారోపణమునకై హిందూదేశము
నందు నిర్బంధ ప్రస్థానము సాగుచున్నది.
యూరపునందు సోవియటు సంధికై ప్రయత్న
ములు జరుగుచున్నవి. ఈ రెండు ప్రయత్న
ములందును భారతీయుల నిర్బంధములు సాగుట
కవకాశములు గలవు. కన్సర్వేటివు పక్ష మీా
ప్రస్థానమున కాశీర్వాదము నొసంగగలదు.
ఎప్పటివలెనె దేశమునందు ప్రారంభమైన
నిర్బంధ విజయయాత్ర నిరభ్యంతరముగ
సాగగలదు. దీనికి ప్రతీకారము భారతీయుల
వలన రాగలదు కాని బ్రిటీషు పక్షముల
వలన రాజాలదు. భారతీయులు త్యాగ
మును, సాహసధైర్యములను, కార్యనీతిను
బూని ఆత్మబలమును ప్రకటించి స్వరాజ్య
ప్రస్థానమును జేయవలయునని గాంధీమహా
త్ముడు చేయుచున్న యుపదేశమునె హా
టనుగారును చేయుచున్నారు. ఈ కార్యవిధా
నమును నిర్ణయించుటకె నిర్మాణకార్య విధాన
మేర్పడినది. నిర్మాణకార్యప్రస్థానము జయప్ర
దమగుటకు, ప్రజాలక్ష్యము శాసనసభలనుండి
దేశము మీాదకు లగ్నము గావలసియున్నది.
నిర్మాణ కార్యవిధానమునందు ప్రధానవిష
యము విదేశవస్త్రబహిష్కరణము, ఖద్దరు
వ్యాపనమును.

శాసనసభలు : నిర్మాణకార్యవిధానము

శాసనసభల బహిష్కరణమునుగూర్చి
దేశమునందంతటను ప్రతిఘటనము బయలుదేరి
నది. అన్ని రాష్ట్రములందును సభాప్రవేశమున
కనుమతులు గావలసివచ్చినవి. అన్ని రాష్ట్రము
లకును సామాన్యముగ ననుమతు లొసంగబడి
నవి. ఢిల్లీయందు 5 వ తేదీని గూడనున్న
కార్యనిర్వాహకసభయును అనుమతినొసంగుట
సహజము. జడమయములైన శాసనసభలవ
లన సామాన్యవిషయములందే ప్రయోజనము

గలుగనపుడు స్వరాజ్యప్రస్థానమునకు ప్రయోజనము గలుగుట యసంభవము. వర్తమాన నిస్సహాయస్థితియందు ఖద్దరువలన విదేశవస్త్ర బహిష్కరణమువలన ప్రజలకు బలము, విశ్వాసముగలుగుట కవకాశములు గలుగగలవు. ప్రజాశక్తిని వృద్ధిచేయుటకు సాధనమైన ఖద్దరువ్యాపనము విదేశవస్త్రబహిష్కరణమునుజేయుట సకలార్థసిద్ధికిని సాధన మని ప్రజానాయకులు గ్రహించి తదనుగుణముగ ప్రవర్తించి పరమేశ్వరానుగ్రహమునకు పాత్రులగుదురు గాత! భారతస్వాతంత్ర్యసంపాదనము భారతీయుల హస్తములందున్నది గాని విదేశీయులహస్తములందు లేదని గ్రహించుట వివేకము. సంస్థానాధీశులు వారి లక్ష్యమును స్వప్రయోజనములనుండియును రాజప్రతినిధి నుండియును బ్రిటిషుప్రభుత్వమునుండియును మరల్చి చిరకాలమునుండియు సంస్థానములను, ప్రజలను, భారతధర్మమును పోషించుచున్న జన్మభూమి పట్లకు మరల్చి కృతార్థు లగుదురుగాత! కలకత్తా కాంగ్రెసు, బొంబాయి కార్యనిర్వాహక సభ నిర్ణయించిన కార్యవిధానము సఫలమగుటకు వ్యవధి చాలకున్నది. శాసనోల్లంఘన ప్రస్థానము నుపక్రమించుటకు సమయ మాసన్న మగుచున్నది. ఈ మహాసందిగ్ధావస్థయందు రాగల లాహోరు కాంగ్రెసునకు లోకోత్తర పురుషుడైన గాంధీమహాత్ముని నధ్యక్షునిగ నెన్నుకొనుట కాంగ్రెసువిజయమునకు సాధనముగ నుండగలదు.

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, Thambu Chetty St., Madras